## సేకరణ : రచన సుగంధం సాయి బాబా చార్య స్వామీజీ (విశ్వకర్మ)

### శ్రీశ్రీశ్రీ సనారీ పీఠాధిపతులు - విజయవాడ

### శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్ర లింగ సహిత సనారీ విశ్వనాధాలయ నిర్మాణకర్త

| | | |
|---|---|---|
| జననము | : | 5-7-1943 |
| జననీ జనకులు | : | కీ.,శే.బ్రహ్మశ్రీ సుగంధం వెంకటేశ్వరరావు, శ్రీమతి సుగంధంపాపాయమ్మ |
| జన్మస్థలం | : | రావులపాడుగ్రామము, గుడివాడ తాలుకా, కృష్ణాజిల్లా |
| విద్య | : | 1952 సం॥ లో 9వ తరగతి -1952 నుండి స్వర్ణవృత్తి నభ్యసిస్తూ దైవచరిత్రలు, వేదాంత, విశ్వకర్మ, గ్రంధముల పఠనము, వాస్తు, జ్యోతిష్యములు, అభ్యాసము, పౌరాణిక నాటక ప్రదర్శనలు |
| వృత్తి | : | స్వర్ణశిల్పము, నవరత్న పరీక్ష |
| ప్రవృత్తి | : | ఆధ్యాత్మిక భావనలు, కులసనాతన సాంప్రదాయములందాసక్తి శ్రీశ్రీశ్రీ సనారీపూజా, చరిత్ర ప్రచారము,బ్రహ్మవిద్యాభ్యాసము. |

రచనలు

1. శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామి నిత్య పూజా విధానము, సంధ్యావందనము, కేదారేశ్వర వ్రతము (ద్వితీయ ముద్రణ)
2. శ్రీ సనారీ మాలాధారణ, పూజావిధానము (ద్వితీయ ముద్రణ)
3. శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధ విజ్ఞానం & మహిమలు (ద్వితీయ ముద్రణ)
4. శ్రీ సనారీశ్వర వ్రత కల్పము
5. శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్ధములు
6. శ్రీ సనారీ యోగజ్ఞానామృతము
7. శ్రీ సనారీ హరికథ (సి.డి. రికార్డింగ్)
8. శ్రీ సనారీ సంవాద గ్రంధపఠన (సి.డి. రికార్డింగ్)
9. సుగంధం వారి కృష్ణవేణి పుష్కరకానుక

అముద్రితములు

10. శ్రీ కంచికామాక్షి విజ్ఞానం, నిత్యపూజ, వ్రతం
11. శ్రీ శివపార్వతీ, శ్రీరామ, వీరబ్రహ్మం, సనారీ వారి కళ్యాణములు
12. శ్రీ సనారీ వారి స్టేజీ నాటకము
13. శ్రీ సనారీ వారి కలర్ ఫోటోలు (12X18 సైజులో లభించును)
14. ప్రతి మాస శివరాత్రికి దేవాలయమునందు కాశీవిశ్వనాధునికి అన్నాభిషేకము భక్తుల స్వహస్తములతో జరుపబడును.

బాధ్యతలు శ్రీ విశ్వకర్మ బి.సి.క్లాస్ బిల్డింగ్ సొసైటి అధ్యక్షులు విజయవాడ.

శ్రీశ్రీశ్రీ సనారీ యోగ జ్ఞానామృతము

సేకరణ - రచన

బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ

# శ్రీశ్రీశ్రీ సనారీ యోగ జ్ఞానామృతము

## నిత్య యోగ సాధనా గ్రంధం

శ్రీశ్రీశ్రీ సనారీ పీఠమ్ స్థాపితం : 2001

శ్రీ సాయి జ్ఞాననిలయం, డోర్ నెం. 23-11-1-6/బి,
ఓగిరాలవారి వీధి, సత్యనారాయణపురం,
విజయవాడ - 11

సేకరణ - రచన

బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ

సెల్ : 92905 82110, 90322 53205, 9553827385
7793992584



ది. 13-12-2014 తేదిన జరిగిన శ్రీశ్రీశ్రీ సనారి విశేశ్వర సంవాద గ్రంధార్థముల గ్రంధావిష్కరణ చేస్తున్న తెలంగాణ స్పీకర్ మాన్యశ్రీ మదుసూదనాచారి గారు




స్వామీజీ వారి రెండవ అల్లుడు బ్ర॥ కంటె శివకుమార్, శ్రీమతి వెంకటరమణ
మనుమడు చి॥ కంటె తేజా ప్రసాద్, శ్రీమతి చందన




సువర్ణ ఘంటాకంకళ సందర్భములో మా పెద్ద మనుమరాలు
చి॥ల॥సౌ॥ శ్రీదేవీప్రియ, భర్త చి॥ పట్నాల మురళీకృష్ణ, మా రెండవ మనుమరాలు చి॥ శశిప్రియ



## విషయసూచిక

పే.నెం సృష్టిక్రమము
1. ముందుమాట
3. గురుధ్యానం
4. బ్రహ్మ విద్యకు మూలము
7. యమనియమాదులు
8. ప్రాణాయామము
11. మానసపూజ
14. గురువుల లక్షణములు
15. వందనక్రమము
18. త్రయోదశవర్గములు
19. తిధులకు, నక్షత్రాలకు స్వరనాడి
20. ఉత్తర, దక్షిణాయములకు స్వరనాడి
23. స్నానక్రమము
26. మయబ్రహ్మ వరఫలం
26. అవధూతఅర్థం
29. విశ్వకర్మ సంతతి వారాచరించవలసినవి
30. చతుర్విధ ఆశ్రమ లక్షణములు
31. సాలోఖ్య సారూప్య, సాయిధ్యములు
32. త్రివిధప్రసాదములు, చాతుర్విద శుశ్రూషలు
34. అష్టవిధ పుష్పార్థములు
35. నవవిధ భక్తులు
38. మహా వాక్యార్థములు 4
41. మానవశరీరంలో పరమాత్మ స్థానాలు
42. గురువులు 8 రకములు
43. పిండోత్పత్తిక్రమము, విశ్వబ్రహ్మ ప్రార్థన
45. చతుర్విధశుశ్రూషలు
48. నిత్యజీవనములో శ్వాసలక్రమము
51. హంస సప్తచక్రములలో సంచారము
54. బ్రహ్మాండ విషయములు
56. వేదాంతడిండిమము, మరుగుపదాలు
64. విరాట్చైతన్యము
67. పంచతన్మాత్రలు
73. పంచభూతములు
75. తత్వవిమర్శ
76. త్రిదేహములు, 120 తత్వములు
78. పంచభూతములు, త్రివేణుల వివరములు
80. త్రయముల వివరములు
91. సప్తవిషయములు
92. అష్టవిషయములు
93. షష్ఠ విషయములు
94. పంచ విషయములు
97. చతుష్ఠయ విషయములు
102. ద్వయవిషయములు
103. యోగవిఘ్నములు
105. జ్ఞానభూమికలు & చతుర్ధశభువనములు
106. గురుగీత
132. వీరబ్రహ్మేఉవాచ
133. యోగసిద్ధుల అమృతవాక్యములు, విశ్వదోష గుణము
134. గురుపరంపర, అష్ఠకము
135. సద్గుర్వష్టకము
137. సద్గురులక్షణములు
138. వేమనఉవాచ
139. సనారీచాలీసా
141. సనారీఖడ్గము
142. మహనీయులనుభవించిన ప్రారబ్ధములు
144. షడ్విధగురుశిష్య సంబంధాలు
145. శివదర్శనానికితెలుసుకోవలసినవి, భగవద్గీతశ్లోకార్థములు
147. పంచాక్షరీమంత్ర ప్రభావము
149. మానవులనుభవించు వ్యాధులకు కారణములు
151. సప్తద్వీపములవివరము,అమృత తత్వసిద్ధి
153. దేవుసత్యన్నారాయణగారి వర్ణమాలిక
158. శివతాండవస్తుతికి అర్థములు
164. వివిధ ద్రవ్యములతో రుద్రాభిషేకఫలితములు
165. విశ్వకర్మాష్టకమునకు అర్థములు
168. స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ, దేవహముల శుద్ధి
169. శ్రీ సనారీశ్వర మంగళాష్టకమ్
170. శ్రీ సనారీశ్వర శుద్ధమాల
171. కాళహస్తీశ్వర స్వామి తెల్పిన 18 యుగములు
174. కుండలినీశక్తిని మెల్కొలుపు విధానము
176. శ్రీ సనారీ సౌజన్యపత్రిక, కాలజ్ఞానం

సేకరణ రచన
**బ్ర॥సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ**
ప్రధమ ముద్రణ : 2017
ప్రతులు : 1000 కాపీలు
వెల : అమూల్యం

ప్రింటింగ్ :
మెట్రోప్రింటర్స్, విజయవాడ-2

## ఆధ్యాత్మిక పరులారా తస్మాత్ జాగ్రత్త!

ఆధ్యాత్మిక ఆసక్తిపరులారా! ఈ గ్రంధంలోని గురుగీత 27 నుండి 30 వరకూగల శ్లోకాలలో శిష్యుడు తన గురువునకు తను, ధన, ధారా, సుతులను అర్పించినట్లగ పడుచున్నది. యిందలి 33వ శ్లోకార్థం. గురువే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు గురువుసాక్షాత్ పరబ్రహ్మ, అంటే ఈ చారాచరజగత్తును త్రిమూర్తులను సృష్టించిన ఆది పురుషుడని అర్ధమగుచున్నది. అట్టి గురుదేవునకు పైన చెప్పినవన్నీ అర్పించి జగద్గురువుగా సేవించమని భావము. అట్టి గురుదేవునకు మనమిచ్చునవికావలెనా? ఆ సృష్టి కర్తేయివన్ని మనకొసంగెనుగదా! అంటే ఈ సృష్టియావత్తూ నీకు చెందినదే యివేమీనావికావు దేవాదిదేవా అని త్రికరణశుద్ధిగా శరణాగతుడవుకమ్మని యిందలి భావము **అంతేగానీ**

జగజ్యోతి వీరబ్రహ్మేంద్రస్వామి గోవిందవాక్యములలో "12వదగు" వుల్లిగడ్డకు ఉపదేశమిచ్చేటి కల్లగురువులు కలినుండే రుమా కల్లగురువుల నెల్లకాలతన్నునుయముడు కల్లలేనినరుల కరుణించుమా ॥హరిగోవింద గోవింద॥ ఈనాటి గురువులు పీఠములేర్పరచి వందలకొలది ఆశ్రమాలు స్థాపించి, లక్షలమందికి ఉపదేశములిస్తూ వేలకోట్ల ధనమార్జించి. జగద్గురువులమని పించుకుని, దర్శనమునకొకరేటు, పాదాభివందనమున కొకరేటు, పాదపూజకొకరేటు, పూజకొకరేటు, హోమమునకొకరేటు పెట్టి, భక్తులకోర్కెతో వారిగృహాన్ని పాదధూళితో పావనముచేయుటకొకరేటు పెట్టి వ్యాపారం చేస్తున్న బాధగురువు లొకవైపు. యింకొందరు వీటితోపాటు పాప ప్రక్ష్యాళనంచేస్తాం అంటూ శిష్యుల పాదసేవకు అనుమతినిచ్చి ఏకాంతమందిరాలలో శృంగారకార్యాలు చేస్తూ సేల్‌పోన్లలో వీడియోలలోచిక్కి, కోర్టులకు తిరిగితుదకు జైళ్ళపాలైన గురువరేణ్యులు కలరు. భక్తులారా మీరు నిశితంగా ఆలోచించండి. దైవస్వరూపుడైన గురుదేవునకు ఈ ధన, కనక, తనుదారాసుతులతో పనిఏముంటుంది. ఇవన్నీ మనకిచ్చినది ఆయనేకదా! ఆ గురువునకు ఈ సంబంధముఅక్కరలేదు. మనకర్మ పరిపక్వమయినపుడు వారే మనదగ్గరకు వస్తారు. లేదా ఏదో కారణంగా మనమే వారిదరిజేరి యోగసిద్ధిని పొందుతాము. అంతే కానీ టిక్కెట్టుకొని ఏదో వినోదాన్ని చూచినట్లుగా డబ్బిచ్చి ఆగురువులనుండి ఏదీపొందలేము. మహాకవులు వ్రాసినట్లు ఒకవ్యక్తి గుణగణాలు, భక్తితత్పరతలు, ధనికబీదరికాలు వారి జీవించియుండగా నిర్ణయించలేము. విధి ఎప్పుడెవరినెట్లు మార్చునో ఎవ్వరూ చెప్పలేరు.

**1. ఎలాగంటే :-** నవఖండల భూమండల సార్వభౌముడైన హరిశ్చంద్రచక్రవర్తి కాటికికాపరియై సతీసుతులనెడబాసి అమిత దరిద్రమునను భవించలేదా! **2)** నల చక్రవర్తి రాజ్యమును కోల్పోయి సతీ సమేతముగా అడవులపాలై ఆహారమునకై అలమటించుచూ వస్త్రవిహీనుడై భార్య చీర కొంగు గోచీగా ధరించి తుదకు భార్యను





కొల్పోయి వంటవానిగా జీవించలేదా. **3.** మహాభక్తుడైన విప్రనారాయణుడు వేశ్యాలోలుడు కాలేదా! **4.** పరమకిరాతకుడైన వాల్మీకి పరివర్తనతో సాధు సజ్జనుడగుమహాయోగికాలేదా! **5.** మహా పరాక్రమవంతులగు పాండవులు రాజ్యాన్ని కొల్పోయి అడవులపట్టి యాచించి జీవించలేదా **6.** అమితవ్యభిచారియైన వేమనకాలక్రమంలో మహాయోగికాలేదా! **7.** పుట్టుమూగయైన మూకశంకరులు కామాక్షీదేవీ కటాక్షమును, మహాకవియు గాయకుడై సరస్వతీపీఠాధిపత్యము వహించి జగద్గురువుకాలేదా! **8.** మహామాయి కటాక్షముచే భీరువులైనవారు రణధీరులైరాజ్యపాలన చేయలేదా! **9.** జగద్గురువులుగా కీర్తింపబడిన పీఠాధిపతులు క్రమేపిపడతీలోలురై, కీర్తి భ్రష్టులై, కోర్టులు, జైళ్ళుపాలైతుదకుతమ శిష్య బృందముతో ఛీ కొట్టించుకొనుటలేదా!

అంటే ఒక వ్యక్తియిట్టివాడని జీవించియుండగా చెప్పలేము కాలం ఎవరిని ఎప్పుడు ఎలా మార్చుతుందో ఆవిధాత నిర్ణయం, మానవుల ఊహకందని విషయం కాబట్టి ఈ గురువుమంచివాడు ఆ గురువుచెడ్డవాడని వారు జీవించియుండగా చెప్పలేము. కావున ఈ లోకంలోలేని నీ మనసుకునచ్చిన ఏదైవరూపాన్నిగానీ, ఏ గురు ఛాయాచిత్రాన్నిగానీ, ధ్యానమందిరంలో పెట్టుకుని నీ మనసుకు నచ్చిన ఏ యోగసాధనా గ్రంధాన్నైనా చేపట్టి, దానినేగురూపదేశంగా భావించి ఏకలవ్య విద్యగా సాధనచేసియోగ సాధకులగుటయే ఉత్తమము. వేదికలపైవేదాంతో పన్యాసములు చేయువారు. మాటలవారేగానీ చేతలవారుకారు. యోగసిద్ధిపరులు మాటలుచెప్పరు. ఆ సమయాన్నికూడా వారు వృధాకానీయరు. నిజమైన యోగ సిద్ధులు ఇహలోక బంధనలలో చిక్కుకొనరు. పూర్వకాలంలో గురువులు శిష్యులను చాలాకాలం పరీక్షించి ఉపదేశ మిచ్చెడివారు. ఈనాడు శిష్యులుకాగోరువారు గురువులను చాలాకాలం పరీక్షించి ఉపదేశం పొందవలసిన పరిస్థితి ఏర్పడినది ఇదియూ కలిప్రభావమో? కాలవైపరీత్యమో? విధినిర్ణయమో? గ్రహించండి. ఎక్కడో నూటికొక్కరు గల సద్గురువువారి కర్మఫలాన్ని బట్టే లభించుతారు విధివిధానాన్ని ఎవరూ తప్పించలేరు. తత్ఫలితాన్ననుభవించుటే మానవ జన్మకు కారణం.

కొన్ని సందర్భాలలో శిష్యులే గురువుల ప్రవర్తనకు కారకులేమో? దీన్ని గమనించాలి.

1. మహాతపో నిష్ఠాగరిష్ఠుడైన రాజర్షి విశ్వామిత్రునిమేనకతన హావభావములతో వ్యామోహితుని జేసితపోదీక్ష భంగముగా వించి ఆతనిచే సంతతిని పొంది తపోభ్రష్టుని గావించలేదా! యిలా ఎంతోమంది ఋషులు తపోభంగము చెందిరిగదా.

2. గృహస్థాశ్రమ ధర్మములు సక్రమముగా పాటించునిష్ఠాగరిష్ఠులని పేర్వడిసిన పురుషులను (బిల్వమంగళుడు) పట్టుదలతో పతితులను గావించిన నారీమణులునూ గలరు. యిదంతయూ పూర్వకర్మ ప్రారబ్ధమేనేమో!

3. నేడు గొప్ప ఆధ్యాత్మిక మహనీయులనిపించుకున్న స్త్రీ పురుష గురువులను వ్రతభంగం చేసిన స్త్రీ పురుష శిష్యులూ కలరు. గమనించండి తస్మాత్ జాగ్రత్త.

శ్రీ సనారీ విశ్వనాధాయై నమః



# అభిప్రాయములు

శ్రీ సనారీ విశ్వనాధాలయ నిర్మాణ కర్త, శ్రీ సనారీ వారి అనేక గ్రంధములను రచించి, భక్తి ప్రచారాన్ని గావిస్తున్న శ్రీ సనారీ పీఠాధిపతులు బ్రహ్మశ్రీ సుగంధం సాయి బాబాస్వామీజీ గత 2 దశాబ్ధాలుగా సనారీ వారి జీవితచరిత్రపై కూలంకషంగా పరిశోధన గావించి, ఎంతోవిలువైన సనాతన ఆధ్యాత్మిక భక్తి విషయాలను అందరికీ అర్ధమయ్యే రీతిలో భక్తులకు తెలియజేస్తున్న నిత్య కృషీవరులు స్వామీజీవారు చదువుకున్నది ఆనాటిరోజుల్లో కేవలం 9 వ తరగతే అయినా స్వయం కృషితో అనేక గ్రంధాలను కూలంకషంగా చదివి, పరిశీలనతో భక్తి జ్ఞాన సముపార్జన చేసి వాస్తు, జ్యోతిష్య, వేదాంత శాస్త్రమర్మములు, పౌరాణిక నటులుగా కూడా విశేషమైన అనుభవాన్ని పొంది జీవనోపాధికోసం స్వర్ణవృత్తిచేసి సంసారబాధ్యతలు నిర్వహించుకుంటూ, మరోప్రక్క విశ్వకర్మబిల్డింగ్ సొసైటీ అధ్యక్షులుగా సంఘసేవ చేస్తూ అందరికీ ఆప్తులుగా, శ్రేయోభిలాషిగా గురూపదేశ సందేశములనిస్తూ విశ్వకర్మ వంశానికి మకుటాయమానంగా వెలుగొందుచున్న బ్రహ్మ శ్రీ సుగంధం సాయిబాబా స్వామీజీ ఎంతో ధన్యులు. డిగ్రీ, పి.జి, పి.హెచ్.డి. చదువులకంటె, స్వశక్తితో అనుభవపూర్వకమైన జ్ఞాన సంపత్తిని స్వాధీనం చేసుకున్నారు. ఎంతో మేధాశక్తిఉంటే తప్ప ఇది అందరికీ సాధ్యంకానిది, అపారమైన తెలివితేటలు, చిత్తశుద్ధి, సచ్ఛీలతలను అలవరచుకొని, ఆచరించి భక్తిజ్ఞాన సముపార్జన చేసుకున్న ఋషిపుంగవులు శ్రీ సాయిబాబా స్వామీజీ.

ప్రస్తుతం ఆయన రచించిన “శ్రీ సనారీ యోగజ్ఞానామృతం”గ్రంధంలోని విషయాలను ప్రతీమనిషి తెలుసుకొని ఆచరించి, జీవతాన్ని భక్తి మార్గంలోకి మలచుకుంటే ఆనందంగా జీవించగలరు. నిజమైన సంబంధీకులెవరు అనే ప్రశ్న మనకెదురైనప్పుడు ఒకే తల్లి కడుపున పుట్టిన అన్నదమ్ములు, అక్క, చెల్లెలు, అని సహజంగా మనంఅనుకుంటాం, కాని ఆధ్యాత్మిక దృష్టితో చూస్తే జన్మతోపాటు జ్ఞానబుద్ధినిచ్చిన తండ్రి, సత్యధర్మాన్ని బోధించిన తల్లి, లౌకిక ధర్మాలను బోధించిన సోదరుడు, దయాగుణాన్ని స్నేహితుని ద్వారా, శాంతి సహనంగల ధర్మపత్ని ద్వారా, ప్రేమానురాగాలు కుమారులనుండి పొందితే వారే నిజమైన రక్త సంబంధీకులౌతారు అని శ్రీ స్వామీజీ తన గ్రంధంలో తెలియజెప్పారు. అంతే కాకుండా అష్టపుష్పాల వివరణ, నవవిధ భక్తి





మార్గాలు, అష్టబోధగురువులు, పంచభూతాలు మొదలగు వివరణలతో పాటు మనిషి పుట్టుకకు ముందు స్త్రీ గర్భధారణ నుండి పిండోత్పత్తి విధానము చక్కగా విశదీకరించారు. అలాగే గురు, శిష్యసంబంధం విషయంలో, శిష్యునికి కలిగిన అనేక ధర్మసందేహాలను గురువుగారు తెలిపిన జ్ఞానబోధ అందరికీ ఎంతో ఉపయోగపడేదిగా వివరించారు శ్రీ స్వామీజీ.

వీరు రచించిన సనారీ సుప్రభాతం, సనారీ అష్టకం అన్నపూర్ణాదేవి అష్ఠకం, సనారీ చాలీసా, సనారీ ద్వాదశసూక్తులు వీటికి సంగీతాన్ని సమకూర్చి ఇటీవల నేను సి.డి. రికార్డింగు పాడినాను. అదిపాడుతున్నపుడు నేను ఎంతో దివ్యానుభూతిని పొందాను. అదొక అదృష్టంగా భావించాను.

సృష్టిలో అన్నిజన్మలకంటే మానవజన్మ ఎంతో ఉత్కృష్టమైనదని అందరికీ తెలిసిన సత్యమే. జన్మను తన స్వార్ధంకోసమే వినియోగించుకోకుండా సాటివారికి మేలు కలిగేకొన్ని పనులు చేస్తే వారు చిరస్మరణీయులుగా చరిత్రలో ఉంటారు. శ్రీ సాయిబాబా స్వామీజీ ఎంచుకున్న ఈ జీవితం పూర్వజన్మ సుకృతం. వారి తల్లితండ్రులు చేసుకున్న పుణ్యఫలం. నిస్వార్ధంతో, ప్రస్తుతతరం, భావితరాలవారి కోసం చేసే ఏమంచి పనికైనా భగవంతుడు వెనుక వుండి నడిపిస్తాడు అనేదానికి స్వామీజీ చేస్తున్న పనులే అందుకు తార్కాణం. వారితో పాటు వారి ధర్మపత్ని శ్రీమతి విమలాదేవి గారు కూడా భర్తతోపాటు ఆధ్యాత్మిక జీవితానికి అంకితమై భగవంతుని సేవలో ప్రబోధకులుగా జన్మసార్ధకత చేసుకుంటున్నారు. వారికి శ్రీ అన్నపూర్ణా సహిత విశ్వనాధుల వారు ఆయురారోగ్యాన్ని ప్రసాదించాలనీ ప్రార్ధిస్తున్నాను. మున్ముందు ఎన్నో గ్రంధాలు రచించాలని, వారు అనుకున్న ఆశయాలు నెరవేరాలని ఆకాంక్షిస్తున్నాను.

అభివందనములతో...............

ఇట్లు కె.వి. బ్రహ్మానందం. విజయవాడ

గానకళా విశారద, గానసుధార్నవ, సంగీత నాదబ్రహ్మ చింతామణి, సుమధుర గానసుధాకర, ఆకాశవాణి& దూరదర్శన్ కళాకారులు,
విశ్రాంత అధ్యాపకులు ప్రభుత్వ సంగీతకళాశాల,
ఆస్థానవిద్వాన్ శ్రీ కంచికామకోటి పీఠమ్ (తమిళనాడు)
ఆస్థానవిద్వాన్ శ్రీ వీరాంజనేయ స్వామిదేవస్థానం చింతామణి(కర్నాటక)
ఉత్తమ ఉపాధ్యాయ పురస్కార గ్రహీత.



ఓం శ్రీ మహాగణాధిపతయే నమః ఓం నమో వీరబ్రహ్మణేనమః

బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ వారు మిక్కిలి కృషిచేసి రచించిన "శ్రీ సనారీ యోగజ్ఞానామృతము"అను గ్రంధమును సాకల్యముగా పఠించితిని.

## గ్రంధకర్తగూర్చి ఒక మాట

బ్రహ్మశ్రీ సాయిబాబాచార్యస్వామీజీ పారమార్థిక చంతనతో 1978లో బ్రహ్మశ్రీ బోనుమద్ది రామలింగసిద్ధాన్తి గారి వద్ద దివ్య మంత్రోపదేశమును పొందినతదుపరి 1995 సం॥లో బోధగురుతణుకుసాంబశివానందరాజు యోగిగారి చెంత సతీసమేతముగా శ్రీ సనారీవారి దీక్షనుగైకొని, గురూత్తముల సాంగత్యము, సేవనముల వలన సాంఖ్య, తారక, అమనస్కములను అభ్యసించి, విజయవాడ సత్యన్నారాయణ పురంలోని స్వగృహమందు శ్రీసనారీ వారినిత్యపూజలు, దేవీనవరాత్రులు, శ్రీసనారీ జయంతి, కళ్యాణములు, భక్తిశ్రద్ధలతో నిర్వహించుచూ శ్రీ గురుదేవుల ఆలయ నిర్మాణమును సంకల్పించి, తమ ఆర్ధికస్థోమతను బట్టి దేవాలయనిర్మాణము నారంభించి, భక్తాదుల సహాయ సహకారములు స్వీకరించి శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహితసనారీ విశ్వనాధాలయమును నిర్మించి, ఆలయ ప్రాంగణమందు దంపతీయుక్తముగా వాన ప్రస్తాశ్రమమును గఋపుచు అత్యంత భక్తిప్రపత్తులతో శ్రీసనారీ వారి నిత్యపూజలు చేయుచూ ప్రతీ మాసశివరాత్రి కి అన్నాభిషేకము, అష్టాదివర్ణస్థులతో చేయించి, దాదాపు వందమందికి అన్నప్రసాదముతో తృప్తిపరచుచూ 1) సంధ్యావందనము, శ్రీసనారీవారి నిత్యపూజావిధానము, కేదారీశ్వర వ్రతము, 2) శ్రీసనారీ వారి మాలాధారణ పూజా విధానము, 3) శ్రీశ్రీశ్రీ సనారీవిశ్వనాధ విజ్ఞానము & మహిమలు, 4) శ్రీసనారీశ్వరవ్రతము, 5) శ్రీశ్రీశ్రీసనారీ సంవాద గ్రంధార్ధములు వంటి మహద్ గ్రంధములు రచించి, ముద్రించి, తద్వారా శ్రీ సనారీవారి దివ్యచరిత్ర, మహిమలను యిప్పుడు శ్రీ సనారీ యోగజ్ఞానామృతమును విస్తృతప్రచారమొనరించి శ్రీసనారీ బాబాపేరిట సార్ధకనామధేయులైరి.

నిరాడంబరులు, సహృదయులు, ఆధ్యాత్మిక విద్యాకోవిదులగు వీరు బ్రహ్మవిద్య ఆవశ్యకతతోపాటు గురుదేవుల ప్రాముఖ్యతను ఎల్లరకును తెలుపుటకు రచించిన "శ్రీ సనారీ యోగజ్ఞానామృతము"అను గ్రంధములో పిండోత్పత్తిక్రమము, సాంఖ్యతారక అమనస్కములు వారనాడీస్వరవిచారణ, ప్రాణాయామసాధన-ప్రాముఖ్యత, షట్చక్రములు స్థూల, సూక్ష్మ, కారణశరీరములు, చతుర్విధ మహావాక్యములు, చతుర్విధ శుశ్రూషలు, రాజయోగముప్రాముఖ్యత, గురు శిష్యుల సంబంధము, సద్గురు సాంగత్యముయొక్క ఆవశ్యకత, చతుర్విధయోగములందు రాజయోగము శ్రేష్ఠమైనదని ఇత్యాదివిషయములు,





శ్రీ సాయిబాబాస్వామీజీ ఎంతో సులభశైలిలో వివరించి **"దుర్లభం తత్త్వదర్శనం సద్గురు కరుణావినా"** అన్న ఉపనిషద్వాక్యానుసారము బ్రహ్మ విద్యసద్గురుని వలననే సంప్రాప్తించునని పారమార్థిక చింతనతో సద్గురువును ఆశ్రయించి మనః శ్చాంచల్యములోను గాక "గురు కటాక్షమున ఆత్మసాక్షాత్కారము పొందినవారికే మోక్షము సంప్రాప్తమగును" అను విషయమును శ్రీ సనారీయోగజ్ఞానామృతము అను ఈ గ్రంధమునందు ప్రస్ఫుటమగుచున్నది.

1. మనుజులిదితెలియనేరక మునులైననుతెలియలేరు ముక్తిపథంబున్
ఘనులైనరాజయోగులు తనలోతన్నెఱుగువారు ధన్యులుసిద్ధా॥

శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాములవారి స్వీయకృతపద్యములు అన్నిటా చతుర్విధ యోగములందున రాజయోగమునందున్న సాధకులు సద్గురు సాంగత్యముననే ఆత్మజ్ఞానమును అవగతము చేసుకోగలరని.

2. సంశయంబులు విడతీసి సద్గతినిచ్చు పరమసాంమ్రాజ్యమును
జూపి భయముతీర్చుమరుపురానట్టి గోప్యముల్ మరగులిచ్చి
- శాంతినిచ్చెడి సద్గురునిసాటిగలరె......

అన్నవిధముగా తనను ఆశ్రయించిన శిష్యుని జననమరణ దుఃఖ ప్రవాహమునుండి కడతేర్చి జీవిత పరమార్ధమును ప్రబోధించు పరబ్రహ్మస్వరూపుడగు సద్గురువునకు సాటివేరెవరును లేరని గురుదేవుల ఆవశ్యకతను, విశిష్టతను ఈ గ్రంధమునందు సాయిబాబా చార్యస్వామీజీ ఎంతో చక్కగా వివరించారు.

ఆధ్యాత్మిక వికాసమును కలిగించుఇట్టి ఉత్తమ గ్రంధమును రచించిన శ్రీసాయిబాబా చార్యస్వామీజీ వారికి శ్రీశ్రీశ్రీసనారీ విశ్వేశ్వరస్వాములవారు శతాయురారోగ్య భోగభాగ్యములనిచ్చి సర్వదా రక్షించుగాక.

"శ్రీ సనారీ యోగజ్ఞానామృతము" అను ఈ గ్రంధమును పఠించి, ఆచరించిన భక్తమహాశయులెల్లరునూ శ్రీ సనారీ వారి సత్కృపాకటాక్షములకు పాత్రులుకాగలరని విశ్వసించుచున్నాను.

ఇట్లు

డా॥ అండలూరి సోమేశ్వరరావు (బొబ్బిలి)
**ఆయుర్వేదరత్న** ప్రఖ్యాత ఆయుర్వేదవైద్యులు
శ్రీ వీరబ్రహ్మంగారి జీవిత చరిత్ర- కాలజ్ఞానము
(గ్రంధ రచయిత& ఉపన్యాసకులు)
ఆయుర్వేద విజ్ఞానము గ్రంధకర్త- పండిత సన్మానగ్రహీత(బొబ్బిలి)



ఓమ్‌నమో వీరబ్రహ్మణేనమః

దృఢసంకల్పమే కార్యసాఫల్యము

శ్లో: ఓం వీరబ్రహ్మేంద్రాంశాయ విద్మహే।

సనారీ విశ్వనాథాయధీమహీ తన్నో అవధూతప్రచోదయాత్

అవతార పురుషుల జీవిత చరిత్రలు వ్రాయడము, చదవడమ వినడము అనేది ఎన్నెన్నో జన్మల పూర్వఫలము(సుకృతమ వలనగానీ సాధ్యపడదు. అ పూర్వ సుకృత వంతులు బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచా స్వామీజీ దంపతులకే దక్కుతుంది.

-:సుగంధం వారి సువాసన:-

**శ్రీ సాయిబాబాచార్యగారు** స్వామివారి పరమ ప్రియభక్తులై శ్రీ సనారీవారి కార జన్మవృత్తాంతాన్ని వారిదివ్యశక్తులను, వారి అద్వైత సిద్ధాంతాన్ని అర్ధంచేసుకుని సంపూర్ణముగా విశ్వసించి, వారిని దైవంగా సేవిస్తూ, వారి పరిపూర్ణబోధలన పూజావిధానాలను, స్వామివారి స్వహస్తములతో యంత్రమంత్ర తంత్రయుక్తముగా అద్భు బీజాక్షరీ సంపుటితో లిఖియించిన సనారీ సంవాదము పండితులకు సైతము అర్ధంకా తరుణంలో, సనారీ వారి కరుణాకటాక్షవీక్షణలతో, సంవాద గ్రంధార్ధముల పేరి పామరులకు కూడా అర్ధమగు నట్లు గతంలో రచియించి, ఆస్థికులు నాస్థికులు సైతవ చదువువారందరికీ అర్ధమై ఆనందపరవశులను జేసి ప్రస్తుతము శ్రీసనా యోగజ్ఞానామృతము అనే దివ్యగ్రంధమును రచియించి విద్యాసాధకులకు పెద్దబాలశిక్ష లోకజ్ఞానమును పొంది పరిపూర్ణులైనట్లుగా, యోగసాధనా విద్యార్ధులు ఈ గ్రం సహాయముతో పరిపూర్ణ ఆత్మజ్ఞానులై ఆత్మను పరమాత్మయందైక్యము చేసి బ్రహ్మం కలసి మానవజన్మను తరింపజేసుకోగలరు. యిట్టి మహత్తర దివ్య గ్రంధమును రచిం శ్రీ సనారీ విశ్వేశ్వర స్వామి యందు వారికిగల భక్తివిశ్వాసాలను జగతికి తెలియజేస వారి పిత్రుదేవతల జన్మలను తరింపజేసినారనుటలో ఏ మాత్రమూ సందేహము లేద వారునూ చరితార్ధులగుదురు.

శ్రీ సనారీ యోగజ్ఞానామృతము ను గ్రోలినవారు ఇందుపొందుపరచిన స సాధనావిషయాలను అర్ధంచేసుకుని ఆచరించిన భక్తులు చరితార్ధులై యేడ యేడుతరముల పితృదేవతలను తరింపజేసిన వారై వారిజన్మలును ధన్యతనొందిముక్తి పొందుదురుగాక...

శ్రీసనారీ విశ్వేశ్వరస్వామి వారిగ్రంధప్రాశస్త్యము సృష్టికి మూలపురుషుడ శ్రీ విరాట్ విశ్వకర్మ భగవాన్ గూర్చి సృష్టిలోని జీవుల బంధవిముక్తిగూర్చి సకల సృ





రహస్యములనుగూర్చి యోగసాధనతో మానవుడే మాధవుడుకాగల విషయములతో గల ఈ గ్రంధరాజము మానవులపాలిట కల్పతరువనుటలో అతిశయోక్తికానేరదు. గతంలో రావణపాత్రధారియైన సాయిబాబాస్వామీజీ శ్రీ శివతాండవ స్తుతిని అర్ధంచేసుకుని, పరయోగముద్రలో ఉండే మహాదేవుని పదిహేను శ్లోకములులో గల భక్తివర్ణనను త్రికరణశుద్ధిగా అర్ధంచేసుకొని ప్రార్ధించువారికి కలుగుఫలితాలను "ముక్తికి మూలమైన కుండలిని" మానవ దేహమందలి షట్ చక్రసంచారంచేయించిన జీవుడు ఆదేహము ద్వారా కర్మఫలాలను నశింపజేసుకుని శరీరాన్ని పవిత్ర పరచుకొని ముక్తిని పొందుటకు యోగములన్నింటిలో ఆఖరిదైనట్టి కుండలిని యోగాన్నిగూర్చి చక్కని సాదృశ్యాలను తెలియజేసారు.

శ్రీ సనారీ యోగజ్ఞానామృతము ముందుమాటలో గ్రంధకర్త శ్రీబ్రహ్మంగారి అవతారసందర్భం, బ్రహ్మంగారి కాలజ్ఞాన గోవింద వాక్యములలో శ్రీ సనారీ విశ్వేశ్వరస్వాములవారి ఆవిర్భావము, రచయితగారి జీవిత సంగ్రహం, గురుశిష్య ఆవశ్యకత, ఆచరణలు మొదలగు విషయములు శ్రోతలకు అర్ధమగునట్లుగా చక్కగా వివరించారు.

ఈ విషయములన్నీ ఆధ్యాత్మిక సాధకులకు ఎంతగానో ఉపయోగ పడగలవు. అంతే గాక స్వరజ్ఞానము, జననమరణ కాలాలను, సంధ్యావందనాది విషయాలను, ఆధ్యాత్మిక, అనుష్ఠాన, ఆచారాది రహస్యములను వివరించి నేటికాలం వారికి మార్గదర్శికులు అయినారు.

ముఖ్యముగా మానవులకు సంప్రాప్తమైన జ్ఞాన విజ్ఞాన సుజ్ఞాన ఫలితాలను పూర్ణవైరాగ్యమునకు, ముముక్షత్వము, యమనియమాది, అష్ఠాంగయోగ, సాంఖ్యతారక, అమనస్కయోగాలు వగైరా విషయాలను అమాయకులకు కూడా అర్ధమగు రీతిలో తెలియజేసిన బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబా స్వామీజీ వారి దంపతులు వారి జన్మలను ధన్యతగావించుకున్నారు.

ఈ సనారీ యోగజ్ఞానామృతము గ్రంధమందలి సమస్త విషయాలను సంపూర్ణముగా చదివి అర్ధముచేసుకుని ఆచరించి ఆత్మానుభూతిని పొందిన వారికి గల అనేక జన్మకర్మలు రహితమై ఆత్మసాక్షాత్కారాన్ని పొంది కలిమాయచే కల్గిన ప్రతిబంధ విముక్తులగుదురని ఆశిస్తున్నాను.

ఇట్లు : **శ్రీవీరబ్రహ్మేంద్రస్వామివారి భక్త రేణువు బ్రహ్మదాసు**

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ వీరబ్రహ్మేంద్ర విజ్ఞాన సేవాశ్రమము బ్రహ్మపురము- వేల్పూరు.

శావల్యపురం మండలం గుంటూరు జిల్లా. నవ్యాంధ్ర.



ఈ సువిశాల ప్రపంచంలోని అనేక దేశములందలలి అనేక భిన్నజాతుల ప్రజలు అనేకానేక మతములవారు వారివారిసంస్కృతిక సాంప్రదాయములతో జీవనయాత్ర దుర్భరముగా సాగించుతూ, జీవనార్ధమై కుటుంబసభ్యులందరూ రేయింబవళ్ళు శ్రమించుతూ బ్రతుకులు భారంగా గడుపుతున్న తరుణంలో ఈ గ్రంధాన్ని చదువుటకే సమయంచాలని పరిస్థితులలో వీటిని ఆచరించువారెందరు అన్న ప్రశ్న ఉదయించకతప్పదు. ప్రపంచమందలి జనులంతా ఈ స్థితిలోనే ఉన్నారా? అంటే కాదనేది అర్థమవుతుంది. ధనవంతులు నిత్యజీవనానికి యిబ్బంది పడనివారు అధికంగానే ఉన్నారన్నది ముమ్మాటికీ సత్యం. అయితే కలి ప్రభావము చే మనసు నందలి కోర్కెలను అదుపు చేసుకోలేక అధిక సుఖములు పొందాలని యితరుల కంటే హుందాగా జీవించాలని కొన్ని తరముల వరకూ కూర్చుని తిన్నా తరగని సంపదలను కూడబెట్టి యింకా యింకా సంపాదించాలన్న అత్యాశతో తనువులు చాలిస్తున్నారు. 999 కోట్ల ఆస్తులు సంపాదించి తృప్తి లేక వెయ్యికోట్లు పూర్తిచేయాలని తపన పడుతున్నారు దానికై చెప్పరాని చేయరాని అకృత్యములనాచరించుతున్నారే కాని తమవద్ద 900 కోట్ల ధనముంచుకొని పైనున్న తొమ్మిదికోట్లను దానధర్మాలకో దైవకార్యక్రమాలకో వృద్ధులను, అంగవికలురను, ఆపన్నులను, అన్నార్తులను ఆదుకుందామనే సద్భావన ధనవంతులెందరిలో ఉన్నదని ఆలోచిస్తే నూటికి ఒక్కరూ కానరారు. కోర్కెలు ఎలాఉన్నాయంటే సైకిల్ గల వారు మోటార్‌సైకిల్ కోసం, మోటార్ సైకిల్ గలవారు కారు కోసం కారుగల వారు ఎ/సి కారు కోసం ఎ/సి కారుగలవారు తమ కొకటి, భార్య కొకటి, పిల్లలకొకటి కోసం తపన. పూరిల్లు గలవారు పెంకిటింటికోసం, పెంకుటిల్లుగల వారు మేడకోసం, మేడగలవారు అనేక అంతస్థుల భవంతికొరకు, భవంతి గలవారు తమకొకటి, భార్యపేర ఒకటి, పిల్లలకు ఒక్కొక్కటి కోసం ఎలాగైనా సంపాదించాలను అనేక అడ్డదార్లు త్రొక్కి సంపాదించి ఎవరికీ చెప్పకుండా ఏదీ వెంటతీసుకు వెళ్లకుండా జీవితంలో తాను సంపాదించిన పుణ్యపాపమూటలు నెత్తుకొని తమకు సంప్రాప్తమైన లోకాలకు తరలిపోతున్నారు. ఈ విషయం జనులందరికీ తెలిసిన నగ్న సత్యం "యిది స్మశానవైరాగ్యం"నదీ స్నానం చేసి యింటికి వచ్చి భోజనం చేసి





విశ్రమించి తమ నిత్యకృత్యములలో పాల్గొన్నప్పుడు యధాస్థితే ఎలా గంటే కుక్కతోక లాగిపట్టినపుడు తిన్నగా వుండి వదలగానే దానివంకర మళ్ళీ వచ్చినట్లు యిదీ జగమెరిగిన సత్యమే, గానీ తమకంటే హీనస్థితిలోని వాళ్ళను చూచి వారికంటే మనమే బాగున్నామని తృప్తి పడేది ఎందరు? ఈనాడు విందులు, వినోదాలకు ఎదుటి వారిలో గొప్పగా ఉండాలని, సమాజంలో కీర్తింపబడాలని తమయింటి కార్యక్రమాలు అతిఘనంగా నిర్వహించి "పులిని చూచి నక్కవాతలు" పెట్టుకున్నట్లుగా తుదకు అప్పులపాలై ఆత్మహత్యలు వరకూ తెచ్చుకునే వారు, యితరుల ధనాన్ని ఎగగొట్టి పెద్దమనుషుల వలే తిరుగువారునూ కలురు. కానీ తమకు కల్గిన దానితోనే కార్యక్రమములు నిర్వహించువారు అరుదు. జన్మానాం మానవజన్మ జన్మబహు దుర్లభం" అను ఆర్యోక్తిచే సృష్టికర్త తమకు ప్రసాదించిన ఈ జన్మలో ప్రశాంతముగా గడుపుతూ మనకు జన్మనిచ్చిన మాతాపితరులను, మనము కన్నవారిని ప్రశాంతముగా నుంచి తమ బాధ్యతలను నెరవేర్చి సంతానాన్నొక యింటివారిని చేసి, భార్యా సమేతముగా వాన ప్రస్థాశ్రమము స్వీకరించి ఆత్మను పరమాత్మలోఐక్యంజేసి జన్మను ధన్యత గావించుకొను వారెందరు? ఈ భావన గలవారికి సహకరించుభార్యలు అరుదే ఆధ్యాత్మిక భావనలుగల వారికీ గ్రంధమును రచియించిన బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీవారు మాటల మనిషికాదు చేతల మనిషని గ్రహించగలరు.

వీరు రచియించిన శ్రీసనారీ యోగజ్ఞానామృతము యోగసాధకులకు అమృత తుల్యమగు జ్ఞానాన్నొసంగుననుట అతిశయోక్తి కాజాలదు. ఈ గ్రంధంలో ముమ్మందుగా రహస్యముగా ఉంచబడినా సృష్టిక్రమాన్ని వివరించి, గురుధ్యానంతో ప్రారంభించి, బ్రహ్మవిద్యకు మూలమగు రహస్యముగా నుంచబడిన అనేక విషయములను గురు శిష్య సంవాదంలో తెలియజేస్తూ, గురువుల లక్షణములను వివరించి, ఎలాంటి గురుని దరిజేరి యోగసిద్ధిని పొందగలరో తెలిపి, ఈనాటి సమాజంలోని వారికి ఎవరెవరికి ఏవిధంగా నమస్కరించాలో తెలిపి యువతరానికి అర్ధమగునట్లు వివరించి, యోగసాధకులు 13 రకములగు దుష్ప్రవర్తనలకు దూరంగా ఉండాలని ఉదాహరణలతో హెచ్చరిస్తూ, తిథి, వార, నక్షత్రాదులకు ఏస్వరం ఉండాలో దాన్ని ఎలా తెచ్చుకోవాలో చెబూతూ యింకా సంవత్సరాదినుండి అష్టమివరకూ ఉండవలసిన స్వరాలను

అవిలేనప్పుడు కలుగు దుష్ఫలితాలను వివరించి, ఉత్తర దక్షిణాయములకు ఏస్వ
ఉండాలి. ప్రతీనిత్యం నిద్రమేల్కొనునపుడు ఎవరెవరిని ధ్యానించి, మంచం దిగునపు
ఏ పాదం ముందుగా భూమిపై మోపి, భూదేవతకు నమస్కరించి ఏదిశగా అడుగు
వేసి కాలకృత్యములు తీర్చుకుని స్నానం చేయునపుడు చెప్పుకోవలసిన మంత్రాల
వ్రాసి ఏఏ వర్ణస్తులు ఏ ప్రకారం నడుచుకోవాలో తెలిపి, చతుర్విధ ఆశ్రమలక్షణమ
నెఱింగి, గురువు వద్ద శిష్యుడు ఆచరించవలసిన పద్ధతులు, త్రివిధ ప్రసాదముల మర్మవ
అష్టవిధపుష్పముల అర్థాన్ని వివరించి మానసపూజలో గల మహోద్భుతమును, మా
శరీరమందలి పరమాత్మ స్థానాలనెఱింగించి, పిండోత్పత్తి క్రమాన్ని ఉత్తమ సంతానా
పొందుపద్ధతులను వివరించి, నాలుగు రకముల గురు సేవలనెరింగించి యోగసాధన
ముందుగా విశ్వబ్రాహ్మను ధ్యానించుట, మానవజీవన విధానంలో ఖర్చగు శ్వాసలలెక్క
శ్వాసలు ఎక్కువ నష్టమగుటచే తగ్గు మానవుని ఆయుఃప్రమాణము, శ్వాసలు తకు
తీసుకొనుటచే పెరుగు ఆయుః ప్రమాణాన్ని వివరించి హంస (శ్వాస) సప్తచక్రాల
ఏఏ సమయంలో ఎంతెంత జపము జరుగునో తెలిపి దానిని సాధకుడు ఏవిధం
సద్వినియోగ పరచుకోవాలో వివరించి, బ్రహ్మాండ విషయములనెఱింగించి, వేదాంతు
వాడు మరుగుపదాలను తెలిపి.విరాట్ చైతన్యము, పంచతన్మాత్రల ఫలితముల
పంచభూతములతో కూడిన మానవ శరీరమునందలి తత్వ విమర్శ,మూడుదేహమ
చర్యలు, త్రివేణుల వివరములు, రెండునుంచి తొమ్మిదివరకు గల సర్వవిషయముల
తెలిపి, మానవశరీరమునందు గల చతుర్ధశ భువనములు, 27 నక్షత్ర స్థానాలు తెలి
సద్గురుని ప్రాధాన్యత తెలుపునట్టి మరుగున పడిన గురుగీతా ప్రభావాన్ని గుర్తు చేస
వీరబ్రహ్మం, వేమన తెలిపిన విశ్వరహస్యములు,యోగ సిద్ధులు తెలిపిన అమ
వాక్యములు, సనారీవారి గురు పరంపర,గుర్వష్టకము, సనారీ చాలీసా, సనారీ అష్టకవ
సనారీ ఖడ్గము సనారీ వారి మంగళాష్టకము, దేవుసత్యన్నారాయణగారు 1947
రచించిన బ్ర॥ ఎదురేశ్వరపు కామేశ్వరరావు (బరంపురం) గారితో 1948లో ముద్రిం
శ్రీ సనారీవారి వర్ణమాలికను 2016లో వెలుగులోనికి తెచ్చుట, సనారీవారి ప్రియశిష్య
పట్టిసపు వెంకటేశ్వరుడు వ్రాసిన మరుగు పడిన విషయములు, శృంగేరి అ
పీఠాధిపతులైన ఆది శంకరాచారిగారు క్రీ॥పూ॥ 4వ శతాబ్దంలో రచిం





శ్వకర్మాష్టకాన్ని పండితపామర్తి నాగభూషణశర్మగారు 1991లో పామరులకు సైతము
ర్థమగునట్లు రచించిన దానిని ఈ గ్రంధమందు పదిలముగా పొందుపరచుట,
తేతాయుగంలో శివభక్తాగ్రగణ్యుడైన రావణబ్రహ్మ స్తుతించిన శివతాండవ స్తోత్రాన్ని
ర్థములతో వివరించుట, సృష్ట్యాదిలో విరాట్ విశ్వకర్మ భగవానుడు తనమానస
త్రులగు పంచబ్రహ్మలకు ఉపదేశించగా నాటినుండి నేటి వరకూ పరంపరగా వస్తున్న
గవద్గీత ముఖ్యశ్లోకార్ధములు, మహనీయులను భవించిన శరీరప్రారబ్ధములు, షడ్విధ
రుశిష్య సంబంధాలు, శివదర్శనానికి తెలుసుకోవలసిన విషయాలు, పంచాక్షరీ మంత్ర
భావము, మానవ శరీరమందలి సప్తద్వీపముల వివరము, యోగసాధనలో కలుగు
మృత తత్వసిద్ధి, ప్రస్తుతము మానవులనుభవించు వ్యాధులకు గల గత జన్మకర్మల
వరములు కాళహస్తి మునీశ్వరుడు తెల్పిన అష్టాదశ యుగముల ప్రవర్తనా విషయములు
ండలినీ శక్తిని మేల్కొలిపి షట్చక్రములను శుద్ధిపరచుకొను విధానము.
యోగసాధనాపద్ధతులు సృష్టి రహస్యాలు ప్రస్తుతకాలంలో మరుగున పడిన రహస్యము
నున్న అనేక ముఖ్య విషయాలు ఈ గ్రంధమందు లెక్కకు మించి పెక్కుగలవు. ఇలాంటి
ముఖ్యవిషయములతోగల ఈ గ్రంధ రాజము యోగసాధకులకు పెద్దబాలశిక్షవలె యోగ
సాధనలకు ఉపయోగపడగలదు. ఈ నాటి డిగ్రీల చదువులు అంతగా లేని కాలంలో
క్క పెద్దబాలశిక్షను పఠించి పరిపూర్ణ లోకజ్ఞానాన్ని సంపాదించెడివారు. అటులనే ఈ
గ్రంధమందు తెల్పిన విషయాలను సద్గురువును మనసునందు నిలిపి సాధనలు
చేయువారు యోగజ్ఞానాన్ని పొంది, అమృతాన్ని సేవించిన దేవతలు అమరులైనట్లుగా
రును ఈ యోగామృతాన్ని త్రికరణ శుద్ధిగా సేవించి ఆచరించినవారు చరిత్రలో
మరులై శాశ్వత కీర్తినార్జింతురనుటలో ఎట్టి సందేహములేదు. ఇట్టి మహత్తర గ్రంధాన్ని
చించిన వారును దీనిని మనకందించుటకు ముద్రణ ఆర్థిక సహాయమొనరించిన
**గుండు శివాజీ అండ్ బ్రదర్స్"** చిరస్మరణీయులు. సనారీ వారి కృపతో వారి శిష్య
రమాణువు సాయిబాబాచార్యులు గారు చేసిన ఈ సత్సంకల్పాన్ని సద్వినియోగపరచు
క!

ఇట్లు

**యోగామాష్టర్ కాకుమాను రామకృష్ణ,** తెనాలి



**తత్వ శోధకులు ఈ మార్గాన్ననుసరించి యోగసిద్ధిని పొందగలరు.**

ఓంశ్రీం

జ్ఞాత్వా కర్మాణి కుర్వీత॥

ఏ విషయములైనాకర్మలనైనా తెలుసుకొని ఆచరించాలి. అని పెద్దల మాట. ఈ గ్రంథంపేరు యోగజ్ఞానామృతం" ఎంత చక్కని పేరు. ఆ పేరులోను పూర్తి విషయం అవగతం అవుతున్నది."యోగః చిత్త వృత్తి నిరోధః" చిత్తవృత్తులను నిరోధించడమే యోగం. అని పెద్దలు చెప్పినా కూడా ఆచిత్త వృత్తులను నిరోధించే మార్గం తెలియకపోతే యోగం నిరర్ధకమే కదా! పైవాక్యాలు పలికిన పెద్దలతో పోలినవారు శ్రీ సుగంధం సాయిబాబాస్వామీజీ గారు. ఎందుకలా పోల్చి చెప్పవలసి వచ్చిందంటే ఏదైనా అనుభవిస్తే గాని వారు చెప్పరు.అని అర్ధమౌతుంది గనుక మధుర పదార్థాలు అనేకం ఉన్నా అనింటిలో తీపి ఉన్నా వేర్వేరు పదార్థాలు వేర్వేరు మధురములుగా మనకు ఎలా అనుభవమో అలాగే అనుభవంపొందిన తదుపరి వచ్చే వాక్కులు వేరుకదా! శ్రీసాయిబాబా స్వామీజీ అనుభవంలోకి వచ్చిన ప్రతివిషయాన్నీ వదలక అందరికీ పంచాలనీ అందరూ శ్రీసనారీ వారి యోగ మార్గంలో నడవాలని స్వామివారు నిగూఢంగా తెలిపిన విషయాలను విశదీకరించి వివరించి అనుభవాలను రంగరించి ఈ గ్రంథం స్వామీజీ వ్రాయడం జరిగింది. ఎంతో మంది గురువులు ఉంటారు అందు బాధ గురువులు, భోద గురువులు, జ్ఞానగురువులు ఇలా ఎంతోమంది ఉంటారు. వారి పంథాలో వారు బోధిస్తూ ఉంటారు. మానవునికి అవసరమైన మోక్షమార్గాన్ని బోధించే గురువులు అరుదుగా ఉంటారు. బాధగురువులకు బాధ కల్గించే విధంగా ఉన్నాకూడా అట్టివాటిని కూడా విడువక, నిష్పక్షపాతంగా గురుశిష్య-ప్రశ్న -ప్రతివచన రూపంలో వ్రాసిన స్థితి చాలాబాగున్నది. ఒక విధంగా ప్రశ్న జనించాలంటే శిష్యుని స్థాయికి దిగజారి ప్రశ్నవేసుకోవాలి.అంటే ఆస్థాయిలో అనుభవించిన విషయాలనుండి సమాధానం చెప్పగలిగి ఉండాలి అలాగే జవాబుకూడా ప్రశ్నకు తగ్గట్టు అనుభవించిన జవాబు వ్రాయాలి అంటే ఎంత సాహసమో ! గురుశిష్యుల బాంధవ్యము సంప్రదాయములు బాధగురువుల పట్ల తీసుకోవలసిన జాగ్రత్తలు చక్కగా వివరించారు. మానవజన్మకు





వచ్చుటకు కారణమేమి?అని ప్రశ్నించుకునే వారందరికీ అదిపెద్ద ప్రశ్నే! అయితే ఈ గ్రంథం ఒక్కసారి పఠిస్తే ఆప్రశ్నకు ఆప్రశ్నే కాదు ఇంకా అనేక ప్రశ్నలకు, మోక్షాపేక్షితులందరూ జవాబులు తప్పక తెలుసుకుంటారు. పూర్వజన్మ సంస్కార బలముకలవారు శీఘ్రగతిన ఈ గ్రంధ పఠనం ద్వారా సార్ధకం చేసుకోగల్గుతారు. పూర్వజన్మ సంస్కారబలం తక్కువ గలవారు కనీసం ఇందలి విషయాలతో ప్రయత్నించి యోగసాధనద్వారా ప్రయాణం ప్రారంభించ గలుగుతారు. అనునది అక్షరసత్యం-యోగసాధనలో పరిపక్వ దశకు చేరిన వారు మాత్రమే వ్రాయగల్గినది ఈ గ్రంథం - ఆధ్యాత్మిక సాధన, లేదా వివిధ గ్రంథాలలో వివిధ సందర్భాలలో గోచరించే అనేక క్లిష్టమైన పదములకు వ్రాసిన అర్థములు శాస్త్రీయముగా గోచరమగుచున్నవి. ఇట్టి వివరణ మేరుపర్వత సమానమై అత్యద్భుతంగా ఉన్నదని చెప్పుట అతిశయోక్తి ఏమాత్రం కాదు. ఇతః పూర్వ శ్రీసాయిబాబాస్వామీజీ గారు శ్రీసనారీ వారి సంవాద గ్రంథార్ధముల గ్రంథం అందించారు. ఇదికూడా ఆ గ్రంథంవలే లేదా దానిని పోలిన గ్రంథం అనువాదమే నని భావించాను కానీ ఈ గ్రంథం అసామాన్యమైనది.

ఈ గ్రంథం పూర్తి అనుభవ పూర్వకముగా వ్రాసినదని అవగతం అవుతున్నది. ఇట్టి మహోన్నత గ్రంధాన్ని పాఠకులు శ్రీస్వామివారి భక్తులు యోగసాధకులు శ్రీసనారీ వారికృపచే ఇందలి విషయములను పూర్తిగా పఠించి అవగతం చేసుకొని మానవజన్మ పరమార్థాన్ని గ్రహించి సాధన సంపత్తిచే కృతార్థులు కాగలరనీ, అట్లే ఇంతటి అనుభవజ్ఞానాన్ని ప్రసాదింప చేసిన భగవానునికి వందనములు అర్పిస్తూ ఇట్టి కృతులను అనుభవాలను భవిష్యత్తులో మరెన్నో వెలయింపజేయుటకు సాయిబాబాస్వామీజీ గారికి ఆయుర్భాగ్యములు ప్రసాదింపచేయగలందులకు మనస్ఫూర్తిగా భగవానుని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు:

పి. వెంకటాచార్యులు

శ్రీ ఆదిశంకరాచార్య వేదధర్మ పీఠమ్

హైదరాబాదు.

15-8-16.



## శ్రీసనారీ యోగ జ్ఞానామృతము

ఈ కలికాలమునందున గృహారామ క్షేత్రాదుల యందును, దారాసుత ధనధాన్యాదుల యందును, స్రక్చందనాదుల యందును తగిలియున్న మనస్సునకు శాంతి లేకపోవుటవలన పూర్వాచార్యులచే రచయింపబడియున్న వేదాంత గ్రంధములు దురవగాహములై యుండుటవలన నేడు యోగాభిలాష కల ముముక్షువులకు యుపయోగకరమగునట్లుగా శ్రీశ్రీశ్రీ సనారీ పీఠాధిపతులు సనారీ యోగాభ్యాసపరులుబ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబా చార్యస్వామీజీ వారు జనులందరి కొఱకు శ్రీసనారీ యోగ జ్ఞానామృతము అను వేదాంతామృతము మనకందించిరి. ఇందున వారి అంతరార్ధము. దేహేంద్రియములు బ్రహ్మముకాదని బ్రహ్మము సర్వాతీతమని అట్టి బ్రహ్మమును తెలిసి కొనుటకు ఈ సాధనములవసరమని ప్రవచింపబడి యున్నది.

శ్లో॥ **సత్యాభి సంధ్యానరతో విముక్తో -మహత్త్వ మాత్మీయముపైతి నిత్యమ్।**
**మిధ్యాభి సంధానరతస్తు నశ్యాత్- దృష్టం తదేతద్య దచోరచోరయోః(వివేక చూడామణి)**

సత్యమగు ఆత్మను ఆశ్రయించువాడు బంధవిముక్తుడై మహత్తరమగు శ్రేయమును సదా పడయుచుండును. మిధ్యయగు దేహాది దృశ్యమును ఆశ్రయించువాడు వినాశమును, దఃఖమును పొందును. లోకమున చోరుడు కానివాడు సుఖమును, దొంగయగువాడు దుఃఖమును పొందు చుండుట కానబడుచున్నది కదా!

ప్రతీ జీవియొక్క హృదయమందును ధర్మాధర్మములకు, న్యాయన్యాయాములకు, సత్యాసత్యములకు ఆత్మానాత్మలకు సదాపోరు జరుగుచుండును. అందున ముముక్షువు యొక్క హృదయమునందు ఈ పోరుఅంత ఇంత కాదు. అతి తీవ్రముగా నుండును. అట్టి వారికి శ్రీ జ్ఞానామృతము అన్నప్రాశము వంటిది. ప్రతియొక్కరును చదివి విషయ పరిజ్ఞానము ఇంకా పరిశోధించాలని ఆశిస్తున్నాను. మాన్యులు శ్రీ సాయిబాబా స్వామీజీ వారిలో సాక్షాత్ ఆపరమశివ స్వరూపులు సనారీవారే ప్రవేశించి ఇట్టి మహత్తర గ్రంధములు వ్రాయబూనుటకు సంకల్పించిరి అనుటలో ఎట్టి సందేహమూలేదు. సనారీ వారి సేవలో నేటికి వీరు తరిస్తూ వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించి ఎన్నో ఇట్టి మహత్తర గ్రంధములు ఇంకా వారి కృషితో వెలుగొందాలనేది నాఆకాంక్ష. వీరికి శ్రీ విరాట్ విశ్వకర్మ పరమేశ్వరుడు అష్టైశ్వర్య భోగభాగ్యాదులు ప్రసాదించాలని ప్రార్ధిస్తూ.....

మీ జనార్ధన శివాచార్య స్మార్తాగమ వాస్తుజ్యోతిష పండిత్
శ్రీ శర్వాణీ శైవాగమ విద్యాపీఠాధిపతులు తెనాలి.







## ప్రతి ఇంట ఉండవలసిన గ్రంథము

విశ్వంబులో విశ్వనాధావధూతయగు-విశ్వబ్రాహ్మణుడొకడు పుట్టేనుమా!
విశ్వంబులో తాను శాశ్వతంబుగ నుండె-విశ్వనాధుండనని పల్కేనుమా!!

శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారు రచించిన కాలజ్ఞానములో 10వ గోవింద వాక్యమిది.

శ్రీకాకుళం జిల్లా పాలకొండ గ్రామములో విశ్వబ్రాహ్మణ వంశంలో జన్మించిన శ్రీశైల మల్లిఖార్జునుని అంశ సంభూతుడు ఈ సనారీ విశ్వేశ్వరస్వామి. వారు ఎంతో గొప్పవారు. ఎన్నో మహిమలు చూపారు. వారిని గురించి శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారు స్వయంగా తన రచనలలో చెప్పారు అంటే, ఇక మనం వారిని గురించి వేరే చెప్పనక్కరలేదు. విశ్వబ్రాహ్మణులకు మహత్తరమైన వరమిది. అంతటి విశ్వనాధుడు తమకులంలో ఉద్భవించటంకన్నా ఇంకేమికావాలి. శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి వారూ స్వయంభువుగా అవతరించి అదే విశ్వబ్రాహ్మణ కులంలో పెరిగి లోకోద్ధరణ చేశారు. అనంతానంత రాశిని మనముందుంచారు. సమాజోద్ధరణ, సమాజహితము, సర్వ సమన్వితము, సద్ధర్మ నిరతిని ప్రతిపాదించి విశ్వ విరాట్ భగవానునిగా విరాజిల్లి కాలజ్ఞానమనే మహత్తర గ్రంధ రాజాన్నిఅందిస్తున్నాను. పూజించి తరించండని, తమ మహదాశీస్సులను మనందరికీ అందించి అనాది విరాట్ స్వరూపులైన శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారి దివ్యాశీస్సులు తమకున్నాయని గుండెనిండా ఆనందాన్ని నింపుకోగలిగిన వంశం విశ్వబ్రాహ్మణ వంశం.

శ్రీ సాయిబాబా గారు ఈ గంధ్రాన్ని అద్భుతంగా తీర్చిదిద్దారు. ఇందులో అనేక వేదాంత విషయాలను పొందుపరచారు. కొన్నిచోట్లయితే శిష్యుడు అడగటం - గురువు చెప్పటంలాంటి గురుశిష్య సంవాదం లాగా విషయాన్ని నడిపించారు. ఈ గ్రంధకర్త అయిన శ్రీసాయి బాబాగారు వ్రాసిన అనేక విషయాలు వారి ప్రతిభా నిరంతర పరిశ్రమ చేస్తేనేగాని ఇలాంటి ఉద్గ్రంధాలు పాఠకుల చేతికందవు. శ్రీసాయిబాబాగారు మంచి అనుష్టానపరులు. శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామివారి యందు అఖండ భక్తి ప్రపత్తులు గలిగిన ధీశాలి. నిరంతరం స్వామివారి సేవలో పునీతులవుతూ ఎందరినో స్వామిసేవలో తరింపజేస్తున్న గొప్ప సాధకులు శ్రీసనారీ విశ్వేశ్వరస్వామివారి అనుగ్రహాన్ని పుష్కలంగా అందుకున్న అదృష్టశాలి. అలాంటి వారు వ్రాసిన గ్రంథం తప్పక ప్రతివారూ పఠించవలసిన గ్రంధరాజంగా వుంటుందనటంలో సందేహంలేదు. ఎవరు నిరంతరం

తన ఇష్టదైవం సేవలో పునీతులై వుంటుంటారో అట్టివారి బాటలో ఆ స్వామి పరివేష్టితులై వుంటారని పెద్దల వాక్యం. రామ నామము జరిగేచోట శ్రీ ఆంజనేయస్వామి వుంటారని ప్రతీతి. అలాగే "ఏ ఇంటా మా కాలజ్ఞానము పూజించి పారాయణము చేయబడుతుందో ఆ ఇంట మేముందు"మన్న శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారి వాక్యాను సారం చూస్తే ఈ గ్రంధం ఏ ఇంట పారాయణం జరుగుతుందో ఆ ఇంట శ్రీ సనారీవారు అనుగ్రహ స్వాములైవుంటారు సుమా!

ఇక సనారీ విశ్వేశ్వర జ్ఞానామృతము అను ఈ గ్రంథ విషయానికి వస్తే ఈ గ్రంధాన్నేవరు పఠిస్తారో వారికి జ్ఞానాభివృద్ధి, హృదయశుద్ధి, మనోపరిపక్వబుద్ధి, అష్టైశ్వర్యసిద్ధి కలుగుతాయనటంలో అతిశయోక్తిలేదు.

శిష్యోద్ధరణ : సద్గురువు తన శిష్యులను ప్రయోజకులుగా చేస్తాడు. వారికి సకల విద్యలు నేర్పుతాడు. జ్ఞానబిక్ష పెట్టి అనుగ్రహిస్తాడు అయితే శిష్యులందరూ తరించాలనేమీలేదు. విశ్వాసులైన వారు తప్పక తరిస్తారంటూ మార్జాలన్యాయ, మర్కటన్యాయం రెండు ముఖ్య విషయాలను ప్రతిపాదిస్తూ మార్జాల మనగా పిల్లి. తన పిల్లలను ఏడు ఇళ్ళు మార్చి మరీ రక్షిస్తూ అవి ఎలా బ్రతకాలో నేర్పుతుంది. మర్కట మంటే కోతి. కోతి తన బిడ్డలను తన గర్భకోశమున అంటిపెట్టుకొని వుండగా అది ఆ చెట్టుపైకి, ఈ చెట్టుపైకి దూకుతూ ఆహారాన్ని సంపాదిస్తూ తన పిల్లలకు పెడుతుంది. అలా తన పిల్లలకు బ్రతుకుతెరువు నేర్పుతుందని చక్కటి ఉపమానాలతో వివరించారు.

ఇంకా చతుర్విధ శుశ్రూషలంటూ తరించదలచిన శిష్యులు చేయవలసిన గురుశుశ్రూషలను వివరిస్తూ నిజమైన శిష్యుడు ఇలా వుండాలని వివరించారు.

అలాగ చతుర్విధ పురుష లక్షణాలను ప్రతిపాదించారు. మహావాక్య చతుష్టయము లంటూ ప్రజ్ఞానంబ్రహ్మ, అహంబ్రహ్మాస్మి, తత్వమసి, అహమాత్మబ్రహ్మ అను నాలుగు వేదములలోని నాలుగు వాక్యాలను వాటి స్థూలమైన అర్థాలను పొందుపరచారు.

శ్రీవీరబ్రహ్మేంద్రస్వామివారి ప్రస్తావచేస్తూ!

అనాది విరాట్ స్వరూపులు స్వయంజ్యోతి స్వరూపులు. కలియుగ అవతారము అయిన శ్రీ మద్విరాట్ పోతులూరి శ్రీవీరబ్రహ్మేంద్రస్వామి వారి రచనలను ప్రస్తావిస్తూ వారు వ్రాసిన పద్యాల నుటంకించారు.

క॥ సంసారమునందుండియు సంసారము విధ్యజేసి సర్వము తానై
సంసారమునందు నిలిచిన సంసారే రాజయోగి సత్యము సిద్ధా!





క॥ అంతా బ్రహ్మమయంబని సంతసమున ఎరుగువారు సర్వజ్ఞులు శ్రీ
కాంతుని కృపచే వారికి చింతలు లేవయ్య యోగసిద్ధుల సిద్ధా॥
క॥ శ్రీ గురుపదముల ముట్టియు బాగుగత్రి విధ ప్రసాదభక్షకుడైనన్।
యోగంబు చేయ నేటికి ? యోగులలో నుండునతడె యోగ్యుడు సిద్ధా॥

అంటూ సిద్దార్ధ శతకములోని పద్యాలను

బ్రహ్మమనగవేరె పరదేశమునలేడు-బ్రహ్మమనగచూడు బట్టిబయలో
తనకుతానె బ్రహ్మతారకమౌనురా-కాళికాంబ! హంస! కాళికాంబ!

విశ్వదోషగుణము విప్రులపాలాయె।- విశ్వమెల్లనడుపు విశ్వకర్మ
విశ్వగురుండెవడొ వివరించి చూడుడు- కాళికాంబ! హంస! కాళికాంబ!

అంటూ శ్రీవీరబ్రహ్మేంద్రస్వామివారు రచనలను పొందుపరచి స్వామివారి దివ్యోపదేశాన్ని పాఠకులకందించారు.

పుట్టినప్పుడు బొడ్డుకోసిననాడు- అప్పుడె గురు ముద్రయంటియుండె
ముద్రతాకనివారు ముజ్జిగంబున వేరు-విశ్వదాభిరామ! వినురవేమ!

ఇవి వేమన పద్యాలు వేమనగారి రసవత్తర పద్యాలను చేర్చి పాఠకుల మనసును రంజింపజేశారు.

ఇంకా శ్రీసనారివారి చాలీసా నందించి సనారీ భక్తుల నిత్యపారాయణము చేసికొనుటను ఎంతగానో ఉపకరించునట్టు గా చేశారు. ప్రతి రోజు ఈ చాలీసాను పారాయణ చేసిన వారికి సనారివారి చరిత్ర చదివినంత ఫలంవస్తుంది. ఇంకా సనారీఖడ్గము, పంచాక్షరీ మంత్ర ప్రభావమును సాధనలోకానికి అందించారు.

శ్రీ గుర్వష్టకమును, మొదలగు ఎన్నో విశేషాలీ గ్రంధములోవున్నవి. అశేష వేదాంత విషయాలను విశేషంగా ప్రచురించి వారికిగల శాస్త్ర పరిజ్ఞానాన్ని, వేదాంత విషయాలపై తనకున్న పట్టును అసిధారవలెనున్నా వారి రచనా వైశిష్ట్యాన్ని ఈ గ్రంధం చదివిన వారు గ్రహించుతురుగాక.

ఎంతో శ్రమతో ఎన్నెన్నో వైవిధ్య విషయాలను సనారీవారి బోధనలను సాధక లోకాని కందించిన శ్రీ సాయిబాబాగారు ధన్యజీవి. వారికి శ్రీసనారీ విశ్వేశ్వరుని కృపాకటాక్ష వీక్షణాలు సర్వదా సర్వత్ర సంప్రాప్తించాలని ప్రార్థిస్తూ..

భగవత్సేవలో
పరిపూర్ణ సిద్ధానందస్వామి,

## అభిప్రాయము



ఫణిదపు ప్రభాకరశర్మ (విభావసు)
రిటైర్డు ఎకౌంట్సు ఆఫీసరు ఎ.పి.యస్.ఇ.బి.
ఇంటి నెం.7-1168 "సాయిసదన్"హరిహర నగర్ 2వలైను ముంగమూరురోడ్డు
ఒంగోలు పిన్ 523008 సెల్:9848835644 లాండ్ 08592-23553

బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీగారు చాలా కాలంగా నాకు సన్నిహితులు, సదాఅభిమానులు, సత్పధగాములు, సన్మిత్రులు, సహృదయులు శ్రీశ్రీశ్రీసనారీవారి పాదారవింద నిత్య పూజాతత్సరులు, సత్పవిత్ర విషయసమాలోచన పరులు, సనారోపదేశ మహామంత్రమును జపించుచూఆమహనీయుని తన హృదయకమలము నందు ప్రతిష్ఠించుకొని శ్రద్ధాభక్తులతో కొల్చుచున్న పరమభక్తాగ్రగణ్యులు, యోగవిద్యా ప్రభాసితులు.

ప్రస్తుతమువారు శ్రీసనారీ యోగజ్ఞానామృతమును తానొక్కరే అనుభవించి ఆనంద పడుటయేగాక, తాను నేర్చిన ఆ దివ్యామృతమును తమ సోదరసంహితులకు పంచి వారును ఏమాత్రమానందపడినను, చూసి సంతోషించవలయునని పరితపించెడి పవిత్ర భావము గల యోగవిద్యావిభాసితులు అగు సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ గారు.....

శ్రీసనారీవారి గురించి ఇంతవరకు ఎవరు ఇంత సుదీర్ఘంగా పరిశోధించుటగాని పరిశ్రమించుట గానీ ప్రచారము చేయుటగానీ జరగలేదు. ఐతే సనారీ విశ్వేశ్వరస్వామి నామధేయము ఎరుగని విశ్వబ్రాహ్మణులు చాలామంది ఉన్నారనుటలో ఎట్టి సందేహములేదు. వారికి శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామివారికి జరిగినంత ప్రచారం జరగలేదు...

**కాలజ్ఞానంలో 10వ గోవిందవాక్యము**

విశ్వంబులో విశ్వనాధావధూతయను విశ్వబ్రాహ్మణుడొకడు బుట్టెనుమా!
విశ్వంబులో తాను శాశ్వతమునుండె విశ్వనాధుడనని పల్కేనుమా॥హరిగోవింద గోవింద॥
అని శ్రీవిరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి తమ కాలజ్ఞాన గోవింద వాక్యములలో తెలిపిరి.

మహనీయులు చరిత్రలను గాని, మహిమాన్వితుల చరిత్రలనుగాని,ఋషుల చరిత్రలనుగాని యోగులచరిత్రలనుగాని వ్రాయాలంటే ఆమహనీయుల సంకల్పబలము గూడా తోడైనగాని రచయిత వ్రాయలేడు.

మహారాష్ట్ర దేశములోనిప్రధమకవి యోగీశ్వరుడు జ్ఞానేశ్వర మహారాజు గారేమి చెప్పారంటే యోగుల చరిత్ర వ్రాసేవారిని "భగవంతుడు ప్రేరేపించునట" , ఏభక్తులు ఏ యోగులు





చరిత్రను వ్రాయడానికి కుతూహల పడతారో వారి కోరికలు నెరవేరునట్లు వారు సంకల్పించిన గ్రంధము నిర్విఘ్నముగా కొనసాగునట్లు చేయడానికి ఆ యా యోగీశ్వరులు అనేక మార్గాలను గోచరింపజేసి యోగులే ప్రేరేపించి దానిని నెరవేర్చడానికి భక్తుని కేవలం ఒక కారణమాత్రునిగా నుంచి, వారి వారి కార్యాలను ఆ యోగిశ్వరులే ఆయా భక్తుల ద్వారా కొనసాగిస్తారు . దానిని విజయవంతంగా ముగింపు చేసుకుంటారు కూడా .1700 శక సంవత్సరం లో మహీపతి పండితుడు యోగీశ్వరుల చరిత్రలను వ్రాయాలని ఆకాంక్షించాడు యోగులు వారిని ప్రోత్సహించి ఆ కార్యాన్ని కొనసాగించి ఆయన చేత పూర్తిచేయించారు అధేవిధం గా 1800 శక సంవత్సరం లో దాసుగుణు యొక్క సేవను శ్రీ షిరిడి సాయి బాబా ఆమోదించారు

అధేవిధంగా బ్రహ్మశీ సుగంధం సాయి బాబా గారు శ్రీ సనారి విశ్వేశ్వర స్వామి వారి చరిత్రను గాని, సనారీ సంవాద గ్రంధార్ధములను గాని వారి మహిమలను గాని వారు ఉపదేశించిన యోగజ్ఞానామృతాన్ని గానీ తేటతెలుగులో వ్రాయడానికి శ్రీ సనారి వారి సంపూర్ణ సహకారం సంకల్పము శ్రీ సాయి బాబా గారికి లభించినవి గనుక నే వారు ఈ క్లిష్టమైన విషయ పరిశీలన వివరణాది సర్వవిషయములు విశ్లేషించగలిగినారు . ఈ నాటి చదువరులకు సులభముగా అర్ధం చేసుకొనుటకు వీలగు భాషలోనే గ్రంథ రచన చేసారు నిజంగా శ్రీ సాయి బాబా గారు ధన్యజనులు శ్రీ శ్రీ శ్రీ సనారీశ్వర స్వామి వారి కరుణ వారిపై నేరుగా ప్రసరిస్తున్నదనడానికి ఈ గ్రంథ రచన, ముద్రణ పూర్తి అగుటయే ఉదాహరణలు.

శ్రీ సాయి బాబా గారు ఈ జ్ఞానామృతం లో ఒకటి కాదు రెండు కాదు ఇంచు మించు 160 శీర్షికలను సమన్వయపరిచి , జ్ఞానామృతాన్ని తాయారు చేసి ప్రజల కందిస్తున్నారు. ఇటువంటి అపురూపమైన అత్యుతమమైన ఒక దివ్య జ్ఞాన ప్రదీపక పై నేను గా అభిప్రాయాన్ని వ్రాయడం నిజంగా సాహసమే, అయితే ఈ కాస్త వ్రాయడానికి కూడా భగవత్ ప్రేరణ అవసరమే, అట్టి ప్రేరణ కొద్దిగానో గొప్పగానో స్వామివారు నాకుకూడా అనుగ్రహించారు కనుకనే నేను ఈ నాలుగు వాక్యాలు వ్రాయగలుగుచున్నాను శ్రీ సాయి బాబా గారు ఇందులో "గురుగీతను" అర్ధసహితముగా జతపరిచారు ఇందులో

శ్లో: **"గు" శబ్ద స్త్వన్ధకారస్స్యా "రు" కారస్తన్నీరోధకః।**
**అంధకార నిరోధిత్వాద్గురు రత్యభిదీయతే॥**

గురు శబ్దంలోని "గు"కారం అంధకారానికి చిహ్నామైతే, రుకారం ఆ చీకటిని నిర్మూలించే వెలుగుకు చిహ్నాం అంటే అజ్ఞానమనే అంధకారాన్ని సమూలంగా నాశనం చేసి శిష్యునకు జ్ఞానమనే వెలుగును ఎవరైతే ప్రసాదించగలరో వారే గురువుగానీ ప్రతీవారూ గురువు కాలేరు. సద్గురు జగ్గీవాసుదేవ్ గారు గురువును గూర్చిన చిన్న వివరం చూడండి.

**ఆదిగురువు ఉదయించిన రోజు**

నిండు పున్నమినాడు ఉండే స్పందన ప్రకంపనలు ఆ రోజు ఉండే అనుభూతి మిగితా రోజులలో కంటే వేరుగా ఉంటుంది ఆధ్యాత్మికపదం లో ఉండేవారికి ఈ రోజు ప్రకృతి నుండి లభించిన ఒక వరం లాంటిది. షుమారు 60 70 ఏళ్ల క్రితం వరుకు కూడా మనదేశం లో జరుపుకునే పండుగలలో "గురుపూర్ణిమ" ఒకటి, ఏదో తెలియని కారణం వలన మనం జ్ఞానానికి బదులు అజ్ఞానాన్ని వేడుక చేసుకుంటున్నాం. అందుకని ఇది ప్రభుత్వ సెలవు దినం కావలసిన అవసరం లేదు అని నిర్ణయించుకున్నాం, మెల్లగా దేశవ్యాప్తం గా గురుపూర్ణిమ వేడుకలు క్రమక్రమం గా తగ్గిపోయాయి ఇప్పటికి అక్కడక్కడ కూడా కొన్ని ఆశ్రమాల్లో ఈ ఆచారం సజీవంగా ఉంది. కానీ గురుపూర్ణిమ అంటే ఏమిటో ఈరోజుల్లో చాలామందికి తెలియదు.

మొట్టమొదటి గురువు జన్మించిన రోజుని గురుపూర్ణిమ అంటాం. కొన్నివేల సంవత్సరాల క్రితం శివుని సిద్ధి పొంది హిమాలయాల్లో పారవశ్యంతో నృత్యం చేసారు మనం యోగ సంప్రదాయం లో శివుడిని దేవునిగా చూడం ఆయనను ఆది యోగిగా లేదా మొదటి యోగిగా చూస్తాం. ఆయన పారవస్య కదలికలను అధికమించినపుడు ఆయన నిశ్చలులయ్యారు పారవస్యత ఆయనలో కొంత కదలికకు అనుమతిస్తే ఆయన తాండవ నృత్యం చేశారు తామ అర్ధం చేసుకోలేని గాఢ అనుభూతినేదో పొందుతున్నారని చూచిన వారు అందరూ అర్ధం చేసుకున్నారు. ఆయన సంభాషిస్తాడేమో అని జనం ఎదురు చూడటం మొదలు పెట్టారు కానీ తాము అక్కడ ఉన్న స్పృహ కూడా ఆయనకు లేక పోవడం వలన వచ్చిన వారు అందరూ కొంతకాలం చూచి వెళ్లిపోయారు 7 గురు మాత్రం అలాగే వేచిఉన్నారు ఆ 7 గురు ఆయనవద్ద యోగం నేర్చుకోవాలని ఎంతో పట్టుదలతో అక్కడే ఉన్నారు కానీ శివుడు వారిని పట్టించుకోలేదు "మీకు తెలిసింది మేము తెలుసుకోవాలనుకుంటున్నాము" అని వారు ఆయనను బ్రతిమిలాడారు శివుడు వారిని పట్టించుకోలేదు అజ్ఞానులారా మీరున్న స్థితిలో కోట్ల సంవత్సరాలైన మీకేమీ తెలియదు. ముందుమీరు దానికి కావలసిన యోగ్యతను పొందాలి. దానికోసం ఎంతో సాధనచేయవలసిఉంది. "ఇది వినోదం కాదని" త్రోసిపుచ్చారు. అందుకని వారు తయారవడం ప్రారంభిచారు. ప్రతీరోజు అలా నెలలు సంవత్సరాల తరబడి వారు సంసిద్ధమౌతూనే ఉన్నారు. శివుడు వారిని పట్టించుకోకూడనుకున్నాడు. 84 సంవత్సరాల తరువాత ఒక పున్నమి రోజున సూర్యుడు ఉత్తర దిశనుండి దక్షిణ దిశకు మారుతున్నప్పుడు మన సాంప్రదాయంలో దక్షిణాయనం ప్రారంభమౌతుందనే కాలంలో "ఆదియోగి ఈ ఏడుగురిని చూశాడు". వారు తేజోవంతులైన జ్ఞానపాత్రులుగా మారారు. వారు జ్ఞానాన్ని అందుకోవడానికి పూర్తిగా సిద్ధంగా ఉన్నారు.





ఇక ఆయన వారిని పట్టించుకోకుండా ఉండలేకపోయాడు. వారు ఆయన దృష్టిని ఆకట్టుకున్నారు. తరువాత 28 రోజులు నిశితంగా వారిని గమనించారు. మళ్ళీ పూర్ణచంద్రోదయమైన రోజున ఆయన గురువుగా మారాలని నిర్ణయించుకున్నారు. ఆదియోగి తననుతాను గురువుగా మార్చుకున్నారు. ఆయన తన కృపను వారిపై కురిపించడానికి దక్షిణవైపు తిరిగి యోగశాస్త్ర ప్రసారం ప్రారంభించారు. ఆయన దక్షిణ దిశవైపు తిరిగి ఆది గురువుగా మార్చుకున్నారుకాబట్టి ఆయనను "దక్షిణామూర్తి" అంటున్నాం. ఆరోజున మొదటి గురువు జన్మించారు. అందుకని ఆరోజు "గురుపూర్ణిమ" అంటారు.

మనం గురువు అనే పార్శ్వాన్ని గ్రహించగలిగే అవకాశంఉన్న రోజు "గురుపూర్ణిమ " అది ఇతరరోజులలో లభించదని కాదు, గురు కృప ఎల్లప్పుడూ ఉంటుంది.

అసలు మీరు గురువుని కోరరు. మీ మనసులో తెలుసుకోవాలనే గాఢమైన కోరిక ఏర్పడ్డప్పుడు మీకు గురువు లభిస్తారు. మీరు ఉత్తమమైన గురువుని ఎంచుకుంటూ, వెతుక్కుంటూ వెళ్లనక్కరలేదు, మీలో తీవ్రమైన తపన పెంచుకోండి. మీకు గురువు లభిస్తారు. గురువు అంటే ఒక వ్యక్తి కాదు. గురువు అంటే ఒక ప్రత్యేకమైన స్థానం. "స్థితి". ఒక ప్రత్యేకమైన శక్తి అదిమీకు మాత్రమే సంభవించగలదు. అదేదో మీకు కలిసేదికాదు. అది మీరు కరచాలనం చేసేదికాదు. మీరు పాదాభివందనం చేసేది కాదు. మీరు దగ్గరకు వెళ్ళి అదికావాలి యిదికావాలి అని యాచింప గలిగేది కాదు. మీరు గురువు అనుకునే ఆస్థితి ఆశక్తి మీకు ప్రాప్తిస్తుంది. అది మిమ్మల్ని ముంచివేస్తుంది. మీరు ప్రస్తుతంఉన్న విధానాల్ని నాశనం చేసి, ఏ బంధనాలు మీకు లేకుండా, సృష్టికర్త మీరు ఎలా ఉండాలనుకున్నారో అలా ఉండేలా చేస్తుంది.

## ప్రేమాశీస్సులతో -సద్గురు

దీన్నిబట్టి ఆలోచించండి గురుస్థానం ఎలాంటిదో....వీరబ్రహ్మగురుదేవులు కూడా గురుపదాన్ని ఇలా నిర్వచించారు.

కం॥ శ్రీగురుపదములు ముట్టియు, బాగుగా త్రివిధప్రసాద భక్షకుడైతే ।
యోగంబు సేయనేటికి యోగులలో నుండు నతడు యోగ్యుడు సిద్ధా॥
గీ॥ గురుడు గురుని పూజగురుడు శిష్యునిపూజ-శిష్యగురువులయొక్క శివుని పూజ॥
శివుని పూజించేటి గురుశిష్యులెందరో-నిత్యముక్తి పరులు నేర్పు సిద్ధా॥

గురువులను విభజించితే 23మంది గురువులుగా మనకు కనిపిస్తున్నారు

1.గూఢగురువు
2.దృఢగురువు
3.ప్రీతి గురువు
4.వరాన గురువు
5.సకృతి కామగత గురువు
6.విహంగ వృత్తి గురువు
7.కూర్మవృత్తి గురువు
8.మీనవృత్తిగురువు
9.బ్రహ్మవిదుడు
10.బ్రహ్మవిద్వరుడు
11.బ్రహ్మవిద్వరీయుడు
12.బ్రహ్మవిద్వ రిష్ఠుడు.
13.సూచకగురువు
14.వాచక గురువు
15.బోధ కగురువు
16.నిషిద్ధ గురువు
17.విహిత గురువు
18.కారణ గురువు
19.పరమ గురువు
20.నాద గురువు
21.ఛాయనిధి గురువు
22.చందన గురువు
23.కౌంచ గురువు

అయితే ఈ గురువుల పరిస్థితి ఒక్కొక్కరిది ఎలాఉంటుంది? అని వివరాలలోకి పోతే చాలా విషయాన్ని వ్రాయవలసి ఉంటుంది. గనుక కేవలం గురువులలో విభజన మాత్రమే ఎత్తి చూపాను.వీరందరూ గాకుండా మన సాయిబాబాగారు మరోక్రొత్తగురువును పరిచయం చేసారు. వారే ఊర గురువు (పుట7)

సాయిబాబాగారు ఈ గ్రంధంలో ఇంకా ఎన్నో విషయాలు, నాడీ శాస్త్రం మొదలైన అమూల్యమైన విషయాలుగూడా క్రోడీకరించారు. నిజంగా యిట్టి విషయాలను తెలుసుకోవాలనుకునే వారికి అత్యంత ఉపయోగకరమైనదీగ్రంథం. అన్నిటినీ గురించి తడవడం సాధ్యంకాదు. (యిదీ చిన్న గ్రంధంమే అవుతుంది) గనుక కొన్నికొన్ని ముఖ్యమైనవాటిని మాత్రమే యిందు పొందుపరిచాను.

**షట్చక్రాలు**

ఈ ఆరు చక్రాలను గురించి చాలామంది వారివారి అనుభవాలతో విశ్లేషించి వివరణలు ఇచ్చారు. "కానీ కూచిపూడి వెంకటలక్ష్మిగారు యోగా శిక్షకురాలు". వీరు చాలా సులభంగా ఒక్కొక్క చక్రాన్ని రెండుమూడు వాక్యాలతో వివరించారు.

1.మూలాధారం:- శరీరంలో వెన్నుముక క్రింద భాగంలో ఉంటుందీచక్రం.సాధకుడు కళ్ళుమూసుకుని ఆప్రదేశంలో ఒక చక్రమున్నట్లు ఊహించుకోవాలి. దానిమీద దృష్టిని





కేంద్రీకరించి మూడు నిమిషాలు కూర్చుంటే సరిపోతుంది. ఈ సమయంలో సాధారణ శ్వాసను తీసుకోవచ్చు.ఇలా చెయ్యడం వలన మలమూత్రాలు సాఫీగా సాగుతాయి.

2.స్వాధిష్టాన చక్రం:- వెన్నెముక క్రిందిభాగం అంటే బొడ్డుకు క్రింద స్థానంలో ఉంటుందీ చక్రం దీనిపై దృష్టి నిలపడం వలన మూత్రపిండాల పనితీరు మెరుగు పడుతుంది.

3.మణిపూరక చక్రం:- వెన్నెముక దగ్గర బొడ్డుకు వెనుక భాగంలో ఉంటుందీ చక్రం.ఈ భాగంమీద మనసు ఏకీకృతం చేస్తే జీర్ణశక్తి అభివృద్ధిచెందుతుంది క్లోమగ్రంధి చక్కగా పనిచేస్తుంది మధుమేహ సమస్యలను రాకుండా కాపాడుతుంది.

4.అనాహత చక్రం:-గుండెకు వెనుక భాగాన ఉండే ఈ చక్రం అత్యంత కీలకమైనది. దీనిమీద దృష్టిపెట్టడం వలన గుండెకు వెళ్ళేరక్తనాణాల్లో అడ్డంకులు ఏర్పడవు. రక్తం గుండెకు సాఫీగా సరఫరా అవుతుంది. క్రమం తప్పకుండా ఈ చక్రాన్ని ఉత్తేజపరచడం వల్ల హృద్రోగ సమస్యలు రావు. సున్నితమైన మనస్తత్వం ఏర్పడుతుంది.

5.విశుద్ధచక్రం:- కంఠానికి వెనుక భాగంలోని ఈ చక్రం థైరాయిడ్ సమస్యలను రానివ్వదు. స్వరపేటిక సమస్యలు తగ్గుతాయి. గొంతు సంబంధవ్యాధులు రావు.

6.ఆజ్ఞాచక్రం:- రెండుకనుల మధ్యభాగంలో ఉండే చక్రం ఇప్పటి వరకు చెప్పుకున్న ఐదు చక్రాలు ఆరోగ్యానికి సంబంధించినవైతే యిది ఏకాగ్రతకు, జ్ఞాపక శక్తికి సంబంధించినది. అన్ని చక్రాలను ఆజ్ఞాపించే అధికారం దీని సొంతం

7.సహస్రార చక్రం:- శిరస్సు మధ్యభాగంలో మాడుక్రింద ఉంటుందీచక్రం.మనసును సమతుల్య పరుస్తుంది. భావోద్వేగాలను తగ్గిస్తుంది. జ్ఞాపక శక్తిని పెంచుతుంది.

సూచన:- ఈ గ్రంధం యోగ విజ్ఞాన సర్వస్వం. ఎన్నో గ్రంధాలను సోధన చేసి అనుభవాలను కూడా జోడించి,మంచి రుచి, పసగల యోగ జ్ఞానామృతాన్ని మనకందించిన శ్రీసాయిబాబా స్వామీజీగారు ధన్యులు.

సర్వేశ్వరుడు సదా వారిని రక్షించి కాపాడుగాక!

ఒంగోలు ఇట్లు

19.8.2016. ఫణిదపు ప్రభాకర శర్మ.

**నాగదోష శాంతి నివారణ కొరకు ధ్యానం :**

అనంతం,వాసుకీం,శేషం,పద్మనాభంచ,కంబళం,శంఖపాలం,ధృతరాష్ట్రంచ,తక్షకం, కాకతీయం తథా।ఏతాని నవ నామాని నాగానాంచమహాత్మనాం సాయంకాలం పఠేన్నిత్యం ప్రాతఃకాలే విశేషతః తస్మిన్ విషభయంనాస్తి సర్వత్రా విజయం భవేత్॥



## అభిప్రాయము

**మహారాజశ్రీ వేగేశన రాధాకృష్ణ,** B.E. ( Civil )

Director - Projects
NCC
( Formerly Nagarjuna Constriction Company Ltd., )
Hyderabad.

సనారీ విశ్వేశ్వర సంవాదమును చాలా సులువైన భాషతో పాఠకులకు, యోగ సాధకులకు అందించటంలో సుగంధం సాయిబాబాచార్య గారి ప్రయత్నం సఫలం అయింది అని నేను భావించుచున్నాను. యోగ సాధకులు ముందుగా ఈ గ్రంథంలోని అన్ని అంశాలు పరిశీలించి వాటిని బాగా అర్థం చేసుకోవాలి. అప్పుడే యోగసాధన యొక్క ప్రయోజనం పరిపూర్ణం అవుతుంది.

సనారీ విశ్వేశ్వరస్వామి తన తపోబలంతో దర్శించిన విషయం ఈ గురు, శిష్యుల సంవాదం ద్వారా వివరించారు. సనారీ విశ్వేశ్వరస్వామికి ఈశ్వరుడే గురువు. మనందరికి కూడా ఈశ్వరుడే గురువు. సనారీ విశ్వేశ్వరస్వామి వారు మనలో ఉన్న ఈశ్వరుని దర్శించే మార్గం సులువుగా బోధించారు అనే విషయాన్ని శ్రద్దగా అర్థం చేసుకొని యోగసాధకులు పాటించాలి. తెలుగు పాఠకులకు ఈ గ్రంథం అందించిన సుగంధం సాయిబాబాచార్యగారికి, విశ్వేశ్వరస్వామివారి కృపతో ఆత్మ (ఈశ్వర) దర్శనం కాగలదని కోరుకుంటున్నాను.

ఇట్లు
ప్రముఖ వాస్తు జ్యోతిష యోగసాధనాగ్రంధాల రచయిత
వేగేశన రాధాకృష్ణ





## సృష్టిక్రమము

**శ్లో॥ న భూమి నజలంచైవ నతేజోనచ వాయుహుః నచర్బ్రహ్మోనచర్విష్ణుః**
**నచరుద్రశ్చతారకాః సర్వశూన్యనిరాలంబో స్వయంభూవిశ్వకర్మణః॥**

సృష్ట్యాదియందు ఏ యితర పదార్థములులేని సమయమున అకార, ఉకార, మకారనాద సంయోగములచే ప్రణవనాద మేర్పడి అందుండి ఆది అంతములులేని మహాజ్యోతి వెల్వడెను. ఆ మహాప్రకాశములో విరాట్ విశ్వకర్మ భగవానుడుద్భవించెను. ఆయన సాకారుడు నిరాకారుడు, వీరే పురుషుడు, వీరి అర్ధశరీరమేగాయత్రీమాత యిటుల వేదపురుషుడు వేదమాతయూ అర్ధనారీశ్వరులైన ప్రథమ ఆది దంపతులు ఈ విరాట్ పురుషుని పంచ ముఖముల నుండి వరుసగా మను, మయ, త్వష్ఠ, శిల్పి, విశ్వజ్ఞబ్రహ్మలను సృజించి, వేదమాత పంచముఖముల నుండి వరుసగా ఆదిశక్తి, పరాశక్తి, ఇఛ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞాన శక్తులను వరుసగా సృజించి మను బ్రహ్మశివునకు ఆదిశక్తి పార్వతిని, మయబ్రహ్మ విష్ణువుకు పరాశక్తిలక్ష్మిని, త్వష్ఠబ్రహ్మ బ్రహ్మకు ఇఛ్ఛాశక్తి సరస్వతిని, శిల్పిబ్రహ్మదేవేంద్రునకు క్రియాశక్తి శశిదేవిని, విశ్వజ్ఞబ్రహ్మ సూర్యునకు జ్ఞానశక్తి సంజ్ఞాదేవినొసంగి, త్రిభువనములు, పంచభూతములను అష్టదిక్పాలకులను, నవబ్రహ్మలను, కోటానుకోట్ల నక్షత్రములను నవగ్రహములను ఏకాదశ రుద్రులను, ద్వాదశ ఆదిత్యులను, పదునాల్గులోకములను సృజించి నవ ప్రజాపతుల ద్వారా అఖిలసురులను, అసురులను, గరుడ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ సాధ్యులను, విద్యాధరులను, 84 లక్షల జీవరాసులను, సంకల్పమాత్రముచే సృజించి, ఈ అనంత విశ్వపరిపాలనా బాధ్యతలను పై పంచజంటలకప్పగించి, అణువునుండి బ్రహ్మాండ మంతయూ తా నుండి, సకల చరాచరజీవరాసుల యందు తానదృశ్యముగా నుండి శ్రీ విరాట్ విశ్వకర్మ భగవానుడదృశ్యుండాయెను. అంతకొంతకాలం వరకూ ఈ పంచదైవ జంటలకు తమ కర్తవ్యం సరిగా బోధపడని వారై, అందరూ కలసి ఆలోచించి ఆవిరాట్ పురుషునికై యాగము చేయసం కల్పించిరి. అమితదీక్షతో వారాచరించు యాగమునకు పరవశించి విరాట్ పురుషుడు యజ్ఞజ్వాలలనుండి ప్రత్యక్షమాయెను.

అప్పుడు వారందరూ దేవాదిదేవా! మా సందేహములు తీర్చి కర్తవ్యమును తెలుపుడని ప్రార్థించిరి.

**॥౧॥ శ్రుతి: అథవిశ్వ బ్రహ్మోపనిషదం వ్యాఖ్యాస్యామః** ॥౧॥ సర్వేదేవా దేవముపతస్తుః ॥౨॥ భక్త్యాతేతంప్రణమ్య ॥3॥ భగవన్ కిమాదౌజాతం ॥౪॥ కేనేదం ధార్యతేజగత్ ॥౫॥ కేనేదం సృజ్యతే ॥౬॥ కేనేదం పాల్యతే ॥౭॥ కేనేదం లీయతే ॥౮॥ తత్సర్వం నో బ్రూహి ॥౯॥ అథనవ.

తా॥ విశ్వబ్రహ్మోపనిషత్తును చెప్పుచున్నాము. 1.సమస్త దేవతలు భగవంతుని గూర్చి వచ్చినవారై 2.భక్తితో నా యీశ్వరునకు నమస్కరించినవారై 3.యో భగవంతుఁడా! 4. ఆదియందేమి యుద్భవించినది? 5. ఎవనిచే నీ జగత్తు ధరించబడుచున్నది? 6.ఎవనిచే నిది సృజింపబడుచున్నది? 7.ఎవనిచే బాలించబడుచున్నది? 8.ఎవనిచే లీనమగుచున్నది? 9.నదియంతయును మాకు జెప్పుమనిరి" ఇది తొమ్మిది వాక్యములు.

**౨.** శ్రు॥అథభగవానాహ ॥౧॥ విరాట్పంచముఖోస ఏవాహం ॥౨॥ మయ్యేవ సృజ్యతే ॥౩॥ సర్వం మయ్యేవ పాల్యతే ॥౪॥ మయ్యేవ లీయతే సర్వం ॥౫॥ సర్వం మయ్యేవధార్యతే ॥౬॥ అహం బ్రహ్మస్వరూపః ॥౭॥ అహం విశ్వస్వరూపః ॥౮॥ అహం వేదస్వరూపః ॥౯॥ సర్వే వేదాః ప్రణవే ప్రనతిష్టితాః ॥౧౦॥ స ఏవమమస్వరూపః ॥౧౧॥ అథ భగవానేకాదశ॥

తా॥ అనంతరము భగవంతుడు చెప్పుచున్నాడు। విరాట్పురుషుడు పంచముఖములు గలవాడు। ఆ విరాట్పురుషుని స్వరూపము నేనే। నా యందే సమస్తము సృజించబడుచున్నది। సమస్తము నా యందే పాలింపబడుచున్నది। నా యందే సమస్తము లీనమగుచున్నది। నా యందే సమస్తము ధరించబడుచున్నది। నేను బ్రహ్మ స్వరూపము। నేను విశ్వస్వరూపము। సమస్త వేదములు బ్రణవ మందు బ్రతిష్టింపబడియున్నవి। యా ప్రణవమే నా స్వరూపము॥ అథాది వాక్యములు11.

౪ శ్రు॥ పూర్వే వేదాస్సమజాయంత ॥౧॥ పఞ్చభ్యోమే ముఖేభ్యః ॥౨॥
తస్మాత్పంచాక్షరోవిరాట్ ॥౩॥ సానగాది పఞ్చ ఋషయ స్సంజాతాః
॥౪॥ సద్యోజాతవామదేవాఽఘోరతత్పురుషేశానాఖ్యాః ॥౫॥ పూర్వాననాత్సానగః
॥౬॥ దక్షిణాత్సనాతనః ॥౭॥ అపరాదహభూనః ॥౮॥ ప్రత్న ఉదీచ్యాం ॥౯॥
ఊర్ధ్వాత్సుపర్ణః ॥౧౦॥ ఏభిః పఠితాః పఞ్చవేదాః ॥౧౧॥
ఋగ్యజుస్సామాథర్వణప్రణవాఖ్యాః ॥౧౨॥ పూర్వే ద్వాదశ॥

తా॥ పూర్వమునందు వేదములుద్భవించినవి (ఎక్కడనగా) 1 నాయొక్క పంచ ముఖముల వలన (అనంతరము) 2 పంచాక్షరియను విరాడుద్భవించె 3 సానగాది పంచఋషులుద్భవించిరి 4(వీరు సద్యోజాత- వామదేవ- అఘోర- తత్పురుష- ఈశానులను నామములు గలవారు 5 తూర్పు ముఖమునందు సానగ ఋషియను ఈశ్వరుడు, 6 దక్షిణ ముఖము నందు సనాతన ఋషియను విష్ణువు, 7. పశ్చిమ ముఖమునం దహభూన ఋషియను బ్రహ్మయు, 8 ఉత్తర ముఖమునందు బ్రత్న ఋషియను దేవేంద్రుడు, 9 ఊర్ధ్వ ముఖమునందు సుపర్ణ ఋషియును సూర్యుడు





ఉద్భవించిరి. 10 వీరలచే పంచ వేదములు పఠించఁబడినవి(అవి) 11 ఋగ్వేదము। యజుర్వేదము। సామవేదము। అథర్వణవేదము। ప్రణవ వేదములను పేర్లుగలవి ॥12॥

౫ శ్రు॥ తతోనామాంతరాః పఞ్చ ॥౧॥ మను మయ త్వష్టశిల్పి విశ్వజ్ఞాః ॥౨॥ ఏతేగాయత్రాబద్ధమానాస్స్యుః ॥౩॥ తతో నామాన్తరాః పఞ్చ ॥౪॥ శివకేశవ బ్రహ్మేంద్ర సూర్యాః ॥౫॥ ఏతే ప్రకృత్యాబద్ధమానాస్స్యుః ॥౬॥ తస్మాదహం సహస్ర శీర్షోభవం ॥౭॥ తద్రూపేణ విశ్వం సృజ్యతే ॥౮॥ బ్రహ్మణోస్య ముఖమాసీత్ ॥౯॥ బాహు రాజన్యః కృతః ॥౧౦॥ ఊరూతదస్యయద్వైశ్యః ॥౧౧॥ పద్భ్యాగం శూద్రో అజాయత ॥౧౨॥ పాదనఖేషు పఞ్చమాః ॥౧౩॥ తతో త్రయోదశ॥

తా॥ అనంతరము సానగాది పఞ్చ ఋషులు 1 మను మయ త్వష్ట శిల్పి విశ్వజ్ఞులను నామాంతరముల బొందిరి. (ఎందువలననగా)2 వీరు గాయత్రీ బద్ధులగుట వలన 3 వీరే మరల నామాంతరములఁ బొందిరి 4 శివ, కేశవ, బ్రహ్మ, ఇంద్ర,సూర్యులని 5 వీరు ప్రకృతిచేఁ బద్ధులైన వారలైతిరి 6. అందువలన నేను సహస్ర శీర్షుండనైతి 7. నా యొక్క ఆ రూపముచే విశ్వమంతయు సృజించబడుచున్నది. 8 నా యొక్క ముఖముల యందుద్భవించిన వారు బ్రాహ్మణులు, 9 బాహువులయందు రాజులు, 10 ఊరువుల యందు వైశ్యులును, 11 పాదములయందు శూద్రులును, 12 పాదనఖముల యందు పఞ్చములును ఉద్భవించిరి ॥13॥

1. మను బ్రహ్మయగు సానగ బ్రహ్మ ఋషి పంచముఖముల నుండి ఐదుగురు ఉపబ్రహ్మలు ఉద్భవించగా అందు ప్రథముడగు ఉపసానగుడు సానగ బ్రహ్మఋషి యందైక్యమైపోగా ఐదుగురు బ్రహ్మలు మిగిలిరి. యిలాగే ఆదిశక్తి నుండి ఐదుగురు శక్తులుద్భవించగా అందు ప్రథమశక్తి ఆదిశక్తియందైక్యము కాగా ఆది శక్తితో ఐదుగురు శక్తులు మిగిలినవి.

2. మయబ్రహ్మయగు సనాతన బ్రహ్మఋషి పంచముఖముల నుండి ఐదుగురు ఉపబ్రహ్మలుద్భవించగా అందుప్రథముడగు ఉపసనాతనుడు సనాతనబ్రహ్మ ఋషియందైక్యము కాగా ఐదుగురు బ్రహ్మలు మిగిలిరి. యిలాగే పరాశక్తినుండి ఐదుగురు శక్తులుద్భవించగా అందు ప్రథమ శక్తి పరాశక్తియందైక్యము కాగా పరాశక్తితో ఐదుగురు శక్తులు మిగిలినవి.

3. త్వష్ట్రబ్రహ్మ యగు అహభవ బ్రహ్మఋషి పంచముఖముల నుండి ఐదుగురు ఉపబ్రహ్మలుద్భవించగా అందు ప్రథముడగు ఉపఅభవనుడు అహభవబ్రహ్మ ఋషియందైక్యము కాగా ఐదుగురు బ్రహ్మలు మిగిలిరి. అలాగే యిచ్ఛాశక్తినుండి ఐదుగురు శక్తులుద్భవించగా అందు ప్రథమశక్తి యిచ్ఛాశక్తి యందైక్యముకాగా యిచ్ఛాశక్తితో ఐదుగురు శక్తులు మిగిలినవి.

4. శిల్పిబ్రహ్మయను ప్రత్నబ్రహ్మఋషి పంచముఖములనుండి ఐదుగురు ఉపబ్రహ్మలుద్భవించగా అందు ప్రధముడగు ఉపప్రత్న సుడు ప్రత్న బ్రహ్మఋషియందైక్యము కాగా ఐదుగురు బ్రహ్మలు మిగిలిరి. అలాగే క్రియాశక్తినుండి ఐదుగురు శక్తులుద్భవించగా అందు ప్రధమశక్తి క్రియాశక్తి యందైక్యముకాగా క్రియాశక్తితో ఐదుగురు శక్తులు మిగిలినవి.

5. విశ్వజ్ఞబ్రహ్మయను సుపర్నసబ్రహ్మ పంచముఖముల నుండి ఐదుగురు ఉపబ్రహ్మలుద్భవించగా అందు ప్రధముడగు ఉపసుపర్నసుడు సుపర్న బ్రహ్మయందైక్యము కాగా ఐదుగురు బ్రహ్మలు మిగిలిరి.

అలాగే జ్ఞానశక్తి నుండి ఐదుగురు శక్తులుద్భవించగా అందు ప్రధమశక్తి జ్ఞానశక్తి యందైక్యముకాగా జ్ఞానశక్తితో ఐదుగురు శక్తులు మిగిలిరి.

యిలా యిరవైఐదు జాతబ్రహ్మ జంటలేర్పడినవి. వీరొక్కొక్కరికి ఐదుగురు చొప్పున 125 మంది జాతబ్రహ్మ లుదయించిరి. వీరే విశ్వకర్మ సంతతియైన విశ్వబ్రాహ్మణ వంశస్థులకు గోత్ర ఋషులు. వీరందరూ ఆనన సంజాతులు బ్రహ్మవంశజుల మూల పురుషులు

౬. శ్రు॥ మనుముఖాత్పఞ్చగణా సమజాయంత ॥౧॥ ప్రథమసురమరుద్గంధర్వ వస్వాఖ్యాః ॥౨॥ శివకేశవాదయః పఞ్చగణాస్సమజాయంత ॥౩॥ రౌద్ర- వైష్ణవ- ఋషి- దేవ- ఆదిత్యాఖ్యాః ॥౪॥ తాన్మేవీక్ష్య పఞ్చదా ద్వాద్వొయుంజీత ॥౫॥ మనుముఖాః కేశవాది నామభిర్యుజ్యన్తే ॥౬॥ తస్మాల్లయస్థితి సృష్టి సుఖప్రకాశకర్తారోభవన్తి ॥౭॥ ఏతేపఞ్చ బ్రహ్మాఖ్యాః ॥౮॥ మనుముఖాదష్టౌ ॥

తా॥ ॥౧॥మనువు వలన నైదు గణము లుద్భవించినవి 1 ప్రమథ గణము 2 దేవగణము 3 మరుద్గణము 4. గంధర్వులు 5.అష్ట వసువులు॥౨॥ వీరే శివ- కేశవ- బ్రహ్మ- ఇంద్ర- ఆదిత్యులను నైదు గణములైరి ॥౩॥ వారు రౌద్ర- వైష్ణవ- ఋషి- దేవ ఆదిత్యులను నామములు గలవారు.॥౪॥ నేను నాముఖోద్భవులగు నైదుగురిని యైదు విధములగు నామములతో గూర్చినవాడనైతిని.॥౫॥ ఆ కారణము వలననేవారు లయము- స్థితి- సృష్టి- సుఖము- ప్రకాశము- వీటికి కర్తలైరి ॥౬॥ వీరు పంచముఖోద్భవ బ్రహ్మలనియుం బేరుఁ గలవారు ॥8॥

3. శ్రు॥ మదాత్మాన ఆకాశః ॥ ౧॥ అస్మాత్పవనః ॥౨॥ తతోగ్నిః ॥౩॥ అగ్నేరాపః ॥౪॥ అద్భ్యః పృథివీ ॥౫॥ తస్యా ఓషధయః ॥౬॥ ఓషధీభ్యోఽన్నం ॥౭॥ తస్మాత్ప్రజాః ॥౮॥ ఇద్ధం చరాచరం జగత్ ॥౯॥ మదాత్మననవ.





తా॥ నా యాత్మ వలన ఆకాశము । దాని వలన వాయువు। వాయువు వలన అగ్నియు । అగ్నివలన ఉదకము । ఉదకము వలన బృథివి। పృథివి వలన ఓషధులు ఓషధుల వలన అన్నము । అన్నము వలన బ్రజలు । ఈ ప్రకారముగా స్థావర జంగమాత్మక మగు జగదుద్భవమయ్యె ॥9వాక్యములు॥

### విశ్వకర్మసృష్టి విశ్వమనగా అఖిలాండకోటి బ్రహ్మాండములు

కర్మయనగా సకల చరాచరములు గల ఈ సమస్తమును సృష్టిచేయుట కర్మయందురు. కావున ఈ ఆది పురుషుని విరాట్ విశ్వకర్మయందురు. యిట్టి సకల చరాచర సర్వ జగత్తునూ తనలో దర్శింపజేయుటయే విశ్వరూప సందర్శనమందురు. అట్టి సృష్టికర్త శ్రీకృష్ణపరమాత్మగా విశ్వరూప సందర్శనము చేసిన విరాట్ పురుషుడు ఈ మహనీయుడు. అష్ట భార్యలు, 16 వేల మంది గోపికలతో రాసక్రీడలు సల్పిన అస్కలిత బ్రహ్మచారి. ఈయన తన అష్ట భార్యలతో ఆనన సంపర్కముతో సంతానమును పొందిరి.
(యిది ఎలాగంటే మయూరము శరీరసంపర్కము లేకనే ఆననసంపర్కముతో సంతానోత్పత్తి యగుచున్నట్లుగా జగతికి తెలియునట్లు శిరమున మయూర పింఛమును ధరించినాడు.)
విరాట్ విశ్వకర్మ భగవాన్ కశ్యపప్రజాపతి ద్వారా 4 లక్షల మానవులను 30లక్షల పశువులను 20 స్థావరములను, 9 లక్షల జలచరాలను, 11 లక్షల క్రిమి కీటకాదులను, 10 లక్షల పక్షిజాతులను స్త్రీపురుష బేధములను సృజించి, కామమును కల్పించి సృష్టియాగమును నిర్వహించెను.

### యుగధర్మములు

కృతయుగమందు ధర్మము నాలుగు పాదములు, త్రేతా యుగమందు మూడు పాదములు ద్వాపరయుగమందు ధర్మము రెండు పాదముల కలియుగమందు ఏకవపాదముపై నడచుటచే ధర్మ సంస్థాపనకై

శ్లో॥ యధాయధాహిధర్మస్య గ్లానిర్భవతి భారతా,
అభ్యుద్ధానమ ధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥

ఈ సూక్తిచే ప్రతీయుగమందు విరాట్ పురుషుడు అవతారములనెత్తి ధర్మసంస్థాపన చేయుచున్నాడు.

**ఓమ్ నమో శ్రీభగవతే సనారీశ్వరాయ నమః నాసృష్టి ప్రభావముచే**

పంచభూతముల సత్తాచే భూమిపై ఓషధులు పుట్టెను. ఓషధుల వలన ఆహారమాయెను. ఈ ఆహారము వలన సకల జీవరాసులు జీవించుచున్నవి. **తేజో భూత**

**సృష్టి=** ముందుగా తేజస్సు యందు ఆకాశ వాయువు యొక్క సత్తా నుండి తేజోభూత సృష్టియాయెను. **వాయు భూత సృష్టి=** వాయువుయందలి శక్తి ఆకాశవాయుతేజస్సుల యొక్క సత్తాచే వాయుభూత సృష్టియాయెను.

**ఉదక భూతసృష్టి=** ఉదకమందలి శక్తి ఆకాశ వాయు తేజస్సుల యొక్క సత్తా వల్ల జల భూత సృష్టి యాయెను. ఈ చాతుర్భూతసృష్టి వేరువేరు అయినప్పటికీ పృథివియందు యివన్నియూ ఉన్నవి.

**సర్వాకారగుణంనాస్తి యోనిప్రణముచ్యతే॥**

## ఉపసంహార క్రమము

భూమిపై సృష్టికాబడ్డ భూతకోటి యావత్తూ ఎలా ఉద్భవించాయో అలాగే ఈ నాలుగింటియందే ఐక్యమవుతూ ఉండగా, విశ్వకర్మచే సృష్టికాబడ్డ పదునాలుగులోకము లున్నూ పాలించే భూతములుండగానే, లయించవని చెప్పడం కాదు. ఇందులో ఉండే జంతు జాలములయించినపుడు పంచభూతములందే ఐక్యమవుతూ ఉన్నవి. సృష్టి ఈ ప్రకారం జరుగుతూయుండగా జ్ఞానాజ్ఞానములచే విచారించిచూస్తే సృష్టిక్రమమందు చెప్పబడ్డ అనుభవం మట్టుకు నిలిచి ఉపసంహార ప్రకరణమును యెరుగకలయించి నందున పంచభూతములు సత్యమై నిలిచి యున్నందువలన పుణ్యాపాపఫలితములతో ఆగామి సంచిత ప్రారబ్ధములున్ను అనుభవించుటకు కర్తయై జీవులు సృష్టిలోనికి వస్తూ పోతూ యున్నారు. జ్ఞానితనకు ఆధారమయినఘటమునందు తత్వశోధన జేసి పరోక్షాపరోక్షముల యందు పంచభూతికము ఒకటిగా ఉండుట చూచి యిట్టి పంచభూతములందులయము గావించి అఖండాచలమందు ఐక్యమయిపోతున్నాడు. ఎట్లాగంటే భూమికి కర్తయయిన ఉదకమందు భూమిన్ని, ఉదకమునకు కర్తయైన తేజస్సుయందు ఉదకమున్నూ, తేజస్సుకు కర్తయైన వాయువునందు తేజస్సును, వాయువునకు కర్తయైన ఆకాశమందు వాయువున్నూ, యిలాచాతుర్భూతైక్యమయిన ఆకాశమును, అపరోక్షమునకు కర్తయైనటు వంటి సర్వమును తెలుసుకోగల ఏ మనస్సు కద్దో ఆ మనస్సునందు ఆకాశమున్నూ, ఈ మనస్సున ప్రణవస్వరూపమయినటువంటిన్ని ప్రకృతి అయినటువంటి, ఏరాజహంస కద్దో ఆహంసయందునను, యిట్టి హంసతో కూడా తాను గురుప్రోక్త అనుభవమునందు ఐక్యమయినవాడయి, ఆగామిసంచిత ప్రారబ్ధములు తెలుసుకొన్నవాడయి, అచలమందు అచలుడయి మహాపాప రహితుడయి యుండును. యిదియే ఉపసంహారక్రమము.





# శ్రీ సనారీ యోగ జ్ఞానామృతము

## ముందుమాట

శ్రీగురుదేవోభ్యోనమః

త్రిమూర్తులు మానవులుగా జన్మించినట్టి ధర్మభూమియు, రత్నగర్భయు, సువర్ణఖనియు, సమస్తలోహములకు నిలయమై సస్యశ్యామలమై పరమపవిత్రమైనట్టి ఈ భారతావనియందు మహా తపోనిష్ఠాగరిష్టులు, మహాత్ములు జన్మించిన కర్మభూమియగు భారతదేశమందు 15వ శతాబ్దిలో, మతకల్లోలములతో జాత్యహంకారములతో హింసాకృత్యముల సల్పుచూ, ఘోరకృత్యములాచరించు అధర్మవర్తనులు పెచ్చుపెరిగి, నీతిన్యాయధర్మములు నశించి అధర్మం విలయతాండవంచేయుచున్నకాలమున, భూదేవి భారమును తగ్గించుటకు **శ్లో॥ యధా యధాహిధర్మస్యగ్లా నిర్భవతి భారతా। అభ్యుధ్యాన మధర్మస్య తదాత్మనాం సృజాహ్యామ్యహం॥** జగతికిధర్మస్థాపనగావించుటకై **"శ్రీ మహావిష్ణువు"** వీరబ్రహ్మేంద్రస్వామిగా అవతరించి, యావత్ భారతదేశము పర్యటించి కాలజ్ఞానమును రచించి గోవిందవాక్యములతో ఆనాటి సమాజాన్ని జాగృతపరచి, 18వ శతాబ్దిలో సాక్షాత్ పరమశివుడు పాలకొండ గ్రామమున విశ్వబ్రాహ్మణ కులంలో సింహాద్రివారియింట విశ్వనాథాచారియై అవతరించి, దుష్టశిక్షణ శిష్టరక్షణ ధర్మసంరక్షణగావింతురని తెలిపి, 16వ శతాబ్దిలో సజీవసమాధిని ప్రవేశించి కలియుగాంతమందు "సనారీ వారు" దివ్య పురుషగణములతో భువికేతెంచి, కృతయుగధర్మములతో రాజ్యమేలుదునని తెల్పిరి. బ్రహ్మంగారి కాలజ్ఞానవాక్కుమేరకు విశ్వనాథుడు జన్మించి, బాల్యమునుండి అనేక మహిమలు ప్రదర్శించుచూ, వేదాంత ప్రబోధనలు చేయుచూ రాజయోగియై, యోగసాధనా పద్ధతులెరింగించుచూ అభ్యాగతులనాదరించుచూ, నిరతాన్నదానములు చేయుచూ, తన అర్ధాంగిని తనయందైక్యము చేసుకుని **సనారీయై** దక్షిణ భారతదేశము పర్యటించుచూ **"సనారీ విశ్వేశ్వరసంవాదంబను"** యంత్రమంత్రతంత్రయోగయుక్తంబగు మహా ప్రబంధమును రచియించి, చెన్నపురిలో 1878లో ముద్రణ గావించి, భక్తులకందించి, తానే ముక్కంటినని రుజువు పరచుకుని, జనారణ్యమును వీడి మహారణ్యమునకేగి, శ్రీశైలపర్వతగుహాలో మహాతపోనిష్టలోనుండి ఆగమవేదమునూహించుచూ, తనభక్తులను వెన్నంటి కంటికి రెప్పవలే కాపాడుదునని అభయమిచ్చి, తమ శిష్యకోటిని రక్షించుచున్నారు. వారు రచించిన గ్రంథరాజమునందలి

విషయములను గుర్తెరిగి త్రికరణశుద్ధిగా ఆచరించిన, మానవుడే మాధవుడు కాగల మహోద్భుత విషయములను తెలియపరచిరి. ఆ ప్రకారము ఆచరించి సువర్ణ సూర్యకాంతంగారు, కొమ్మోజు కూర్మన్నగార్లు చరితార్థులైరి. మనమెరుగని అజ్ఞాత శిష్యులింకెందరో జీవన్ముక్తిని పొందియుందురు. ఆ కోవలోనివారే మాబోధగురువు బ్ర"తణుకు సాంబశివానంద రాజయోగి" వారు. 1995లో మా దంపతులచే నిజగురుని పాదం పట్టించి, **సనారీ సంవాదాన్ని** మాచేతికందించిన మహనీయులు "ఆ గ్రంథరాజమందలి విషయములు అతి నిగూఢమైనవని సంపూర్ణభక్తి విశ్వాసములతో సద్గురుని సేవించిన జగద్గురువులగు **సనారీవారు** అందలి సర్వవిషయములు తెలుపుదురనిరి. మేము సనారీవారి పాదం పట్టిన నాటినుండి నిత్యమూ సనారీవారి పాదసేవచెస్తూ జగద్గురువు, సద్గురువు, మద్గురుదేవులగు సనారీవిశ్వేశ్వరుల కరుణా కటాక్ష వీక్షణములతో ఈవేదాంత గ్రంధమునుసాధకుల కొరకు వ్రాయసాహసించితిని. మహర్షులు, మహనీయులు, సిద్ధపురుషులు, దైవాంశసంభూతులు, కారణజన్ములు, కలిమాయ లోబడి అకృత్యములనాచరించిఘోర నరకములపాలగు మానవుల నుద్ధరించుటకు యోగసిద్ధులై తాము గ్రహించిన విషయములనుగ్రంధస్థముగావించిన విషయములను స్వతంత్రించి మహా ప్రసాదముగా స్వీకరించి నాస్వానుభవమును జోడించి యోగసాధకుల ఆచరణకు యిందు పొందుపరచుచున్నాను. యిందలి విషయములు ఆధ్యాత్మికపరులకు ఏ కొంచెమైనా సహకరించగలిగితే నాజన్మ ధన్యమైనట్లుగా తలంచెదను.

ఇట్లు సనారీ భక్తరేణువు **బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ**

12 సంవత్సరములు గురుశుశ్రూషచేసి ఉపదేశం పొందవలసియుండగా, జీవితము క్షణభంగురమని భావించి, ఆధ్యాత్మికాతత్పరులమగు మాకు వయసు 50 సంవత్సరము లుండునని ఎంచి మాతో 12 ప్రదక్షిణలపూర్వకముగా జగద్గురు శుశ్రూష చేయించి **బోధగురుడు** సద్గురు నిజపాదములు పట్టించి మా దంపతులకు మంత్రోపదేశముతో దీక్ష నిచ్చిరి. నాటినుండి 20 సంవత్సరములు నిత్యానుష్టానముతో సనారీ విశ్వేశ్వర సద్గురువుల పాదసేవచేయుచూ, నాకు కల్గిన మానసిక ప్రేరణచే సనారీవారి పూజావిధాన పుస్తకములు రచియించి, **శ్రీశ్రీశ్రీ సనారీ సంవాద గ్రంధార్ధములను రచియించి నిజభక్తులకందించి** యిపుడీ సనారీ యోగజ్ఞానామృతము రచియించి, నాకు చేతనైన





మార్గములో నిజగురుని సేవచేయుచున్నాను. యివన్నియు సద్గురువుల ప్రేరణచే చేయుచున్నాను. నేను నిమిత్తమాత్రుడనని సవినయంగా మీకు మనవి చేస్తూ జగద్గురుని ధ్యానించుచున్నాను.

గురుధ్యానం:-సీ॥ **శ్రీభూతిరుద్రాక్ష శీరజటామకుట దండకమండలధారనిరత**
**అరుణ ప్రభాలీలలాడుకౌపీనాంగకటిసూత్రబంధంబు కఠినమెసగ**
**బ్రహ్మాసనాదిగంబర పుండరీకమాచర్మాంబరా బ్రహ్మకర్మపాలి**
**గిరిగహ్వారోపాసకృూరపాప వినాశ సర్వరక్షణ మహాసాధుమూర్తి**

గీ॥ **పరమపాంచాల పావనభక్తరక్ష, బ్రహ్మతేజోప్రభావసంపాద్యవిభవ**
**పార్వతీనాధమౌనిసంభావ్యనిరత, పాహిసర్వేశ విశ్వేశబ్రహ్మమూర్తి** (అని ప్రార్థిస్తూ)

**శిష్యుడు**: "గురుదేవా! 'పునరపిజననం పునరపిమరణం' జీవికి అనివార్యంకదా! జీవి నానా యోనులందు పుట్టుచూగిట్టుచూ, కుమ్మరి చక్రంవలే పరిభ్రమించుచున్నదిగదా! ఈ గమనంలో జీవి అనేక అవస్థలకు లోనగుచూ, యిహలోకబాధలననుభవించలేక విధాతను దూషించుచూ మరిన్ని పాపములను మూటగట్టుకుని దుర్భరజీవనమను భవించుచున్నారు. స్వామీ సృష్టికర్తకిది లీలావినోదమా? యిదేమి ప్రారబ్ధము పరమేశా! అజ్ఞానులమగు మేము ఈ సృష్టి రహస్యమునెరుంగజాలక, కుడితిన బడిన ఎలుకవోలే, శ్లేష్మమునబడిన ఈగలవోలే, కలిమాయచే జీవనసాగరమున బడికొట్టిమిట్టాడి మరణించువారికి, జీవన్ముక్తిమార్గమెరిగింపవేదేవదేవా! కరుణామయా! భక్తవత్సలా! ఆపద్భాంధవా! అనాధరక్షకా! మేము 'సంసార సాగరము దాటుటకు నీవేదిక్కు, అన్యదా శరణం నాస్తి. "త్వమేవ శరణం మమ" తస్మాత్ కారుణ్యభావేన రక్షరక్ష" "సద్గురుదేవా" యనుచూ అంతరంగమునగురుని ముకుళిత వదనారవిందుడనై ప్రార్థింపగా భక్తజనవ శంకరుడగు విశ్వనాథుడు నామనంబుననిట్టి ఊహ కల్గించెను.

**సద్గురువు** : ఓరీ శిష్యా 84 లక్షల జీవరాశులలో మానవజన్మ ఉత్తమమైనది, అనేకజన్మలందు జీవి విరాట్‌పురుషుని ప్రార్థించుటచే దేవాదిదేవుడు జీవికి మానవజన్మను ప్రసాదించగా గతజన్మలందు సృష్టికర్తకు తానుచేసిన ప్రార్థనలను, భూపతనమైన పిదప కలిమాయచే ప్రభావితులై ఇహలోక సౌఖ్యములందాసక్తులై, అరిషడ్వర్గములకు లోనై, ఈషణత్రయములలో బడి పూర్వజన్మములందు విశ్వకర్మకు తాను చేసిన ధ్యానాన్ని మరచి, కంటికి కనబడునదే శాశ్వతమని భావించి భ్రమలకు లోబడి వాటి సంపాదనకై

చెప్పరాని, చేయరాని దుష్కృత్యములనాచరించి, పాపభారాన్ని పెంచుకుని అశాశ్వతమగ భూ, ధన, కనక, రత్న, పద్మవులకై పరుగులిడి, స్త్రీ సంపర్కమునకై వావివరసలు మర కోర్కెలు తీర్చుకుని, అంత్యమున వీటన్నింటినీ వీడి తానాచరించిన కర్మఫలితాన్ని మాత్రవే వెంటనిడుకొని, హీనజన్మలను పొంది, తత్కర్మఫలాన్ననుభవించుచూ, విధాతన దూషించుచూ మరిన్ని పాపపుమూటలను పెంచుకొనుచున్నారు. కొందరు సద్గుణములతో ఉన్న దానితో తృప్తిచెంది పరోపకారములు, పుణ్యకార్యములాచరించి, ఉత్తమజన్మలన పొందుచున్నారుగానీ, శాశ్వతమగు బ్రహ్మైక్యమును పొందుమార్గమునాచరించినవార అరుదు.

**గురువు** :శిష్యా జన్మరాహిత్యమును పొందగోరువారు యిలాగాక వేరుగా జీవించవలెను

**శిష్యుడు** : గురుదేవా! మాయందు కరుణతో ఆమార్గమును తెలుప ప్రార్థించుచున్నాను

**గురువు** : ఓరీ శిష్యా లోకచదువుకునాలుగు మెట్లుగలవు. 1. ఓనమాలు దిద్దుట, 2. గుణింతములు నేర్చుట, 3. పుస్తకములు లోకజ్ఞానం కొరకు చదువుట, 4. వా అర్థమెరిగి చదువు చాలించి ఆ విద్యతో జీవనయాత్ర చేయుట.

అటులనే బ్రహ్మవిద్యకు 4 మెట్లు గలవు. మొదట తారకంబును బొందుట, పిద సాంఖ్యవృద్ధిని విచారించుకొనుట, తరువాత సాంఖ్యలయంబై నిలచిన పిదప తత్వం అమనస్కంబని యెరుంగుట. ఆపైన పరిపూర్ణంబు గ్రహించి ప్రపంచబంధవిముక్తుడగుటయే జన్మరాహిత్యంబుగనుక పరబ్రహ్మనుపొందు తారకంబునెరింగించెదను వినుము బ్రహ్మవిద్యకు మూలము.

**తారకము** : దేశము నలుమూలలా తిరిగి కార్యగురువును కనుగొని వారికి అహర్నిశల సేవచేసి వారి కృపను పొందగలిగితే ఆగురుదేవుడు కుడిహస్తమును నీ శిరస్సున పెట్టి గతంలో నీవు చేసిన పాప పుణ్యములచే నీవు అనుభవించవలసిన సుఖదుఃఖంబు బ్రహ్మవ్రాతను తుడిచివైచి, నేటి నుండి సత్కార్యంబులు చేయుచూ, తత్పుణ్యఫలమువలన జీవన్ముక్తి పొందుటకు నీ నొసట విభూతి పెట్టి, నాలుకపై పంచామృతరసముతో జ్ఞానబీజాక్షరములునాటి, అవి మొలకెత్తుటకై సద్గురుని పాదతీర్థంబు నీజిహ్వాగ్రమున పోసి, నీ కుడిచెవిలో ముందుగా జీవన్ముక్తినిపొందు పరమరహస్యము, పరమపావనమగు తారకమంత్రమునుపదేశించుచుంటిని, శ్రద్ధగా వినిత్రికరణ శుద్ధిగా సదా ఆచరించుము దివ్యమంత్రోపదేశము చేయుటయే తారకమందురు.





**సాంఖ్యతత్వము** : దీనికి అంతర్లక్ష్య, మధ్యలక్ష్య, బాహ్యలక్ష్యములనెరింగి నీకనువగు పద్ధతిని ప్రాణాయామమున శరీరమును నిటారుగా నుంచి, నొసటి ప్రదేశమును రెండు కంటి చూపులను ఏకంచేసి, శరీర ధ్యాసలేకుండా నిశ్చలంగానున్నచో, చెవులందు దివ్యనాదము వినుచుండటయే దీని సాధన. ఈ యోగాభ్యాససాధకుడు శరీరమందలి 25 తత్వాలను తెలుసుకుని 26వ తత్వమగు పరమాత్మయందు భక్తిగలిగి తీవ్రసాధనతో సాంఖ్యతత్వాన్ని సాధించాలి.

**శిష్యుడు**: గురుదేవా! చెవులయందు నాదములన్నారు ఎలాంటి ధ్వనులు వినబడును స్వామీ?

**గురువు** : ఈ సాధనలో ముందుగా క్షిణీనాదము (చిరుగజ్జెల నాదము) మరికొన్ని దినంబులకు ఘల్లుఘల్లుమను ధ్వని, యింకొన్నాళ్ళకు మేఘనాదంబును, ఆ పిదప భేరీనాదమును, యింకొన్నాళ్ళకు మృదంగనాదము, ఆ పిదప తాళశబ్దమును, మరి కొన్నాళ్ళకు ఘంటానాదము, ఆ తరువాత శంఖానాదమును, ఆ పిదప వీణానాదమును, తర్వాత కొన్నాళ్ళకు వేణునాదమును యిలా పదిరకములు ధ్వనులు వినబడును. ఆఖరున సృష్టికి మూలము ఓంకారధ్వని యెడతెరిపిలేకుండా సదా వినిపించుచుండును. యిటుల సాంఖ్యతత్వాన్ని సాధించాలి.

**శిష్యుడు**: గురుదేవా! తర్వాత అమనస్కము గురించి తెలుపండిస్వామీ!

**గురువు** : శిష్యా సాధకుడు శుచియగు ప్రశాంత స్థలమున కూర్చుండి యిష్టదైవ ఛాయాచిత్రాన్ని ఎదుటనుంచుకొని ఆచార కట్టుబాట్లతో మెత్తని ఆసనమువేసుకుని, దానిపై తెల్లని వస్త్రాన్ని పరిచి తన శరీరం సహకరించు సుఖాసనము వేసుకుని రెండు చూపులను ఏకంచేసి, భ్రుకుటి మధ్యన దృష్టినిచెదరక నిలిపి తదేక దీక్షతో చూడగా, చూడగా, చంద్రమండలము, యింద్రధనస్సు, మాణిక్యదీపాలు, అగ్ని మిణుగురులు, ధూమ కింజరులు, ఇంకా అనేక చిత్ర విచిత్రంబులు కానబడును. యివన్నీ ఆత్మ ప్రయత్నములచే సంభవమగును యిదియే అమనస్కము.

**పరిపూర్ణము** : శిష్యా ఈ అమనస్కసాధనతో దినక్రమేణా చూస్తుండగా పైనచెప్పిన వన్నియూ మరుగైపోయి, చూచేకొలది వెన్నెలగుపడును. ఆ వెన్నెలలో చిన్మయరూపు కనుపించును. అదియే పరబ్రహ్మరూపమని సకలశృతిస్మృతి పురాణములు చెప్పుచున్నవి. యిదే పరిపూర్ణం.

**శిష్యుడు:** గురుదేవా! మహిమాన్విత విషయాలను వివరించి సాధనచేయించి, యోగసిద్ధుని గావించు సద్గురుని గుర్తించుటెట్లు నాయందు శిష్యవాత్సల్యంతో శెలవీయండి. ఎవనివద్ద మంత్రదీక్షనుపొందాలి?

**ఎలామంత్రసిద్ధినిపొందాలి?**

శ్లో॥ **యస్మిన్ దేవేతుయోభక్తః ।మంత్రస్తస్మాదవాప్యతే।**
**శీఘ్రసిద్ధిప్రదోమంత్రో!నాభక్తేభ్యఃకదాచన॥**

అర్ధం: ప్రతిమానవుడు తనయిష్టదైవముయొక్క మంత్రమును ఒక గురువు ద్వారా ఉపదేశం పొంది,ప్రతినిత్యము శక్త్యానుసారంగా జపించినచో సర్వపాపములు తొలగిపోవును. ముముక్షుమార్గమును ఉత్తరోత్తముగా పొందుటకు మంచి అవకాశము లభించును. గురూపదేశము లేనిమంత్రమును పఠించరాదు. పుస్తకములలో గల మంత్రములను చదువరాదు. -మీ పేరుతో ఏ అక్షరములు గల ఏ మంత్రము సిద్ధించునో,ఏ దేవుని పూజ మీకు రాణించునో గ్రహించి అట్టి మంత్రమును జపించి సార్ధకత పొందుటయే వేదాంతమార్గ లక్షణము. **(మంత్రార్వణను గ్రహించాలి.)**

**శిష్యుడు : మంత్రజపసమయములు తెలుపండి స్వామీ**

**గురువు :** **శ్లో: బ్రాహ్మీముహూర్తసకలాశ్చమంత్రాః శైవాః ప్రదోషే గణేశాః ప్రభాతే**
**మధ్యందినే భాస్కరవైష్ణవాశ్చ।శక్త్యానిశీథేసకలాగమోక్తిః॥**

**అర్ధం:** బ్రహ్మ ముహూర్తమందు అన్ని మంత్రములు జపించవచ్చును. శైవమంత్రములు ప్రదోషసమయములందునూ, గణేశమంత్రములను మధ్యాహ్నకాలమందునూ, శాక్తేయ మంత్రములు అర్ధరాత్రములందునూ జపించవలయును. యియ్యది జపసిద్ధి సమయములు.

**శిష్యుడు :** ఎవనివద్ద మంత్రదీక్ష పొందాలి స్వామీ

**గురువు :** శ్లో॥ **విధురేనదిశౌన్మత్రః ।డాంబికేనకదాచన।**
**నగృహ్ణీయాన్న గృహ్ణీయాత్। వర్జయేత్ బ్రహ్మచారిణమ్॥**

అర్ధం: భార్య మరణించినవానివద్ద మంత్రోపదేశము పొందరాదు. బ్రహ్మచారివద్ద దురాచారవంతులవద్ద, అతిధనాశాపరుల వద్ద, నిత్యానుష్ఠానములేనివానివద్ద, హీనజాతి వానివద్ద, ఒక పీఠాధిపతియైయుండియు అన్యాయం, అధర్మం, అవిద్యావంతులుగా శోభిల్లుచున్న వానివద్ద, తన పీఠానికేన్యాయము చేయలేనివానివద్ద ఎలాంటి మంత్రాన్ని స్వీకరించరాదు. స్వీకరించినచో మహాపాతక వంతులగుదురు.





**శిష్యుడు : మంత్ర ఉపదేశార్హులు ఎవరు స్వామీ ?**

**శ్లో॥** **గృహస్థేన దిశేన్మత్రః। తన్మంత్రశ్శీఘ్రసిద్ధిదః॥**
**వానప్రస్తేనయతినా। చిరకాలప్రదమ్॥**

**అర్ధం:** మంత్రస్వరూపస్వభావ ఫలవిషయము లెఱింగిన గృహస్థునివద్ద మంత్రోపదేశము సిద్ధించును. వానప్రస్థులవద్దగానీ, సన్యాసులవద్దగానీ, స్మశానమునందు నివాసముండు వారివద్దగానీ, పెండ్లికాని యతివద్దగానీ మంత్రోపదేశము పొందినచో ఆ మంత్రాన్ని నియమనిష్ఠలతో జపించిననూ ఫలితము జన్మాంతరమున పొందవచ్చును. సాధకుడు జీవించి యుండగా ఫలితాన్ని పొందలేడు.

**శ్రీజగద్గురు సనారీ విశ్వనాథావధూతస్వామినే నమః**

**శిష్యుడు : గురుదేవా। యమనియమాలను తెలియజేయండి స్వామీ ।**

**గురువు** : శిష్యా, వేషము, భాష, అనుకరణ, ఆకర్షణతో ఉన్న గురువును ఆశ్రయిస్తే ఎల్లప్పుడు ఏదో వంకతో ధనము తెమ్మని శిష్యుని పీడించువాడు **'ఊరగురువు'** వీరు షట్చక్రములు పేర్లు, యిడా, పింగళి, సుషుమ్న పేర్లు తెలుసుకుని, రేచక పూరక కుంభకాదులను గూర్చి గొప్ప గొప్ప ఉపన్యాసములిస్తూ, వారి వేషభాషలతో అన్నీ తామెరుంగుదుమని నమ్మబల్కుచూ క్రియాశూన్యులై యుందురు. మేమే యోగసిద్ధులమని అబద్ధములు చెప్పుచూ యోగసాధనాపేక్షతో తన దగ్గరకు వచ్చు వారికి మోసపుమాటలు చెప్పి అమాయకులనాకర్షించి జీవించువారే ఊరగురువులు. వీరి దరిచేరుటేయమ మందురు. (యింకా నిద్రదేహేంద్రియ సర్వవ్యాపారములను శీతోష్ణములను సమపరచతగ్గది ఏదో) **అదే అష్టాంగయోగమండలి ఘయ్యమందురు.**

**నియమము** : మాఘ కార్తీక మాసాల్లో నదీస్నానం చేద్దామని ప్రొద్దున చన్నీళ్లలో మునిగినంతమాత్రాన శరీరం శుద్ధిగాదు. మేము మడికట్టుకుంటామని స్నానంచేసి తడిబట్టలు పిండుకుని అక్కడ అంటుంది, యిక్కడ అంటుందని గెంతులు వేసుకుంటూ వెళ్ళినంతమాత్రాన అంటు పోతుందా? శుద్ధా, అశుద్ధాలను భరించు భూదేవికి అంటు ఉందా? హృదయమందలి దైవాన్ని అర్చించి ధీరుడై నిలిస్తే దైవంమెచ్చేది అపుడే, అదీనియమమంటే అంతేగానీ మడికాదు, మయిలు కాదు. కులం గొప్పేమీ కాదు, **గుణం ప్రధానం** తనువులోని తత్వాలను తెలిపేది గురుమూర్తి. యిది గ్రహించుటే నియమము. యింకా వివరంగా చెప్పాలంటే విగ్రహారాధనచే సాకారమూర్తి నర్చించుచూ,

నిరాకారముగా తనలోని పరమాత్మను జీవాత్మతో కలుపుటే నియమము.

**శిష్యుడు:**గురుదేవా! చాలారకములు ఆసనాలున్నాయి కదా! ఏ ఆసనం శ్రేష్టమైనది.

**గురువు** :అనేక ఆసనములు కలవు ఒక్కోదానికీ ఒక్కో ప్రత్యేకతలను చెప్పుదురు. అవన్నీ యోగా భ్యాసకులకు సాధ్యపడవు. యివన్నీయూ జీవనార్థమై దొమ్మరులు తమ నైపుణ్యముచే అనేక రకములయిన ఆసనములు వీధులలో ప్రదర్శించుదురు. అట్టి ఆసనముల వలన ఎట్టి ప్రత్యేక ప్రయోజనములేదు. సాధకుడు ప్రతీరోజూ ఒకేచోటులో స్థిరంగా తన శరీరం సహకరించేటట్లు కూర్చుని జపమో, తపమో చేయుటయే ఆసనమందురు. తన శరీరానికి వీలైనట్లు నిత్యమూ ఒకే ప్రదేశంలో కూర్చుని ప్రాణాయామము నిష్టతో క్రమంతప్పక ఆచరించుటయే ప్రధానము.

**శిష్యుడు:** గురుదేవా! ప్రాణాయామ పద్ధతులను వివరంగా తెలియజేయండి.

**ప్రాణాయమము**

**గురువు** : సాధకుడు ఎడమ ముక్కు గుండా 30 సెకన్లు గాలిని పీల్చి 1నిముషము బలాత్కారముగా గాలిని నిల్పి, 2 నిముషములు గాలిని కుడిముక్కుద్వారా వదిలి, మళ్ళీ కుడిముక్కునుండి గాలిని పీల్చి, పైవిధంగా ఎడమ ముక్కుగుండా వదిలి, మళ్ళీ ఎడమ ముక్కుగుండా గాలిని పీల్చి, కుడిముక్కుగుండా గాలిని వదలాలి. యిలా చేసినదానిని 1 ప్రాణాయామము అందురు. యిలా ప్రతీనిత్యం చేస్తూ, నిముషాలు పెంచుకుంటూ శరీరానికి హానికలగకుండా, గంటలతరబడి శ్వాసను బంధించవచ్చును. ఒకే సారి ఎక్కువసమయము గాలిని బంధించుట ప్రమాదమగును. కొంచెం కొంచెంగా సాధనచే సమయాన్ని పెంచుకోవాలి. యిలా ప్రతినిత్యము చేయుటచే యింద్రియనిగ్రహం యేర్పడి, ఆత్మజ్ఞానము కలిగి వాయువును జయించినవారై దీర్ఘాయుష్మంతులగుదురు.

**శిష్యుడు:** గురుదేవా! యిలాంటి సాధకులు ఎలాంటి ఆహారాన్ని భుజించాలి.

**గురువు** : శిష్యా జీవహింసచేసే మత్స్య మాంసభక్షణ నిషిద్ధము. జీవనార్థమై మొలకలురాని విత్తులనుగానీ, విత్తనములులేని ఫలములనుగానీ, తామర తూడులను, పాలను గానీ, యితరులవలన లభించిన ఆహారమునుగానీ, యివియునూ మరీ మరీ కోరక మితముగా బ్రహ్మార్పణ గావించి భుజించుట ముఖ్యము. ఎచటనైనా భోజనముచేయునపుడు మళ్ళీ మళ్ళీ కోరక, పెట్టిన ఆహారముతో తృప్తి పడవలయును. అంతేగానీ, అన్నమును మాని ఆకులు తినుటచే ప్రయోజనం లేదు. ఆకులు మేకల ఆహారముగదా? పళ్ళు కాయలు పక్షుల ఆహారము గదా? గాలిని తిని శరీరాన్ని శుష్కింపజేసుకున్న ఏ ఫలితమూ లేదు.





గాలి పాములకు ఆహారముగదా? వాటివలన ఏ ప్రయోజనములేదు. ఈ శరీరంతోనే భవసాగరాన్ని దాటాలి. శరీరారోగ్యాన్ని కాపాడుకుంటూనే జీవన్ముక్తిని పొందాలి. కావున పైన చెప్పినట్లుగా సాత్విక ఆహారాన్ని తీసుకుంటూ రాత్రింబవళ్ళు దైవధ్యానమునందుండి జన్మను సార్థకం చేసుకోవాలి.

**శిష్యుడు** : గురుదేవా! ధ్యానయోగమునెట్లు సాధించవలయునో తెల్పండి స్వామీ.

**గురువు** : ఈ చరాచర జీవకోటిని, అనేక కోటి బ్రహ్మాండములను తనసంకల్పమాత్రముచే సృజించి, పోషించుచూ తనయందు లయమొనర్చుకొను, విశ్వసృష్టికర్తయగు విరాట్ విశ్వబ్రహ్మ(జ్యోతిరూపమును), మానవశరీరమందు శోధించి మనో నిశ్చయముతో, దృష్టిని భ్రూమధ్యన నిలిపి శరీరమును మరచియుండుటే ధ్యానయోగమందురు.

**శిష్యుడు** : గురుదేవా! ఈ స్థితికి ఎలాంటి ప్రయత్నాలు చేయాలో శెలవీయండి.

**గురువు** : భ్రూమధ్యన దృష్టినిలిపి చెదరకుండా యుంచి శరీర స్పృహలేకుండా ఎండవానలకు, చలివేడులకు లెక్కసేయక, బాహ్య ప్రపంచదృష్టి లేకుండా ఉండాలి.

**శిష్యుడు** : యిలా ఉండుటచే సాధకుడు ఏ ఫలితాలను పొందును గురుదేవా.

**గురువు** : పంచీకరణలో తెల్పిన విధంగా పంచభూతగుణములను దేహేంద్రియములకు పంచివేసి, ధనమందు, భార్యయందు, పుత్రులందు విముఖుడై,శారీరసంబంధ కోర్కెలన్నింటినీ త్రెంచివేసి, మనకంటికి కనబడునదెల్లా నశించునవని నిశ్చయించుకుని, పరమాత్మనుండి వెలువడినదే ఈ ఆత్మయని దృఢనిశ్చయుడై, యిహలోక, పరలోక సౌఖ్యములనాశింపక లక్ష్యసాధనకై శరీర స్పృహలేక, ఆకాశభూత స్వాభావిక ప్రణవనాదమును చెవులకు వినుటకర్పించి, భూతత్వమైన శరీరాన్ని భూభూతమున కర్పించి, శరీరమునందలి ప్రాణవాయువును వాయుభూతమునకర్పించి, జ్ఞానేంద్రియము లందలి అగ్నిని, భ్రూమధ్యయోగసాధనచే జ్వలించు అగ్నిని అగ్నిదేవున కర్పించి, జీవి భ్రూమధ్యగతుండై ఆత్మనచట నిలిపియున్నవాడే గురుడు. యిదియే నిర్వికల్ప సమాధి.

**(ఈ పంచీకరణ నేను వ్రాసిన సనారీవిశ్వేశ్వర సంవాదగ్రంధార్ధములలో కలదు.)**

> యోగసాధకులు ఆగ్రంథాన్ని చదివి మీ శరీరమందలి 25 తత్వములను సాధనచే గుర్తెరిగి, పంచభూతముల సంబంధస్థానములకు పంచివేసి, తత్వరహితులై, నిశ్చలులై, ఆత్మను పరమాత్మ సంధానుము గావించి, బ్రహ్మమందైక్యమై నిర్వికల్ప సమాధిని పొందగలరు. గురుదేవుల కృపచే జన్మరాహిత్యము పొరెదవచ్చును.

సనారీఉవాచ:

**నేను నిజంచెప్పితిని నిశ్చయమీపరతత్వ బోధయును**
**దానవవర్గనిర్జరులుదారమనుష్యులు సంయమాదులున్**
**దీనిగ్రహించివిశ్వమయదేవునిగాంచు నిదానమార్గ**
**సోపానములన్నియు తెలిసి పావనమొందుటే గ్రంధమెట్లనన్**

**శిష్యుడు** : గురుదేవా! దీనికై ఎలా సాధనచేయాలో వివరంగా చెప్పండి.

**గురువు** : ఓరీ శిష్యా సాధకుడు శుచియగు స్థలమందు జింక చర్మమునుగానీ, దర్భచాపనుగానీ పరచుకుని, దానిపై తెల్లని వస్త్రమును పరుచుకొని, ఆచార కట్టుబాట్లతో సుఖాశీనుడై సద్గురుని స్మరిస్తూ, ముఖం కొంచెంగా వంచి కనురెప్పలు రెండూ మూసి నాసికాగ్రాన్నిలో దృష్టితో చూచునది. 1. అమావాస్య దృష్టి ఈ సాధన అధమము. మూడువంతుల కంటిచూపుతో నాసికాగ్రాన్ని రెప్పవేయకుండా చూచే సాధనను (2) పాడ్యమి దృష్టియందురు. ఈ సాధన తారకయోగానికి అనుకూలమైనది.

3. యింక పున్నమిదృష్టి ఎలాగంటే స్థిరచిత్తుడై తన గురుదేవుని మనసున తలంచిసుఖాశీనుడై ముఖం కొంచెం వంచి, నల్లగుడ్డు రెప్పలోఉంచి, తెల్లగుడ్డుమాత్రమే కనుపించునట్లుగా ఉంచి, తదేక దీక్షతో ప్రతీదినము చూడగా, ముందుచెప్పిన వెలుగులు కన్పించును. 1 జాము అనగా (3 గంటలనుండి) 2 జాముల వరకూ దృష్టి నిలుపగా, కటిక చీకటి కన్పించును. ఆ చీకటిలో చూడగా చూడగా ముందు చెప్పిన వెలుగులు కనబడును. క్రమంగా పున్నమి వెన్నెల కనబడును. యింకా చూడగా ఆ పండువెన్నెలలో జగన్నిర్మాణ కర్తయైన శ్రీ విరాట్ విశ్వకర్మయగు పరబ్రహ్మ, మహా వెలుగై కోటిసూర్య ప్రకాశంగా అభిన్నవలయాకృతిగా భృకుటియందు కనబడును. ఆ దర్శనము పొందిన మానవులు పరబ్రహ్మలో కలియుదురు. అనగా ఆ మహాజ్యోతిలో లీనమగుదురు. ఎచట మనస్సు లయమగునో అచట ఆ పరమపదం కనబడును. ఇది ఆత్మ దర్శనం పొందిన వారికి మాత్రమే తెలియును. ఈ ప్రకారం పెరుగులో నెయ్యి ఉన్నట్లు, గింజలయందు నూనె ఉన్నట్లు, విత్తనములందు మొలకయున్నట్లు, మానవశరీరమందు పరమాత్మ కలదు. సద్గురు కటాక్షమును పొందినవారు గురువాజ్ఞచే మానవశరీరంలో శోధించినవారికి పరబ్రహ్మ దర్శనము పొందుదురు. ఎట్లనగా, పెరుగును కవ్వముచే మర్ధించితే వచ్చిన వెన్నకాచిన నెయ్యి లభించినట్లుగా.





**శిష్యుడు** : గురుదేవా! సన్యాసియోగము, రాజయోగములలో ఏది ఉత్తమమైనది. ఏ సాధన శ్రేష్టమైనది?

**గురువు** : శిష్యా అన్ని యోగముల కన్నా రాజయోగము శ్రేష్టమైనది. ఏలననగా తతిమా యోగులకు రాజయోగి ఆధారుడు. అతిథి అభ్యాగతుల నాదరించి పోషించువాడు గనుక, యిట్టి రాజయోగికి శాంభవీముద్ర అనుకూలమైనది. ఈ ముద్ర పార్వతీదేవికి ప్రీతిపాత్రమైనది గనుక ఈ పేరువచ్చినది. ఈ ముద్రసాధనతో ధ్యానము చేయగా చేయగా పుట్టిన చిదగ్ని చేత, మానవులు అనేక కోట్ల జన్మలందు త్రికరణములచేత చేసిన, బ్రహ్మహత్యాది మహాపాతకములు సైతమూ అవలీలగా దహించబడి, జీవికి జన్మరాహిత్యము కల్గును. యిలాంటి రాజయోగి ఎచటయున్ననూ పరబ్రహ్మ స్వరూపుడేగానీ సామాన్య యోగీశ్వరుడుకాదని ఎరుంగుము. ఈ యోగము కన్నా ఎక్కువగు ఏ యోగములు లేవని గ్రహించుము. **సనారీ ఉవాచ:**

**నీ నేత్రంబులతో గని మానక పూజింపువెలినిమంత్రంబేలా!**
**తానే వెలుగై యుండగ మానకుమా బ్రహ్మపథము మాయలు లేవే॥**

ఈ పూజ చేయుజ్ఞానులు ఎలాంటి విగ్రహారాధన పూజలు చేయరు. ఈ మానసపూజలో కంటిచూపుతో అంతా వెలుగే కనబడుతుంది. ఈ వెలుగే విశ్వబ్రహ్మము యిదిసృష్టి అంతా నిండియున్నది. ఎక్కడా సూదిమొనమోపునంత సందు కూడా లేకుండా జగత్తునంతా నిండియున్నది. ఈ యోగము బ్రహ్మ విష్ణు రుద్రాదులకు జీవనాధారము. దీనికి ప్రమాణము

మానసపూజ

**ఈశ్వర ఉవాచ** మానస పూజచే కల్గుమహిమలు, అద్భుతములు, ఏమనిచెప్పను, ధ్యానములేదు, అంగన్యాస, కరన్యాసకరతంత్రములు చేసే అవసరంలేదు, చక్కగా స్నానంచేయుట,మంచి ఆసనము మంచి చోట కూర్చొటను ఎప్పుడూ కోరదు,ఈ మానసపూజ శుద్ధమగు పానీయములతో, భోజనము,భోజనముతో తినదగు పదార్ధములను కోరదు,బ్రహ్మనికి వీటన్నింటితో పనిలేదు.

**శిష్యుడు:** స్వామీ ఈ పూజ ఎవరెవరో చేయవచ్చునో నా యందు దయతో చెప్పండి

**గురువు:** భార్యాబిడ్డలు గలవారెవ్వరైనా ఏకులంవారైనా ఏవయస్సువారైనా ఈ మానస పూజను వశము చేసుకోవచ్చును. మానసారాధనకన్నమించిన గొప్ప మంత్రము లేవీ

లేవు. అలాంటి మంత్రములను కనిపెట్టినవారూ లేరు. అన్నిలోకములలో వాడుకలోలేనిది,రహస్యముగ్గా ఉంచబడినట్టి విద్యను, నరలోకంలోని జనుల సాధన కొరకు నీవు అడిగావు కావున వినుము ఈ విద్యను సాధింపుము.

**శిష్యుడు** : ఈ పూజకు ఏమేమి కావాలి, ఎలా అర్చించాలి స్వామీ.

**గురువు** : ఎలాంటి రూపము, పేరు,ఎలాంటి పనులు లేనట్టిదగు మహాగొప్ప తేజస్సుతో వెలుగుచున్న జ్యోతికి, నేను చేయు ఉపచారములు, పూజలో చేయుపనులు శాశ్వతముగా నుండుగాక. 1.గొప్ప సముద్రములు, నదులు, ఉపనదులందలి గొప్ప జలములన్నీ నీకు అభిషేకముగా,2.మట్టి,రాళ్ళు, చెట్లు, జంతువులు వీటితో కూడిన 14లోకంబులు నీకు గంధముగా. 3.నక్షత్రములు, గ్రహములు,ద్వాదశ రాసులు గొప్పమండలాలతో మహామేరుపర్వతధూళితో కూడిన అకాశమునీకు పుష్పంబుగా. 4.ఆకాశంలో ప్రవేశించి,ప్రవేశింపలేక అన్ని దిక్కులకు గిరగిరా తిరుగుతూ,సన్నని రేణువులతో ఆకాశమునకెగయు వాయువు నీకు ధూపంబుగా. 5.సమస్త జీవులందలి అగ్ని నీకు దీపంబుగా పంచభూతముల కలయికతో నిర్మితమైన, నేనేనీకు ప్రసాదముగా నన్ను నేనర్పించుకొంటున్నాను దేవా, భక్తరక్షకుడవై రక్షించుము పరమాత్మా సాష్టాంగ దండప్రమాణములు శ్రీ విశ్వబ్రహ్మార్పణమస్తు అంటూ ఆత్మపూజను చెప్పుకోవలయును.

శిష్యా నీకళ్ళతో చూస్తూ మానకుండా పూజించు, బయట ఏమంత్రములతో పనిలేదు. నీవే జ్యోతివై సృష్టికర్త ప్రతిరూపమై ఉన్నావు. ఈ పూజనువదలవద్దు బ్రహ్మన్ని చేరు మార్గమిదే, యిందులో ఏమాయలూ లేవు.

ఈ పూజచేసే జ్ఞానులు వేరే ఎలాంటి పూజలు చేయరు. వారికి అంతాదివ్య ప్రకాశమే గోచరించును అంతరదృష్టిలోగలజ్యోతి స్వరూపుడు నీ లోను,నాలోను బయలందు, సంపూర్ణంగా ఆమహాప్రకాశము అన్నిలోకములందు నిండియున్నది.

**ఈశ్వర ఉవాచ** : ఈ ఆత్మపూజ చేసేవారికి ప్రతీపూటా నేనే మ్రొక్కుతుంటాను, యిది యదార్థము అలాంటి పుణ్యాత్ములు ఏలోకంలోని వారైనా,నేను కంటికి రెప్పవలే కాపాడుతుంటాను.

**శిష్యుడు** : గురుదేవా! యింతటి మహిమగల బ్రహ్మవిద్యను ఎలాంటి వారు అభ్యసింపవచ్చునో తెలియజేయండి?

**గురువు** : శిష్యా అష్టవిధ బంధములనుండి విముక్తుడయినగానీ ఈ విద్య సిద్ధించదు.





**అవి ఏవనిన**

1. వివాహమయిన భార్యతో సంసారమునకు యిల్లు, ఆమెను సంతోషపెట్టుటకు వస్తు వాహనాదులకు ధనసంపాదనకై, అహర్నిశలు శ్రమించి అక్రమంగానైనా ధనార్జన చేయుట, వారికి కలిగినసంతతిని పెంచి పెద్దజేసి విద్యాబుద్ధుల నేర్పించుటకు, ఉన్నతస్థాయిలో వివాహాదిశుభకార్యములు జరిపించుటకు కలి ప్రభావముచే ఎంత ధనమార్జించినను కొరతగనే యుండును. ఈ సమాజములో తామెంత ధనవంతులయినా తమకంటే ధనవంతులను చూచి ఆ స్థాయికి చేరలేకపోయితిమనే అశాంతితో జీవనయాత్ర సాగింతురే కానీ, తమకంటే నీచస్థితిలోనివారిని గాంచి వారికంటే మనమే ధనవంతులమను తృప్తి పడలేక, కోరికలను అదుపుచేసుకోలేక, దుర్వ్యసనములతో దుర్భరమగు జీవన యాత్రచేయుదురు. వీటన్నింటికీ మూలము భార్యయేగాన ఈ బంధములో చిక్కినచో, కుడితిలో పడిన ఎలుకవలే శ్లేష్మములో చిక్కిన ఈగవలే జీవితములు కడతేరుచున్నవి. మానవుల మనసునందలి కోర్కెలతో, కీటకము దీపకాంతిని ఆహారపదార్థమని భ్రమించి దానిని మ్రింగబోయి ఆ వేడికి ఆహుతియగువిధముగా, మానవజీవితములు యిహలోక భ్రాంతులతో కొట్టుమిట్టాడి సమసి పోవుచున్నవి. అట్లుగాక బహు దుర్లభమగు మానవజన్మ నెత్తినందులకు వారివారి వర్ణాశ్రమ ధర్మముల నాచరిస్తూ 20వ సంవత్సరము వరకూ జీవనోపాధికి తగు విద్య నభ్యసించి, బ్రహ్మవంశజులు బాల్యమున గాయత్రీ మంత్రో పదేశమును పొంది, యితరులు గురువులచేఏదేని ఉపదేశము పొంది బాల్యమునుండి వృత్తివిద్యలను బ్రహ్మవిద్యను ఆచరిస్తూ పెద్దల ఆజ్ఞానుసారము వివాహము చేసుకుని ఇహలోకవ్యామోహములకు లొంగక తనకు కలిగిన దానితో తృప్తినొంది, మిత సంతానమును పొంది వారికి విద్యాబుద్ధులు నేర్పి వివాహములు చేసి, వారినో యింటివారిని చేసి సంసార బంధములు చాలించి భార్యాసమేతంగానీ, తానొక్కడైననూ ప్రశాంతమగు కొండగుహలందు గానీ, చిట్టడవిలందైనా ప్రవేశించి, పర్ణశాలనేర్పరచుకుని, బాల్యమునుండి తనాచారించు బ్రహ్మవిద్యను తదేక నిష్టతో ఆచరించుచూ, అచట లభించు ఫలములను గానీ, కాయలను గానీ, దుంపలనుగానీ తామరతూడులనుగానీ, యాచనచేగానీ తనకు లభించిన పదార్థములతో తృప్తినొంది జీవనయాత్ర సాగించుచూ, ఆత్మను పరమాత్మయందు లగ్నం చేసి సదా యోగధ్యానంతో జన్మను తరింపచేసు కొనవలయును.

**శిష్యుడు** : గురుదేవా! యోగసిద్ధి పొందవలెనన్న సద్గురువు కావలెను గదా వారి లక్షణములెట్టివో తెల్పండి స్వామీ.

**గురువు** : శిష్యా గురువనగా గురుతు చెప్పి గమ్యానికి చేర్చువాడు. శిష్యుడనగా శుశ్రూష చేయువాడు, జ్ఞానమార్గముపదేశించని వాడు గురువు కాడు, సేవలుచేయనివాడు శిష్యుడు కాడని ఎరుంగుము. లౌకిక సంబంధ గురుశిష్య సంబంధమున విషయ శూన్యముండును. నిజగురువనగా "గు" శబ్దమునకు గాఢాంధకారమగు చీకటిని తొలగించువాడు "రు" అనగా ఆ అంధకారములో జ్ఞానజ్యోతిని ప్రసాదించగలవాడు సద్గురువు. వారి ప్రవర్తనలు ముఖ్యముగా 3 విధములుగా నుండును.

1. పచ్చిగడ్డిపై తిరుగు పురుగును తుమ్మెదపట్టి మట్టిగూటి దగ్గరకు తెచ్చి గట్టిగా కుట్టి గూటిలో పడవేసి, పైమూత మూసి గూటిచుట్టూ తిరుగుచూ ఝుంకారనాదము చేయుచుండును. బాధతోనున్న క్రిమి "భ్రమరము" తన చుట్టూ తిరుగుచూ మరల కుట్టునన్న భయంతో తుమ్మెదపై తదేక దృష్టితో నుండి, కొన్నాళ్ళకు తుమ్మెదవలే తయారయి గూటినుండి బయటకు వచ్చును. అనగా గురువు శిష్యుని కొట్టి తిట్టి భయపెట్టి విద్యలలో తనంతవానిని జేయును.

2. పిల్లి పిల్లలను పెట్టి పాలిచ్చి పెంచుతూ దూరంగానుండి పిల్లలను గమనిస్తూ, పిల్లలకు హాని కలుగునని అనుమానం కలిగినప్పుడు ఎవరికంటా పడకుండా పిల్లల్ని నోటకరుచుకుని సురక్షిత ప్రాంతమునకు జేర్చి తన విద్యలన్నీ నేర్పి వాటిని వదిలివేయును. అట్లే సద్గురుడు శిష్యునికి తన విద్యలన్నీ నేర్పి తనంతజేసి శిష్యుని వదిలివేయును.

3. కోతి పిల్లలను బెట్టి తన సహజతత్వమగు చెట్టుకొమ్మలనుండి గుట్టలనుండి దూకుచూ తన ధోరణిలో నుండునేగానీ పిల్లగురించి యోచించదు. పిల్లతల్లిని పట్టుకొని తనను తాను రక్షించుకోవాలేగానీ, తల్లి ఏమాత్రమూ పిల్లను గమనించదు. పిల్ల పట్టుతప్పినా పట్టించుకోదు, దానివంకనైనా చూడక తన విద్యలను ప్రదర్శిస్తుంది. యిలాంటి గురువుల దరిజేరుట హానికరము, కావున భ్రమరకీటక న్యాయము, మధ్యమము, మార్జాల కిశోర న్యాయము ఉత్తమమైనది. బ్రహ్మజ్ఞానాన్ని పొందగోరువారు తామరాకుపై నీటిచందాన నీటిలో ఉన్నా నీరంటనట్లు, కుమ్మరిపురుగు ఏ మలినమున ప్రవేశించినా బురదనంటించుకోనట్లు, నెయ్యి ఎంత వేసుకున్నా నోటికి అంటనట్లుగా, యోగాభ్యాసి అన్నిటనుండియూ, ఏదీ తనకు సంబంధంలేని విధముగా లోకసంబంధ విషయములందు ఉండి లేనట్లుగా, సంచరించువాడు యోగసిద్ధిని బొందును. యిలా కాకుండాయోగసిద్ధిని పొందజాలరు.





**శిష్యుడు** : గురుదేవా! నేటి గురువులు చాలామంది చాలా విషయాలు చెబుతున్నారు గదా. ఉత్తమ గురువుని గుర్తించుటెట్లు స్వామీ! యోగ సాధనలు ఎలా చేయాలి.

**గురువు** : శిష్యా జ్ఞానసముపార్జన ప్రశాంతంగా చేయాలిగానీ, వేగిరపాటుతో పనికిరాదు. ఎందుకంటే చీమ బెజ్జములోనుండి తన ఆహారవస్తువెచటగలదో గ్రహించి, అచటకు నిదానముగా చేరి నోట కరుచుకొని దానితో గూటికి చేరి భద్రపరచుకొనును. పక్షి చెట్టుకొమ్మపైనుండి ఆహారమును చూచి వేగంగా ఎగిరి వెళ్ళి కాళ్ళతో పట్టి చెట్టుకొమ్మను చేరేలోగా పట్టిన ఆహారము ఒక్కోసారి నేలపాలగును. కావున నిదానముగా చేయు జ్ఞాన సముపార్జన తనకు దక్కును. వేగిరపాటుచే అభ్యసించు విద్య అక్కరకు రాదు. **యింకా సద్గురువుల నడవడికలు ఎలాగంటే,** విషయవాంఛలందు మనసు పోనీయక సదా దైవధ్యాసతో నుందురు. అట్టివారికి మాయాభావములు మనసుకు రానీయకుండా, మడి, మైల అనునది లేకుండా దైవమే చేయును. వీరు పనికిమాలినపనులు, యితరులను వంచించు పనులు చేయరు. ఊరికే తిరగరు. అతిగా మాట్లాడరు. మనసును కేంద్రీకరించి ఆత్మను పరమాత్మతో కలుపు పనులు నిష్టగాచేసి బ్రహ్మంతో కలిసి, పరిపూర్ణుడై బ్రహ్మమందే ఉంటారు. యింకా జ్ఞాని, మంత్రసిద్ధిని బొందినవారు క్రూరమృగాల్ని వశపరచుకొని, విషజంతువులకు గల విషాన్ని సైతము శరీరానికి సోకకుండా చేసుకోగలరు. వాటిని తన అదుపులో ఉంచుకోగలరు. ఎలాంటి అవాంతర ఆపదలను సైతం తప్పుకుంటారు. సద్గురుడు, ఎలాగంటే సూర్యునకు ఎలాటి మలినము అంటదో, మరణంతో శరీరభ్రాంతులు ఎలా నశిస్తాయో అలాగే బ్రహ్మజ్ఞాని ఏదైనా అవసరకార్యంలో నిమగ్నుడయినా భార్యతో సంభోగిస్తున్నా వారికి ఎలాంటి భంగమూ రాదు. శరీర అవసరాలను తీర్చుకొనుటకు జ్ఞానానికి ఎట్టి సంబంధము లేదు.

**శిష్యుడు** : గురుదేవా! ఈ భువిపై నరులు మహనీయులకు ఏవరుసగా వందనమాచరించాలో తెలియజేయండి.

**గురువు** : మొదట సూర్యునకు, అగ్నికి, సద్గురువులకు, యోగి, ఉదాసీ, పరమహంస, భోగి, అవధూత, కవికి, రాజులకు, అవతారమెత్తినవారికి, వరుసగా మ్రొక్కాలి. వారు ఎదురైనపుడు గజందూరంలో నుండగా, వారిముందు సాష్టాంగపడి, యెడమచేతిపై కుడిచేతిని మెలికవేసి, ఫాలభాగాన్ని భూమికి తగులునట్లుగా ఆనించి, నమస్కరించి వారు కనబడునంతవరకూ చూచి, అపుడు నేలపై కూర్చోవాలి. యిలా కాకుండా

నమస్కరించిన పాపం వస్తుంది. గురుశిష్యులిరువురు చర్చలకు పాల్గొనరాదు. గురువుగారి ప్రక్కన నిల్చోవాలి. విషయాన్ని పూర్తిగా ఎరిగినచో వారి ఎదుట సామర్ధ్యంగలవారు మాత్రమే కూర్చోవచ్చును. యిలాకాకుండా వ్యతిరేకంగా ప్రవర్తిస్తే పాపం కలుగును. మీకు గల సర్వదోష నివారణకు ఆ మహనీయులకు మధుర ఫలములు శక్తికొలది యిచ్చి, నమస్కరిస్తే దోషనివారణయగును. యిలా చేయనివారికి నరకము పట్టి వదలకుండా బాధిస్తుంది. కన్నతండ్రి అయినా ఈదోషబారినుండి తప్పుకోలేరు. యిలాకాక ఈ దోషాన్ని వదిలించుకొనుట చాలా కష్టం. వారి పాదాలుబట్టి మ్రొక్కనిదే పోదా పాపము. యిది ఎలాంటిదంటే కాలకూట విషసమానమైనది. మరియు ఆవధూత, ఉదాసీ, పరమహంసలను జూచి 14 లోకములతో గల బ్రహ్మాదిగా, మానవులవరకూ ఎవ్వరయినా యిలా నమస్కారాలు చేయనివారు భరింపలేని, తరింపరాని మహా నరకముల బడుదురు. అదియును గాక ఆ మహనీయులు ఎదురగునపుడు వెనుకకుపోయే, భూపాలకులు, షట్కర్మనిరతులు, వ్యాపారస్తులు, వ్యవసాయదారులు, వారి సేవకులు, ధనవంతులు, లెక్కలుకట్టువారు, గానుగనాడించువారు, పొగడ్తలు చెప్పువారు, దైవారాధకులు ఎవరైనాగానీ పైన తెల్పిన విధమగు సపర్యలు చేయనిచో వారికి గల ఐశ్వర్యం, సత్కర్మ సంపద, దేహబలం, వారు సంపాదించిన జ్ఞాన విజ్ఞానములు క్రమముగా తరిగిపోవును.

**శిష్యుడు** : గురుదేవా! నాకిదంతయూ అగమ్యగోచరముగా యున్నది. యిన్నీ సాధించుట ఈ జన్మకు సాధ్యమా? సూక్ష్మముగా మోక్షము నొందగల దారి నాకు అనుగ్రహింపుము స్వామీ!

**గురువు : సనారీ ఉవాచ:**-శిష్యా! సత్య ధర్మవ్రతాచరణులగు వారెవ్వరైనా భార్యా సహితంగా, నన్ను, నా భార్యను, నా యంత్రాన్ని నా గ్రంధాన్ని మడిమయిలని ఆలోచింపక కుల ఆచారములు గమనించక, త్రికరణ శుద్ధిగా శ్రీగంధం, విభూతి కుంకుమలు ధరించి, రుద్రాక్ష, తులసీమాలలు అలంకరించుకుని సమస్త పుష్పములతో పూజించి, దూపదీపనైవేద్యములనర్పించి కర్పూరనీరాజనములతో ప్రదక్షిణపూర్వకముగా ఆరాధించు వారలకు, (భగవత్),నా కృప కలుగును. జపసిద్ధి పొందాలంటే భ్రూమధ్య దృష్టి నిలిపి ప్రాణాయామము చేస్తూ మంత్రాన్ని అక్షరలక్షలు జపించి జపసిద్ధి పొందవచ్చును.యిలా సాధకులంతా ఒకచోటచేరి గురువు చెప్పినట్లుగా పూజలు, జప సాధనలు చేసి





భోజనపానాదులనుసేవించి తృప్తులై సదా ధ్యానమందున్న యోగసిద్ధిని పొందుదురు. సాధనాబింకముచే ఆత్మపరమాత్మ యందు లయమగు కాలాన్ని ఉపరతియందురు. దీనినే ముక్తికాంతను కూడుట యందురు. యిలాచేయలేక మూఢులు తమతో నున్న సువాసినీ యోగినీలను ముక్తికాంతగా భావించి వావి వరసలు తప్పి క్షణికావేశముతో ఆత్మనిగ్రహము చెడి వివేకము కోల్పోయి ఒక నిమిషమాత్రము క్రీడించి, బ్రహ్మతేజస్సగు యింద్రియస్కలనముచేసి, మహాపాతకులై రౌరవాది నరకములపాలై, తక్షణమే కొన్ని, ప్రేతంబున అన్నియూ అనుభవింతురు. యివన్నియు అన్యస్త్రీకూటంబుచే సంభవించుచుండునని గ్రహించుము.

**శిష్యుడు**గురుదేవా!వీటన్నింటినీ తప్పుకొనుటకు మనసునెట్లు స్వాధీనమందుంచు కోవలయునో నాయందు దయతో తెలియజేయండి.

**గురువు** : శిష్యా గురువుచే మంత్రోపదేశముపొంది, దానిని విమర్శింపక తదేక నిష్ఠాగరిష్ఠత్వంబుతో యితర విషయములందు మనసు పోనీయక దృఢభావంబుతో నుండుటయే శ్రద్ధయందురు. యిది బ్రహ్మజ్ఞానార్జనకు అత్యంత ఆవశ్యకము. యిలాగాక కొందరు దుష్టగురువులు మిధునకైంకర్యమనగా భార్యాభర్తలకు సేవచేయుటయే త్రివిధ ప్రసాదమనియు, మరికొందరు స్త్రీపురుష సంపర్కరసము ఒక గిన్నెయందుంచి దానిలో కొంతజలమును మరికొంత మధువును కలిపి శిష్యులకిచ్చెదరు. యిది కలుష ప్రసాదమగనుక నిజము చెప్పెద వినుము. త్రివిధ ప్రసాదమనగా 1. ముందుగా గురువు ప్రకృతి యిట్టిదనియు ప్రకృతి జన్యమిట్టిదనియూ తెలిపి 2. ఆ తర్వాత ప్రత్యగాత్మయిట్టిదని బోధించి 3 ఆపైన కేవలాత్మ నిర్యాణమును వివరముగా బోధించుటే త్రివిధ ప్రసాదము.

**శిష్యుడు** : గురుదేవా! ఈ లోకంలో స్వార్థపరులు తమ కోర్కెలసాధనకై అనేక అక్రమాలు చేసి అమిత సుఖసంతోషములతో జీవించుచున్నారు. ధర్మంగా జీవించువారు అనేక కష్టములననుభవించుచున్నారు. యిదేమి న్యాయము స్వామీ!

**గురువు** :శిష్యా యిల్లలుకగనే పండుగౌనా? పండకనే చెట్టునుండి పండు విడువడునా? ఎవరు చేసుకున్న కర్మఫలము వారిని విడువదు. జన్మజన్మలందు అనుభవింపజేయును. యిది తథ్యం. తస్మాత్ జాగ్రత జాగ్రత. ఎవరు చేసుకున్న పుణ్యపాప ఫలములను వారు జన్మజన్మలందు అనుభవించుచుందురు. పాపకర్మలనాచరించువారు దానికి తగినట్లుగా 21 నరకములననుభవింతురు.యిదిగాక స్వర్గమనునది యింకొకటి గలదు.**(నేను వ్రాసిన సనారీవిశ్వేశ్వర సంవాద గ్రందార్ధములలో కలవు.)**

**శిష్యుడు** : గురుదేవా! స్వర్గప్రాప్తికి ఎట్టి ప్రయత్నాలు చెయ్యాలో సెలవీయండి స్వామీ.

**గురువు** : శిష్యా! దుష్టకార్యములందు మనసు పోనీయక, సత్ కార్యములను విడువక, అరిషడ్వర్గంబులలో చిక్కకయున్నవారు యోగసాధనలో అంతరనాదాన్ని ప్రతీక్షణం వింటూ ఆనందసాగరంలో మునిగియుందురు అట్టివారు స్వర్గసౌఖ్యములనుభవింతురు.

**శిష్యుడు** : గురుదేవా! జీవన్ముక్తి పొందుటకు యేమి మార్గములు గలవో వాటినెలా సాధించాలో నాయందు శిష్యవాత్సల్యంతో తెలియజేయండి.

**గురువు** : ఆకాశమంతా శూన్యంగా ఉన్నట్లు, గాలిలో ధూళియున్నట్లు అగ్నిలో కాంతి యున్నట్లు, నీటిలో నవరుచులున్నట్లు, భూమిలో అనేక రంగులున్నట్లు, అన్ని దిక్కులందుగల సృష్టిని గమనింపక, శరీరానికిగల గుణములను తత్వములను, మొత్తం ఈ ఆలోచనలను మనసుకు రానీయకుండా, శరీర స్పృహలేకుండా ఆత్మను పరమాత్మయందు జేర్చి, స్వప్రకాశుడై ప్రాణంతోనుండియూ శవంవలే నుండువాడేముక్తికి అర్హుడు. ఇట్టివారు కలిమిలేములు, సుఖదుఃఖములు, చలివేడి, మానావమానములు సమంగా భావింతురని ఎరుంగుము.

**శిష్యుడు** : గురుదేవా! యిట్టి మానసిక స్థితికి ఎలాంటి సాధనలు చేయాలి స్వామీ.

**గురువు** : శిష్యా బ్రహ్మజ్ఞానాన్ని పొందగోరువారు త్రయోదశవర్గాలను త్యజించాలి. అవి ఏమిటంటే 1. స్త్రీసౌఖ్యాన్ని సుగంధపరిమళాలనుభవించవలెనను**ఆశ** 2. ఎదుటవారి విద్య స్త్రీ యవ్వనమునకు అందానికి ధనాన్నీ చూచి **ఓర్వలేకపోవుట**, 3. ధన, ధాన్య, వస్తు వాహనాదులు, భూములు గృహములందు **కోరిక** 4. తన రహస్యము తెలిసివారు ఎక్కడ తనను చులకనగా చూతురోయని వారిపై **క్రోధము**, 5. తనవద్ద ధనము కలిగియాచించిన వారికి యివ్వననే **లోభబుద్ధి**, 6. తనవద్దగలవాటిపై మోహముతో యితరుల అవసరానికి యిచ్చుటకు నిరాకరించు **మోహము**, 7. యితరుల యోగ్యాయోగ్యతనెంచక పశువువలె ప్రవర్తించు**మదము**, 8. మూర్ఖత్వంతో తిరుగుచూ తనకంటే అధికులెవరని భావించు **మాత్సర్యము**, 9. జరిగిన విషయాలు తలుచుకుంటూ యితరులపై ద్వేషం పెంచుకునే **ఈర్ష్య**, 10. ఎదుటవారి గొప్పతనాన్ని వినిసహించలేక యిలా మాతాతలూ చేసారనే **అసూయ**, 11. తన గొప్పతనాన్ని తనలో తలచుకుంటూ ఆత్మస్తుతి చేసుకొనే **దంబము** 12.నాకు గల రాజసం, త్యాగము సుగుణములు ఎవరికి గలవని యోచించు **దర్పము**, 13. తాను చేపట్టిన కార్యాన్ని సాధించలేక యితరులపై చిరాకు పడి వారిని బాధించు **అహంకారము**. శిష్యా ఈ 13 లక్షణాలను బ్రహ్మజ్ఞానాసక్తులు దరి చేరనీయరాదు.





**శిష్యుడు** : యోగసాధకులు యింకా ఎలాంటి పద్ధతులను ఆచరించాలి గురుదేవా!

**గురువు** : శిష్యా నాడీవార నిర్ణయములు యోగసాధకులకు చాలా అవసరము. ఆది, మంగళ, గురు, శని వారములు సూర్యనాడి కుడి ముక్కున శ్వాస రావాలి. సోమ, బుధ, శుక్రవారములు చంద్రనాడి ఎడమ ముక్కున శ్వాస రావాలి. కృష్ణపక్షంలో గురువారములు సూర్యనాడి, శుక్లపక్షంలో చంద్రనాడి నడవాలి. పూర్ణిమరోజున చంద్రనాడి, అమావాస్యనాడు సూర్యనాడి వార సంబంధంలేకుండా రావాలి. సంవత్సరాదిరోజున చంద్రనాడి ఉండాలి. యిది రానిచో ఆ సంవత్సరంలో ప్రాణహాని. శుద్ధపాడ్యమినాడు చంద్రనాడి లేకున్న ధననష్టము కలుగును. శుక్లవిదియనాడు చంద్రనాడి లేకున్న సంవత్సరమంతా భయముతో గడుచును. శుక్లతదియనాడు సంవత్సరాదినుండి 3 రోజులు చంద్రనాడి ఆడాలి. చవితినాడు ఆవార స్వరం లేకపోతే బంధువిరోధం కలుగును. పంచమినాడు వారస్వరము లేకుంటే వ్యాధి వచ్చును. షష్ఠినాడు వారస్వరం లేకుంటే సంకటములు. సప్తమినాడు వారస్వరము లేకుంటే దేశాలబట్టి తిరుగును. అష్టమినాడు వారస్వరము లేకుంటే ఆ సంవత్సరములో మరణము కల్గును. దక్షిణాయన ఆరంభదినమున సూర్యనాడి, ఉత్తరాయణ ఆరంభదినమున చంద్రనాడి. ఈ ప్రకారం ఉదయం 1 గంట శ్వాస నడిచిన చాలును. సంవత్సరాదినుండి మూడురోజులు వార సంబంధం లేకుండా తిథుల ప్రకారం స్వరాలు ఆడాలి. 4వ రోజునుండి వారస్వరము ఆడాలి. యోగసాధకులు ఈ స్వరనాడిని తప్పక ఆచరించాలి.

| **యింకా తిథులకు స్వరనాడి** | | **నక్షత్రములకు స్వరనాడి** | |
|---|---|---|---|
| **సూర్యనాడి తిథులు** | **చంద్రనాడి తిథులు** | **సూర్యస్వర నక్షత్రములు** | **చంద్రస్వర నక్షత్రములు** |
| బహుళ నవమి | బహుళ షష్ఠి | రోహిణి | శ్రవణం |
| శుద్ధ చవితి | శుద్ధ పాడ్యమి | పుబ్బ | అశ్వని |
| శుద్ధ పంచమి | శుద్ధ విదియ | ఉత్తర | భరణి |
| శుద్ధ షష్ఠి | శుద్ధ తదియ | హస్త | కృత్తిక |
| శుద్ధ దశమి | శుద్ధ సప్తమి | చిత్త | మృగశిర |
| శుద్ధ ఏకాదశి | శుద్ధ అష్టమి | స్వాతి | ఆరుద్ర |
| శుద్ధ ద్వాదశి | శుద్ధ నవమి | విశాఖ | పునర్వసు |
| బహుళ పాడ్యమి | శుద్ధ త్రయోదశి | అనూరాధ | పుష్యమి |
| బహుళ విదియ | శుద్ధ చతుర్దశి | జ్యేష్ట | ఆశ్లేష |

| | | | |
|---|---|---|---|
| బహుళ తదియ | శుద్ధ పూర్ణిమ | మూల | మఖ |
| బహుళ సప్తమి | బహుళ చవితి | శతభిషం | పూర్వాషాఢ |
| బహుళ అష్టమి | బహుళ పంచమి | ఉత్తరాభాద్ర | ఉత్తరాషాఢ |
| బహుళ త్రయోదశి | బహుళ దశమి | | ధనిష్ట |
| బహుళ చతుర్దశి | బహుళ ఏకాదశి | | పూర్వాభాద్ర |
| బహుళ అమావాస్య | బహుళ ద్వాదశి | | రేవతి |

నక్షత్రస్వరము సూర్యుడై, చంద్రుడాడిన రోగమును, నక్షత్రస్వరము చంద్రుడై సూర్యుడాడిన ఆపదయును కలుగును.

ప్రయాణసమయమున సూర్యస్వరమాడుచుండిన కుడికాలు ముందుపెట్టి, చంద్రస్వరామాడుచుండిన ఎడమకాలు ముందుపెట్టి బయలుదేరాలి. ప్రతీమాసము మొదటిరోజున సూర్యస్వరము 4 జాములు (12 గంటలు) ఏకధాటిగా నడిచినవానికి మరణము చెప్పవలయును. 4 జాములు సూర్యస్వరము భారముగా నడిచిన 4 సంవత్సరములు ఆయువు పై విధముగా ఒక రోజంతా నడిచిన 3 సంవత్సరములు ఆయుర్ధాయమును. అలాగే 2 రోజులు నడిచిన 2 సంవత్సరముల ఆయుర్ధాయము. 3 రోజులు విడవకుండా నడిచిన 6 నెలలాయువును. 10 రోజులు నడిచిన 1 నెల ఆయువును 14 రోజులు స్వరము మారకనడిచిన 15 రోజులాయువు. అలాగే నెలరోజులు నడిచిన 1 రోజు ఆయుర్దాయమును చెప్పవలయును.

చంద్రస్వరము అతిభారముగా 5 రోజులు నడిచిన 1 సంవత్సరము రోగముతో బ్రతుకును. 15 రోజులు చంద్రస్వరము నడిచిన 6 నెలలాయువును 20 రోజులు నడిచిన నెలవరకూ వ్యాధిబాధ వుండును. ఒకరోజంతా పైవిధంగా స్వరము నడిచిన ఔషధసేవ, జపము, హోమము, దానములు, శివపూజ మొదలగునవి చేసిన అపమృత్యువు తొలగును.

**సూచన:** ముఖ్యముగా పూర్ణిమరోజున వార సంబంధము లేకుండా చంద్రస్వరము అమావాస్య నాడు వారసంబంధం లేకుండా సూర్యస్వరమూ ఆడాలి.

| **ఉత్తరాయణమున** | | **దక్షిణాయనమున** | |
|---|---|---|---|
| మకర సంక్రాంతి | చంద్రనాడి | కర్కాటక సంక్రాంతి | సూర్యనాడి |
| కుంభ సంక్రాంతి | సూర్యనాడి | సింహసంక్రాంతి | సూర్యనాడి |
| మీనసంక్రాంతి | చంద్రనాడి | కన్యాసంక్రాంతి | చంద్రనాడి |





| | | | |
|---|---|---|---|
| మేష సంక్రాంతి | సూర్యనాడి | తులా సంక్రాంతి | సూర్యనాడి |
| వృషభ సంక్రాంతి | చంద్రనాడి | వృశ్చిక సంక్రాంతి | చంద్రనాడి |
| మిధున సంక్రాంతి | సూర్యనాడి | ధనస్సంక్రాంతి | సూర్యనాడి |

**సూచన:** యిందలి ముఖ్యాంశములేమనగా 1. వారం, 2.పక్షం 3. రవి సంక్రమణం 4. ఆయన ప్రవేశము 5 సంవత్సరాదులలో చంద్రస్వరము నడిపించి మరునాడు ఏ రోజైన ముందురోజు స్వరాన్నే నడిపించాలి.వారం కంటేపక్షం, పక్షం కన్నా రవి సంక్రమణం, దానికన్నా ఆయన ప్రవేశము, దీనికన్నా సంవత్సరాది, ఒక దానికంటే వేరొకటి క్రమంగా బలీయమైనవి.

కొత్త అమావాస్య మొదలు మూడు దినములు రాత్రినిద్రించు వేళ సూర్యస్వరమును ఉదయము నిద్ర లేచువేళ చంద్ర స్వరము ఉండాలి. ఒక్క సంవత్సరాదిన చంద్ర స్వరమాడిన సంవత్సరమంతా బాగుండును.

**సూచన:** ప్రతీవారు దీనిని గమనించి చంద్ర స్వరము వచ్చునట్లుగా సాధనచేసి సుఖించగలరు.

1. ముక్కుపైభాగమును తాకుతూ 12 అంగుళముల శ్వాసనడిచిన పృథ్వీతత్వం.
2. ముక్కు రంధ్రం క్రింద భాగమునుండి 10 అంగుళముల శ్వాసనడిచిన జలతత్వము
3. ముక్కురంధ్రముల నుండి వెచ్చగా 6 అంగుళముల శ్వాస నడిచిన అగ్నితత్వము
4. ముక్కు రంధ్రముల మధ్యనుండి వెచ్చగా 8 అంగుళముల శ్వాసనడిచిన వాయు తత్వము
5. ముక్కు రెండు రంధ్రముల నుండి 4 అంగుళముల శ్వాస నడిచిన ఆకాశతత్వము

1. పృథ్వీతత్వమునసకల శుభకార్యములు స్థిరమగు కార్యములు చేయుటకు అనుకూలము, శుభం.
2. జలతత్వమందు అన్ని శుభకార్యములు చేయుటకు చాలామంచిది
3. అగ్నితత్వము వివాదములకు మంచిది, ప్రమాదకరమైనది.
4. వాయుతత్వము నందు ఏపనీకాదు ప్రమాదకరమైనది.
5. ఆకాశతత్వము నందు యోగాభ్యాసానికి మంచిది. యింక దేనికీ పనికిరాదు.

**వీటిని గమనించి ఆయా కార్యములందు ఫలితములు పొందగలరు.**

**సూచన:** చంద్రనాడి వారములయందు ఉషఃకాలవేళలో సూర్యనాడి నడిచిన శూన్యఫలితమనియు, చంద్రనాడి ప్రవహించుచుండిన సంపూర్ణ శుభములు కలుగునని శాస్త్రము.

అటులనే సూర్యనాడి వారములయందు ఉషఃకాలవేళలో చంద్రనాడి నడిచిన శూన్య ఫలితమనియు, సూర్యనాడి నడిచిన పూర్ణ శుభఫలప్రాప్తియని ఎరుంగుము.

**స్వరమార్పు విధములు**

1. ఎడమస్వరము నడుచునపుడు కుడి స్వరమవసరమైనచో, ఎడమ చేతిని కిందమోపి, రెండుపాదములను కుడివైపుకు మడిచి కూర్చున్నయెడల కుడిస్వరము ఆడును.
2. కుడిస్వరమున్నప్పుడు ఎడమస్వరము మార్చుటకు, కుడిచేతిని నేలకుమోపి రెండు పాదములను ఎడమవైపుకు మడిచి కూర్చున్నచో ఎడమ స్వరము నడుచును.
3. యోగదండమును కుడిచంకలో పెట్టుకుని, రెండుపాదములను ఎడమవైపునకు మడిచి కూర్చుండి యోగదండముపై ఆధారపడిన ఎడమ స్వరము లభించును.
4. యోగదండము ఎడమచంక నిడిపాదములను కుడివైపుకు మడిచి కూర్చుండి యోగదండముపై ఆధారపడిన కుడిస్వరము లభించును.
5. పరుండునప్పుడు స్వరము మార్చవలెనన్నచో, ఎడమచంకలో చిన్నగుడ్డను బంతిలాగ చుట్టి పెట్టుకుని ఎడమచేతిపై పడుకుని ఎడమపాదమును మంచంకోడుకుగానీ, మరిదేనికైనా గట్టివస్తువుకుగానీ ఆనించియుంచిన కుడిస్వరము లభ్యమగును.
6. పైవిధంగా కుడిచంకలో వస్త్రముంచి కుడిచేతిపై పడుకుని కుడికాలిని పైవిధముగా నుంచిన ఎడమస్వరమాడును.

**సూచన:** ఏవిధమగు స్వరమైననూ ఉదయము పద్ధతితప్పినచో, మద్యాహ్నం 12 గంటల నుండి 2 గంటలవరకూ సక్రమపద్ధతిన హంసను నడిపిన చాలును. ఈ స్వరమును తన అధీనమందుంచుకొని నడిపించగలవారు సంపూర్ణ ఆరోగ్యవంతులై యుందురు. స్వరసాధనచే మూర్ఛవ్యాధులు, జ్వరబాధలు, ఉదరరోగములు, నేత్రవ్యాధులు నివారించుకొనవచ్చును.

**శిష్యుడు** : గురుదేవా! ఏరోజునైనా వ్యతిరేకంగా స్వరం నడుస్తున్నప్పుడు ఏమి చేయాలి స్వామీ?

**గురువు** : చంద్రస్వరం రావాలంటే కుడిచేతిపై పడుకుని కుడిచంకలో గుడ్డని గుండ్రంగా చేసి నొక్కి పెట్టి కాసేపు పడుకుంటే ఎడమపక్కనుండి గాలి వస్తుంది. సూర్యస్వరం రావాలంటే ఎడమచేతిపై పడుకుని ఎడమచంకలో గుడ్డనిపెట్టి నొక్కి పెట్టి కాసేపు పడుకుంటే కుడిముక్కునుండి గాలి వస్తుంది. దీనికొరకు సాధువులు, యోగులు యోగదండాన్ని చంకలో నొక్కిపెట్టి శ్వాసను మార్చుకుంటారు. పైన చెప్పిన ప్రకారం





ఉదయం నిద్రలేచేసరికి ఆముక్కు రంధ్రంనుండి గాలి రావాలి. అలా రాని పక్షంలో పైన చెప్పినట్లు స్వరాన్ని తెచ్చుకుని సూర్యనాడి అయితే కుడికాలు, చంద్రనాడి అయితే ఎడమకాలు ముందుగా భూమిపై ఉంచి భూదేవికి నమస్కరించి

శ్లో॥ **సముద్రవసనే దేవీం పర్వతస్థనమండలే।**
**విష్ణు పత్నీం నమస్తుభ్యం పాదస్పర్శామ్ క్షమస్వమే॥**

(అంటూ భూదేవికి నమస్కరించుతూ తన రెండు చేతులను చూస్తూ)

శ్లో॥ **కరాగ్రే వసనే లక్ష్మీం, కరమధ్యే సరస్వతీం।**
**కరమూలే స్థితే గౌరీం ప్రభాతే న కరదర్శనమ్॥**

అంటూ రెండు చేతులతో కళ్ళను తుడుచుకుంటూ ముందుగా తల్లిదండ్రులను, తానారాధించు దైవాన్ని, గురువును, యింకా తన యిష్టదేవతలందరికీ నమస్కరిస్తూ, సూర్యనాడికి దక్షిణ పశ్చిమ దిశలలో 3 అడుగులు, చంద్రనాడికి తూర్పు ఉత్తరదిశలలో 3 అడుగులు వేస్తూ పడకనుండి లేవాలి. నిత్య కాలకృత్యములు తీర్చుకుని,

**స్నానక్రమము:**...........................................................................

(సూర్యోదయానికి ముందుగా నీటికి నమస్కరించుతూ)

శ్లో॥ **గంగేచయమునేచైవ కృష్ణాగోదావరీ సరస్వతీ।**
**నర్మదా సింధుకావేరి జలేస్మిన్ సన్నిధింకురు॥**

(ఆపోయిష్ఠాది నవ మంత్రములను చెప్పుకుంటూ స్నానం చేసి ఆఖరున)

శ్లో॥ **అపవిత్రః పవిత్రో వాసర్వావస్థాంగతోపివా।**
**యస్మరేత్ విశ్వకర్మాణం సభాహ్యాంభ్యంతర శుచిః॥**

(ఈ మంత్రం చెబుతూ శిరస్సున జలప్రోక్షణ చేసుకోవాలి.)

నేను వ్రాసిన **సంధ్యావందనం** నిత్యపూజా విధానంలో కలదు.

సంధ్యావందనాన్నాచరించి యిష్టదేవతా పూజ చేసుకొని జీవనార్ధమై నిత్యకృత్యములలో పాల్గొని తాను స్పృహలోనున్నంతవరకు మానసిక జపం చేసుకుంటూ,సత్యమును పాటిస్తూ భూతదయకల్గి,కన్నవారిని ప్రేమతో ఆదరిస్తూ,

భార్యాపిల్లలను పోషణ చేయుచూ గృహస్థాశ్రమధర్మం తప్పకుండా కలిగినదానితో తృప్తిపడి, పరుల ధన, కనక వస్తువాహనాదులకు, పరకాంతలకూ ఆశపడక జీవించుటే ఉత్తమపురుష లక్షణము దీనికి వేరుగా జీవిస్తూ ఎన్ని వ్రతములు పూజలు చేసినా,

నిష్ప్రయోజనము. అన్నిటికంటే జీవహింస చేయకుండుట ఉత్తమము. యిలా పగలంతా శ్రమించి **రాత్రి పరుండు సమయమున అణువునుండి** బ్రహ్మాండమంతయూ నిండి సమస్త జీవులకు ఆత్మవైయుండు ఓ పరంధామా! నేను ఉదయం నిద్రలేచినది మొదలు ఇప్పటివరకూ, తెలిసీ తెలియక కాళ్ళతో చేతులతో మనస్సుతో, కంటిచూపుతో, నోటి వాక్కుతో చేసిన సుకృత దుష్కృత్యములునీకు సమర్పించుచున్నాను. **"ఓపాప విధ్వంసకా"** యిపుడు నిన్ను నా హృదయకమలమందు నిలిపి నిద్రింతును. మరల మేల్కొన్నది మొదలు రాత్రి నిద్రించువరకూ సత్కార్యములు చేయునట్లునాకు బుద్ధినొసంగుము. నాకుగల పాపములన్నియూ హరించి నన్ను నీ సన్నిధిలో చేర్చుకొనుము. ఓ పరంధామా అనాధరక్షకా! ఆపద్బాంధవా నన్ను రక్షింపుము. రక్షింపుము రక్షింపుము. అనుచూ రెండు చేతులూ జోడించి నమస్కరించి ఎడమచేతిపై పడుకుని శ్వాస పీల్చునపుడు "సో" వదులునపుడు "హం" అనుచూ నిద్రవచ్చువరకూ జపిస్తూ మనసున ఏయితర ఆలోచనలు లేకుండా హాయిగా నిదురించి, బ్రహ్మముహూర్తమున మేల్కాంచి, గురువు చెప్పినమంత్రాన్ని పడకమీదనుండియే తూర్పుముఖంగా కూర్చుని జపిస్తూ బ్రహ్మముహూర్త సమయానికి ముందుగా పడకనుండి లేవాలి.

(ఓ పరమాత్మా దృఢమైన భక్తి విశ్వాసములను నిశ్చలమైన ధ్యాన నిష్టను నాకు దయతో కల్గించండి) ఈ విధంగా పూజకుగానీ జపానికిగానీ ముందుగా దైవాన్ని కోరుకుని ఆరంభించాలి.

**శిష్యుడు** : గురుదేవా! శరీరానికి ఆత్మకూగల భేదాన్ని చెప్పండి. పరమాత్మతత్వమేది?

**గురువు** : దేహము పంచజ్ఞానేంద్రియములు పంచకర్మేంద్రియములు, పంచప్రాణములు పంచతన్మాత్రలు, చతురంతఃకరణలు, ఈ యిరువది నాలుగు తత్వములయొక్క కూడికయే దేహము. ఇట్టి దేహమందు 25వ తత్వమగు జీవాత్మ చేరికచే ఈ శరీరము పంచవింశతితత్వములగుచున్నవి. యివిగాక 26తత్వముగలదు. **"పరమాత్మ"** యిట్టి దేహముతో జీవి ఈ ప్రపంచమున బదుచున్నది.

**శిష్యుడు** : గురుదేవా! ఈ అనంత సృష్టిలో జీవి ప్రవేశించుటకు కారణమేమి?

**గురువు** : స్త్రీ పురుషులు జన్మించినది మొదలు చచ్చువరకూ ప్రతిదినము చేయుచుండెడి పుణ్యాపాపకర్మలను ఆగామి కర్మలని చెప్పబడును.

**సంచితము** : ఒక్కొక్క జన్మయందు చేయుచూ వచ్చెడి పుణ్యాపాపములన్నియూ గుట్టలు గుట్టలుగా పర్వతమువలే పెరుగుతూ ఉన్నవే **సంచిత** కర్మలందురు.





**ప్రారబ్ధము** : జీవి సంచితమందుండి వారి చేసిన పూర్వజన్మ కర్మానుసారముగా పుణ్యాపాపములననుభవించుటకై జన్మించునదే **ప్రారబ్ధ**మందురు.

**మానవజన్మలో** ఎవరెవరు మనసున ఏది కావాలయునని నిత్యమూ తలంచుచున్నారో ఆ కోరికయే **ఆగామి** యందురు. అట్టి కోరికలు లెక్కలేనన్ని చేరి వృద్ధి పొందినదే **సంచిత**మందురు. ఈ సంచితమునుండి మరుజన్మకు కావలసినంత పుణ్యాపాపములను సంపాదించుకుని మరుజన్మలో అనుభవించునదే **ప్రారబ్ధ**మనబడును. ఈ ప్రపంచమున ప్రతీ మానవులు అనుభవించు సుఖదుఃఖములకు కారణమేమనగా పూర్వజన్మలందు వారు చేసుకున్న పుణ్యాపాప ఫలితములేగానీ, యిందు పరమాత్మ ప్రత్యేకించి యిచ్చునదేమీ లేదు.

**షరా : ప్రతీ జీవీ పూర్వజన్మ కోర్కెలను అనుభవించుటకై మరల మరల జన్మించుచున్నారు.**

**శిష్యుడు** :గురుదేవా! స్థూలశరీరం గురించి చెప్పారు, సూక్ష్మశరీరం గురించి చెప్పండి స్వామీ

**గురువు** : జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, ప్రాణములు 5, మనోబుద్ధులూ రెండూ కలిసి 17తో సూక్ష్మశరీరమైనది.

**శిష్యుడు** : గృహస్థుడు ఎలా ఉండాలో శలవీయండి గురుదేవా!

**గురువు** : 1.శుచి, శుభ్రత, 2. దొంగబుద్ధిలేకుండుట, 3. ఓర్పు, 4. ధైర్యము, 5. యింద్రియనిగ్రహము, 6.లోకజ్ఞానము, 7. వేదాంత విచారణ, 8. సత్యము పల్కుట, 9. క్రోధము లేకుండుట, 10. మంచి బుద్ధితో జీవించుట.

**యిలాగాక దుర్బుద్ధులతో నున్నవారు :**

నోటితో చేయుపాప కర్మలకు మృగముగనో పక్షిజాతిగానో పుట్టవలసియుండును. మనసుతో చేయు దుష్కర్మలచే హీనజాతిలో పుట్టవలసియుండును. అహంకారముతో శరీరముతో చేయు హింసాకృత్యములకు పర్వతములుగానో వృక్షములుగానో జన్మింతురు.

శ్లో॥ **సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం ।**
**నిర్మోహత్వే నిశ్చలతత్వం నిశ్చలతత్వే జీవన్ముక్తి"**

కావున శిష్యా (శంకరాచార్యులవారు చెప్పినట్లు) అన్ని జీవులయొక్క మనస్సుకు సాక్షిగా నుండి "నే" ననెడి తలంపును తెలుసుకొనదగిన యింద్రియ వ్యాపారములనెల్లను ఆత్మచేయుచున్నదనియు, అట్టి ఆత్మయే స్వయంప్రకాశమైన జ్యోతిరూపమని తెలుసుకుని,

దానివలనకలుగు బ్రహ్మానంద సుఖమును సాధనతో ఎవరు పొందుచున్నారో వారు ఏకులమువారైననూ తన గురువని శంకరాచార్యులవారు తలచుచున్నారు.

**శిష్యుడు:** గురుదేవా!శంకరాచార్యులవారి జన్మ రహస్యంచెప్పండి.

**గురువు: ఆచార్యశంకరోనామ త్వష్ట పుత్రో నసంశయః ।**
**విప్రకులగురోర్దీక్షా విశ్వకర్మంతు బ్రాహ్మణాః ॥**

వ్యాసునకిచ్చిన మయ బ్రహ్మవరం ఫలించు విధివిధానంగా విప్రులు యోగసిద్దిని పొంది వారి **పీఠములు** మార్పు చేసిన వారి శాస్త్రములు పూజింపబడుట కొరకు ఉపదేశార్థతగల త్వష్ట ప్రజాపతి కుమారుడగు విశ్వరూపాచార్యులు(దత్తాత్రేయులవారిని త్వష్ట వంశీయునకు విప్రబాలవిధవకు శంకరాచారిగా ఆవిర్భవింపజేసి, వారితో విప్రులకు ఉపదేశములు చేయించి,అష్టాదశ పీఠములు స్థాపించి విప్రులకు వారి పీఠములకు రాజపూజ్యతకు కారకులైరి.)

**శిష్యుడు** : గురుదేవా! ఎలాంటివారు యోగి, అవధూత? యోగమనగానేమి?

**గురువు** : శిష్యా మనసును వెలుపలకు బరువిడకుండా నిలిపియుంచుటే యోగము, అట్టి వాడే యోగి, యిట్టి యోగమే మౌనమని చెప్పబడును. దీనికి సాధనయేమనగా తలంపులన్నియూ క్రమముగా అణచి, శాంతముగానుండి ఎలాంటి ఆలోచనలు లేనివాడై సమస్తభూతములను (జీవులను) సమముగాచూచువాడే యోగియనియు, సన్యాసియనియూ అందురు.

**అవధూత అర్థం** : **"అ"** అనగా నాశనములేని వాడు. **"వ"** అనగా సకల మానవులలో శ్రేష్టుడు. అనగా బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసియనెడి నాలుగు ఆశ్రమములందున్న వారికంటె శ్రేష్టుడు. **"ధూ"** యనగా దేహమేనేనను అభిమానమే సంసారమనబడును. యిట్టి దేహాభిమానమే లేకుండుట **"త"** అనగా తత్వమసి యనెడి మహావాక్యరీతిగా "**బ్రహ్మము, ఆత్మ"** యనెడి భేదములేక రెంటినీ ఐక్యము చేయువాడని అర్థము. యింకా జాతి, కుల, మత, ప్రాంతీయ భేదములు శరీరమునకేగానీ పరబ్రహ్మ అంశయగు ఆత్మకులేదని తెలుసుకుని, సకల ప్రపంచవ్యాపారములను మరచి ఆ పరబ్రహ్మమే తానని ధృఢనిశ్చయముగలవాడై ఎల్లప్పుడు స్థిరముగా నుండువాడే **అవధూత.**

**శిష్యుడు** : గురుదేవా! మోక్షమనగా ఏమిటో తెలియజేయండి స్వామీ.

**గురువు** : నిత్యుడు, నిర్వికారుడు, శాశ్వతుడు, స్వయం ప్రకాశుడు, కేవలా ద్వితీయుడుగా





నుండు పరబ్రహ్మము తానేనని తెలుసుకుని, సకల ప్రపంచవ్యాపారములను మరచి తాను సాక్షీమాత్రుడైయుండి, నిత్యము ఆనందపరవశమున తేలియాడువాడే జ్ఞాని. అట్లు ఆనందింపక తనకంటే మరియొక బ్రహ్మమున్నదని తలంచి, అష్టాంగయోగములు చేసి భ్రూమధ్యమున దృష్టి నిలిపి, పంచముద్రలను అనుష్టించి దానివలన కలుగు దశవిధ నాదములు, చిత్కళలను ఆ చిత్కళలలోని మండలములు మొదలగువానిని చూచుచూ, అవియే బ్రహ్మమను సంకల్పమే **"అజ్ఞానము"** దేహమునకు యింద్రియములకును వేరుగానుండు పరబ్రహ్మమే తానని తెలుసుకొనలేక, దేహేంద్రియములుగల జీవుడే తానని తలచి మోక్షము పొందవలెనను సంకల్పమే **"బంధము"** శరీరము మాయతో కూడిన ఆత్మ తనవికాని దేహేంద్రియములు తనవిగా తలంచుచూ కొన్ని దినములలో నశించిపోవు భార్య, పుత్ర, పుత్రిక, గృహ, ధన ధాన్యాది వస్తువాహనాలదుల మీద నుండు ఆశలన్నింటినీ క్రమంగా వదలి, సుఖ, దుఃఖములు శరీరమునకేగానీ ఆత్మ స్వరూపుండనగునాకు లేవని బ్రహ్మజ్ఞానియై గ్రహించి, ఆత్మ స్వరూపియగునేనే బ్రహ్మమని తలచి అన్ని తలపులు మరచి, ఎల్లపుడు బ్రహ్మానందములో జొక్కియుండుటే మోక్షము. పాలలో నెయ్యి మరుగై ఎట్లున్నదో, అట్లే సకల ప్రాణులయందు **ఆత్మ** మాయచే కప్పబడి మరుగైయున్నది.(ఇదే బ్రహ్మసాక్షాత్కారము)

**శిష్యుడు** : గురుదేవా! యిట్టి మోక్షసామ్రాజ్యమును పొందుమార్గమేమి?

**గురువు** : శిష్యా అణుమాత్రమైన తేజస్సగు బ్రహ్మము నాశ్రయించి సమస్త జీవరాసులు మనగలుగుచున్నవి. ఆ తేజస్సు తొలగిన నిర్జీవములగుచున్నవి. ఆ అణుమాత్ర పరబ్రహ్మమగు ఆత్మను మాయ కప్పియుండుటచే జనన మరణములకు కారణమగు చున్నది. అట్టి మాయను యోగసాధనచే జయించినచో, నిత్యానందమనెడు సుఖము ప్రాప్తించును. అట్టి బ్రహ్మానందమున లీనమైనవాడు, పరిపూర్ణ ఆనందస్వరూపుడగు చున్నాడు. ఇట్టి వానికి బ్రహ్మమునకూ భేదములేదు. ఇతడు మాయ యనెడు పాపబంధములను తెగనరికి, శివజ్ఞానియగును. యిట్టివానిని లోకుందరు పూజింతురు. ఇట్టివానికి భిక్షపెట్టిన, అన్నవస్త్రాదులిచ్చిన, సాక్షాత్ పరమేశ్వరునకర్పించినట్లగును. ఇట్టి శివజ్ఞానిని దూషించినవారు శివదూషణచేసినవారగుదురు. ఈతనిని స్తుతించిన శివుని స్తుతించినట్లగును. పరమేశ్వరుని కృపగలవారు మాత్రమే జీవన్ముక్తులగుదురు. ఇట్టి బ్రహ్మమును గుర్తెరిగినవారే, బ్రాహ్మణులగుదురని శృతి ప్రమాణము. ఇట్టి యోగిని బ్రహ్మాదిదేవతలు కూడా పూజింతురు.

**శిష్యుడు** : స్వామీఈ స్థితికి రావలెనన్న ఎట్టి యోగసాధనలుచేయవలెనోతెలుపండి.

**గురువు** : శిష్యా యింద్రియములను విషయ వ్యాపారాదులయందు బోనివ్వక, క్రమ క్రమముగా వశపరచి, తన శరీరమును కష్టపెట్టక జ్ఞానముతో నిష్టగా సాధనచేయుచూ రావలయును. జ్ఞానానుష్ఠానము వలన మనస్సును అణచినయెడల యింద్రియములకు విషయములందు ఆశకలుగ నేరదు. మనస్సును నిలుపక యింద్రియములను బాలాత్కారము అణుచుటకు ప్రయత్నించినవానిని మూఢుడందురు. యింద్రియములను వాటి కార్యములను జేయనీయక నిర్బంధించినయెడల, శరీరము నిలువజాలదు. ఈ శరీర సహాయముననే జీవికి ముక్తి సామ్రాజ్యము లభించును. ఎట్లన్న నదిని దాటవలెనన్న నావ అవసరముగదా! అట్లే భవసాగరము దాటవలెనన్నచో శరీర సహాయముచే సాధ్యమగును. దేహము జలమువల్లను, మనసు సత్యముచేతను, జీవాత్మ నిష్కామ్యబ్రహ్మనిష్ట వల్లను, బుద్ధి యదార్థ జ్ఞానమువల్లను, పరిశుద్ధమగును. జ్ఞానులు జ్ఞానతీర్థస్నానమువలన వాక్కు, మనస్సు, బుద్ధి, జీవాత్మను పరిశుద్ధము చేసుకొందురు. లౌకికమగు జలస్నానముచే కలుగు దేహశుద్ధిని అట్టి వారు పాటింపరు. జ్ఞానులు తమను ఆశ్రయించినవారికి బ్రహ్మజ్ఞానముపదేశించి, బ్రహ్మజ్ఞాన దానము చేసిన వారగుదురు. అన్ని దానములకన్నా జ్ఞానదానమే ఉత్తమము, శ్రేష్టమయినది.

**శిష్యుడు** : గురుదేవా! జీవన్ముక్తుడనగా ఎట్టివారు స్వామీ తెలియజేయండి!

**గురువు** : వేదములవలననూ, స్మృతుల వలన, ధర్మములవలనను, తనకు జీవన్ముక్తి లభించునని తెలుసుకొని, ఆతలంపులు మరచి తదేక నిష్టాగరిష్ఠుడై, సదా బ్రహ్మములో జొక్కియుండువాడే జీవన్ముక్తుడు.

**శిష్యుడు** : గురుదేవా! సాధనా పద్ధతులెన్ని విధములు వాటి ఫలితాలను నాయందు దయతో తెలియజేయండి.

**గురువు** : గురుయంత్రాన్ని మంత్రముతో క్రమము తప్పకుండా మనసులగ్నంచేసి మంత్రమందలి బీజాలేమూలమైనవిగాచేసి, శ్వాసను పూరించి, దానికి రెట్టింపు సమయం శ్వాసను నిలిపి, నిదానంగా శ్వాసను వదలాలి, శ్వాస నిలుపునదే కుంభకము. ఈ కుంభకమందే మంత్రబీజాలను జపించు జపస్థానం గురువునుండి తెలుసుకుని, కుంభకమందు **జగన్మాతను** ఆత్మలోనిలిపి, ఈ అర్చన చేయాలి. అప్పుడు కలిగే ఆకాశ ధ్వనిని శ్రవణానందముగా వినాలి. ప్రశాంత వాతావరణంలో రాత్రింబవళ్ళు తదేకనిష్ఠతో





ఈ యోగాన్ని 12 సంవత్సరములు చేయాలి. దీనివలన కలుగు సిద్ధులెవ్వి? అనగా 3 మాసాలకు కుంభకముసిద్ధించి వాయు స్వాధీనమగును. 1. సంవత్సరానికి దేహారోగ్యము, 2 సంవత్సరములకు జనవశీకరణ, 3 సంవత్సరములకు అన్ని దోషాలు పోవుట,4వ సంవత్సరంలో సంపూర్ణ వాయుజయంబు, 5వ సంవత్సరంలో శరీరపీడలన్నీ పోవుట, 6వ సంవత్సరంలో నేత్రాలకు ఆరోగ్యము, 7వ సంవత్సరములో పరవిద్యాభక్షణయు, 8వ సంవత్సరంలో దివ్య దేహము, 9వ సంవత్సరంలో బహుదేవతాగణములతో గల మహాసిద్ధ గణ సమూహ దర్శనము 10.వ సంవత్సరంలో వాగ్జాలతయు, 11వ సంవత్సరము మహాసిద్ధగణసమూహతోగల దర్శనము, 12వ సంవత్సరంలో తానే దైవస్వరూపుడగుటయును, దీక్షతో ఆచరించినవారికి క్రమముగా ఇవి సిద్ధించును. గృహస్తుడు ఈ యోగసిద్ధి కొరకు పంచపర్వదినములందు, (94వ పేజిలో) భార్యా ఋతుకాలాన్ని విడిచి తతిమా కాలములందు వంశాభివృద్ధికై భార్యతో సంసారము చేయుచూ, తతిమాసమయములందు ఆత్మను యింద్రియములను నిగ్రహించుతూ, యోగసిద్ధిని పొందాలి. అన్ని జాతులవారు ఈ ప్రకారము ఆచరించాలి.

**శిష్యుడు** : విశ్వకర్మ సంతతి వారికి ప్రత్యేక నియమనిబంధనలు కలవా గురుదేవా!

**గురువు** : విరాట్ విశ్వకర్మ సంతతివారగు విశ్వబ్రాహ్మణులు జాతాదిగా షోడశకర్మలు తెలుసుకోవాలి. వారికి గల పంచాశ్రమములు తెల్పెద. శ్రద్ధగా వినుము.

**దైవజ్ఞ స్మృతౌ : విశ్వకర్మ సంతతివారు**

శ్లో॥ **ప్రథమం బ్రహ్మవంశంచ బ్రహ్మచర్య గృహస్థకం।**
**వానప్రస్థంచ సన్యాసం పంచైతే ఆశ్రమశ్శృతః॥**

తా॥ 1. బ్రహ్మవంశమున 2. బ్రహ్మచర్యము, 3.గృహస్థము, 4. వానప్రస్థము, 5 సన్యాసము అనెడు ఐదు విధంబులుగా నియమించియుండెను. గనుక వీరలు ముక్తి చెందుటకు సాధన చతుష్టయములు నెరింగించెదను. శిష్యా శ్రద్ధగా వినుము.

1. నిత్యా నిత్య వివేకము అనగా బ్రహ్మము నిత్యము జగత్తు మిధ్యయని తెలుసుకొనుట.
2. ఇహాముత్రఫలభోగవిరాగమనగా! యిహలోకంబున వనితాగృహాది విలాస భోగములందును, పరలోకమున రంభాది భోగములందును ప్రీతి (మక్కువ) లేకుండుట.
3. శమాది షట్కసంపత్తి 6 విధములు 1. శమము, 2.దమము, 3. ఉపరతి, 4 తితీక్ష, 5 సమాధానము, 6. శ్రద్ధ. శమమనగా యిహలోక విషయాదులందపేక్షతో మనసును

త్రిప్పి నిలకడగా యుంచుట 2 దమమనగా జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు విషయాదులయందు ప్రీతితో చరించునపుడు, బ్రహ్మజ్ఞానాసక్తుడై మనస్సును నిగ్రహించుట, 3 ఉపరతియనగా యిహలోక కర్మాదులను విడిచి ఆత్మను సదా పరమాత్మతో కలిపి యుంచుట, 4. తితీక్షయనగా తాననుభవించు ప్రారబ్ధకర్మలకు యితరులపై నిందమోప కుండుట 5. సమాధానమనగా గురువు తెలుపు వేదాంత విషయములును స్థిరచిత్తుడై బుద్ధినిలకడగా ఉంచుట 6 శ్రద్ధయనగా మాతా పితరులయందు గురువుయందు భగవంతుని యందు వినయ విధేయుడై యుండుట. గురువు వలన మోక్షమార్గమును గ్రహించి, స్థిరచిత్తుడై మోక్షము పొందుట.

**1. బ్రహ్మవంశజుల లక్షణములు**

పిత్రుముఖతా గాయత్రీ బ్రహ్మోపదేశములను పొందినిత్యస్నానసంధ్యానుష్ఠానములు చేయుచూ, శ్రీగంధ, కుంకుమ భస్మములను ధరించి జ్యోతిస్వరూపుడగు విరాట్ విశ్వబ్రహ్మ దర్శనమునకై నిత్యమూ జపతపోనిష్ఠలయందు నిమగ్నుడై యుండుట ఆవశ్యకము.

**2. బ్రహ్మచర్య లక్షణము మనుసూత్రే :**

స్నానసంధ్యాఽగ్ని కార్యవేదవ్రతభిక్షాచర్యకుకౌపీనదండధారయే ద్యుక్తం బ్రహ్మచర్యం

తా॥ నిత్యము భస్మధారణ, సంధ్యావందనము, అగ్నికార్యము, వేదభిక్ష, కుశ, కౌపీన దండములను ధరించుట, వేదాధ్యయనాదిగాయత్రీ బ్రహ్మోపదేశములను గురుముఖతా పొందుట, శ్రద్ధతో ఆచరించిన బ్రహ్మచారి, మరణానంతరమున పరబ్రహ్మమందైక్యమై శాశ్వత బ్రహ్మపథము నొందును. **దీనినే సాలోక్య పదవియందురు.**

**3. గృహస్థ లక్షణము**

**మనుసూత్రే:** షోడశ సంస్కారాధికార కర్తవ్యమిత్యుక్త వ్రతాంగార్హస్థం।

తా॥ జన్మించినది మొదలు పదహారు కర్మలయొక్క అధికారమును పొందుటయే గాక, మరియు

శ్లో॥ **స్నాన సంధ్యాది జపహోమం దేవతానాం పూజనం।**
**ఆతిథ్యం వైశ్వదేవంచ షట్కర్మ దినేదినే॥**

తా॥ నిత్యస్నానము, భస్మధారణ, సంధ్యావందనము, జపము, హోమము, దేవపూజ, అతిథి పూజ మొదలగునవి చేయుచున్న గృహస్థుడు, పరలోకంబున పరబ్రహ్మ సమక్షమునగాక, అతని సమీపమునగల మరొయొక ప్రదేశమునందుండి సమస్త భోగములననుభవించును.





**4. వానప్రస్థ లక్షణము**

**ధర్మశాస్త్రే:** గృహస్థుడు తన సంతానమునకు వివాహములు జరిపించి, కుటుంబ బాధ్యతలను వారికి అప్పగించి, భార్యాసమేతుడైగానీ, తానొక్కడైననూ వనమందుగానీ, కొండగుహలయందుగానీ పర్ణశాలనేర్పరచుకొని, తాను ఉపనయనము నాటినుండి చేయుచూ వచ్చిన మహామంత్రానుష్ఠానమును నిత్యమూ చేయుచూ 12 సంవత్సరములు గానీ, 5 సంవత్సరములుగానీ కనీసం 3 సంవత్సరములైనను, నియమ నిష్ఠలతో చేయుచూ, కందమూలాది ఫలములు సేవించి పాలను త్రాగుతూ, లభ్య పదార్థములను ఈశ్వరార్పణ కావించి భుజించుచూ దంపతీయుక్తముగా యిట్టి వ్రతమాచరించినచో స్వర్గలోకమున వరబ్రహ్మవంటి రూపము గలిగి యుంచుట సమస్త భోగములనుభవించుచును. **యిదియే సారూప్య పదవి**

**5. సన్యాసి లక్షణము**

**మతధర్మచంద్రికా:** నిత్యస్నానము, భస్మధారణ, ప్రణవవేదవిధిని తప్పకుండా తత్వభేదాఽభేదంబులను, కర్మ దుష్కర్మలను గ్రహించి 1.అణవమలము 2.కార్మీక మలము 3.మాయీకమలము వీటిని తొలగించి పాశాబంధంబులను మూలంటా త్రెంచివేసి, పంచేంద్రియంబులను నిగ్రహించి దేహాభిమానమును విడిచి, సమస్త సంబంధ బాంధవ్యంబులను తెగనరికి, పరిశుద్ధాత్మతో తాను తానైయున్న సన్యాసి, అంత్యమున పరలోకంబున పరబ్రహ్మయందైక్యమై జనన మరణాదులు లేనివాడగును. యిదియే **సాయుజ్యపదవి.** యిది కష్టమగునని భావించిన వారికి రాజయోగము. దీనిని గురించి వేమనయోగి!

ఆ॥వె॥ **కామిగానివాడు కవిగాడు రవికాడు। కామిగాక మోక్షకామిగాడు**
**కామియైనవాడు కవియగురవియగు। విశ్వదాభిరామ వినురవేమ॥**

ఈ ఆర్యోక్తిచే గృహస్థాశ్రమంబైన రాజయోగము స్వీకరించి, అందు సకల భోగములనుభవించుచూ సద్గురు కరుణా కటాక్షంబున గురుపాదముపట్టి, పదిరెండు వందనములు చేసి జ్ఞానంబుపొంది, దానివలన 1. దైవభక్తి, 2. శాంతము, 3. శత్రువులందు ఉపేక్షభావము, 4. సర్వభూతదయాళుత్వము, 5. సత్యధర్మంబులు మొదలగు గుణములచే సంచరించుచూ కులమతభేదంలేక ప్రవర్తించిన ఎల్లజనులు ముక్తి పొందవచ్చునని తెలిపిరి.

**6.చాతుర్విధ శుశ్రూషలు**

1. **స్థల శుశ్రూష:** గురువుగారి నివాసమును శుభ్రంగా ఊడ్చుట, అవసరమగునపుడు కడిగి ముగ్గులతో అలంకరించి పరిశుభ్రముగా ఉంచుట స్థల శిశ్రూష యందురు.

2. **అంగ శిశ్రూష:** గురువుగారి శరీరావయవములను ఒత్తుచూ, వారి దేహము అలసట కల్గినపుడు చేయదగు సపర్యలన్నీ చేయుట అంగ శిశ్రూష యందురు.

3. **భావశిశ్రూష:** గురువుగారున్న ప్రదేశమే కాశీ గయాది మహాపుణ్యక్షేత్రములుగా భావించి ఆనందించుట. గురుపాదోదకం పంచామృతముగా పరిశుద్ధమగు గంగా తీర్థముగా భావించి కనులకద్దుకొని సేవించుట, గురువే సాక్షాత్ బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్వరూపంబులుగా భావించి యుండుటయే భావ శిశ్రూష యందురు.

4. **ఆత్మశిశ్రూష:** గురువుగారి ఆత్మయందలి భావములు గ్రహించి, వాటికి కావలసిన సమస్తమును స్వయముగా సమకూర్చుటే భావ శిశ్రూష యందురు

త్రివిధ ప్రసాదములనిన

1. గురుపాదోదకాన్ని భక్తితో అజ్ఞాన మూల హరణం జన్మకర్మ నివారణం గురు పాదోదకం పీత్వా యనుచూ కన్నుల కద్దుకుని ఆ తీర్థాన్ని సేవించుట.

2. గురువు భుజించిన శేష పదార్థాన్ని మహా ప్రసాదముగా భుజించుట.

3. గురువు తెలుపు వాక్యములను శ్రవణానందముగా విని ఆచరించుట. ఈ మూడింటిని త్రివిధ ప్రసాదములందురు.

**శిష్యుడు** : గురుదేవా! మీరు వివాహమాడి రాజయోగియై గృహస్థాశ్రమ ధర్మమును స్వీకరించమంటున్నారు. భార్యతోనే అన్ని బంధములు ఆరంభమగుననుచున్నారు. యిందలి మర్మము నాకు బోధపడుటలేదు స్వామీ.

సనారీఉవాచ:

గీ॥ **అడదానికిమగడైనవాడుజనుడు,మీసముండినశాక్తేయోపాసకుండు,**
**నోరుగల్గిన వాదంబు బారుయగును. యిహపరంబంత జూరువాడెందునున్న**

**గురువు** : శిష్యా బ్రహ్మచర్య వ్రతమాచరించుట చాలా కష్టము. స్త్రీ సంపర్కము లేక పోయిననూ, మనసు చంచలమైన వ్రతభంగమగును. కావున రాజయోగియైయూ , తామరాకు మీద నీటి చందాన సంసారమునంటీఅంటక జీవించుచూ,శక్తిని ఉపాసించి యోగసాధన చేసి తరించమన్నారు పెద్దలు. అంటే జనజీవనానికి ధనం కావాలి.





ఆ ధనాన్ని న్యాయమార్గమున కష్టించి ఆర్జించాలి. కానీ నేరాలు, ఘోరాలు, మోసాలు చేసి జీవించరాదు. భార్యను సహధర్మచారిణిగా స్వీకరించి ఆమెకై తపించరాదు. పిల్లలను ప్రేమతోపెంచి పెద్దచేసి ఒక యింటివారిని చేయాలిగానీ, వారిపై ఆశలు, అతిప్రేమను పెంచుకోరాదు. భవసాగరం దాటుటకు శరీరం కావాలి, గానీ దానిపై మమకారం పెంచుకోరాదు. అన్ని విషయములందు తామరాకు నీటిలో ఉండియూ, నీరంటుకోనట్లు ప్రతీవారు సంసారమందుండి, అదే శాశ్వతమని భ్రమించరాదు. ఈ సంసారమనెడు అడవిలో భార్యయే పెద్దవలగాను, పుత్రులే శత్రువులుగాను ధనమే అగ్నిజ్వాలలుగా యున్నది. ఈ ధనమువలన భార్యా,భర్తలు, తండ్రీ కుమారులు, తోడబుట్టినవారు, స్నేహితులు, బంధువులు విరోధులగుచున్నారు. అజ్ఞానులు అశాశ్వతమగు ధనముకై తాపత్రయ పడుచున్నారు కానీ సత్యము శాశ్వతమగు పరమాత్మను పొందగోరకున్నారు. జ్ఞాని తన స్వజన సౌఖ్యముకై పాటుబడక తన ప్రాణ ప్రయాణమునకు ముక్తి పొందు సాధనలు చేయుచూ, ఈ క్షణమో, కొంతసేపటికో, నేడో రేపో, శరీరము నశించుట తథ్యమని తలంచి మోక్షసాధనకై నిరంతరం యోగసాధనలో ఉండాలి.

**శిష్యుడు** : మానవజీవితములో మానవులెట్లు ప్రవర్తించిన శ్రేష్టులగుదురు గురుదేవా!

**గురువు** : ఆహార నిద్ర మైధునాదులతో నాలుగు కాళ్ళ జంతువులవలే జీవించువారికంటే, విగ్రహారాధన చేయువారు శ్రేష్టులు. వీరికంటే నిర్మల బుద్ధిచే పరమాత్మయనెడు పరబ్రహ్మమును మనోవాక్కులచే ఆరాధించువారు శ్రేష్టులు, వీరికంటే అంతరాత్మలోగల భగవంతుని తెలుసుకొని ధ్యానించువారు శ్రేష్టులు, వీరికంటే సత్తు చిత్తూ ఆనందమనెడు యోగము నెరిగి శరీర స్పృహలేక పరమాత్మలో లీనమైయుండువారు శ్రేష్టులు. వీరికంటే తన్ను తాను మరచి బ్రహ్మానందసాగరమున దేలుచూ భావోన్మత్తులై శీతోష్ణములనుగానీ, రాత్రింబవళ్ళను, ఎండ వానలను గమనించక ఉండిన చోటునే యుండు మహనీయులను గమనించి, వారికి ఆహారాదులను సమకూర్చి సంరక్షించువారే శ్రేష్టులు.

**శిష్యుడు** : గురుదేవా! యిట్టివారికి స్నాన సంధ్యాదులతో పనిలేదా స్వామీ.

**గురువు** : ఏ జ్ఞానముచే జనన మరణాదులనెడు సముద్రమును దాటి మోక్షమనెడి దరిచేరుచున్నారో, ఆ జ్ఞానమే వారికి తీర్థము. జ్ఞానులకు గంగాజలము తీర్థము కాజాలదు. జనులెల్లరు జలముచే దేహశుద్ధిచేసుకొనుచున్ననూ, వారి మనసు, బుద్ధి, జీవాత్మ ఈ జలముతో శుద్ధి కాజాలవు. జ్ఞానులకు జ్ఞానతీర్థస్నానము ఆత్మను పరమాత్మ యందుంచుటయే.

3. **ధ్యానము:** అఖిలాండకోటి బ్రహ్మాండములను తృటిలో సృజించి, పోషించి, సంహరింప సమర్ధుడైన లీలా నాటకసూత్రధారియగు విరాట్ విశ్వరూపుని, అనంతకోటి నామములతో స్థిరచిత్తులై జపించుటయే ధ్యానమందురు ప్లహ్లోదుడు. సదాస్మరించుట.

4. **పాదసేవన:** సృష్టికర్తను సగుణరూపునిగా తలంచి ఆయనదివ్య పాదారవిందములందు హృదయము నర్పించి పూజించుటయే పాదసేవయందురు. భార్గవి(లక్ష్మీదేవి)

5. **అర్చనము:** భగవంతుని రూపమునుగానీ యంత్రమునుగానీ కలశమును గానీ అందు సాక్షాత్ పరబ్రహ్మయున్నట్లు భావించి మంత్రోచ్చాటనతో కుంకుమ, పూలు, అక్షతలు, పంచామృతములతో పూజించుటయే అర్చనయందురు. పృధుడు

6. **వందనమనగా:** భగవంతుని దివ్యమంగళ రూపును విగ్రహమందుగానీ చిత్రపటమందు గానీ చూచినంతనే అమితభక్తితో శిరస్సాష్టాంగ దండ ప్రమాణములు చేయుటయే వందనము. అక్రూరుడు

7. **దాస్యమనగా:** వందనముగావించిన వెంటనే భయభక్తులతో అనేక కోటి బ్రహ్మాండ నాయకా ఆది మధ్యాంతరహితా। అనంతావతారా। శరణాగతవత్సలా। నీవు రక్షకుడవు నేను నీ పాదదాసుడను. అజ్ఞానముతో తెలిసీ తెలియక నేను చేసిన తప్పులను క్షమించి, రక్షించమని మనసులోని భగవంతుని అనంతావతారములను ఊహించుకొనుచూ స్థిరచిత్తుడై యుండుట. గరుత్మంతుడు.

8. **సఖ్యమనగా:** యిహలోక సౌఖ్యములయందు ధనేషణ, ధారేషణ, పుత్రేషణలయందు కోరికలేక శాశ్వతుడగు పరబ్రహ్మయందు అత్యంత భక్తి శ్రద్ధలతో నుండుట. అర్జునుడు.

9. **నివేదనయనగా:** భగవంతునియందు మనసు లయమొనర్చి మరియే యితర విషయములందు ఆలోచనలు లేక నిర్వికల్పుడై యుండుట నిశ్చలుడై తదేక ధ్యానముతో తన్మయత్వము పొందుటయే నివేదన. గోపికలు ఆత్మనివేదనముచే

**శిష్యుడు** : గురుదేవా! జ్ఞానులకు, బ్రహ్మజ్ఞానులకు గల పూజాభేదములు వివరించండి

**గురువు** :భక్తులు, **పూజారులు** చేయు దైవారాధన **ముముక్షువులు** ఆచరించునది

| | **జ్ఞానపూజా విధానము** | | **సుజ్ఞాన పూజా విధానము** |
|---|---|---|---|
| 1. | తపోనిష్ట వహించుట | – | యిహభోగములందనాసక్తులై యుండుట |
| 2. | ధ్యాన నిమగ్నుడై యుండుట | – | ఏఆలోచనలు లేక నిశ్చింతగాయుండుట |
| 3. | పద్మాసనాశీనుడైయుండుట | – | వివేకముగా యుండుట |
| 4. | పాదములు కడుగుట | – | స్థిరమగు మనోభావముతో నుండుట |
| 5. | హస్తములు కడుగుట | – | మనస్సును కదలనీయక యుంచుట |





| | | | |
|---|---|---|---|
| 6. | స్నానముచేయుట | – | ఎల్లపుడూ జ్ఞానాపేక్షతో యుండుట |
| 7. | గంధాలంకరణ చేయుట | – | సృష్టిలోనిసమస్తమూ బ్రహ్మముగా భావించుట |
| 8. | అక్షత సమర్పణ చేయుట | – | అపరోక్షదృష్టియే (అంతర్‌దృష్టి) |
| 9 | పుష్పపూజ చేయుట | – | ఆత్మసందర్శనము (స్వస్వరూపము గాంచుట) |
| 10. | ధూపమేయుట | – | చిత్తమును స్వాధీనపరచుకొనుట |
| 11. | దీపము వెలిగించుట | – | బ్రహ్మజ్ఞాన ప్రకాశముతో యుండుట |
| 12. | ప్రసాదము స్వీకరించుట | – | సచ్చిదానందముతో యుండుట |
| 13. | ప్రదక్షిణచేయుట | – | ఎలాంటి సంకల్పములు లేకుండుట |
| 14. | పాదాభివందనము చేయుట | – | అహాన్నిస్వాధీనపరచుకొనుట |
| 15. | మౌనదీక్షతో నుండుట | – | సదానిష్టతో నుండుట |
| 16. | సంపూర్ణపూజ చేయుట | – | ఎల్లకాలములందు సంతోషముగా యుండుట. |

**పద్యం** : యింద్రియంబుల విషయముల్ విపులముగ। పరుగులెత్తంగనీయక పట్టినిలిపి
తనకుస్వాధీనముగజేసుకొనుట నిదియె। యజ్ఞమననొప్పుబుషిమతమిదియెవత్సా॥

**శిష్యుడు** : గురుదేవా! ఈ స్థితికి రావలెనన్న ఎలాంటి సాధనలు చేయాలి స్వామీ!

**గురువు** : సాధకులు అహంకారాన్ని లజ్జను వీడి, అశ్వము, వరాహము, గోవు, గాడిద, కుక్క, నక్క మొదలగు సర్వజంతువులందు, పరమాత్మ జ్యోతిస్వరూపంగా యున్నాడని తలంచి సమస్త జీవులను భగవంతుని ప్రతిరూపముగా భావించి, ఏ జీవరాశియందు హీనభావము లేకుండా సంచరించుతూ వాటిని ఆపదలందు ఆదుకొనుచూ, సదా భగవన్నామస్మరణ చేయుటయే అనన్య భక్తియందురు. యింక చివరిగా అనంతుడగు పరమాత్మ చతుర్ధశ భువనములందునూ, సర్వప్రాణులయందునూ ఆత్మస్వరూపంబుగా నున్నాడని ఎరింగి, భ్రూమధ్యన దృష్టి నిలిపి జ్యోతిస్వరూపుని నేత్రపర్వముగా తిలకించుచూ, తన్మయత్వమునొందుటయే ఏకాంతస్థితియందురు. యిలా సాధనలు చేయాలి. లేకున్నపాపఫలితముల నొందెదరు.

**శిష్యుడు:** మానవులకు సంప్రాప్తించు పంచ మహాపాతకము లెవ్వి స్వామీ?

**గురువు** : 1. బ్రహ్మహత్య, 2. మత్తుపదార్ధములు సేవించుట, 3. బంగారమును దొంగిలించుట, 4. గురు భార్యను పొందుట, 5. యిట్టివారితో కలిసి స్నేహము చేయుట.

**శిష్యుడు** : యోగసాధనలో పొందు స్థితులేమేమి గురుదేవా! ముక్తి యనగానేమి?సమాధి యనగానేమి?సచ్చిదానందమనగానేమి?

**గురువు** : **ముక్తియనగా-** అన్ని బంధములనుండి విడిపడుటయే ముక్తియందురు సమాధియనగా- జీవాత్మను పరమాత్మతో కలుపుట సమాధియందురు. సచ్చిదానమం మనగా- సత్ నశింపక అన్ని కాలములందు ఉండునది. చిత్‌యనగా- స్వప్రకా జ్ఞాన స్వరూపముగలది. ఆనందము- నిరంతర సుఖమునిచ్చునది యగు పరబ్రహ్మ స్వరూపము, మనస్సు సంసారమునకు కారణమైనది, యిది పరబ్రహ్మమందు లీనమైతేనేగానీ, ముక్తిలేదు. **ఆకాశము** : శబ్ద సహితము, **పరబ్రహ్మము** : శబ్ద రహితము

**శిష్యుడు:** గురుదేవా! యోగసాధనకు ఆటంకము లెవ్వి స్వామీ?

**గురువు** : **అవిద్య** : సత్వరజో, తమో గుణత్రయాత్మకము. **బ్రహ్మము** : అవిద్యవలన స గుణబ్రహ్మంబై ఐదువిధములుగానున్నదని చెప్పుదురు.

1. **శుద్ధచైతన్యము** - పరమాత్మ 2. **మాయా విచ్చిన చైతన్యము** - ఈశ్వరుడు. 3 **అంతఃకరణ విచ్ఛిన్న చైతన్యము**- జీవుడు 4. **మృత్యు విచ్ఛిన్న చైతన్యము**- మహదహంకారము, **5.విషయవిచ్ఛిన్న చైతన్యము**- నిర్గుణ బ్రహ్మము, **(సగుణ నిర్గుణ విలక్షణ** బ్రహ్మం- నిప్రృతి యోగికము-) **వాసనత్రయములు,** 1. శాస్త్రవాసన 2 లోకవాసన 3. దేహవాసన (వీటి వివరాలు 80వ పేజీలో గలవు.)?

**శిష్యుడు** : మహా వాక్యములు వీటినివివరంగా తెలుపండిస్వామీ!

**గురువు : మహావాక్యములు 4 శ్రద్ధగా విని విషయమును గ్రహించు శిష్యా.**

1. **ప్రజ్ఞాన బ్రహ్మ:** సమస్త భూతములందునూ అంతరాత్మగా నుండు వివేకమే ప్రజ్ఞానము ఆ ప్రజ్ఞానము పరబ్రహ్మ స్వరూపమేగానీ వేరుగాదు. యిది **ఋగ్వేదవాక్యము.** (జాగ్రదవస్త జీవుల స్థూల శరీరము దీనినే అన్నమయ కోశమందురు.

2. **అహం బ్రహ్మోస్మి** : నేను అనెడి అహంభావముపోయి పరబ్రహ్మమందైక్య మగు చున్నాను. యిది **యజుర్వేదవాక్యము.** యిది (స్వప్నావస్థ) దీనినే సూక్ష్మశరీర మందురు దీనినే ప్రాణమయ కోశమందురు.

3. **తత్వమసి** : ఆ పరబ్రహ్మ స్వరూపము దేహేంద్రియాదులకు అతీతమై సాక్షీభూతమైన చైతన్యమగు నీవు అయితివి. యిది **సామవేదవాక్యము.** (సుషుప్త్యవస్థ). కారణ శరీరము దీనినే ఆనందమయ కోశము అందురు.





4. **అయమాత్మ బ్రహ్మ** : స్వప్రకాశమై నిత్యమై అపరోక్షమైయుండు ఈ ఆత్మ స్వరూపమే పరబ్రహ్మమయినది. యిది **అధర్వణవేదవాక్యము.** (తుర్యావస్థతో) కూడిన మహాకారణ శరీరము దీనినే విజ్ఞానమయకోశమందురు.

**సర్వంఖల్విదం బ్రహ్మ** : సమస్తము బ్రహ్మస్వరూపము శరీర రహితము **ప్రణవవేదవాక్యము** మనోమయ కోశము (తుర్యాతీతము) పంచకోశ రహితము.

**శిష్యుడు** : గురువా! అమనస్కయోగమనగా ఏమిటో తెలుపండి స్వామీ

**అమనస్క యోగము**

**గురువు** : శిష్యా అమనస్కయోగమన గా మనోలయము అనగా మనసు లేకుండుట. అనగా సర్వకాల సర్వావస్థలందు మనసును పరబ్రహ్మయందైక్య మగుట "అట్లు మనసుకు వృత్తిరహితము కావలయును గానీ", పశువులవలే కందమూలాదులు భక్షించినను, సర్పమువలే వాయుభక్షణము చేసినను గానీ, గానుగ చుట్టి వచ్చు ఎద్దువలే నిత్యమూ దేవాలయములందు ప్రదక్షిణలు చేసినను, తాబేలు వలే విషయములో బడనివ్వక యింద్రియములు నిలిపినను, గబ్బిలమువలే తల్లక్రిందులుగ తపస్సుచేసినను, పందికొక్కువలే గుహలలో యుండినను, మర్రియూడలవలే జడలు దాల్చినను ముక్తిలేదు. **వీటివలన అమనస్కంబుగాదు.** అమనస్కంబుగానిదే పరబ్రహ్మమందైక్యముగా నేరదు. హంసనాద బిందు కళలతో మనఃప్రాణంబులయంబగుయవస్థతురీయ్యంబనియు, ఉన్మనియనియు, అమనస్కంబనియు, నిర్వికల్పసమాధియనియు చెప్పుదురు. రేచక పూర్ణాత్మకమైన హంస మంత్రమును రేయింబవలు తదేకనిష్ఠతో ధ్యానించగా, బుద్ధి స్థిరంగా యుండును. దశవిధనాదములు వినగా చివరికి ప్రణవనాదము వినబడును. మనోలక్ష్యములచే స్వయంజ్యోతి కనబడును. రెండు ఝాములు (6గం॥) తదేక నిష్ఠతో నాదబిందు కళలను ధ్యానింపగా తన్మయత్వంగలుగును. మనసు నశించును. యిదియే **అమనస్కము.** సాంఖ్యతారక యోగోపాసకులకు మనశ్శుద్ధియు, పరబ్రహ్మస్వరూప నిర్ణయమును లభించినట్లు- అమనస్క నిష్ఠగలవారికి నిరతిశయ బ్రహ్మానందము కలుగును. అనాహతమందు ఘంటా శబ్దము పుట్టును. ఆ ధ్వనియందు వెలుగును, ఆ వెలుగు నందు మనస్సు యున్నది. మనోలీనమైనవారికి ముక్తి కలుగును. దీనినే అమనస్క మందురు. చూపు, చూచువాడు, చూడబడునది యనుమూడును, విశ్రాంతిబొందుస్థలము, అనగా యివేమీ లేనిచోటుననే మనసు నిలుపవలెనుగానీ, భ్రూమధ్యయందు మనసు

నిలుపరాదు. అభ్యాసకులు దృష్టి భ్రూమధ్యయందే నిలిపి క్రమక్రమముగా నిలకడ చిక్కిన పిదప ఆ ప్రదేశమును వదిలి పరబ్రహ్మయందే మనసు నిలుపవలెను. యిదియే అమనస్కరాజయోగ లక్షణము. అచలమన్ననూ, పరిపూర్ణమన్ననూ, సచ్చిదానందమన్ననూ, పరబ్రహ్మమన్ననూ, మాటల భేదమేగానీ వేరేమియూగాదు. నిర్గుణ సాక్షాత్కార విరాట్ పరబ్రహ్మ స్వరూపమునకే, అచలమనియూ, పరిపూర్ణమనియు, సచ్చిదానందమనియు, పరబ్రహ్మమనియు చెప్పుదురు. యిది పురుషులకు "స్త్రీలకు పాతివ్రత్యమే భూషణము". పాతివ్రత్యము వలన యిహలోక పరలోకములయందు సన్మానింపబడుదురేగానీ, వారికి ముక్తిరాదు. స్త్రీలను అబలలనియు, అజ్ఞానులనియు, తలంచవలదు. స్త్రీలకు ఏకాగ్రత ఎక్కువనుండును గనుక పరబ్రహ్మమును యోగసాధనచే అతి సూక్ష్మముగా వారు తెలుసుకొందురు.

**శిష్యుడు** : గురుదేవా! యోగసంబంధ విషయములు, యిందలి మర్మములు తెలియజేయండి.

**గురువు** : యోగమనగా మానవాత్మకు, పరమాత్మకును, నీటికుండయందలి ఆకాశమునకు, మహాకాశమునకు భేదంలేనట్లుగా, అనగా మనస్సును అనేకరీతులుగా సంచరింపనీయక తనయందే లగ్నం చేసుకొనుట, యింద్రియములను వశపరచుకొనే చిత్తమును పరబ్రహ్మయందు లయింపజేయుటయే యోగము. నిత్యమూ మనము దేనితో యిహలోకమందలి సమస్త వస్తువులను చూచుచుందుమో, అట్టి నేత్రములయొక్క చూపునకు యిహలోక దృష్టిని తప్పించి, తనను తాను చూచుకొనుటనేర్చిన అదివరకు కనబడు వస్తువులెల్లనూ కానరావు. దీనినే అంతర్ముఖ వ్యాప్తియని చెప్పుదురు. అట్లు చూపెక్కడ లీనమగునో అచటే మనస్సు సైతము లీనమగును, చూపు మనస్సు ఎక్కడ లీనమగునో అచ్చటనే హంస స్వరూపముగ నుండెడి వాయువు లీనమగును. అచ్చటనే మనోమారుతములు లయమగుచున్నవి.

**శిష్యుడు** : యిట్టి యోగాభ్యాసమునకు ఎలాంటి ఆసనములు ఏఏ ప్రదేశాలు అనుకూలమో తెలుపండి గురుదేవా!

**గురువు** : యోగాభ్యాసము చేయువారు ప్రశాంత వాతావరణ ప్రదేశములందు, గుహలయందుగానీ, జనసంచారము, దుర్వాసనయు, నల్లులు, చీమలు, దోమలు, మిట్టపల్లములునూ లేని విశాలమగు సమ భూమియందు జింకచర్మము, దర్భాసనము





పరచుకొని దానిపై వస్త్రములేసుకుని స్థిరచిత్తముతో పద్మాసనముగానీ, తన శరీరము సహకరించిన ఏ యితర ఆసనమైననూ వేసుకుని, శరీరము నిటారుగా ఉంచి, మెడ కొంచెం క్రిందకు వంచి, ఏ ఆలోచనలు లేక, తన గురువు నుండి ఉపదేశం పొందిన మంత్రమును తదేక ధ్యాసతో జపించి సిద్ధింపజేసుకోవలయును. తనకుగల దుర్గుణములను, ముఖ్యంగా కోపమును దూరంగా విడువవలెను. కారము, ఉప్పు మొదలగు తామస పదార్థములను తినక సాత్వికాహారమును మితముగా భుజింపుచూ, మితనిద్రతో నుంటూ, మొదట్లో ఏ ఆసనమందైననూ ఒక గంట కూర్చుండుటకు అభ్యాసం చేస్తూ, క్రమేపీ సమయాన్ని పెంచుకుంటూ, కనీసం (1ఝాము) 3 గంటలైనా కూర్చోగలగాలి.

శ్లో॥ నాత్యశ్నస్తుయోగో స్తినచైకాంతమనశ్నతఃనచాతి స్వప్నశీలస్యజాగ్రతోనైన చార్జున॥
భగద్గీత 6వ అధ్యాయములోచెప్పినట్లుగా
ఈ యోగసాధన తిండిపోతుకు,ఉపవాసములు చేయువానికి,అతినిద్రపోవువానికి,అసలు నిద్రపోనివారికి,భక్తివిశ్వాసములు లేనివానికి సిద్ధించదు. ఉపదేశించరాదు.

**శిష్యుడు** : గురుదేవా! సాత్విక ఆహారమంటే ఎలాంటివి భుజించాలి స్వామీ.

**గురువు** : సాత్విక ఆహారము తేనె, పాలు, నెయ్యి, మినుములు, గోధుమలు, పెసలు, యివి ఆయుర్వృద్ధినిచ్చి శరీరానికి శక్తిని, ఆరోగ్యమును, సుఖమును, సప్తధాతువృద్ధిని, విజ్ఞానాన్ని కలిగించుతాయి. యింకా రాజస ఆహారమగు కారము, పులుపు, ఉప్పు, వగరు,చేదు యివి శరీరానికి వేడిని పెంచి కామక్రోధాలను అభివృద్ధి చేయును.

**శిష్యుడు** : యోగాభ్యాస సమయాలను తెలుపండి స్వామీ!

**గురువు** : యోగాభ్యాసము భోజనము అయిన వెంటనే చేయరాదు. తెల్లవారుజామున ప్రశస్తము.

**శిష్యుడు** : గురుదేవా! మానవశరీరములో పరమాత్మ ఏఏ స్థానాల్లో ఉన్నారో తెలుపండి స్వామీ!

**గురువు** : 1. స్థూలశరీరమందు రొమ్మెముకకు వీణాదండమునకు మధ్యన వ్రేలాడు మాంసఖండమందు పరమాత్మ యుండును.

2. సూక్ష్మశరీరమున నేత్రస్థానమందు పరమాత్మ యుండును.

3. కారణశరీరమున దౌడలమధ్య వ్రేలాడు మాంస ఖండమున పరమాత్మ యుండును.

4. మహాకారణ శరీరమున కపాలమందలి సహస్రారచక్రమున పరమాత్మ యుండును.
5. శరీర రహితమున సర్వవ్యాపకమై అంతర్బాహ్యములయందు సర్వత్రా నిండి, నిబిడీకృతమై పరమాత్మ యుండును.

రెండు దవడల మధ్య వ్రేలాడు మృదువగు మాంసఖండమునుండి యోగానుభవము గలవారలకు, సుధ (అమృతము) స్రవించుచుండును. ఆ సుధాపానముతో నిరంతర అనుభూతి పొందినవారికే తెలియునుగాన యిది పరమాత్మ స్థానముగా నెంచబడినది.

**శిష్యుడు** : గురుదేవా! ఎన్ని రకముల గురువులున్నారో వారి బోధలేమిటో తెలుపండి స్వామీ!

**గురువు** : లోకమందు 8 రకముల గురువులు కలరు. వారి బోధ లెట్లుండుననిన-

1. **బోధకగురువు:** యోగసంబంధ గ్రంథములందలి విషయాలను బోధించును.
2. **వేదక గురువు:** ఉపనిషత్తులందలి విషయాలను బోధించును.
3. **నిషిద్ధ గురువు:** తనకు ధనము వచ్చు మార్గమాలోచించి బోధించును.
4. **కామ్యక గురువు:** పాపపుణ్యములు జీవికి చెందు విషయములను బోధించును.
5. **సూచక గురువు:** ఆత్మాఽనాత్మల విషయములను బోధించును.
6. **వాచకగురువు:** వైరాగ్య విషయములను బోధించును.
7. **కారణగురువు:** జీవన్ముక్తి విషయములు శిష్యునకు బోధించి పరిపూర్ణుని జేయును.
8. **విహితగురువు:** నిరాలంబమును (నిరాకార విషయములను) బోధించును.

శిష్యా! మానవులు పూర్వజన్మ సుకృతముచే ఎవరికి చెందవలసినవి వారు గురుకృపచే పొందుదురు. మోక్షప్రాప్తిని పొందగోరువారు సంసారజలధిలో ముక్కుమూసుకుని మునుగక ఆ మహా సంసార సముద్రము దాటుటకు ఈదుచూ ఒడ్డుకు చేరినటుల, యింద్రియభ్రాంతులనణచి సంసారాన్ని వదిలిన మహనీయులు మోక్షాన్ని పొందిరి.

**శిష్యుడు** : గురుదేవా! సామాన్య మానవుని మొదలు చక్రవర్తులవరకూ గల యోగసాధన లెట్లుండును?

**గురువు** : శిష్యా మోక్షాపేక్షులగు చక్రవర్తులు నగరాన్ని వీడి అడవులందలి తాపసులను చేరారు. రాజాధిరాజులు సైతమూ ఆశ్రమవాసులగు గురువుల దరి చేరారు. అడవులందలి ఋషులు జపతపములనాశ్రయించి (ఆచరించి) మోక్షాన్ని పొందుటకు జనారణ్యమును వీడి మహారణ్యములను చేరిరి. నిరుపేదలు సర్వసంపదలు గల మానవులు గురుపాదం పట్టి నిత్యమూ వారి పాదసేవ చేయకపోతే ధనేషణ, ధారేషణ, పుత్రేషణలు ఎలా నశిస్తాయి? గురుపాదసేవ చేయనివారికి ఈషణత్రయములు, అరిషడ్వర్గములు వదలక పట్టి ఉంటాయిగదా!





గురుసేవ చేయకుంటే, మనసు మోక్షాపేక్ష నాశిస్తున్నా, బుద్ధి స్థిరంలేక కుక్కబుద్ధివలే ఉంటుంది గానీ మోక్షాన్ని పొందజాలదు సుమా!

**శిష్యుడు** : గురుదేవా! ఈ లోకంలోని జనులు ఉత్తములు, మధ్యములు, అధములుగా జన్మించుటకు కారణమేమి స్వామీ.?ఎట్లు పిండోత్పత్తి యగును.

## పిండోత్పత్తి క్రమము

**గురువు** : ఈ ప్రపంచమున స్త్రీ పురుషులు పరస్పర ఆకర్షణతో వ్యామోహంతో చేయు కామక్రీడలో ఋతు సమయమునందు స్త్రీ గర్భాశయమునందు శుక్లము ప్రవేశించి, అండముతోచేరి గర్భము వచ్చును. స్వాధిష్ఠానచక్రమందలి బ్రహ్మశరీరమందలి అవయవములను అంగములను ఏర్పరచును. తల్లిదండ్రుల రూపములతో జీవితానుగత జన్మలో చేసుకున్న కర్మలను అనుభవించుటకు తగు స్థితిగతులను, దేహారోగ్యములను, భోగభాగ్యములను, తెలివితేటలను, బంధుమిత్రాదులను, పరిసర ప్రాంతములను సృష్టికర్త సమకూర్చును. తల్లిదండ్రుల శుక్లశోణితములు కలసి రోజు రోజుకూ వృద్ధి చెందుతూ బంతి ఆకారముగానుండి 5 రోజులకు నీటిబుగ్గయగును. 10 దినములకు నెత్తురై 15 దినములకు మాంసపుముద్దయగును. 20 దినములకు గట్టిపడి 25 రోజులకు తలపొట్ట తయారగును. నెలచివరిలో మాయ ఏర్పడును. రెండవమాసములో వక్షము, 3వ మాసములో అవయవములు, 4వ మాసములో సప్తధాతువులను 5వమాసములో వెంట్రుకలు వచ్చును. 6వ మాసములో అవయవములు వేటికవి విడివడి వేరగును. 7వ మాసములో ప్రాణము, 8వ మాసములో శిశువుకు జ్ఞానోదయము గలిగి మొదటగా జననీ జనకులు మోహావేశముతో చేసిన రతిక్రీడ, తాను గతజన్మలో చేసిన కర్మ ఫలములననుభవించుటకై యిలా జన్మించుతున్నానని గ్రహించి, ఎవరు చేసుకున్న కర్మఫలము వారనుభవించక తప్పదనుకొని సృష్టికర్తయగు **విరాట్ విశ్వబ్రహ్మమును** ప్రార్థిస్తూ, నిరంజన!, నిర్వికార!, నిష్కళంక!, నిరుపద్రవ!, నిరామయా!, నిస్సంగ!, నిష్ప్రపంచా!, నిరాకారా!, నిరీశ్వరా!, నిరాభాసా!, స్వప్రకాశా!, మహాదేవా!, దీనదయాపరా!,దివ్యరూపా!, అనంతా!, ఆత్మానందా!, అమోఘా!, అతులితా!, ఆది మధ్యాంత శూన్యా!,అభవా!, అనాది పురుషా!,ఆర్తజనరక్షకా!, పరమపావనా!, వేదాంతమయా!, విశాలా!, వినోదా!, అజితా!, అచలా!, అవ్యక్తా! అఘోరా! విరాడ్రూపా! విశ్వకర్తా! విశ్వపాలా! విశ్వా! విశ్వసృజనా! విశ్వగోళా! విశ్వహృదయా! విశ్వకర్మా!

విశ్వబ్రహ్మా! ఆపదోద్ధారకా! యిలా అనేక విధములుగా ప్రార్థించుచూ, యిటుల అనేక జన్మంబులనెత్తితిని, యిలా ఈ జన్మంబులు అనేకముగా నెత్తుచూ, ఆగామి సంచిత ప్రారబ్ధములననుభవించుచున్నాను. యింక నాయందు దయయుంచి, నన్ను కరుణించి, నీ కటాక్ష వీక్షణలతో ఈ గర్భమందలి నరకములనుబాపి ముక్తిమార్గంబు జూపరావే, నను బ్రోవరావే యనుచు అనేకవిధంబుల మహాదేవుండగు విశ్వబ్రహ్మను ప్రార్థింపుచూ, తల్లిగర్భమందుట తనకు నరకంబనియు, తల్లి తనను మోయలేక బాధపడుచున్నదనియూ, దిగులు నొందుచూ, సుఖదుఃఖరాగద్వేషాదులననుభవించుటకు 9వ మాసమున ప్రసవవేదన గావించి, జననీ గర్భభార విముక్తుండై జన్మించి, దినదినాభివృద్ధి చెందుతూ, తల్లిగర్భమందు తాను భక్తితో చేసిన భగవధ్యానమును మరచి, ప్రకృతి సంబంధమగు ఈషణత్రయాదులలో బడి, పూర్వజ్ఞానమును మరచి గత జన్మకర్మలననుభవించుచున్నారు.

**శిష్యుడు** : గురుదేవా! జీవి జన్మించిన పిదప యిట్టి కర్మలననుభవించవలసిందేనా? జీవన్ముక్తిమార్గములు లేవా? దయతో తెలుపండి స్వామీ! అసలు జ్ఞానులు, అజ్ఞానులు పుట్టుటకు కారణమేమిటి?

**గురువు** : శిష్యా స్త్రీ బహిష్టయైన దినము మొదలు 16 దినములవరకు పిండోత్పత్తి కాలము. బహిష్టయైన1వదినమున రతి సల్పిన అల్పాయువుగలవాడు జన్మించును. 2వ దినంబున కూడిన వ్యాధిగ్రస్తుడు జన్మించును. 3వ దినమున అతిచోరుడు జన్మించును. 4వ దినంబున గర్భము నిలచిన అల్పాయువుగల దరిద్రుడు పుట్టును. 5వ దినమున కూతురు. 6వ దినమున గర్భము నిలిచిన మధ్యమగుణముగల కుమారుడు జన్మించును. 7వ దినంబున పుత్రవతియగు కుమార్తె, 8వ దినమున మహదైశ్వర్య సంపన్నుడగు కుమారుడు, 9వ దినంబున పతివ్రతయగు కుమార్తె, 10వ దినంబున సుగుణుడగు కుమారుడు, 11వ దినంబున అధర్మురాలగు కుమార్తె, 12వ దినంబున పురుషోత్తముడగు కుమారుడు 13వ దినంబున గర్భము నిలిచిన వర్ణ సంకరురాలు, దుర్మార్గురాలగు కూతురు, 14వ దినంబున ధర్మాత్ముడు, కృతజ్ఞుడు, దృఢవ్రతుడు, ఆత్మజ్ఞానియగు పుత్రుడు భూపాలకుడును 15వ దినంబున అధిక సౌభాగ్యము పుత్రులు, ధనము రాజవంశమును పొందు పతివ్రతయగు కూతురు 16వ దినంబున సకల శాస్త్రమహావిద్యా ప్రవీణుడు, జితేంద్రియుడు బ్రహ్మవిద్యాదురంధరుడు సకల జనమిత్రుడునగు కుమారుడు కలుగును. శిష్యా ఋతుకాలమందలి సరి దినములలో గర్భము నిలిచిన పుత్రుడును, బేసి దినములలో గర్భము నిలిచిన కుమార్తెయు పుట్టుదురు.





**శిష్యుడు** : గురుదేవా! తలిదండ్రుల అంశములు జన్మించినవారికి ఏ శరీర భాగము లందుండును

**గురువు** : శిష్యా తండ్రి అంశములు ఎముకలు, మెదడు, వీర్యము. **తల్లి అంశములు నెత్తురు, వెంట్రుకలు, మాంసము ఏర్పడును. గుణములు ఎలా వస్తాయంటే**

| **సంభోగకాలమందు పురుషునికి** | **సంభోగకాలమందు స్త్రీకి** | |
|---|---|---|
| రాజసమెచ్చిన రాజసుండును | రాజసమెచ్చిన | వ్యర్థుండును |
| తామసమెచ్చినతామసుండును | తామసమెచ్చిన | క్రూరుడును |
| సత్వగుణమెచ్చినసాత్వికుండును | సత్వగుణమెచ్చిన | తపః సంపన్నుడును |

ఉదయకాలమందు జన్మించిన సాత్వికుండును, మధ్యాహ్నము జన్మించిన దుష్టప్రవర్తన గలవాడు, అస్తమయ కాలమున జన్మించిన అసుర రూపుడును, రాత్రికాలమున జన్మించిన సకల సామ్రాజ్య సంపదలుగల వాడును, వేకువజామున జన్మించిన దీర్ఘాయుష్మంతు లగువారు జన్మింతురు. సంగమ సమయమున శుక్ల మధికమైన పురుషుడును, శోణితమధికమైన స్త్రీయును, శుక్లశోణితములు సమమైన నపుంసకుడును, గర్భమందు శుక్లశోణితములు వాయువుచే భేదింపబడెనేని యిద్దరులేక ముగ్గురు శిశువులు కలుగుదురు. గర్భవతియైన స్త్రీని 8వ మాసములో రతి సల్పగా గర్భమందలి శిశువు వీర్యమును త్రాగి పాపకర్ముడు, రోగగ్రస్తుడగును. 9వ మాసములో రమించగా పిండము గర్భమునుండి యూడిపడును. గర్భవతియగు స్త్రీకి కుడిప్రక్కన పురుషుడు, ఎడమ ప్రక్కన స్త్రీ శిశువులుందురు.

**శిష్యుడు** : గురుదేవా! బ్రహ్మచర్యమనగా నేమి? అతీత చాతుర్విధ శుశ్రూషలెవ్వి స్వామీ!

**గురువు** : స్త్రీపురుషులు సంతానోత్పత్తికై స్త్రీల ఋతుకాలమందు రతి సల్పుచూ గర్భవతియని తెలిసినప్పటినుండి ప్రసవించిన 3 నెలలవరకూ (మరల ఋతుకాలము వరకూ) సంగమించకుండుటయే బ్రహ్మచర్యము. స్త్రీ బహిష్టయైన 16 దినములు సంగమ సమయము. అలాగాక అన్యదినములందు భార్యనుగూడినా వ్యభిచారమగును. (అన్యస్త్రీని కూడుట వ్యభిచారమందురు)

**చతుర్విధ శిశ్రూషలు :- అతీత పద్ధతి యిది**

**1. స్థాన శిశ్రూష** : జాతి, వంశ ప్రతిష్టయందు అభిమానమును, దేహాభిమానమును విడిచిపెట్టుట పరబ్రహ్మయందు, ప్రణవమునందలి అకార ఉకార మకారములకు

లక్ష్యార్థముగ కన్పడు స్థానమును ఎరుకమరపులులేని యునికితో విచారణ చేయుటయే స్థానశిశ్రూష యందురు.

**2. A. అంగ శిశ్రూష:** సూర్య, చంద్ర బ్రహ్మ విష్ణు రుద్రాదులే కన్నులు మొదలగు దేహ అవయవములని విమర్శించి యెరుగుట **అంగ శిశ్రూష** యందురు.

**2.B .అంగశిశ్రూష** : కామక్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనెడి అంతర్ శత్రువులను, పంచమలములను మనసు దరిజేరనీయకుండుట, అంగశిశ్రూషయందురు

**3.భావశిశ్రూష** : మనసు జడమనియు, తాను మనస్సుకంటే భిన్నుడ ననియు, శరీరమునశించునది గనుక తాను శరీరముకాదనియు, తాను పంచకోశములకు విలక్షుడననియు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, అంతరేంద్రియములనెడి (14) చతుర్థశేంద్రియములకు తాను విలక్షుడై సాక్షిగనుండుదుననియు తలంచుటయే భావ శిశ్రూష. యింకా బ్రహ్మతానని భావించుట భావశిశ్రూష యందురు.

**4. ఆత్మ శిశ్రూష** : భావ శిశ్రూషయందు తాను సాక్షియనియు దానికి భిన్నుడనని తెలుసుకొనుచు ఆత్మ శిశ్రూషయందు తాను సాక్షియనుకొనుటయు, చేయు వృత్తులందు తాను సాక్షిగాదనియు, అఖండ పరిపూర్ణ సచ్చిదానంద స్వరూపమే తాననియు గ్రహించి తాను తానై యుండుటయే ఆత్మశిశ్రూష. ఆత్మకు ఆత్మయే ప్రియమైనటుల కూటస్థ భిన్న పరబ్రహ్మమైన తనయందు తాను తప్పక యుండుటచే ఆత్మశిశ్రూషయందురు. (పంచమలములనగా)

1. **అణవమలము** : పరబ్రహ్మమును తెలుసుకొనవలెనను జ్ఞానమును మరుగు పరుచునది.

2. **కార్మీకమలము** : పెద్దలవలన రహస్యములను వినునపుడు దానియందు బుద్ధి పోనీయనిది

3. **మాయికమలము** : బుద్ధిని, మనసును దట్టమైన అజ్ఞానముతో కప్పియుంచునది.

4. **మాయేయమలము** : జీవునిచే మాయాసంబంధమగు పాపకార్యములు చేయించునది.

5. **తిరోధానమలము** : ఈ జగత్తే సత్యము, బ్రహ్మవిద్యయేమిధ్యయనెడు అజ్ఞానమును కలుగజేసి జననమరణాది దుఃఖముల అనుభవమునకు కారణమైనది.

**శిష్యుడు** : గురుదేవా! సాధకుడు పరిపూర్ణుడు కావలెనన్న ఎట్టి భక్తితో సాధన చేయాలి స్వామీ?

**గురువు** : భక్తివిధానములు 1. శాంతము, 2. దాస్యము, 3. సఖ్యము, 4. వాత్సల్యము, 5. మాధుర్యము.





1. సర్వవిషయములందు సర్వులయందునూ ఉద్రేకపడక నిదానించుటే **శాంతము.**
2. గురువులయందు పెద్దలయందు అనురాగముతో సేవలందించుటయే **దాస్యము.**
3. తనవారు, పరవారు అనుభేదము మనసుకు రానీయకుండా, అందరియందు స్నేహభావముతో నుండుటయే **సఖ్యత**యందురు.
4. సుఖదుఃఖాదులందు సహ్యాఽసహ్యములందును మానావమానములందును యితరులతో ప్రేమాభిమానములతో ప్రవర్తించుయే **వాత్సల్యము.**
5. షడ్రుచులందును, సమస్త పరిస్థితులందును, సకల జీవరాశియందును సమభావముతో నుండుటయే **మాధుర్య**మందురు.

**శిష్యుడు** : గురుదేవా! ఎట్టి ఉపదేశమువలన ఏ యోగము సిద్ధించును స్వామీ!

**గురువు** : హస్తమస్తక సంయోగమనగా మనసును ఊర్ధ్వముఖవ్యాప్తిచేయమని చెప్పుట.

**ఉపదేశము:** మనసు ఊర్ధ్వముఖముగ నిలుపుటకు స్థాననిరూపణ జేసి ఆ విధానము నెరింగించుట.

**ఉపవాసమనగా:** మనసును విషయ సుఖములనుంచి తప్పించి సహస్రారమందుంచుట. (ఆత్మను పరమాత్మతోకలుపుట) దీనికొరకు చేయు యోగసాధనలు రెండు విధములు.

**1. అభ్యాసయోగము:** దీనినే కర్మయోగమనియు ప్రాణాయామమనియు అందురు. ఈ యోగాభ్యాసముచే చిత్త పరిపక్వము కలుగును.

**2. జ్ఞానయోగము** : దీనినే రాజయోగమందురు. చిత్త పరిపక్వముగల వారు దీనిచే ముక్తినొందుదురు. ప్రాణాయామము (3) విధములు. 1. ప్రాకృతము లేక మంత్రయోగము. 2. వైకృతము లేక లయయోగము 3 కుంభకము లేక హఠయోగము. మంత్రయోగములు (4) విధములు 1. అజరూపమగు మంత్రయోగము, 2. జపరూపమగు మంత్రయోగము, 3. క్రియారూపమగు మంత్రయోగము, 4. సగుణరూపమగు మంత్రయోగము.

**శిష్యుడు** : గురుదేవా! ప్రాణాయామముచే కలుగు ఉపయోగములేమిటి స్వామీ!

**గురువు** :శిష్యా ప్రాణాయామములో శ్వాసలు తక్కువగా తీసుకొందురు. దీనివలన దేహారోగ్యము, ఆయుష్షు అభివృద్ధి చెందును. మానవుల జన్మ సమయమునగల నవగ్రహ స్థితిని బట్టి ఆయుః ప్రమాణముండును. యిది సంవత్సరకాలమాన ప్రకారం కాక శ్వాసల లెక్క ప్రకారముండును. సహజంగా మానవులు రోజుకి 21600 శ్వాసలు

నడుచును. యోగసాధనచే శ్వాసను బంధించుటచే వారి సాధనా బింకమును బట్టి రోజుకి తక్కువ శ్వాసలు నడుచుటచే జీవన ప్రమాణాన్ని పెంచుకోవచ్చును. మానవులు ప్రాణాయామము చేసి ఆయుష్షును పెంచుకోకపోగా నిత్యము కర్చు కావలసిన 21600 కంటే ఎక్కువ శ్వాసలు కర్చుపెట్టి ఆయుఃప్రమాణాన్ని తగ్గించుకొనుచున్నాడు. అదెట్లనగా

| శ్వాసతీసుకొనునది | బయటకువదులునది | నష్టమగుశ్వాసలు |
|---|---|---|
| మానవులు ప్రశాంతంగా నున్నపుడు 12 అంగుళాలు | 8 అంగుళాలు | 4 అంగుళాలు |
| మామూలుగా నడుచునపుడు 16 అంగుళాలు | 8 అంగుళాలు | 8 అంగుళాలు |
| చేతిపనులు చేయునపుడు 20 అంగుళాలు | 10అంగుళాలు | 10 అంగుళాలు |
| ఘర్షణ సమయంలో 24 అంగుళాలు | 12 అంగుళాలు | 12 అంగుళాలు |
| నిద్రపోవునపుడు 48 అంగుళాలు | 30 అంగుళాలు | 18 అంగుళాలు |
| పరుగెత్తునపుడు54 అంగుళాలు | 27 అంగుళాలు | 27 అంగుళాలు |
| సంభోగ సమయంలో 64 అంగుళాలు | 24 అంగుళాలు | 40 అంగుళాలు |

మానవులు ఈ విధంగా శ్వాసలు నష్టపోతూ జీవనప్రమాణము తగ్గుచున్నది కావున యోగ సాధనచే శ్వాసలు తగ్గించి ఆరోగ్యాన్ని ఆయుష్షును పెంచుకోవచ్చు శిష్యా!

**ప్రాణాయామము చేయు పద్ధతులు**

పూరకము: (గాలి పీల్చుట) 16 సెకన్లు, కుంభకము (గాలినిలుపుట) 64 సెకన్లు, రేచకము (గాలిని వదులుట) 32 సెకన్లు ఈ నిష్పత్తితో సమయాన్ని పెంచుకొంటూ సెకన్లు, నిముషాలు, గంటలు సాధనచే దినక్రమేణా పెంచుకుని ప్రాణాయామాన్ని సిద్ధించుకోవాలి.





**ఈ సాధనతో కలుగు మానసిక పరిస్తితి** మనము **12 అంగుళాలు శ్వాసను తీసుకుని**

1 అంగుళం శ్వాసను లోపలుంచుకొని 11 అంగుళాల గాలి వదిలిన ఈ ప్రపంచేచ్ఛ తొలగును.

2 అంగుళాల శ్వాసను లోపల ఉంచుకుని 10 అంగుళాల శ్వాసను బయటకు వదిలిన మనసు ఆనందమును పొంది జ్ఞానము కల్గును

3 అంగుళాల శ్వాసను లోపల ఉంచుకుని 9 అంగుళాల శ్వాసను బయటకు వదిలిన వివేకి యగును.

4 అంగుళాల శ్వాసను లోపల ఉంచుకుని 8 అంగుళాల శ్వాసను బయటకు వదిలిన దూర దేశములందలి విషయాలను గ్రహించును.

5 అంగుళముల శ్వాసను లోపల ఉంచుకుని 7 అంగుళాల శ్వాసను బయటకు వదిలిన భూసంబంధ విషయాలు గ్రహించును.

6 అంగుళాల శ్వాసను లోపల ఉంచుకుని 6 అంగుళాల శ్వాసను బయటకు వదిలిన ఆకాశ సంబంధ విషయాలు గ్రహించుదురు.

**12 అంగుళాల శ్వాసను తీసుకుని**

7 అంగుళాల శ్వాసను నిలిపి 5 అంగుళాల శ్వాసను విడిచిన శరీరము కాయసిద్ధి పొందును.

8 అంగుళాల శ్వాసను నిలిపి 4 అంగుళాల శ్వాసను వదిలిన అణిమాదుల సిద్ధి పొందును.

9 అంగుళాల శ్వాసను నిలిపి 3 అంగుళాల శ్వాసను వదిలిన నవఖండములందు సంచరించును.

10 అంగుళాల శ్వాసను నిలిపి 2 అంగుళాల శ్వాసను వదిలిన జీవి ఈ దేహమునుండి వేరొక శరీరములో ప్రవేశించును.

11 అంగుళాల శ్వాసను నిలిపి 1 అంగుళం శ్వాసను వదిలిన ఆత్మ పరమాత్మ యందైక్యమగును.

12 అంగుళాల శ్వాసను పీల్చి ఏమియూ వదలక నిలిపిన ఆ శ్వాసపుట్టినచోటునుండి శరీరమంతయూ తిరుగుచుండును. ఇట్టి సాధన చేయు పరమయోగి మృత్యువును జయించి అన్నపానాదులు లేకుండా అనేక యుగములు యోగనిష్ఠలో చొక్కి యుండును.

**గమనిక** : 12 అంగుళముల కంటే ఎక్కువ శ్వాసలు తీసుకొనువారికి ఆయుక్షీణమగును. కావున యోగాభ్యాసంతో అతి తక్కువ శ్వాసలు తీసుకుని ఆయుష్షును పెంపొందించుకొనవచ్చును. ఆరోగ్యాన్నీ పొందవచ్చును.

**శిష్యుడు** : గురుదేవా! మానవులలో దైవ సంపత్తి అసుర సంపత్తి గలవారి లక్షణములెట్లుండును

**దైవ సంపత్తిగలవారి లక్షణములు:**

**గురువు** : దైవకార్యములు, ధర్మకార్యములు చేయుట, చేయించుట, చేయువారికి సహాయపడుట అదీ సాధ్యముకానిచో చూచి సంతోషించుట **దైవ సంపత్తిగలవారి లక్షణములు:**

**అసుర సంపత్తి గలవారి లక్షణములు**: దైవకార్యములు చెడగొట్టుట, యితరులచే చెడగొట్టించుట, అట్టివారికి సహకరించుట, చెడిన కార్యములు చూచి సంతోషించుట.

**యింకా మానవులలో గల సత్ పురుషులు:**

1 రణమును జయించిన వానిని శూరుడు వీరుడందురు.

2. శాస్త్రములు చదివినవానిని పండితుడందురు. 3. వాక్పటిమ గలవానిని వక్తయందురు. 4. దానములు చేసినంత మాత్రమున దాతకాలేడు. యితరుల అవసరములలో ఆదుకొనువాడే నిజమగు దాతయందురు. 5. యింద్రియములను జయించినవానిని శూరుడందురు. 6. ధర్మాచరణ కలిగియున్నచో పండితుడందురు. 7. యితరుల హితవుకోరువానిని సుగుణసంపన్నుడందురు.

1. దేహేంద్రియముల సౌఖ్యములే గొప్పగా తలచువానిని శూద్రగుణములు కలవాడని, 2. ధనమే గొప్పదని తలంచువానిని వైశ్యగుణములు కలవాడని, 3. యశస్సే (కీర్తి) గొప్పదని తలంచువాడిని క్షత్రియ గుణములు కలవాడని, 4. బ్రహ్మజ్ఞానమే గొప్పదని తలంచువానిని బ్రాహ్మణ గుణములు కలవాడని, 5. భోగమే గొప్పదని తలంచువానిని స్త్రీగుణము కలవాడని, 6. యోగమే గొప్పదనితలంచువానిని పురుష గుణములు కలవాడని అందురు,7. క్షత్రియ గుణములు కలిగినప్పటి నుండి శుభేచ్ఛయు, బ్రహ్మజిజ్ఞాసయు, ముముక్షత్వమున్ను నివృతిమార్గబుద్ధియు గొప్పదను తలంపులు గల్గును. అప్పటినుండి ఆత్మ వికాసమునకు వచ్చుచుండును. యివియే గురుతులు శిష్యా! బ్రహ్మచింతన ఉత్తమమైనది, శాస్త్ర చింతన మధ్యమము, మంత్రచింతన అధమము,





తీర్థయాత్రాపేక్ష అధమాధము, లోక భ్రాంతి కోర్కెలు విషతుల్యము నరక రూపమైయున్నవి. ఈ ప్రకృతిలో వయోవృద్ధులు, ధనవృద్ధులు, విద్యావృద్ధులు వీరందరూ జ్ఞానవృద్ధుని శిష్యులు, సేవకులు అని తెలుసుకో శిష్యా

**శిష్యుడు** : గురుదేవా! దేహమందలి సప్తచక్రముల వివరములు తెలుపండి స్వామీ?

**గురువు** : జీవాత్మ సప్త చక్రములందలి దేవతలను అజపతో అర్చించు క్రమము:-

**1. ఆధార చక్రం** : యిది గుదమూలమున కలదు. పృథ్వీతత్వం ఘ్రాణకారణం, 1 ఘడియ 40 విఘడియలలో 600 జపం జరుగును. దీనికి 4 రేకుల దళములతో పచ్చరంగు గలిగి, 4 దళములలో "వశషస" ఈ అక్షరములుండి మధ్యలో "న" అక్షరముండును. దీనికి గణపతి అధిదేవత, సూర్యోదయం 6 గంటలకైనచో షుమారు 40 నిమిషములలో 600 జపం జరుగును. సాధకుడిది ఆచరించిన అధోముఖంగాయున్న హంస ఊర్ధ్వముఖియై స్వాధిష్టానము జేరును. దీనికి యిచ్ఛాశక్తి అధిదేవత. "భూస్థానం" త్రికోణాకృతి.

**2. స్వాధిష్టాన చక్రం** : యిది మర్మావయవము దగ్గరలో, 6 దళములతో సింధూర వర్ణముతో "బ భ మ య ర ల" ఈ అక్షరముల దళముల మధ్య "మ" అక్షరముండును. దీనికి బ్రహ్మ అధిదేవత షుమారుగా , ఉదయం 6-40 నుండి మధ్యాహ్నం 1-20 వరకూ 6-40 నిమిషముల కాలంలో 6వేల అజపగాయత్రీ జపం జరుగును. సాధకుడు తాను అర్చించిన యిటనుండి హంస మణిపూరకము చేరును. దీనికి క్రియాశక్తి అధిదేవత. గురులింగం చతుష్కోణాకృతి "జలస్థానం"

**3. మణిపూరక చక్రం** : యిది బొడ్డు దగ్గర గలదు. 10 దళములతో కృష్ణవర్ణం గలిగి "డ ఢ ణ త థ ద ధ న ప ఫ" ఈ అక్షరములు దళముల మధ్యన "శి" అక్షరముండును. దీనికి విష్ణువధిదేవత. మధ్యాహ్నం 1-20 నుండి రాత్రి 8 గంటలవరకూ 6-40 ని॥కాలంలో 6వేల హంస గాయత్రి జపము జరుగును. సాధకుడు తానర్చించినయిటనుండి హంస అనాహత చక్రము చేరును. దీనికి జ్ఞానశక్తి అధిదేవత శివలింగం పీఠాకృతి "అగ్నిస్థానం".

**4. అనాహత చక్రం** : యిది హృదయము దగ్గరగలదు. 12 దళములతో సువర్ణఛాయ కలిగి,"క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ" ఈ అక్షరములతో కూడిన దళముల మధ్య

"హ" అక్షరముండును. దీనికి శివుడు అధిపతి. రాత్రి 8 నుండి అర్థరాత్రి 2-40 వరకూ గం॥6-40 ని॥ కాలంలో 6వేల హంస గాయత్రీ జపము జరుగును. సాధకుడు తానర్చించిన హంస యిటనుండి విశుద్ధచక్రమునకు పోవును. దీనికి బీజశక్తి అధిదేవత. చరలింగం లింగాకృతి "వాయుస్థానం"

**5. విశుద్ధ చక్రం** : యిది కంఠస్థానమున గలదు. 16 దళములతో తెల్లని జ్యోతికాంతితో "అ నుండి అః" వరకూ దళములందక్షరములు కలిగి మధ్యలో "య" అక్షరముండును. దీనికి జీవుడధిపతి, అర్థరాత్రి 2-40 నుండి 3-46 వరకూ 1 గంట 6 నిముషాల కాలంలో వేయి పరమహంస జపము జరుగును. సాధకుడు తానాచరించిన యిటనుండి అగ్నేయ చక్రమునకు హంస వెళ్ళును. ప్రసాద లింగము మత్యాకృతి "ఆకాశముద్ర" దీనికి ఆదిశక్తి అధిదేవత.

**6. ఆగ్నేయ చక్రము** : భ్రూమధ్యనగలదు. యిది 2 దళములతో విద్యుల్లతా కాంతితో "హం క్షం" అక్షరములు కలిగియుండును. దీనికి సనారీ విశ్వేశ్వరులు అధిపతి. తెల్లవారుజామున 3-46 నుండి 4-52 నిముషముల వరకూ 1 గంట 6 నిముషముల కాలంలో వేయి పరమహంసల జపము జరుగును. సాధకుడు తానాచరించిన యిటనుండి సహస్రారమునకు హంస పయనించును. మహాలింగం "ప్రకాశముద్ర" సర్వసృష్టిస్థానము దీనికి పరాశక్తి అధిదేవత.

**7. సహస్రార చక్రం** : యిది కపాలమందుగలదు. వేయి దళములతో దేదీప్యమాన ప్రకాశముగలిగి వేయిదళముల మధ్యన "ఓం" అక్షరముండును. దీనికి సకల చరాచర సృష్టికర్త విరాట్ విశ్వకర్మ భగవాన్ అధిపతి. తెల్లవారుఝాము 4-52 నుండి ఉదయం 6 గంటలవరకూ 1 గంట 8 నిముషాల కాలంలో వేయి పరమహంసల జపము జరుగును. సాధకుడు సరిగా ఆచరించినచో అచట దైవసాక్షాత్కారము జరుగును. ఓంకారలింగము "విమల జ్ఞానముద్ర" ప్రణవ స్థానం. ఈ ఏడు చక్రములందు సంచరించువాయువే ప్రాణమందురు. ఈ వాయు సంచారస్తానభేధములచే దశ విధవాయువులగుచున్నవి. దీనికి శ్రీగురుమూర్తి అధిదేవత.

ఈ సప్తకమలాలు వెన్నెముక ఆధారంగా వీణాదండమువలే, గుదస్థానంనుండి కపాలం వరకూ వరుసగా యుండును. వెన్నెముక నడుమరంధ్రమందు 1. సుషుమ్నానాడి కలదు. దీనికి **శివుడధిపతి**. యిది సూర్యమండలం దాకా వచ్చియుండును. దాని చివర





సూక్ష్మమగు రంధ్రముండును అదియే దశమ రంధ్రము, యిందులో సకల చరాచర సృష్టియావత్తూ యుండును. దీనికి కుడిప్రక్కన పింగళి, ఎడమ ప్రక్కన ఇడా నాడీ కలవు. యిది గుదస్థానంనుండి కపాల బ్రహ్మరంధ్రం వరకూ ఉండును. 2.పింగళినాడికి **బ్రహ్మ అధిపతి.** ఈ నాడి మూలాధారంనుండి కపాలపర్యంతము వచ్చి అగ్నేయచక్రమందలి అగ్నిమండలమును వ్యాపించి కుడిముక్కుగుండా వాయువు పోవును. యిడానాడికి **విష్ణువు అధిదేవత.** ఈ నాడి మూలాధారంనుండి కపాలంవరకూ, వచ్చి తాకి అక్కడగల చంద్రమండలం వ్యాపించి తిరిగి ఎడమ ముక్కుగుండా వాయువు పోవును. ఆగ్నేయ చక్రమందు పుట్టిన సకారమునూ, మూలాధారమునందు అపానవాయువుతో పుట్టిన హకారమున్నూ కలిసి "హంస" అనియూ "సోహం" బనియూ ఊర్ధ్వఅధోకుండలుల యందు వ్యాపించుచున్న, ఆధారాది చక్రములందలి అధిదేవతలకు నేటి ఉదయం నుండి మరుచటి ఉదయం వరకు 21600 జపం జీవుడు చేసి దేవతల కర్పణ చేయుచున్నాడు. ఇట్టి రహస్యమును మానవులు కనుగొనలేక, తానాచరించలేక, కాశీ, గయ, ప్రయాగ మొదలగు తీర్థయాత్రలు చేయుచూ, కాలమంతయూ వ్యర్థముగా గడుపుచున్నారు. దీనిచే జీవి ఆడుచున్న బంతివలే క్రిందికి పైకి తిరుగుచూ సుఖదుఃఖములననుభవించు చున్నాడు. సహస్రారమే శబ్దరూపమగువాక్కు, అదే పరంజ్యోతి, అదే యూర్ధ్వకుండలి, అదే అమృత స్థానము. అదే సమస్త సృష్టికీ కారణము, అది మెరుపువలె కనబడి క్షణంలో అదృశ్యమగును. సహస్రారమందే సమస్త సృష్టియున్నది. దీనియందు జీవుడు ప్రవేశించినపుడు ఈ సమస్త మూ చిద్విలాసముగా కనబడును. ఆ స్థితిని బొందిన జీవికి ఏదోషమూ అంటదు. హంసను సహస్రారమును దాటించినచో కపాలమును ఛేదించును అట్టి జీవి పరమాత్మయందైక్య మగును. అట్టి ఊర్ధ్వకుండలిని ప్రవేశింపలేక, అధోకుండలి (మూలాధారం) లోబడి, దారాపుత్రులు తన్నురక్షించెదరని భ్రాంతిచెంది, ఈ దేహమే నేననుకొని, తాపత్రయపడుచుండును. జీవుడు తన దేహమందుగల అమృతమును పానము జేయుదారిగనలేక, తనకంటే వేరైన వస్తువుకలదని, నేర్పుకొలది భక్తికర్మల నాచరించుచూ, షట్కర్మకాండలలో మునిగియుండును. సుధాభాండమునెన్ని సార్లు గంగలో ముంచినను ఎట్లు పవిత్రము కాజాలదో, ఈ దేహమును ఎన్నిసార్లు పవిత్రక్షేత్రములలో ముంచిననూ బాహ్యమగు కర్మ లెన్నిటినాచరించిననూ మోక్షము రాదు. హంస సంచారము చేయించు నేర్పులేక ఆధారమును దాటించిన జీవి నరకములపాలగును. **కృతయుగమున** మనఃశుద్ధి,

త్రేతాయుగమున దృష్టిరూపకం. ద్వాపరయుగమున మంత్రసామర్థ్యం కలియుగమున కరసాధనం కావున మానవులందరూ చేతులతో అన్ని కార్యములు నెరవేర్చుకొనుచున్నారు. యిది యుగధర్మము శిష్యా!

**శిష్యుడు** : గురుదేవా! సిద్ధులమరుగు పదాలను, బ్రహ్మమనగా ఏమిటో తెలుపండి స్వామీ?

**గురువు** : **బ్రహ్మాండ విషయములు**

1. బ్రహ్మమనగా యిది 84 లక్షల జీవరాసులందు జీవమై యున్నది.
2. ఆత్మ, పరమాత్మ, జీవుడు, దేవుడు, సర్వశరీరములందు జ్యోతిరూపుడగు పరమాత్మ చేరుటచే సర్వజీవులు చేతనముతో నున్నవి. ఆ పరమాత్మ తొలగినచో అచేతనములగుచున్నవి. అదియే ప్రణవనాదమగు ఓంకారము.
3. ఓంనాదమందు 1 బిందువ 2 బిందువందు కళ 3 కళయందు అకార, ఉకార, మకారము ఈ మూడును మాతృకళలు కలసి ఓంకారమైనది.వీటికి శక్తులు.
4. జ్ఞానశక్తి,యిచ్ఛాశక్తి,ఆదిశక్తి ఈ త్రిశక్తులకు,
5. రజోగుణం,సత్వగుణం,తమోగుణములు వీటికి గుణములు
6. జాగ్రత, స్వప్న, సుషుప్తి, వీటికి అవస్థలు
7. విశ్వ, తైజస, ప్రాజ్ఞులు వీటికి అధిదేవతలు.
8. అండ, పిండ, బ్రహ్మాండములు వీటికి అండత్రయములు..
9. నాద, బిందు, కళలు, వీటికి కళలు.
10. ఆత్మతత్వం, జీవతత్వం, బ్రహ్మతత్వం, వీటికి తత్వములు.
11. బ్రహ్మానందం, నిర్విషయానందం, విషయానందములు వీటికి ఆనందములు.
12. సత్తు, చిత్తు, ఆనందములు వీటికి సదసత్తులు.
13. జీవుడు, ఈశ్వరుడు, ఆత్మ వీటికి జీవత్రయములు.
14. స్థూలదేహం, సూక్ష్మదేహం,కారణదేహములు వీటికి దేహత్రయములు.
15. ఆధ్యాత్మ, ఆది భౌతిక, ఆది దైవికములు. వీటికి తాపత్రయములు
16. పుణ్యకర్మ, పాపకర్మ, మిశ్రమకర్మ, వీటికి కర్మత్రయములు.
17. భూత, భవిష్యత్, వర్తమానములు వీటికి కాలత్రయములు
18. స్వర్గలోకము, పాతాళలోకము, మర్త్యలోకములు వీటికి లోకములు.





19. సాలోక్య, సామీప్య, సాయుజ్యములు వీటికి పదవులు.
20. విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యాకృతులు, వీటికి ఈశ్వరత్రయములు
21. బాహ్యభక్తి, ఏకాంతభక్తి, అనన్యభక్తి, వీటికి భక్తిత్రయములు.
22. గురుదీక్ష, మంత్రదీక్ష, పాదదీక్ష వీటికి దీక్షాత్రయములు
23. నాభిస్థానము, హృదయస్థానము, త్రికూటస్థానములు వీటికి స్థానములు
24. వామనేత్రం, దక్షిణనేత్రం,నాసాగ్రములు,(త్రికూట స్థానం) వీటికి నేత్రములు
25. అంతర్లక్ష్య, బాహ్యలక్ష్య, అంతరాంతర లక్ష్యములు వీటికి లక్ష్యములు
26. సుజ్ఞాన, విజ్ఞాన, ప్రజ్ఞానములు వీటికి జ్ఞానత్రయములు.
27. సూర్యమండల, చంద్రమండల, అగ్నిమండలములు వీటికి మండల త్రయములు.
28. జీవన్ముక్తి, క్రమముక్తి, విదేహముక్తి, వీటికి ముక్తిత్రయములు
29. ధర్మ, అర్థ, కామములు వీటికి కామత్రయములు
30. సాత్విక, రాజస, తామసములు వీటికి బుద్ధి త్రయములు
31. వసు, రుద్ర, ఆదిత్యులు వీటికి దేవత్రయములు
32. ఐహిక, ఆముష్మిక, వైరాగ్యములు వీటికి విరక్తిత్రయములు.
33. ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతములు వీటికి మతత్రయములు
34. తారకయోగము, సాంఖ్యయోగము, అమనస్కయోగము వీటికి యోగత్రయములు
35. త్వత్పద, త్వంపద,అశిపదములు వీటికి పదత్రయములు.
36. చైతన్యము, చేతనములు, శుద్ధచైతన్యము వీటికి చైతన్యములు.
37. జీవాత్మ, అంతరాత్మ,పరమాత్మలు వీటికి ఆత్మత్రయములు.
38. సవికల్పము, నిర్వికల్పము, నిర్బీజసమాధులు వీటికి సమాధులు.
39. సన్యాసము, గృహస్థము, బ్రహ్మచర్యము వీటి ఆశ్రమములు
40. ద్రష్ట, దర్శన, దృశ్యములు వీటికి లక్ష్యములు
41. వెలిచూపు,లోచూపు, అంతరచూపు వీటికి త్రివిధ దృష్టులు
42. గురుపాదోదకం, గురుప్రసాదం, గురువుచ్ఛిష్టం,(ఎంగిలి) వీటికి త్రివిధ ప్రసాదములు
43. శ్రవణ, మనన,నిధి ధ్యాసములు, వీటికి నిధి ధ్యానములు.
44. సగుణము, నిర్గుణము,శుద్ధనిర్గుణము,వీటికి గుణత్రయములు.

45. సత్యము, శాంతము, మౌనము, వీటికి శాంత త్రయములు.

46. రతి,ఉపరతి, సమరతులు వీటికి రతిత్రయములు.

47. ఆత్మైక్యము, శివజీవైక్యము, జీవబ్రహ్మైక్యము వీటికి ఐక్యత్రయములు.

48. జ్ఞానయోగం, భక్తియోగం, ఆత్మయోగం వీటికి యోగత్రయములు.

49. ఆత్మ, అనాత్మ, కేవలాత్మ వీటికి ఆత్మత్రయములు.

50. సగుణము, నిర్గుణము, శుద్ధ నిర్గుణము వీటికి గుణత్రయములు.

51. వూర్ధ్వరేతస్సు, అధో రేతస్సు, ఆత్మరేతస్సు, వీటికి రేతస్సులు.

52. కూటస్తుడు, సాక్షి, ప్రత్యగాత్మ కూటత్రయములు. (వీటికి పైన త్రయములు లేవు)

**ఈ బాహ్యాంతర త్రిపుటుల కతీతమే పరబ్రహ్మము.**

**వేదాంత డిండిమము**

1. సంచితము, ఆగామి, ఈ రెండు కర్మలు జ్ఞానాగ్నిచే దహించబడుచున్నవి. ప్రారబ్ధము అనుభవించిన పిమ్మట మోక్షము కలుగునని వేదాంత భావము.
2. మనము చేయు కర్మలు చిత్తశుద్ధికొరకు, ఉపాసనలు ఏకాగ్రత కొరకు, మోక్షము కొరకు "బ్రహ్మజ్ఞానాన్ని" పొందుటయని వేదాంత భావము.
3. కర్మలనాచరించినవారు మరల జన్మకు వచ్చుచున్నారు, ఉపాసకులునూ మరల జన్మకు వచ్చుచున్నారు. బ్రహ్మజ్ఞానులు మరల జన్మకురారని వేదాంత భావము.
4. వృధాకర్మలును, వృధా సంభాషణ, వృధా వాదములను వృధా మనస్సునందలి కోర్కెలను విడిచి సత్యమైనది బ్రహ్మమొక్కటేయని ఎరుంగవలెనని వేదాంత భావము.
5. ఆరింటిని చంపి (అరిషడ్వర్గములు) మూడింటిని విడిచి (ఈషణత్రయములు) రెంటిని భేదించి (ఆత్మ, అనాత్మలు) సర్వానికి అతీతమగునది బ్రహ్మము ఒక్కటే యని తెలుసుకొన్నచో మోక్షము పొందవచ్చునని వేదాంత భావము.
6. ఆత్మతెలియని ఎడల జన్మ నిరర్ధకమగును. తెలిసినచో జన్మ సార్ధకమగును. ఆత్మ నెరిగినవానికి ఆత్మ ఎచటనో లేదనునది వేదాంతభావము.
7. ఈ విషయములు గ్రహించు పురుషులకు "సుఖము" అల్పము. క్లేశములు "అనంతము", బ్రహ్మనిష్టులకు సుఖములనంతములని వేదాంతభావము.

**శిష్యుడు** : గురుదేవా! బ్రహ్మాండ విషయములు మరుగు పదములు మీదివ్యశక్తిచేనాకు గోచరింపుడు స్వామీ!





**గురువు** : శిష్యా నీకు జ్ఞానదృష్టి నొసంగుచుంటిని. శ్రద్ధాసక్తుడవై సర్వమూ గమనింపుము.

బ్రహ్మ= రజోగుణము - విష్ణు= సత్వగుణము

రుద్రుడు= తమోగుణము/ - ఈశ్వరుడు= శుద్ధ సత్వగుణము

సదాశివుడు= నిర్గుణుడు - సరస్వతి= భాషా రూపిణి.

లక్ష్మి= సంతోషరూపిణి - పార్వతి= దేహమందున్న శక్తి

అర్ధనారీశ్వరుడు= హంస (రాకపోకలుగల శ్వాస)

కుమారస్వామి= పంచవిషయములతో కూడిన "యెరుక"

గణపతి= జ్ఞానము - వీరభద్రుడు= హంకారము

నందికేశ్వరుడు= ప్రణవము - శివుడు= ఓంకారము

గరుత్మంతుడు= చూపు/ విష్ణు= తెలివి - బ్రహ్మ= దేహ ఎరుక/హంస=కోరిక

వైకుంఠము= ఎప్పటికీ తరగని స్థలము - కైలాసము= భ్రూమధ్యము

కైవల్యము= ఇంద్రియానందము - మేరువ= సహస్రారము

పన్నెండు నదులు= పన్నెండు నాడులు - .శ్రీశైలము= సహస్రారము

చతుస్సముద్రములు= అంతఃకరణచతుష్టయము

శ్రీరంగము= నేత్రమధ్యస్థలము - తిరుపతి= గురువునుతెలుసుకొనుట

కాశి= తన్నుతానెరుంగుట - కాళహస్తి= కాలమును అతిక్రమించుట

జగన్నాథము= స్వప్నభోగము - పృధివి= మూలాధారము

ఉదకము= స్వాధిష్టానము - తేజస్సు, మణిపూరకము

వాయువు= అనాహతము - ఆకాశము= విశుద్ధము

చీకటి= అజ్ఞానము/వెలుగు= జ్ఞానము - పాతాళము= బొడ్డుక్రిందభాగము

స్వర్గలోకము= శిరస్సు - మర్త్యలోకము = హృదయం

నాలుగు వేదములు= నాలుగు గుణములు,= 4 అవస్థలలో ఉండెడినాలుగు భావాలు

షట్‌శాస్త్రములు= పంచవిషయములుతో గల మనః ప్రవృత్తి

అష్టాదశ పురాణములు= లింగదేహము 17 అవయవములు +1 భ్రాంతిన్ని =18

షణ్మతములు= షడృచులు (ఆరురుచులు) - బ్రాహ్మణులు= ఓంకారనాదము,
మంచిశబ్దములు= మంచి గుణములు

రాజులు= అంతఃకరణ చతుష్టయము శూద్రులు= కర్మేంద్రియములు

ఛండాలురు= హీనభ్రమలు తురకలు= అజ్ఞానము, అహంకారమున్ను

సంకరకులములు= అనేక కోరికలు

ఉదయాద్రి= మూలాధారము /హస్తాద్రి= ఆజ్ఞేయము

శింశుమారచక్రము= హంస/ సూర్యుడు= చిత్తైన తాను

చంద్రుడు= గుణస్వరూపమైన తెలివి. కరుణగల మనస్సు

27 నక్షత్రములు= 25 తత్వములు+జ్ఞానాజ్ఞానములతో కూడి నవిన్నూ 27

సప్తమహర్షులు= 7ద్వారములయందు కనబడెడి కళలు

అరుంధతి= సుషుమ్న / చతుర్ముఖ బ్రహ్మ= అంతఃకరణ చతుష్టయము

అరణ్యము= సంసారము/ స్త్రీలు= భ్రాంతులు

పురుషులు= జ్ఞాన,విజ్ఞాన, సుజ్ఞాన, ప్రజ్ఞానములు.

నపుంసకులు= గుణాతీతులు / సంకరులు= తెలిసీ తెలియని గుణములు

పర్వతములు= వక్రభావములు/ కృష్ణుడు=సాక్షి

పంచపాండవులు= పంచ అంతఃకరణములు

అష్టభార్యలు= అష్టప్రకృతులు / గొల్లలు= యింద్రియములు

గోపాలకులు= విషయములు, మంచిని కాపాడువారు

పదహారువేల గోపికలు= జాగృత, స్వప్నములలో జరిగెడి సంకల్పములు

గోవిందుడు= గోపాలకులను సాధించినవాడు, గోవులకు ఆహ్లాదము కూర్చువాడు

ద్వారకా పట్నము= ఆత్మకు, పరమాత్మకూ నడుమనున్నది.

రేపల్లె= యింద్రియగ్రామము

గొల్లలు చల్లలమ్ముట= ఇంద్రియముల విషయ ప్రవర్తనములనుట

వెన్న= నిజజ్ఞానము/పాలు= అభేదము

గురువు= సంవిద్రూపమైన స్వప్రకాశమైన వెలుగు

గురుచరణము= సర్వేంద్రియములయందు విజ్ఞానము

గురు స్వరూపము= సర్వప్రపంచము రూపు

గురుసత్తా= పరమాత్మ/రథము= శరీరము

ముక్తికాంత= సర్వమును విడిచిన ప్రజ్ఞ. ముక్తిని ప్రసాదించునది

క్రింది డెక్క= పృథివి/మీది డెక్క= ఆకాశము





మూడుస్తంభములు= మూడు భూతములు/బండ్లు= కర్మేంద్రియములు

సారధి= రజోగుణము – గుర్రములు= నాలుగు వేదములు

జ్ఞానము = బాణము (నాలుగు భావములు) శక్తి= మాయ

అజ్ఞానము = ధనస్సు – హంస = యింద్రధనస్సు/ బాణము= వూహ

విష్ణుమూర్తి= గురుమూర్తి – యుద్ధముచేసెడివాడు= తాను (శివుడు)

త్రిపురాసురులు=2 కన్నులు, 1.చెవి, – నోటి దంతములు= రాక్షసులు)

ఆయోధ్యాపట్టణం= బ్రహ్మము – యుద్ధము=గెల్చుట

దశరథుడు= పది దిక్కులలో శిరస్సులు గల ఈశ్వరరూపము

ముువ్వురు భార్యలు=మూడుగుణములు – ఆంజనేయులు= మనస్సు

రామలక్ష్మణ భరత శత్రుఘ్న సీతలు = పంచప్రాణములు

అంగదుడు= శరీరమందలి ఎరుక – వాలి= హంస/తార= మాయ

సుగ్రీవుడు= అన్ని పదములకు మూలమైన తెలివి/ జాంబవంతుడు= మాయ

నీలుడు= మరపుగల తెలివి/లంక= అజ్ఞానమ/రావణాసురుడు= దశేంద్రియములభ్రమ

వానరసమూహము= జ్ఞానమందలి అనేక సంకల్పములు

కుంభకర్ణుడు= తమోహంకారము – విభీషణుడు= నిర్భయము

ఇంద్రజిత్తు= ఇంద్రియమరపు – అతికాయుడు= స్వప్న భ్రమ

అశోకవృక్షము= సదాచింత – తాటకి= తంత్రములు చేసెడి తెలివి

మారీచుడు= దుర్గుణము – ఆశలు= ఊహకోరికలు

కొమ్మకు కోటి రాక్షసులు= ఒక్కొక్క యింద్రియమునకు అనేక భ్రమలు

సముద్రము= అవిద్యామాయ – మూలబలము= కామక్రోధాదులు

ప్రధానులు= అభిమానము, స్వతంత్ర భేదము, దూషణలు

మండోదరి= సుబుద్ధి – సింహము= అతికామక్రోధములు

రావణుని సకల సైన్యము= 72వేల నాడులనుండి పుట్టిన మాయా విషయాదులు

లంక కావలివాడు= అనేకవ్యసనములు / యోధానుయోధులు=ఈషణత్రయవాసనలు

వెలుగుబంట్లు= మరణము, మొదలగు భయములు / పాములు= అతి ఆశలు

ఏనుగులు= అష్టమదములు / పెద్దపులి= అసత్యము/ ఒంటెలు= అష్టపాశములు

కుక్కలు= ప్రతీక్షణమూ పడు చిరాకుల/ కాకులు= జీవులు/ తేళ్ళు= సంశయములు

పందులు= దురతిశయములు - మంద్రగబ్బలు= మహాపాతకములు

జెట్టిపోతులు= మనసున ఒకటి, పై కొకటి పలుకుట /గుబ్బములు= అతిమోహములు

గాడిదెలు= తానుపట్టిన కుందేలుకు మూడు కాళ్ళని వాదించుట

దున్నపోతులు= తప్పుని తెలియక చేయునింద/రథములు= దేహములు

పక్షులు= వర్ణాశ్రమ దర్మమగు నియమములు/ దేవుడు= అన్ని దేహములందున్నవాడు

లవణ సముద్రము= సంసార సాగరము/వారధి= గురుబోద/లంకిణి= పాపచిత్తము

ఆంజనేయుని లంకా ప్రవేశము=జ్ఞానము గల మనస్సును పొందుట

రామముద్రిక=ఆత్మసత్యం/ జగం= మిధ్య/ఆంజనేయుని తోక= ప్రణవము

ఆంజనేయుని లంకా యుద్ధము= భక్తిని పొందినమీదట కొన్ని విషయములు నశించి కొన్నిటియందు కలవరపడుట/ తోకకు గుడ్డలు చుట్టుట= ఆవరణములు కమ్ముకొనుట

చమురు= పుణ్యము - కాల్చుట= తారకము ప్రకాశించుట

తోకచల్లార్చుట= అమనస్కము - సంజీవికొండ= గురుపదవి

ఆంజనేయుని యింద్రజిత్ బంధించుట= మొదట తెలివి గలిగి తర్వాత దానిని మరచుట

విభీషణునకు పట్టము గట్టుట= సంసారమందుండి నిష్కళంకుడై యుండుట

సుషేణుడు= ధర్మయుక్తమైన బుద్ధి - దుర్యోధనాది శతకము= దుర్గుణ శతకము

భారతము= అనంతము/ధృతరాష్ట్రుడు= రజోగుణము /సాత్యకి= జ్ఞానసత్యము

పాండురాజు= సత్వగుణము / విదురుడు= తమోగుణము /భీష్ముడు= హంస

పాండవపంచకము= అంతఃకరణ పంచకము/ ద్రౌపది= విద్యామాయ

ద్రోణుడు= ధైర్యము/కృపాచార్యుడు= దయ/కర్ణుడు= విషయము

అశ్వద్ధామ= నిజజ్ఞానపలుకు/అభిమన్యుడు= అభిమానము/శల్యుడు= మూల ఎరుక

దుష్టద్యుమ్నుడు= దుష్టదుర్గుణములను పోగొట్టే జ్ఞానము / ఉత్తరుడు= మాయపలుకు

ద్రౌపది వస్త్రములు విడిపించుట= ఆవరణములు విడుచుట

విరాటరాజు= విరాట్ పురుషుడు - వనవాసము= అజ్ఞానముతో సంచరించుట

శకుని= మాయ/ సంజయుడు= జ్ఞాన యరుక / సర్వమును ఓడుట= సుషుప్తియవస్త

పాచికలు= స్వప్నము జాగ్రదావస్థలు/ అజ్ఞాతవాసము= మరపులోయుండుట

దక్షిణగోగ్రహణము= ఇంద్రియములను స్వాధీనమందుంచుకొనుట

లక్క గృహములో ప్రవేశపెట్టుట= అసత్యములలో ప్రవేశపెట్టుట





పాముల కరిపించుట=అసత్యములను సత్యములుగా చూపుట

విషాన్నము పెట్టుట= ఆశలు పెట్టుటరాజ్యభాగము నివ్వకుండుట(అస్వతంత్రము)

భీముని తండ్రి= వాయువు/ యముడు= కాలము/ దేవేంద్రుడు= ఇంద్రియ విషయజ్ఞానము

అశ్వనీదేవతలు= సత్యజ్ఞానము - హస్తినాపురము= దహరము

ఘటోత్కచుడు= బలము/శిఖండి= మొండివాదము / కుంతీదేవి= మూలమాయ

యుద్ధస్తలము= గురుస్థలము/యుద్ధములు= గురుమర్మములు/ ఇల్లు=దేహము

బలరాముడు= దేహి, దేహము/ రుక్మిణి= మూలకాంత / కోడి = నిజయోగి

జనకులు= అనేకకులములు - పదునెనిమిది పర్వములు= 18 కులములు

సూర్యమండలము= నేత్రస్థలము - ఆజ్ఞాచక్రము= 12 కళలు కలది

అగ్నిమండలము= అనాహత చక్రము 10 కళలు గలది

పండ్రెండింటికి= 10 నాళ్ళు, పురుషుడు, బ్రహ్మనాడి కలసి 12 (అజ్ఞా చక్రము)

చంద్రమండలము (విశుద్ధి)= 16 కళలు గలది

పదునారింటికి=అంతఃకరణ,కర్మేంద్రియ,విషయపంచకములు15 జ్ఞాతతో 16(విశుద్ధి)

నక్క=ప్రణవము/విదురుడు= భక్తి / ఎడ్లు= సత్యము, శౌచములు

వాకిళ్ళు= నవద్వారములు/తాను= గృహస్తు / ఉపచారములు= సర్వగుణములు

భూమి= అజ్ఞానము/ పుట్టలు= చెట్లు / నాగలితో దున్నుట= గురువు బోధ చేయుట

చెట్లను నరికి బాగుచేయుట= భక్తి కలుగుట / దుర్గుణములు=దుర్మోహములు

పగ్గము= యోచన / మేడి= బుద్ధి/కమతగాడు= మనస్సు/ కాడి= విరక్తి

దున్నుట= ఎల్లప్పుడూ విమర్శతో నుండుట / రాగి= రజోగుణము

అన్నిదిక్కులు= అనేక గురు రహస్యములు/ పైరు పెరుగుట= శిష్యునికి నిజం తెలియుట

పంటబండుట= స్వానుభవముతో గుర్తించుట/ కల్పవృక్షము= సత్ సంకల్పము

కామధేనువు= సత్ కోర్కెలు / పరశువేది= గురుని సత్ కృప / గొల్లవాడు= శిష్యుడు

బంగారము= కోర్కె రహితము/ వెండి= నిర్మల జ్ఞానము / విరక్తి= కట్టుస్తంభము

కంచు= సత్వగుణము/ ఇత్తడి= పిరికితనము / తోడు పెట్టుట= గురు కటాక్షము కల్గుట

నవరత్నములు= అష్టాంగయోగములతో కూడిన ఆరూఢభావం।

నేతలు దిగుట= శరీరమును విడుచుట / ఆవు= గురువు / మేత= భక్తి

పాలుపితికెడి చెంబు= మోక్షము పొందవలెనను బుద్ధి

లేగ= గురువు నందు శ్రద్ధ కలవాడు/పాలు= గురుబోధలోని రహస్యము
దాలివేయుట= దుర్గుణములను పోగొట్టు సత్ విమర్శ
చల్లచేయుట= గురుబోధను తరచి తరచి విషయమును గ్రహించుట
వెన్న= గ్రహించిన పూర్ణభావము/నెయ్యి= స్వానుభవానందము
కవ్వము= ఆలోచన/ కవ్వపుతాళ్ళు= గురుని ఆజ్ఞ / వంట యిల్లు= సూక్ష్మదేహము
పద్మవ్యూహభేదము= అనంతసంసార భేదకం / మత్స్య యంత్రము= కాలచక్రము
కవ్వపురాట= సుషుమ్ననాడి/సాలెలు= సరసములు /మంటచేయుట= బోధచేయుట
పొయ్యి= అజ్ఞానము/ నిప్పు= జ్ఞానము / కట్టెపుల్లలు= దుర్విషయములు
వంటచేయుపాత్రలు= అంతఃకరణములు / నీరు= భక్తి/ ధాన్యము= గురు రహస్యము
పచనము చేయుట= తుర్యానుభవము / ఉప్పు= శాంతము/ కారము= ధీరత్వము
చింతపండు= ఆనందము/తీపి= శ్రద్ధ / చేదు= మాయ
వగరు= వైరాగ్యము/ పప్పులు= గుణములు/కూరలు= అష్టాంగయోగములు
పచ్చళ్ళు= షడ్విధముక్తులు/ఊరగాయలు=విజ్ఞాన చతుష్టయము
అనేకపాకములు= నానావిధ రహస్యములు/పాత్ర= గురువు/ కల్పడము= జీవుడు
భోజనము చేయుట= గురునిభావమును నీతో చెప్పుకొనుట / చాకలివాడు= గురువు
ఆకలితీరుట= మాయ తొలగుట/ వస్త్రములు= ఆవరణములు-దూదేకులవాడు= గురువు
వర్తకుడు= గురువు/ సాలెవాడు= ఈశ్వరుడు/ నూలు= కర్మ/ గుంట= అజ్ఞానము
పడుగుచేసుట= ఆగామి సంచిత ప్రారబ్ధములు / పగ్గము= సుషుమ్ననాడి
మగ్గంచాచుట= గుణత్రయములు జరుగుట/ నాడి తిరుగుట= సంకల్పము చేయుట
పలకలు వేసుట= పాపపుణ్యములు / సుడికి చమురు రాయుట= దేహాభిమానము
మగ్గానికి ఆధారాలు= షోడశాధారములు / గవాక్షి= భ్రాంతి/ పడుగుపేక= రాగద్వేషాలు
సాలెలు= జీవులు/ గురువు= వ్యాపకలింగము/ చేప= నేత్రము/ మొసలి= అజ్ఞానము
భావలింగము= అనుభవములోనున్న రూపము / గొఱ్ఱె= అభేదము/ కప్ప= మనస్సు
ఇష్టలింగము= తెలివితోనున్న స్వరూపము/ ప్రాణలింగము= భ్రూమధ్యయందున్నది
పాములు= నాళ్ళు/ తుమ్మెదలు= ఓంకారము/ కొంగలు= సుగుణములు/ డేగ= జ్ఞానభ్రమ
బల్లి= మరుపు/ కుబేరుడు= మోక్షచింత/ దేవతలు= అధిదేవతలు, విషయములున్నూ
రాక్షసులు= ఆశలు, మోహకోరికలు, యింద్రియములు వగైరాలు





సముద్రము= ఆగామి,సంచిత, ప్రారబ్ధరూపమైన సంసారము
కవ్వము= సుషుమ్ననాడి/ కవ్వపుతాళ్ళు= యిడా,పింగళనాడులు
తరచుట= సంధానము చేసి విమర్శించుట(ప్రాణాయామము)
తరచగా పుట్టినది= భక్తిజ్ఞాన, వైరాగ్యములు/విషము= మలత్రయము/ పీఠము-ఓంకారము
లక్ష్మి= ఆనందరూపమైన శక్తి /అమృతము= నిత్యముక్తి
విష్ణుమోహినిగా నిలుచుట= ముక్తికాంతగా అవతరించుట/లింగములు= జీవచతుష్టయం
అమృతాన్ని పంచుట= సర్వేంద్రియములకు యోగబోధ తెల్పుట
రాక్షసులను త్యజించుట= దుర్గుణములను విడుచుట/ షడాధారములు= షట్చక్రములు
లింగత్రయములు= ప్రణవచ్ఛబ్ధ సచ్ఛబ్ధములు/ అంగములు= దేహచతుష్టయములు
షడ్లింగములు= పంచవిషయములు, మనస్సున్ను / పూజకుడు=సాకారమైనతాను
గురులింగ జంగములు= గురువు, తాను, ఆత్మలు/ లింగకాయలు= ఉపాదులు
షట్కమలాలు= పంచకోశములు, భ్రాంతి/ ధారణలింగము= తనలోతానై ఉన్న స్వరూపము
పూజాపాత్రలు= పంచజ్ఞానేంద్రియములు/ లింగసూత్రం= హంస/లింగస్తలము= భక్తి
లింగవస్త్రములు= సుగుణములు /కరతల ప్రవేశము= గురుజ్ఞానమందలి శ్రద్ధ
జ్యోతులు= సత్యజ్ఞానములు/ఉదకము= పరమాత్మయందలి ప్రీతి
విభూతిలీల= నిత్యము దర్శించెడి మహిమలు / సాంబ్రాణి= భూతవిషయము
మారేడు దళములు= అష్టాంగయోగములు/ యజ్ఞోపవీతము= అఖండజ్ఞానము
పుష్పములు= అధిదేవతలు/గంధము=నిర్విషయనిష్ఠ / అగ్ని= నిజబోధ
అక్షింతలు= అయిదు ప్రాణావృతులు/ఉపచారములు= కర్మేంద్రియములు
హారతికర్పూరం= ప్రత్యగాత్మయైన సాక్షి/ మంత్రం= అజప/శంఖము= ఓంకార నాదము
ఘంట= యోగనిష్ఠలో వినిపించు దశవిధనాదములు / నైవేద్యము= మాయా ఐక్యము
మంగళహారతి= సర్వకళా సందర్శనము /మంత్రపుష్పము= సర్వారూఢభావము
ప్రదక్షిణము= ద్రవ్య, క్రియ, భావములనే, అద్వైత త్రయముల ఐక్యము
తాంబూలము= త్రిగుణములను ఏకము చేయుట /ఆభరణములు= అంతఃకరణములు
నమస్కారము= సర్వ అభిమానములను వదలుట / మంగళసూత్రము= గురుభావము
కుంకుమ= రాగము/ పసుపు= భ్రమ/ కష్టము= స్వతంత్ర కర్తృత్వహంకార నిరసనము
వింజామర= విజ్ఞానము/ఛత్రము= సుజ్ఞానము / అజ్ఞానవృక్షము= తీవ్రమగు అజ్ఞానము

శయ్య= మాయ తొలగిన వెనుక వచ్చెడి జ్ఞానము / బీజము= మోహము/ నీరు= ప్రీతి
నిద్రించుట= సాకారం పోయి తానైయుండుట /పర్ణములు= సంతోషము
కాండం= అభిమానము / కొమ్మలు= దుఃఖములు/ ఉపశాఖలు= ఆలోచనలు
పుష్పములు= ప్రారబ్ధము/ చిగుళ్ళు= సంచితము
ఆగామి ఫలము= నరజన్మమెత్తడము/తీగెలు= అష్టపాశములు/
మొత్తం= సంసారవర్తన/తల్లి= సాకారమనెడు ప్రకృతి
తండ్రి= అహంకారమనెడు పురుషుడు/పత్ని= భ్రమయనెడి స్త్రీ (ఆడది)
పుత్రులు= భ్రమలవలన కలుగు సంకల్పములు / త్రిపురములు= నివాసస్థానములు
శత్రువులు= కామాదులు/ బంధువులు= యింద్రియములు
సోదరులు= త్రిగుణములు/ అజ్ఞానము= దరిద్రము/ సారంగధరుడు= సాక్షి
జ్ఞానము= అపరోక్షాత్మవిజ్ఞానము - కర్మేంద్రియములు= పరిచారకులు
ప్రభువు= పరమాత్మ/ పట్టపుదేవి= మాయ/దివానులు= విరాట్, స్వరాట్, సామ్రాట్
గుమస్తాలు= అష్టవసువులు - సేనానాయకులు= ఏకాదశ రుద్రులు
సర్దార్లు= అష్టదిక్పాలకులు - ఠాణేదార్లు= ద్వాదశ ఆదిత్యులు
గుమస్తాలు= అష్టవసువులు - సముద్దార్లు= చతుర్ధశమనువులు
జమీదార్లు= దశావతారాలు - సిరస్తాదార్లు= షట్చక్రవర్తులు
రాజ్యం= బ్రహ్మాండము - కరణములు= సంకల్పవికల్పములు
మునసబులు= షోడశ మహారాజులు - జైలరు= యముడు
మోహతాదులు= నవదుర్గలు (అనగా మోహస్వరూపమగు శక్తులు)
గుమాస్తాలు= అకాలమృత్యువులు - దుర్గుణములు= మూడు గుణములు
జవానులు= నానావిధ శక్తులు - డలయ్యతులు= నానావిధ దైవములు

శిష్యా నేను చెప్పిన సంగతులన్నియూ మననము చేసుకొనినచో రామాయణ, భారత, భాగవత కథలన్నియూ నీ శరీరమందే కనబడును. కనుక నిశితముగా విమర్శించుకొని తరింపుము. నీకేమైనా సందేహములు కలిగిన నన్నడిగి తెలుసుకొనుము.

**శిష్యుడు.** విరాట్ చైతన్యం యేమైవున్నది స్వామీ?
**గురువు.** బింబ ప్రతిబింబభావము చేత 1. సూత్రాత్మ, 2. అవ్యాకృత, 3. హిరణ్యగర్భ, 4. విరాట్ లనే చైతన్యములై వున్నవి శిష్యా.
**శిష్యుడు.** ఒక్క చైతన్యము నాలుగు చైతన్యములగుటకు కారణమేమి స్వామీ?





**గురువు.** మూలమాయ సంబంధమువల్ల నగుచున్నవి శిష్యా.
**శిష్యుడు.** మూలమాయ అనగానేమి స్వామీ?
**గురువు.** తన మూలము తనకు యేమి లేకపోయి 1. మహాకారణ, 2. కారణ, 3. సూక్ష్మ, 4.స్థూల దేహములై వున్నవి శిష్యా.
**శిష్యుడు.** ఈ చైతన్యములనుంచి దేహములకు యేమివచ్చెను స్వామీ?
**గురువు.** సత్తా వచ్చెను శిష్యా. అవి అయిదు విధములై వున్నది శిష్యా.
**శిష్యుడు.** అయిదు ఎవ్వి స్వామీ?
**గురువు.** 1. స్వరాట్, 2. విరాట్, 3. సాంబ్రాట్, 4. అంతర్యామి, 5. మూల ప్రకృతులు శిష్యా.
**శిష్యుడు.** విరాట్ చైతన్య మూలముయేమైవున్నది స్వామీ?
**గురువు.** తిరిగి బింబప్రతిబింబభావము చేత 1. ఈశ్వరుడు, 2. రుద్రుడు, 3. విష్ణు, 4.బ్రహ్మలనెడి చైతన్యములై వున్నది శిష్యా.
**శిష్యుడు.** ఒక్క చైతన్యము నాలుగు చైతన్యములగుటకు కారణమేమి స్వామీ?
**గురువు.** విద్యామాయ సంబంధమువల్ల శిష్యా.
**శిష్యుడు.** విద్యామాయ అనగా నేమి స్వామీ?
**గురువు.** అనేక కాలములనుండి లేక పొయ్యేది అయిస్వాజాతి విజాతియ్యమున 1. మహాకారణ, 2. కారణ 3.సూక్ష్మ 4.స్థూల దేహములై వున్నది శిష్యా.
**శిష్యుడు.** చైతన్యములనుంచి దేహములకు ఏమివచ్చినది స్వామీ?
**గురువు.** సత్తా వచ్చినది శిష్యా.అవి అయిదు విధములైవున్నది శిష్యా.
**శిష్యుడు.** అయిదు ఏమిటి స్వామీ?
**గురువు.** 1. రుద్రుడు, 2. క్షేత్రజ్ఞుడు, 3. బృహస్పతి, 4. చంద్రుడు, 5. మాయ అయివున్నది శిష్యా.
**శిష్యుడు.** బ్రహ్మ అనెడి చైతన్యం యేమైవున్నది స్వామీ?
**గురువు.** తిరిగి బింబభావము చేత 1. ప్రత్యగాత్మ, 2. ప్రాజ్ఞ, 3. తైజస, 4. విశ్వులనెడి చైతన్యములైవున్నది శిష్యా.
**శిష్యుడు.** ఒక్క చైతన్యము నాలుగు చైతన్యములగుటకు కారణమేమి స్వామీ?
**గురువు.** అవిద్యామాయవల్ల శిష్యా.
**శిష్యుడు.** అవిద్యామాయ అనగా నేమి స్వామీ?
**గురువు.** క్షణమాత్రము వుండి లేక పొయ్యేదిఅయి స్వజాతి విజాతియ్యమున 1. మహాకారణ, 2. కారణ, 3. సూక్ష్మ, 4. స్థూల దేహములై వున్నది శిష్యా.
**శిష్యుడు.** చైతన్యములనుంచి దేహములకు యేమి వచ్చినది స్వామీ?

**గురువు.** సత్తావచ్చినది శిష్యా.అవి అయిదు విధములై వున్నది శిష్యా.

**శిష్యుడు.** అయిదు ఎవ్వి స్వామీ?

**గురువు.** 1. అహంకారము, 2. చిత్తము, 3. బుద్ధి, 4. మనస్సు, 5. అంతర్యామి అయివున్నది శిష్యా.

**షరా- మూలమాయ, విద్యామాయ, అవిద్యామాయ,అనునవి మూడు.**

**శిష్యుడు.** మూలమాయ అనగా నేమిస్వామీ?

**గురువు.** తనమూలం తనకు యేమీలేక పోయి తనకు తానువున్నది శిష్యా.

మూలమాయ యావత్తు వ్యాపించియున్నది. 1. కాలము యెగువనులేక దిగువయావత్తు వ్యాపించియున్నది. 2. చిత్తము యెగువను లేక దిగువయావత్తు వ్యాపించియున్నది. 3. తమస్సు యెగువలేక దిగువయావత్తు వ్యాపించియున్నది. 4. ఆకాశము యెగవలేక దిగువ యావత్తు వ్యాపించియున్నది

**శిష్యుడు.** విద్యామాయ అనగానేమి స్వామీ?

**గురువు.** అనేకకాలమువుండి లేక పొయ్యేది అయి నాలుగయిన 1. కాలము, 2. చిత్తము, 3. తమస్సు, 4. ఆకాశము అయిన నిరాహార ప్రకృతులయి వున్నది శిష్యా.

**శిష్యుడు.** అవిద్యామాయ అనగా నేమి స్వామీ?

**గురువు.** క్షణమాత్రంవుండి లేక పోయేది అయి నాలుగయిన 1. వాయువ, 2. అగ్ని, 3. ఉదకము, 4. పృధువులయిన సాకార ప్రకృతులయివున్నది శిష్యా.

**శిష్యుడు.** ఇవన్నియు ఎట్లువున్నవి స్వామీ?

**గురువు.** 1. వాయువు యెగువలేక దిగువయావత్తు వ్యాపించియున్నది 2. అగ్ని యెగువలేక దిగువ యావత్తు వ్యాపించియున్నది. 3. ఉదకముయెగువ లేక దిగువ యావత్తు వ్యాపించియున్నది. 4. పృథివి ఈ సర్వానికి ఆధారమైయున్నది. కాలము= కాలము స్వజాతి, కాలములో విజాతి/చిత్తు= చిత్తులో స్వజాతి/చిత్తులో విజాతి/తమస్సు= తమస్సు స్వజాతి/తమస్సులో విజాతి/ఆకాశము= ఆకాశముస్వజాతి, ఆకాశములో విజాతి/ వాయువ= వాయువ స్వజాతి, వాయువలోవిజాతి/ అగ్ని= అగ్ని స్వజాతి, అగ్నిలోవిజాతి/ ఉదకము= ఉదకము స్వజాతి/ఉదకములో విజాతి/పృథివి= పృథివిస్వజాతి, పృథివిలోవిజాతి ఈ యావత్తు ప్రపంచము అయివున్నది. కాలము రెండు భాగములై,





సగము భాగము తనకు తానేవుండి, సగభాగము యావత్తు వ్యాపించియున్నది. చిత్తు రెండు భాగములై సగభాగము తనకు తానే అయివుండి, సగభాగము యెగువలేక దిగువ యావత్తు వ్యాపించియున్నది. తమస్సు రెండుభాగములై సగభాగము తనకు తానే అయివుండి, సగభాగము యెగవలేక దిగువ యావత్తు వ్యాపించియున్నది. వాయువ రెండుభాగములై సగభాగము తనకు తానే అయివుండిసగభాగము అగ్ని అయివున్నది. అగ్ని రెండుభాగములై సగభాగము తనకు తానే అయివుండిసగభాగము పృథివి అయివున్నది. పృథివికన్న పదిభాగములు ఉదకము హెచ్చు/ ఉదకముకన్న పదిభాగములు వాయువ హెచ్చు/వాయువకన్న పదిభాగములు ఆకాశము హెచ్చు/ఆకాశముకన్న పదిభాగములు తమస్సు హెచ్చు/తమస్సుకన్న పదిభాగములు చిత్తు హెచ్చు/ చిత్తుకన్న పదిభాగములు కాలముహెచ్చు/ పృథివి, తమస్సు, ఉదకము యీ మూడునుగూడి **నాదమైవున్నది**/ వాయువ, అగ్ని, చిత్తు కూడా బిందువ అయివున్నది ఆకాశము, కాలముగూడ **కళ** అయివున్నది/ **ఇవే నాదబిందుకళలు.**

**షరా= అహంకారాత్ త్రిగుణాని.అనగు మూడు గుణములు కలవు.**

**శిష్యుడు.** త్రిగుణములనగా నెవ్వి గురుదేవా?

**గురువు.** తమోస్సత్వరజోగుణములు శిష్యా.

**శిష్యుడు.** తమోగుణమనగా నేమి గురుదేవా?

**గురువు.** అహంకారము వల్ల "సుషుప్తి" తమోగుణము శిష్యా.

**శిష్యుడు.** సత్వగుణమనగా నేమి గురుదేవా.?

**గురువు.** అహంకారమువల్ల స్వప్నము "సత్వగుణము" శిష్యా.

**శిష్యుడు.** రజోగుణమనగా నేమి గురుదేవా?

**గురువు.** అహంకారమువల్ల జాగ్రత "రజోగుణము" శిష్యా.

**షరా- త్రిగుణేభ్యః పంచతన్మాత్రాణి** యివి ఐదువిధములు.

**శిష్యుడు.** పంచతన్మాత్రలనగా నేమి గురుదేవా?

**గురువు.** ఈశాన, తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాతములు.

**శిష్యుడు.** ఈశానమనగా నేమి గురుదేవా?

**గురువు.** శబ్దమే ముఖముగలది తమోగుణమువలన బుట్టినది (విశ్వజ్ఞబ్రహ్మ)

**శిష్యుడు.** తత్పురుష ముఖమనగా నేమి గురుదేవా?
**గురువు.** స్పర్శముఖముగలది సత్వగుణము వలన బుట్టినది (శిల్పిబ్రహ్మ)
**శిష్యుడు.** అఘోరమనగా నేమి గురుదేవా?
**గురువు.** రూపమే ముఖముగలది సత్వగుణము వలనపుట్టినది (త్వష్టబ్రహ్మ)
**శిష్యుడు.** వామదేవముఖమనగా నేమి గురుదేవా?
**గురువు.** రసమేముఖముగలది రజోగుణమువలన పుట్టినది (మయబ్రహ్మ)
**శిష్యుడు.** సద్యోజాతముఖమనగా నేమి గురుదేవా?
**గురువు.** గంధమేముఖముగలది. రజోగుణమువలన బుట్టినది (మనుబ్రహ్మ)
**శిష్యుడు.** స్వజాతియ్యమైన ఈశానముఖమనేశబ్దము విజాతియ్యమున ఏమైయున్నది గురుదేవా?
**గురువు.** ఆకాశము, వాయువ, అగ్ని, ఉదకము, పృథివి, ఈ 5కి అయిదు శబ్దములు కలవైయున్నవి శిష్యా.
**శిష్యుడు.** స్వజాతియ్యమైన తత్పురుషమనే స్పర్శ విజాతియ్యమున నేమైవున్నది గురుదేవా?
**గురువు.** వాయువ, అగ్ని, ఉదకము, పృథివి, నాలిగింట నాలుగు స్పర్శలైవున్నవి శిష్యా
**శిష్యుడు.** స్వజాతియ్యమైన అఘోరమనెడి రూపము. విజాతియ్యమునేమైయున్నది గురుదేవా?
**గురువు.** అగ్ని,ఉదకము,పృథివి, ఈ మూడింటమూడు రూపములు కలవైవున్నవి శిష్యా.
**శిష్యుడు.** స్వజాతియ్యమైన ఉదకము విజాతియ్యమున నేమైవున్నది గురుదేవా?
**గురువు.** ఉదకము, పృథివి, రెండింట రెండురసములైవున్నవి శిష్యా.
**శిష్యుడు.** స్వజాతియ్యమైన పృథివి విజాతియ్యమున ఏమైవున్నది గురుదేవా?
**గురువు.** ఒక్క పృథివి యందొక్కగంధమైయున్నది శిష్యా.యివి ఐదు గుణములు కలవై యున్నవి.
**శిష్యుడు.** అవియెవ్వి గురుదేవా?
**గురువు.** 1. ఆకాశము, 2. వాయువ, 3. అగ్ని, 4. ఉదకము, 5. పృథివి, అయివున్నది శిష్యా

**షరా– పృథివి స్వజాతియైన గుణముగంధము, పృథివిలో ఉదకము కలసి రసమయ్యెను, పృథివిలో అగ్నికలిసి రూపమయ్యెను, పృథివిలో వాయువుకలసి స్పర్శయయ్యెను, పృథివిలో ఆకాశము కలసి శబ్దమయ్యెను.**

**శిష్యుడు.** అగ్నియేమైవున్నది గురుదేవా?





**గురువు.** మూడుగుణములుకలదైవున్నది శిష్యా.
**శిష్యుడు.** ఆమూడు ఏమిటి గురుదేవా?
**గురువు.** ఆకాశము, వాయువ, అగ్ని శిష్యా.

**షరా– అగ్నికి స్వజాతియ్యమైన గుణము రూపము అగ్నిలోవాయువకలసిన శబ్దము వచ్చును.**

**శిష్యుడు.** వాయువ ఏమైవున్నది గురుదేవా?
**గురువు.** రెండుగుణములు కలదైవున్నది శిష్యా
**శిష్యుడు.** ఆరెండును ఏమిటి గురుదేవా?
**గురువు.** వాయువకు స్వజాతియ్యమైనగుణము స్పర్శ, వాయువలో ఆకాశముకలసి శబ్దము శిష్యా.
**శిష్యుడు.** ఆకాశమున ఏమైవున్నది గురుదేవా?
**గురువు.** ఒక్క గుణమైవున్నది శిష్యా.అదేశబ్దము,ఆకాశగుణము.
**శిష్యుడు.** స్వజాతియ్యమైన పృథివి విజాతియ్యమున ఏమైవున్నది గురుదేవా?
**గురువు.** రెండువిధములై వున్నది శిష్యా.
**శిష్యుడు.** ఆరెండును యెవ్వి గురుదేవా?
**గురువు.** సుగంధ, దుర్గంధములు శిష్యా.
**శిష్యుడు.** స్వజాతియ్యమైన ఉదకము విజాతియ్యమునసేమైవున్నది గురుదేవా?
**గురువు.** ఆరువిధములైవున్నది శిష్యా.అవి 1. ఉప్పు, 2. పులుసు, 3. కారము, 4. వగరు, 5. చేదు, 6. తీపిరుచులు శిష్యా.
**శిష్యుడు.** స్వజాతియ్యమైన అగ్ని విజాతియ్యమునసేమైవున్నది గురుదేవా?
**గురువు.** అయిదు విధములైవున్నది శిష్యా.అవి 1. ఎఱుపు, 2. నలుపు, 3. తెలుపు, 4. పచ్చ, 5. ఆకుపచ్చ రంగులు శిష్యా.
**శిష్యుడు.** స్వజాతియ్యమైన వాయువ విజాతియ్యమునసేమైవున్నది గురుదేవా?
**గురువు.** నాలుగువిధములైవున్నది శిష్యా.అవి 1. మృదువు, 2. కఠినము, 3. ఉష్ణము, 4. శీతలము స్వభావములు శిష్యా.
**శిష్యుడు.** స్వజాతియ్యమైన ఆకాశము విజాతియ్యమునయేమైవున్నది గురుదేవా?
**గురువు.** రెండు విధములైవున్నది శిష్యా.అవి శబ్దము, తచ్ఛబ్దము శిష్యా (ప్రతిధ్వని)

**శిష్యుడు.** త్రిగుణములనగా నేమి గురుదేవా?
**గురువు.** రజ, స్సత్వ, తమోగుణములు శిష్యా
**శిష్యుడు.** తమోగుణమునకు సత్తాయేమిటి గురుదేవా?
**గురువు.** లయసత్తాగలది శిష్యా.
**శిష్యుడు.** తమోగుణమునకు రూపమేమిటి గురుదేవా?
**గురువు.** లోపల తెల్పు, బయట నల్పు, అనగా లోపల నిర్మలము బయట క్రౌర్యము గలది శిష్యా.
**శిష్యుడు.** తమోగుణమునకు నామమేమిటి గురుదేవా?
**గురువు.** రుద్రుడనే నామముగలదు శిష్యా.
**శిష్యుడు.** తమోగుణమునకు కర్తృత్వము మేమిటి గురుదేవా?
**గురువు.** సృష్టి, స్థితి, లయ కర్తృత్వముగలదు శిష్యా.
**శిష్యుడు.** తమోగుణమునకు సంబంధమేమిటి గురుదేవా?
**గురువు.** మూలమాయా సంబంధముగలదు శిష్యా.

**శిష్యుడు.** సత్వగుణమునకు సత్తాయేమిటి గురుదేవా?
**గురువు.** స్థితిసత్తాకలదు శిష్యా.
**శిష్యుడు.** సత్వగుణమునకు రూపమేమిటి గురుదేవా?
**గురువు.** లోపల నలుపు, బయట తెలుపు అనగా లోపల క్రౌర్యము, బయట నిర్మలము శిష్యా
**శిష్యుడు.** సత్వగుణమునకు నామమేమిటి గురుదేవా?
**గురువు.** విష్ణువనునామము కలదు శిష్యా.
**శిష్యుడు.** సత్వగుణమునకు కర్తృత్వమేమిటి గురుదేవా?
**గురువు.** సృష్టి, స్థితి కర్తృత్వము కలదు శిష్యా.
**శిష్యుడు.** సత్వగుణమునకు సంబంధమేమిటి గురుదేవా?
**గురువు.** విద్యామాయా సంబంధముకలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణమునకు సత్తాయేమిటి గురుదేవా?
**గురువు.** సృష్టి చేయు స్వభావము గలదు శిష్యా.
**శిష్యుడు.** రజోగుణమునకు రూపమేమిగురుదేవా?
**గురువు.** లోపల తెలుపు, బయట యెరుపు, అనగా లోపల నిర్మలము, బయట క్రౌర్యము గలది శిష్యా
**శిష్యుడు.** తమోగుణములో రజోగుణమునకు నామమేమిటి గురుదేవా?





**గురువు.** రుద్రునిలో బ్రహ్మఅనే నామముగలదు శిష్యా.
**శిష్యుడు.** తమోగుణములో రజోగుణ కర్తృత్వమేమిటి గురుదేవా?
**గురువు.** సృష్టికర్తృత్వము కలదు శిష్యా.
**శిష్యుడు.** తమోగుణములో రజోగుణమునకు సంబంధమేమిటి గురుదేవా?
**గురువు.** మూలమాయలో అవిద్యామాయా సంబంధముకలదు శిష్యా.

**శిష్యుడు.** సత్వగుణములో తమోగుణమునకు సత్తాయేమిటి గురుదేవా?
**గురువు.** లయసత్తాకలదు శిష్యా.
**శిష్యుడు.** సత్వగుణములో తమోగుణమునకు రూపమేమిటి గురుదేవా?
**గురువు.** లోపలనలుపు, బయట తెలుపు, అనగా లోపల క్రౌర్యము, బయట నిర్మలముండును శిష్యా.
**శిష్యుడు.** సత్వగుణములో తమోగుణమునకు నామమేమిటి గురుదేవా?
**గురువు.** విష్ణులో రుద్రుడనేనామం కలదు శిష్యా.
**శిష్యుడు.** సత్వగుణములో తమోగుణమునకు కర్తృత్వమేమిటి గురుదేవా?
**గురువు.** లయ కర్తృత్వము శిష్యా.
**శిష్యుడు.** సత్వగుణములో తమోగుణమునకు సంబంధమేమిటి గురుదేవా?
**గురువు.** విద్యామాయలో మూలమాయా సంబంధముండును శిష్యా.

**శిష్యుడు.** సత్వగుణములో సత్వగుణమునకు సత్తాయేమిటి గురుదేవా?
**గురువు.** స్థితిసత్తాకలదు శిష్యా.
**శిష్యుడు.** సత్వగుణములో సత్వగుణమునకు రూపమేమిటి గురుదేవా?
**గురువు.** లోపల నలుపు, బయట నలుపు, అనగా లోపలను బయటను క్రౌర్యముండును శిష్యా.
**శిష్యుడు.** సత్వగుణములో సత్వగుణమునకు నామమేమిటి గురుదేవా?
**గురువు.** విష్ణులో విష్ణు అనే నామముగలదు శిష్యా
**శిష్యుడు.** సత్వగుణములో సత్వగుణమునకు కర్తృత్వమేమిటి గురుదేవా?
**గురువు.** స్థితి కర్తృత్వము శిష్యా.
**శిష్యుడు.** సత్వగుణములో సత్వగుణమునకు సంబంధమేమిటి గురుదేవా?
**గురువు.** విద్యామాయలో విద్యామాయా సంబంధముగలదు శిష్యా.

**శిష్యుడు.** సత్వగుణములో రజోగుణమునకు సత్తాయేమిటి గురుదేవా?

**గురువు.** సృష్టిసత్తాకలదు శిష్యా.

**శిష్యుడు.** సత్వగుణములో రజోగుణమునకు రూపమేమిటి గురుదేవా?

**గురువు.** లోపల నలుపు, బయట ఎఱుపు, అనగా లోపల క్రౌర్యము, బయట చలనముండును శిష్యా.

**శిష్యుడు.** సత్వగుణములో రజోగుణమునకు నామమేమిటి గురుదేవా?

**గురువు.** విష్ణులో బ్రహ్మయుండును శిష్యా.

**శిష్యుడు.** సత్వగుణములో రజోగుణమునకు కర్తృత్వమేమిటి గురుదేవా?

**గురువు.** సృష్టికర్తృత్వము కలదు శిష్యా.

**శిష్యుడు.** సత్వగుణములో రజోగుణమునకు సంబంధమేమిటి గురుదేవా?

**గురువు.** విద్యామాయలో అవిద్యామాయా సంబంధముగలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో తమోగుణమునకు సత్తాయేమిటి గురుదేవా?

**గురువు.** లయసత్తాగలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో తమోగుణమునకు రూపమేమిటి గురుదేవా?

**గురువు.** లోపల యెరుపు, బయట తెలుపు, అనగా లోపల క్రౌర్యము, బయట నిర్మలము గలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో తమోగుణమునకు నామమేమిటి గురుదేవా?

**గురువు.** బ్రహ్మలో రుద్రుడనేనామముగలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో తమోగుణమునకు కర్తృత్వమేమిటి గురుదేవా?

**గురువు.** లయ కర్తృత్వము కలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో తమోగుణమునకు సంబంధమేమిటి గురుదేవా?

**గురువు.** అవిద్యామాయలో మూలమాయాసంబంధముగలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో సత్వగుణమునకు సత్తాయేమిటి గురుదేవా?

**గురువు.** స్థితిసత్తాగలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో సత్వగుణమునకు రూపమేమిటి గురుదేవా?

**గురువు.** లోపల యెఱుపు, బయట నలుపు, అనగా లోపల చలనము బయట క్రౌర్యముగలదు శిష్యా.





**శిష్యుడు.** రజోగుణములో సత్వగుణమునకు నామమేమిటి గురుదేవా?

**గురువు.** బ్రహ్మలో విష్ణు అనే నామముగలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో సత్వగుణమునకు కర్తృత్వమేమిటి గురుదేవా?

**గురువు.** స్థితి కర్తృత్వముగలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో సత్వగుణమునకు సంబంధమేమిటి గురుదేవా?

**గురువు.** అవిద్యామాయలో విద్యామాయాసంబంధముగలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో రజోగుణమునకు సత్తాయేమిటి గురుదేవా?

**గురువు.** సృష్టిసత్తాకలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో రజోగుణమునకు రూపమేమిటి గురుదేవా?

**గురువు.** లోపల యెఱుపు, బయట యెఱుపు అనగా లోపల క్రౌర్యము, బయట చలనముగలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో రజోగుణమునకు నామమేమిటి గురుదేవా?

**గురువు.** బ్రహ్మలోబ్రహ్మ అనెడి నామముగలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో రజోగుణమునకు కర్తృత్వమేమిటి గురుదేవా?

**గురువు.** సృష్టి కర్తృత్వముగలదు శిష్యా.

**శిష్యుడు.** రజోగుణములో రజోగుణమునకు సంబంధమేమిటి గురుదేవా?

**గురువు.** అవిద్యామాయలో అవిద్యామాయా సంబంధముగలదు శిష్యా.

**షరా– పంచతన్మాత్రేభ్యః పంచభూతాని అనగా పంచభూతములు**

**శిష్యుడు.** పంచభూతములనగా నేమిటి గురుదేవా?

**గురువు.** ఆకాశము, వాయువ, అగ్ని, నీరు, భూమి ఈ ఐదును శిష్యా.

**శిష్యుడు.** ఆకాశమనగా నేమిటి గురుదేవా?

**గురువు.** స్వజాతియ్యమైన యీశాన్యముఖమనే శబ్దమునుంచి విజాతియ్యమైన ఆకాశముపుట్టినది శిష్యా.

**శిష్యుడు.** స్వజాతియ్యమైన యీశాన్యముఖమనే శబ్దమునకు మూలమేమిటి గురుదేవా?

**గురువు.** ప్రణవమనెడి నాదము శిష్యా. (ఓంకారము.)

**శిష్యుడు.** వాయువనగా నేమిటి గురుదేవా?

**గురువు.** స్వజాతియ్యమైన తత్పురుషముఖమనే స్పర్శనుంచి విజాతియ్యమైన వాయువ పుట్టెను శిష్యా.

**శిష్యుడు.** స్వజాతియ్యమైన తత్పురుషమనెడి స్పర్శకు మూలమేమిటి గురుదేవా?

**గురువు.** ఆకాశము శిష్యా.

**శిష్యుడు.** అగ్నియనగా నేమిటి గురుదేవా?

**గురువు.** స్వజాతియ్యమైన అఘోరముఖమనెడి రూపమునుంచి విజాతియ్యమైన అగ్నిపుట్టెను శిష్యా.

**శిష్యుడు.** స్వజాతియ్యమైన అఘోరముఖమనే రూపమునకు మూలమేమిటి గురుదేవా?

**గురువు.** వాయువయే శిష్యా.

**శిష్యుడు.** ఉదకమనగా నేమిటి గురుదేవా?

**గురువు.** స్వజాతియ్యమైన వామదేవముఖమనెడి రసమునుంచి విజాతియ్యమైన వుదకముపుట్టెను శిష్యా.

**శిష్యుడు.** స్వజాతియ్యమైన వామదేవముఖమనెడి రసమునకు మూలమేమిటి గురుదేవా?

**గురువు.** అగ్నియే శిష్యా.

**శిష్యుడు.** పృధివి అనగా నేమిటి గురుదేవా?

**గురువు.** స్వజాతియ్యమైన సద్యోజాతముఖమునుంచి విజాతియ్యమైన పృధివి పుట్టెను శిష్యా.

**శిష్యుడు.** స్వజాతియ్యమైన సద్యోజాతముఖమనెడి గంధమునకు మూలమేమిటి గురుదేవా?

**గురువు.** ఉదకముయే శిష్యా.

**శిష్యుడు.** ఆకాశమునకు గుణవృత్తస్థితి అనగానేమిటి గురుదేవా?

**గురువు.** గుణముశబ్దము, వృత్తి సుచిరము, స్థితివ్యాపకము శిష్యా.

**శిష్యుడు.** వాయువునకు గుణవృత్తస్థితి అనగా నేమిటి గురుదేవా?

**గురువు.** 1. గుణము, స్పర్శ, 2. వృత్తి, చలనము, 3. స్థితి, గమనములున్నూ శిష్యా.

**శిష్యుడు.** అగ్నికి గుణవృత్తిస్థితి అనగా నేమిటి గురుదేవా?

**గురువు.** గుణమురూపము, వృత్తి ఉష్ణము, స్థితి చలనములు శిష్యా.

**శిష్యుడు.** ఉదకమునకు గుణవృత్తిస్థితులెవ్వి గురుదేవా?

**గురువు.** 1. గుణము రసము, 3. వృత్తి ద్రవించుట, 3. స్థితి కదలుట యున్నూ కలవు శిష్యా.





**శిష్యుడు.** పృధివికి గుణవృత్తిస్థితులెవ్వి గురుదేవా?

**గురువు.** గుణముగంధము, వృత్తి కఠినము, స్థితి ధరియించుట కలవు శిష్యా.

**శిష్యుడు.** స్వజాతియ్యమైన వాయువ విజాతియ్యమున నేమైయున్నది గురుదేవా?

**గురువు.** శాకిని, డాకిని మొదలగు అనేక భేదములైన పిశాచ దేహములై యున్నది శిష్యా.

**శిష్యుడు.** స్వజాతియ్యమైన అగ్ని విజాతియ్యముననేమైయున్నది గురుదేవా?

**గురువు.** బ్రహ్మ, విష్ణు, రుద్ర, యీశ్వర మొదలయిన అనేకభేదములైన దేవతా దేహములైవున్నవి శిష్యా.

**శిష్యుడు.** స్వజాతియ్యమైన ఉదకము విజాతియ్యమున నేమైయున్నది గురుదేవా?

**గురువు.** అనేకభేదములైన ఉదకదేహములైయున్నది శిష్యా.

**శిష్యుడు.** స్వజాతియ్యమైన పృధివి విజాతియ్యముననేమైయున్నది గురుదేవా?

**గురువు.** 1. ఓషధులు, 2. జరాయుజములు, 3. శ్వేదజములు, 4. అండజములు, 5. బుద్బుదములు అయివున్నవి శిష్యా.

**శిష్యుడు.** స్వజాతియ్యమైన ఆకాశము విజాతియ్యమున నేమైయున్నది గురుదేవా?

**గురువు.** 1. వాయువ, 2. అగ్ని, 3. ఉదకము, 4. పృధివి యీ నాలుగింట నాలుగాకాశాములైవున్నవి శిష్యా.

**ఇదం అఖిలంజగత్**

నాయనా? సాంఖ్యసూత్రమంతయు జెప్పితి యికను నూటయిరువది తత్వముల క్రమము చెప్పెద. సావధానుండవై వినుమని గురుదేవుడీక్రింద వ్రాసిన రీతిని సెలవిచ్చెను.

**తత్వవిమర్శ**

1. మాయ అనగా యెన్నివిధములయినప్పటికీ యిదే గనుక ఏకతత్వమని చెప్పేది.
2. **శిష్యుడు గురువు** (జీవుడు,ఈశ్వరుడు) ఆ రెండును సర్వమునకు కారణ మహాకారణములైవున్నవి. గనుక రెండుతత్వముల క్రమమని చెప్పేది.
3. మూలమాయ, విద్యామాయ, అవిద్యామాయ .ఇదే స్వరము అయివున్నవి. గనుక మూడుతత్వముల క్రమమని చెప్పేది.
4. అగ్నిమండలము 10 కళలు, చంద్రమండలము 16 కళలు, సూర్యమండలము 12 కళలు, మొత్తము38కి **తత్వములు 36న్ను, ప్రకృతిపురుషులు యిద్దరున్ను కలసి 38.**

5. ఆకాశము, వాయువ, తేజస్సు, ఉదకము, పృధివి, ఇవి పంచభూతములు. 5 తత్వముల క్రమమని చెప్పేది
6. ఈశాన్య, తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాతములు, ఇవి 5.మహాభూతములు 1. మహాంధత, 2. మనస్సు, 3. చిత్తు అనగా (అణుస్వరూపము) ప్రకృతి వెల్గు కాలము 5+3=8 అష్ట ప్రకృతులు ఇది 8 తత్వములక్రమమని చెప్పేది.
7. విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ప్రత్యగాత్మ, విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృత, సూత్రాత్మ, సాంబ్రాట్, కూటస్థచైతన్యము, శుద్ధ చైతన్యము. ఇవి పురుష సంజ్ఞలైవున్నవి గనుక ఈ పదకొండైన పురుష తత్వాల క్రమమని చెప్పేది. ఇవి ప్రధానములని తెలిసికొనవలెను.
8. మనస్సు, బుద్ధి, చిత్తము, హంకారము, 4. ఇందులో మనస్సు హంకారముకూడి 1, చిత్తముబుద్ధియుకూడి 1, **ఇవిరెండు అంతరింద్రియములు.** సమాన, వ్యాన, ఉదాన, ఆపాన, ప్రాణములు 5 ప్రాణములు. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములు 5 జ్ఞానేంద్రియములు. వాక్పాణి పాదపాయూపస్థలు 5 కర్మేంద్రియములు15 పై అంతరింద్రియములు 2.కలసి యీ పదునేడునుకూడి **సూక్ష్మశరీరము** ఇది సర్వకార్యములకు వునికిపట్టు జన్మములను తెచ్చునది ఇది **17 తత్వముల** క్రమమని చెప్పవలెను.
9. శబ్దస్పర్శరూపరస గంధములు **(5)** తన్మాత్రలు 2 తత్వములు17= అయ్న 19తోకూడి, పైన5 కలసి 24 తత్వములక్రమమని చెప్పేది. 1 **జ్ఞాతతో** కలిసి =25
10. వచన, దాన, గమన, ఆనంద, విసర్జనములు, 5 కర్మేంద్రియ విషయములు. కామక్రోధ లోభమోహమదమాత్సర్యములు 6 అరిషడ్వర్గములు. భ్రాంతి అనగా మోహనాకారిణి 1 కలసి 12 పైన తెల్పిన తత్వములు 24 కలసి 36 తత్వముల క్రమమని చెప్పేది.

**11.జ్ఞాతతోకూడిన తత్వములు 25, వీటి అధిదేవతలు 25, ప్రకృతి పురుషులు 2 ఇవి 52 తత్వముల క్రమమని చెప్పేది.**

**(ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవికములు)**

3 తాపత్రయములు

3 స్థూలసూక్ష్మకారణ దేహములు





3 జాగ్రత్ స్వప్న సుషుప్తులు

3 సత్వ, రజ, స్తమోగుణములు

5 ఆనందమయ, ప్రాణమయ, అన్నమయ,విజ్ఞానమయ,మనోమయ కోశములు

6 ఆధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధి, ఆజ్ఞా చక్రములు

3 ఇడా, పింగళ, సుషుమ్నలు

**26** వెరశి

5 ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఆదిశక్తి, పరాశక్తులు 5

4 పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరులు 4

3 ఆకార, ఉకార, మకారములు 3

3 నాద, బిందు, కళలు 3

3 బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు 3

7 త్వక్చర్మమాంసరుధిర మేదస్సుమజ్జాస్థులు మొత్తం7
(త్వక్కు, చర్మ, మాంస, రుధిర, మేదస్సు, మజ్జ, అస్తులు)

3 ఆగామి, సంచిత, ప్రారబ్ధములు

6 గణపతి, బ్రహ్మ, విష్ణు, రుద్రుడు, సదాశివుడు, ముక్తికాంతతో 6గురు

5 ఎఱుపు, నలుపు, తెలుపు, పచ్చ, ఆకుపచ్చ రంగులు

3 దారీషణ, ధనీషణ, పుత్రీషణములు

3 శాస్త్రవాసన, దేహవాసన, లోకవాసనలు

6 షడూర్ములు (ఆకలి, దప్పిక, నిద్ర, మైధునం, శోకము, మోహము)

6 ఆస్తి, జాయతే, వర్ధతే, పరిణమితే, అపక్షియ్యతే, నశ్యతి, అను షడ్భావ వికారములు

**83 ఈ మొత్తం**

1 అజ్ఞానము

36 పైన వ్రాసిన 36 తత్వములు

120 ఇవి మొత్తం నూటయిరువది తత్వములక్రమమని చెప్పేది.

---

2 జననమరణములు= దేహగుణములు

2 శోకమోహములు= మనోధర్మములు

2 క్షుత్పిపాసలు= ప్రాణధర్మములు

| **స్థూలదేహము** | **సూక్ష్మదేహము** | **కారణదేహము** |
|---|---|---|
| దేహము | ఎఱుక | మరపు |
| బ్రహ్మాండము | పిండాండము | అండాండము |
| మూలమాయ | విద్యామాయ | అవిద్యామాయ |
| పంచభూతములు | గుణములు | కళలు |
| విరాట్దేహము | జీవదేహము | గురుదేహము |
| ఎఱుక | హంస | ప్రణవము |
| ఇంద్రియదేహము | విషయదేహము | నిర్విషయదేహము |

**దేహత్రయము యిన్ని విధములై వున్నది సాంఖ్యము సమాప్తము**
శ్రీజగద్గురు విశ్వనాథావధూత పరగుర్వర్పణమస్తు.

**తారకము**

**శిష్యా!** అండపిండ బ్రహ్మాండములనగా ముందు బాహ్యమునకుచెప్పెద, 1.అండాండమనగా భూచక్రము, 2. పిండాండమనగా స్థావరములు, పర్వతములు, తరువులు మొదలగు చరాచరజీవములు, 3. బ్రహ్మాండమనగా ఆకాశము, ఇది బాహ్యలక్షణము. అంతరమునకు 1. అండాండమనగా కంటి గుడ్డు. 2. పిండాండమనగా బిందువనేటి కంటిపాప- 3. బ్రహ్మాండమనగా ఆపాపమధ్యను వెలిగేకళ, ఆకళలో నిష్కళయే పరబ్రహ్మము.

**పంచీకరణముగురించి నేనువ్రాసిన సంవాదగ్రంధార్ధములగ్రంధమందు కలదు**

**పంచభూతముల వివరము**

పృథివియనగా కంటి చుట్టూవుండెడి ఎఱుపు, కంటిగుడ్డు ఉదకము తెల్పు, కంటిమధ్యన నలుపు అగ్ని, అందులో నీలమైన పాపయేవాయువ, అందులో కళ ఆకాశము. ఆకళలో నిష్కళయే తానైన పరబ్రహ్మము.

**త్రివేణులవివరము.**

కంటిలోగల పైనలుపుగంగ, ఆనలుపులో నీలమయినకుండలి అనేపాపయే యమున- ఆపాపయే నీలతో యదమధ్యస్థము. ఆపాపమధ్యమున వెలిగెడు వెలుగు సరస్వతి- ఆదేవిద్యుల్లేఖ- ఆ వెలుగులో నిష్కళయేతానైన విరాడ్రూపము- అదేముక్తికాంత.
**శిష్యుడు:** గురుదేవా! సజ్జనుల తక్షణకర్తవ్యములనెరిగించుడు స్వామీ!





**గురువు:** తా॥ శిష్యా ఏ కార్యమునైనా సాహసమున విమర్శింపక చేయకాదు. అట్లు చేయుట వలన సమస్తమైన ఆపదలు రాగలవు విమర్శించి చేయువారికి సకల సంపదలు అవియే వచ్చి చేరును. దీనికి ప్రమాణము.

**కిరాతార్జునీయమున:**

శ్లో॥ సాహసావిధధీతనక్రియామవివేకః పరమపదాంపదం।
వృణతేహివిమృశ్యకారిణంగుణలుబ్ధాస్యయమేవసంపదాః॥

**మరియునైషధంబున**

శ్లో॥ విచార్యకార్యం సృజమావిధానుమృధాకృతానుతాపస్త్వయిపార్ష్విగ్రహం॥

తా॥ శిష్యా ఏ కార్యమునైనను విచారించి చేయుము. వ్యర్థముగా ఏపనీ చేయకుము. పశ్చాత్తాపము నీ వెన్నంటి యున్న విషసమానమగు శత్రువు వంటిది.
**శిష్యుడు:** గురుదేవా! విషసమాన మనగా నేమి?అదెట్లు ప్రాప్తించును?
**గురువు:** శిష్యా తల్లిదండ్రులు, తన కంటే పెద్ద తోబుట్టులు, గురువు మరియూ ప్రముఖులను అవమానించిన విషము వలే హాని చేయును.
**విషయము** శ్లో॥ **గురుంత్వం కృత్యహుం కృత్యనిర్జనజాయతేవనే॥**

తా॥ గురువులను ఎదిరించిననూ, నీవు నీవని ఏకవచనమూ సంబోధించియు అవమాన పరచినవాడు నిర్జనారణ్యమున బుట్టుననియూ,
**మరియూ** శ్లో॥ **నహివశిషుపథ్యః పరిభవః॥**

తా॥ గురువుల పట్ల హీనభావముతోనుండుట శుభముగాదని పెద్దలు వచింతురు.
**శిష్యుడు:** గురుదేవా! వేదశాస్త్రప్రమాణముగా మానవులు త్వరగా చేయవలసిన పని ఏది?
**గురువు:** జన్మ మరణాది దుఃఖప్రవాహమగు సంసారచ్ఛేదమును సమూలముగా తెగనరుకటయే యోగసాధకులు త్వరగా చేయవలసినపని.
**త్వరితమనగా** శ్లో॥ **కౌమార ఆచారేత్ప్రాజ్ఞో, ధర్మాన్భాగవతానిహ॥**
తా॥ ప్రాజ్ఞుడయినవాడు కౌమారావస్థయందే భగవత్కార్యము లాచరింపవలయును.
**భర్తృహరి:** శ్లో॥ **యావత్స్వచ్ఛమిదం శరీరమమరుజం యావజ్జరాదూరతో।**
**యావచ్చేంద్రియ శక్తిరప్రతిహతాయావత్క్షయంనాయుషః॥**
**ఆత్మశ్రేయసితావదేవవిదుషాతావత్ప్రయత్నో!**
**మహాన్సందీప్తేభవనేహికూపఖననంప్రత్యుద్యమఃకీదృశః॥**

తా॥ ఎంతకాలమువరకూ శరీరము రోగరహితమై బలంగా యుండునో, చాలాకాలం ముసలితనము శరీరమునకు రాకుండునో, ఎంతవరకు శరీరమున శక్తి తగ్గకుండునో, ఎంతవరకు శరీరమునకు మృత్యువు దూరంగా యుండునో, ఆలోపలనే బుద్ధిమంతుడు తను దైవకార్యములు ఆచరించి జీవన్ముక్తుడు కావలయును. శరీరానికి అనారోగ్యము, ముసలితనము వచ్చిన తరువాత వాటినివారణకొరకు ప్రయత్నించుట,"ఎట్లన" యింటికి నిప్పంటుకొని మండునపుడు, దానినార్పుటకు నూతినిత్రవ్వుచందముగా నుండును అని చెప్పినాడు. మరియూ

శ్లో॥ **వ్యాఘ్రీవతిష్ఠతిజరాపరితర్జయంతీ రోగాశ్చశత్రవ ఇవప్రహరంతిదేహం।**
**ఆయుః పరిస్రవతిభిన్నఘటాదివాంభోలోభస్తథాప్యహితమచరతీతి చిత్రం॥**

తా॥ బెదిరించుచూ పైకి దూకెడి పులివలే ముదిమివచ్చుచున్నది. శత్రువులవలే రోగములు శరీరశక్తినిహరించుచున్నవి. పగిలిన కుండలోని నీరు వలే రోజు రోజుకూ ఆయుష్షు తగ్గుచున్నది. అయిననూ జనులు అరిషడ్వర్గములలో చిక్కి ప్రవర్తించుట చాలా చిత్రముగా యున్నదని బ్రహ్మజ్ఞానాసక్తులందురు.

శిష్యుడు: గురుదేవా!మూడుతోగల సర్వ విషయములను తెలియజేయండిస్వామీ!

**ఈషణత్రయములు**

గురువు: **ధనేషణ:** ధనముయందు ఆశతో మోహముతో యితర విషయములందు శ్రద్ధలేకపోవుట.

**దారేషణ:** భార్యయందలి మోహముతో యితర విషయములందు శ్రద్ధలేకపోవుట.

**పుత్రేషణ:** పుత్రులయందు మోహముతో యితర విషయములయందు శ్రద్ధలేకపోవుట.

**వాసనత్రయములు**

**దేహవాసన:** దేహమేశాశ్వతమని ధనం వెచ్చించుతూ, గృహము పరిచారిక సేవలతో సుఖించవలెనను ఆలోచనలతో నుండుట. బ్రహ్మజ్ఞానశూన్యుడగుట.

**శాస్త్రవాసన:** గురువుల వలన, గ్రంథపఠనములచే సకల శాస్త్రములనభ్యసించి శాస్త్రజ్ఞానియై వేదికలందు ఉపన్యసిస్తూ మదపుటేనుగు వలే హుంకరిస్తూ బ్రహ్మజ్ఞానశూన్యుడగుట.

**లోకవాసన:** పురాణాదులయందు చెప్పబడిన క్షేత్రములలో తీర్థయాత్రలు చేయుచూ, యిదియేమోక్షప్రదమని భావించి క్షేత్రములు తిరుగుచూ, బ్రహ్మజ్ఞానశూన్యుడగుట.





**గుణత్రయములు**

**సత్వము:** జనలోకములో యోగ్యమగు కర్మలనాచరించుగుణములు కలుగుట.

**రజస్సు:** జనలోకములో తన గొప్పను ప్రదర్శించు కర్మలనాచరించుగుణము కలుగుట.

**తమస్సు:** పరమమూర్ఖత్వముతో జనులను చేతలతో మాటలతో హింసిచు గుణము కలుగుట.

**సంగత్రయములు**

**అంతఃసంగ:** మనస్సునందు అనేక సంకల్పములతో నుండుట.

**మధ్యసంగము:** లోకపారమార్థికములలో ఒకదానియందైనా స్థిరములేక యుండుట.

**బాహ్యసంగము:** యిహలోక కోర్కెలందు తాపత్రయముతోనుండుట.

**అతిబంధత్రయము**

**భూప్రతిబంధము:** పూర్వజన్మలందు సంప్రాప్తించిన కర్మలవలన ప్రస్తుతజన్మలో ఎన్నిసార్లు జ్ఞానాభ్యాసము చేసినను తత్కర్మఫలమున ఏదో రూపమున విఘ్నములు జరిగి జ్ఞానము లభించదు.

**వర్తమాన ప్రతిబంధము**

భార్యాపుత్ర, భూ, ధనగృహాదులు, లోకవిద్యయు, జ్ఞానాభ్యాసమునకు, విఘ్నములు జరిగి జరుగుతున్నకాలమున ఆత్మజ్ఞానము లభించదు.

**ఆగామి ప్రతిబంధము**

రాబోవు కాలమందైననూ, జ్ఞానసముపార్జనకు ప్రయత్నించుదమన్నతనకు గల జీవన విధానము వలన ఆటంకములు కలిగి మనసునందలి కోర్కె సఫలము కానేరదు.

**త్యాగత్రయము**

**సాత్వికత్యాగము:** మానవులు యజ్ఞయాగాది క్రతువులను నిత్యానుష్ఠానములు చేస్తూ ఏ ఫలితములను కోరకయుండుట

**రాజసత్యాగము:** మానవులు యజ్ఞయాగాది అనుష్ఠానములు చేయుట శరీరానికి బాధాకరమని చేయకుండుట.

**తామసత్యాగము:** మానవులు యజ్ఞయాగాద్యనుష్ఠానములు ఆచరించుట కాలయాపనయని యిహలోక భ్రాంతులతో చేయకుండుట

**జ్ఞానత్రయము**

**సాత్వికజ్ఞానము:** సర్వభూతములందు తనవలే జీవాత్మయున్నదను భావముతో నుండుట

**రాజసజ్ఞానము:** సర్వభూతములందు తనవలేగాక జీవాత్మ వేరేగా భావించుట.

**తామసజ్ఞానము:** సర్వభూతములలో తనకు కావలసిన జీవములను స్వప్రయోజనమునకు మక్కువతో పెంచి వాడుకుని, తన అవసరము తీరిన పిదప వాటికి ద్రోహము చేయుట

**కర్మత్రయము**

**సాత్వికకర్మ:** ప్రేమ,పగలు లేకుండా ఏ ఫలితాన్ని ఆశించని విధంగా చేయబడే పనులు

**రాజసకర్మ:** అహంకారముతో ప్రతీదానికి ఫలితాన్నాశించి చేయుపనులు

**తామసకర్మ:** పంచమహాపాతకములయందు భయపడక మనసు నందలి కోర్కెతో ఎలాంటి పాపకార్యాన్నైనా చేయు పనులు.

**కర్తాత్రయము**

**సాత్వికకర్త:** యితరులకు ఆరోగ్యం ప్రసాదించుటే ధ్యేయంగా తాను చేయు పని సఫలమైననూ, విఫలమైననూ సమభావంతో కర్తవ్యమే ధ్యేయంగా కార్యములాచరించుట

**రాజసకర్త:** సంతోషశోక మిళితుడై తాజేయు కార్యములందు మాత్రము దృష్టిగలిగి కర్తవ్యమే ధ్యేయంగా కార్యములాచరించుట.

**తామసకర్త:** అతి మూర్ఖత్వంతో యోగ్యాయోగ్యములాలోచింపక అతి అజ్ఞానంతో కార్యములాచరించుట.

**బుద్ధిత్రయము**

**సాత్వికబుద్ధి:** చేయకూడని పని, చేయదగినపని, భయము, భయములేక, బంధము, విముక్తి, నిజము అబద్ధములను తెలుసుకొనునది.

**రాజసబుద్ధి:** చేయకూడని పని, చేయదగిన పని, రెండింటిని సత్యము, అసత్యములను గర్వంగా గుర్తెరిగినది.

**తామసబుద్ధి:** ధర్మబద్ధమగు కార్యములను అధర్మకార్యములుగను, అధర్మకార్యములను ధర్మ కార్యములుగనూ గుర్తెరిగినది.

**ధృతిత్రయము**

**సాత్విక ధృతి:** ధైర్యముతో అఖండమయిన యోగాభ్యాసమును చేయునది.





**రాజస ధృతి:** ధైర్యముతో ఫలాపేక్షను పొంది ధర్మార్థ కామములు చేయునది

**తామస ధృతి:** స్వప్న,భయ, శోక, కష్ట, మదములయందు అతిగా దిగులు పొందునట్లు చేయునది.

**సుఖత్రయము**

**సాత్విక సుఖము:** కార్య ఆరంభకాలమందు కష్టమయినది ఏదో, కార్యాంతరమందు అతి సుఖముగనుక అట్టి సుఖరూపమయినది.

**రాజససుఖము:** కార్యారంభమునందు సుఖము, అంతమందు దుఃఖరూపమయినది.

**తామససుఖము:** కార్యములు ఆది అంతములయందు ఏకప్రకారము కష్టరూపమయినది.

**భక్తిత్రయము**

**బాహ్యభక్తి:** సదా బాహ్యేంద్రియ విషయములతో శిష్యుడు అతిప్రేమతో గురువును పూజించుట.

**అనన్యభక్తి:** సదా అంతరేంద్రియములతో శిష్యుడు అతి ప్రేమతో గురువును అంతరమందు మననము చేయునది

**ఏకాంతభక్తి:** సదాపదునాలుగు లోకములు గురువేనని అంతరమున శిష్యుడు నిశ్చయించునది.

**కారణత్రయములు**

**వైరాగ్యము:** ఎల్లప్పుడూ సర్వమూ మిధ్యయని వైరాగ్యముతో నుండుట.

**భక్తి:** ఎల్లప్పుడూ సర్వకాల సర్వావస్థలయందు భక్తితో నుండుట.

**ఉపరతి:** ఎల్లప్పుడూ ఆత్మయందు పరమాత్మ సమాగమునకై పరితపించుచుండుట.

**దీక్షాత్రయము**

**బాహ్యదీక్ష:** సమస్తవస్తువాదుక సమయమందు కనబడు ప్రపంచం యావత్తు ఆత్మేయని నిశ్చయించి సంచరించేది.

**అంతరదీక్ష:** అంతఃకరణ చతుష్టయముచేత వచ్చెడి సకల కార్యములు యావత్తు ఏకము చేసి సర్వము ఆత్మకొరకే ప్రపంచమున భాగములుగా అవుతూవున్నది.

**పూర్ణదీక్ష:** వ్యవహారిక పారమార్థములయందు చేయబడే సకల పనులు యావత్తు నశించక తగినట్లు చేస్తున్నప్పటికీ సర్వమును అఖండాచలమని నిశ్చయించి ఆభావముతో నుండునది.

**రహస్యత్రయము**

**రహస్యము:** యోగసాధనలో ఆత్మను గుర్తించుటను గురించి తెలుపకుండుట.

**అతిరహస్యము:** ఆత్మ విషయములనే ప్రధానముగా చెప్పునది.

**పరాపరరహస్యము:** సంపూర్ణ అనుభవమును కలుగజేయునది.

**సమాధిత్రయము**

**అవ్యయసమాధి:** దేహేంద్రియములు, అంతఃకరణములు అణచి కొండరాతివలె చలనము లేకయుండునది

**సంచార సమాధి:** ఇంద్రియ విషయములు, అంతఃకరణముల చలనములేక ఒకచోట నిలకడలేకుండా సంచరించుతూ ఆత్మను పరమాత్మయందు ఐక్యము చేసి ఉంచుట.

**భోగసమాధి:** అంతఃకరణములనణచి, ప్రపంచ పారమార్థిక సంచార విషయములు గురుదీక్షను బొంది, సర్వ విషయములను ఆత్మయందు తలంచుతూ అఖండభావమును పొందియుండేది.

**బాహ్యసచ్చిదానంద త్రయము**

**సత్తు:** సర్వదేశములయందు సర్వకార్యములయందు సమస్త వస్తువులయందు కదలక నిండివున్నాడు పరమాత్మ

**చిత్తు:** అచలములో పుట్టినటువంటి అణువైయుండి సదా చలిస్తూ ఉన్నటువంటిది.

**ఆనందము:** ఈ చిత్తులో పుట్టి సమస్తలోకములు అయివున్నది.

**అంతఃసచ్చిదానంద త్రయము**

**సత్తు=** అనృతము= (హంస) **చిత్తు=** జడము=(తెలివి) **ఆనందము=** ఇంద్రియానందము= (దుఃఖాత్మికము)

**ప్రథమ అవస్థాత్రయము**

**ప్రథమావస్థ=** జాగ్రత్త/ **ద్వితీయావస్థ=** స్వప్నము/ **తృతీయావస్థ=** సుషుప్తి.

**శక్తిత్రయము**

**ప్రథమశక్తి=** ఇచ్ఛాశక్తి/ **ద్వితీయావస్థ=** క్రియాశక్తి / **తృతీయావస్థ=** ద్వేషశక్తి.





**మంటపత్రయము**

**శ్రవణమంటపము=** శ్రవణమనెడి పేరుగలది (విషయాలను వినెడిది)

**మనన మంటపము=** విషయాన్ని పదేపదే యోచించునది (శోచించడమను పేరుగలది)

**నిరుద్వసనమంటపము=** విషయసారమును అనుభవించెడి పేరుగలది.

**పురుషత్రయనిరూపణము**

**క్షరము=** పిపీలకాది బ్రహ్మపర్యంతమైన సర్వభూతములను క్షరుడని చెప్పబడును.

**అక్షరము=** సర్వభూతములకు అధికారమైన సంవిద్రూపమును కూటస్థుడనియు అక్షరుడనియు చెప్పబడును.

**ఉత్తమరూపుడు=** క్షరాక్షరములు లేనటువంటి అఖండ స్వరూపము పరమాత్మ(విరాట్)

**యాగత్రయము**

**బాహ్యాయాగము=** యజ్ఞ యాగములు, నిత్యానుష్ఠానములు చేయుట.

**అంతరయాగము=** శాక్తేయ ఉపాసనలు చేయుట.

**అంతరాంతరయాగము=** అఖండ బ్రహ్మానందమును పొందుట.

**లింగత్రయములు**

**స్త్రీలింగము=** జగత్ సర్వము (ప్రకృతి) స్త్రీ లింగము.

**పుంలింగము=** జగత్తుకాధారుడైన కూటస్థ చైతన్య పురుషుడు.

**నపుంసకలింగము=** గుణరహితమయిన సమయమందు పైరెండు లేనివిగనుక నపుంసక లింగము.

**అర్థత్రయములు**

**బాహ్యార్థము=** భక్తిజ్ఞాన వైరాగ్యములను విచారణ చేయునది

**లక్ష్యార్థము=** యోగ, జ్ఞాన, విషయములయందున్న స్వానుభవము

**భావార్థము=** పరిపూర్ణ ముక్తిని పొందెడి ఆచరణములు.

**కాలత్రయ నిరూపణము**

**భూతకాలము=** గతంలో జరిగిపోయినకాలము.

**వర్తమాన కాలము=** ప్రస్తుతము జరుగుచున్న కాలము.

**భవిష్యత్కాలము=** ముందుగా జరుగబోవు కాలము.

**ప్రతిబింబత్రయము**

**బింబము**= మూల ప్రకృతి / **ప్రతిబింబము**= చైతన్యమయిన శుద్ధ ప్రకృతి.

**ప్రతిబింబాంతర బింబము**= ఈయంశయందు బుట్టిన జడరూపమైన తెలివి.

**కర్మత్రయ నిరూపణ**

**అంతఃకర్మ**= మనస్సు, బుద్ధి, చిత్తముల చేత తలంచి నిశ్చయించి సమాధానమును పొందినది.

**మధ్యకర్మ**= జ్ఞానేంద్రియములయందు గల పనుల చేత బుట్టినది.

**బాహ్యకర్మ**= కర్మేంద్రియములచేత చేసిన పనులవలన రాబడినది

**అండత్రయ విచారము**

**బ్రహ్మాండము**= పంచభూతములతో కలసి వుండేది(జగత్)

**పిండాండము**= పంచకోశములతో గల శరీరము.(84 లక్షల జీవరాసులు)

**అండాండము**= పంచరంగులు గల తేజో రూపమయిన నేత్రము.(దృష్టి నిచ్చునది)

**భిన్నాదిత్రయ వివేకము**

**భిన్నము**= భూర్భువస్సువలోకములు / **అభిన్నము**= పంచభూతములు = **భిన్నాభిన్నము**= ఆత్మ

**ఆనందత్రయములు**

**విషయానందము**= పంచవిషయములచేత రాబడే ఆనందము

**విద్యానందము**= అంతఃకరణల చేత రాబడే ఆనందము

**బ్రహ్మానందము**= విషయానందము, విద్యానందము నశిస్తే వచ్చేది

**బ్రాహ్మణత్రయ విచారము**

**ప్రణవము**= నిజ ప్రణవమే ఒక బ్రాహ్మణుడు / **తత్ శబ్దం**= ఆ శబ్దమునకు కారణమే ఒక బ్రాహ్మణుడు / **సచ్ఛబ్దం**= ఆ శబ్దసాక్షియే (తెలివి) ఒక బ్రాహ్మణుడు.

**అంతరనాడీ త్రయము**

**ఇడ,పింగళ, సుషుమ్న**= ఈ మూటినివరుసగా, గంగా, యమున, సరస్వతి యందురు

**తత్వత్రయము**

ఆత్మ తత్వము, విద్యాతత్వము, పరతత్వము





**అభ్యాసత్రయములు**

**శ్రవణము**= సమస్త వేదార్థములు వినుట/ **మననము**= విన్నదానిని సదాతలచుట / నిధిధ్యాస = మనసునందు నిలిపి అనుభవించుట

**వర్ణత్రయములు**

అకార, ఉకార, మకారములు

**కుండలిత్రయము**

**ఆధారకుండలి**= మూలాధారమందుగల కుండలిని అనే శక్తి

**మధ్యకుండలి**= అనాహత చక్రమందున్న కుండలిని అనే శక్తి

**ఊర్ధ్వకుండలి**= విశుద్ధచక్రమునుండి బలముతో భేదించుకొని పోయే కుండలిని అనే శక్తి.

**గ్రంథి త్రయము**

**బ్రహ్మగ్రంథి**= మూలాధారమందున్నది / **విష్ణు గ్రంథి**= మణిపూరకమందున్నది / **రుద్ర గ్రంథి**= ఆజ్ఞా చక్రమందున్నది

**రాజయోగలక్ష్య త్రయములు**

**బాహ్యలక్ష్యం**= గురువుచే చెప్పబడిన నిర్గుణ విషయమైన అనుభవము, మనస్సున నిశ్చయించుకొని బయలందు వాటిని చూచుట

**మధ్యలక్ష్యం** = బయలందు చూచిన సమస్త విషయార్థములను తనయందు నిలుపుకొనుట

**అంతర్లక్ష్యం**= తనయందులయం చేసుకున్న సమస్త అర్థములను తనలో స్వస్వరూపముగా జూచుట

**బంధత్రయము**

**మూలబంధము**= మూలాధార కుండలిని పెకళించుట / **ఓఢ్యాణబంధము**= నాభియందు ప్రాణ, అపానవాయువులను కలిపి విష్ణుగ్రంథిని భేదించుట.

**జాలంధర బంధము**= విశుద్ధచక్రమందు నిలిచి (స్థూల శరీర స్పృహ కోల్పోయి) ఊర్ధ్వ కుండలీ భేదనముచేయుట.

**దృష్టిత్రయము**

**ప్రతిమాదృష్టి**= భూచరీముద్ర సంబంధమయిన యొక కళాదృష్టి.

**పౌర్ణమి దృష్టి**= శాంభవీముద్ర సంబంధమయిన అర్ధోన్మీలితమైన సంపూర్ణ చంద్రికా దృష్టి.

**అమావాసదృష్టి**= షణ్ముఖి రాధాముద్రల సంబంధమయిన మహేంద్ర దృష్టి.

**అంతర అవస్థా త్రయములు**

**జాగ్రత్తలో జాగ్రత్త**= సదా తన్నుతా గుర్తెరిగియుండేది.

**స్వప్నములో స్వప్నము**= అంతఃకరణ చేత పుట్టబడిన్న కార్యములను స్వప్నావస్థవలెనే గుర్తెరిగి ఉండుటయే.

**సుషుప్తిలో సుషుప్తి**= సదా తుర్యమునందు ఐక్యమయి ఈ రెంటిని మరచియుండేది.

**లక్షణత్రయము**

**జహర్లక్షణము**= జీవలక్షణము / **అజహర్లక్షణము**=ఈశ్వర లక్షణము/ **జహదజహర్లక్షణము**= కూటస్థ చైతన్య లక్షణము.

**ఆధాత్మత్రయ సంశయములు**

**ఆధ్మాత్మికతా దాప్యము**= జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియ పంచకము, అంతఃకరణ చతుష్టయము. **ఆది భూతకతాదాప్యము**= పైవాటి క్రియలు. **ఆది భౌతికతా దాప్యము** = పైవాటి అధిపతులు.

**తాదాప్య త్రయ నిర్ణయము**

**సహజతాదాప్యము**= అంతఃకరణ చతుష్టయములు ఐక్యమయినది.

**కర్మదతా దాప్యము**= మనోహంకారములు కలసి చేయబడిన పనులు.

**భ్రాంతి జన్యతా దాప్యము** = వాసనాత్రయము వదలని వలన కలుగు మనో చాంచల్యము.

**మండల త్రయములు**

**అగ్నిమండలం**= నాభియందు గలదు / **చంద్రమండలము** = కంఠమందు గలదు / **సూర్యమండలము** = నేత్రమందుగలదు.

**అద్వైతత్రయము**

**ద్రవ్యాద్వైతము** = పాంచభౌతిక అనే ద్రవ్యము ఒకటియని నిశ్చయించుట.

**క్రియాద్వైతము**= పాంచభౌతికము చేత చేయబడిన క్రియలు సమస్తము ఏకమనిపించుట.

**భావాద్వైతము**= పై రెండిటియొక్క సంధి సంపూర్ణమైన భావము ఒకటేయని నిశ్చయించుట.

**నాదబిందు కళ స్వరూపము**

**నాదము**= పంచభూతములయొక్క గుణములు యావత్తూ నాదము.





**బిందువు**= మనో, బుద్ధి, చిత్తములను ఒకటిగా చేసేది.

**కళ**= క్షేత్రజ్ఞ, ప్రత్యగాత్మ, చైతన్యములను ఒకటిగా చేసేది.

**అపరోక్ష లింగత్రయము**

**ప్రాణలింగము**= జాగ్రత్త అవస్థయందు సంచరించే ప్రాణాది దశ వాయువుల యొక్క కార్యములు అయిక్యము.

**ఇష్టలింగము**= స్వప్నావస్థయందు సంచరించేయే సప్తదశకంగలదో, వీటిలో కలిసేది.

**బావలింగము**= అఖండశబలమై నిలిచిఉండేది.

**దృష్టిత్రయము**

**బాహ్యదృష్టి**= పరోక్షమున ఒకటిగా చూచునది.

**అంతర దృష్టి**= పరోక్షమును అపరోక్షమందు ఐక్యము చేసుకొనునది.

**భావదృష్టి**= పరోక్షాపరోక్షములు లేక నిలిచినది.

**పంచాక్షరీ త్రయము**

**జీవపంచాక్షరి**= లవరయహ / **ఈశ్వర పంచాక్షరి** = అ, ఉమయఓం / **మధ్య పంచాక్షరి** = నమశ్శివాయ.

**భూమాత్రయ నిరూపణ**

**దుఃఖము** = ప్రపంచమునందు ఉండే అవిద్యా సంబంధమగు భ్రమ.

**సంభ్రమము**= ఆత్మ ఐక్యమందు ఉత్సాహమును పొందుతూ ఉండునది.

**ఆనందాభ్రమము**= సర్వమునందు అఖండాచలముగ చేసుకుని ఆనందమునందు ఐక్యమై పరమానందముతో ఉన్నది.

**కాంతాత్రయము**

**బహిఃకాంత**= పరోక్షమందు ఉండే పంచభూత సంబంధమయిన పంచశక్తి స్వరూప కాంతి.

**అంతఃకాంత**= పంచశక్తులు ఐక్యమయి ఏకశక్తి అయి నిలిచినది.

**ముక్తికాంత**= సర్వమును భేదించి గురుముఖతా రాబడ్డయేజ్ఞానముకలదో దానియందు ఐక్యమయి ఉండేది.

**ప్రణవత్రయము**

**బాహ్యప్రణవము**= పిపీలికాది బ్రహ్మ పర్యంతము పదునాలుగు భువనములతో నిండి అఖండ నాదమును పలుకుచుండునది.

**అంతఃప్రణవము**= సహస్రార కమలమందు నివసించి తుమ్మెద నాదముచేస్తూ వుండునది.

**యోగ ప్రణవము**= గ్రంథిత్రయమును భేదించుకొని బ్రహ్మ కవాటము దాటి బయలు వెళ్ళునది.

**విరాట్ త్రయ విచారము**

**విరాట్**= బాహ్యస్థితి చతుర్దశ భువన రూపమైయున్న చిన్మయుని పేరు

**స్వరాట్**= అంతటాయుండే యే స్వరము కలదో అట్టి స్వరమునకు ఆధారమైయున్న చిన్మయుని పేరు

**సాంమ్రాట్**= విరాట్, స్వరాట్‌ల యొక్క మధ్యయందు గల చిన్మయుని పేరు.

**పరత్రయ విచారము**

**పరః** = చతుర్దశ భువనములు / **పరతరం** = బ్రహ్మ ప్రపంచకము / **పరాత్పరం** = సంపూర్ణమైన ఆత్మ.

**కళాత్రయము**

**చంద్రకళ** = 16 కళల స్వరూపము / **సూర్య కళ** = 12 కళల స్వరూపము / **అగ్ని కళ** = 10 కళల స్వరూపము **యివియే చిత్తము, బుద్ధి, అహంకారములు.**

**ఆకాశత్రయము**

**ఘటాకాశము**= పిండాండముతో ఉండేది / **మఠాకాశము** = బ్రహ్మాండమున మధ్యన ఉండేది / **మహదాకాశము** = పిండాండ బ్రహ్మాండములకు ఆధారమయి ఉన్నది.

**శిష్యా!** త్రయ సంబంధమగు విషయములన్నియూ తెల్పితిని. వీటిని వివేకముతో గ్రహించుము.

**శిష్యుడు :** గురుదేవా యింకనూ యిట్టి విషయములన్నీ తెల్పుము స్వామీ.

**గురువు :** శ్రద్ధగా వినుముశిష్యా !

**సప్తపుర సౌజ్ఞ**

**జ్ఞానపురము**= జ్ఞానేంద్రియ పంచకం ఒక పురము / **కర్మపురము**= కర్మేంద్రియ పంచకము / **అంతఃపురము**= అంతఃకరణ చతుష్టయము / **త్రైగుణ్యపురము** = గుణత్రయము /





**కాలపురము** = పూర్వ సంచితమైన కర్మ / **అపంచీకృత భూత పురము**= తన్మాత్రలు కలసినది / **ఈశ్వరపురము** = వాయుదశకము (దశవాయువులు).

**అష్టతను ప్రశంసలు**

**స్థూలదేహము**= పంచభూతములతో కూడినది / **సూక్ష్మదేహము** = పంచలింగములతో కూడినది / **కారణ దేహము** = హంసమయమయినది / **తుర్య దేహము** = ప్రణవమయమయినది / **ఆనందదేహము** = ఉత్సాహముతో కూడినది / **భిన్న దేహము** = ప్రకృతి పురుషులతో కూడినది / **చిద్రూప దేహము** = కేవలము ప్రకృతి దేహమయినది / **శుద్ధాంగలింగ దేహము**= శుద్ధ స్ఫటిక ప్రకాశ దేహమయమైనది.

**అష్టాత్మక నిరూపణము**

**జీవాత్మ** = జ్ఞానావస్థయందు జీవుడే ఆత్మయని భ్రమ చెందుట / **అంతరాత్మ**= హంసయే ఆత్మయని భ్రమ చెందుట / **పరమాత్మ**= నిజప్రణవమే ఆత్మయనడము / **నిర్మలాత్మ** = ద్వివిధ ప్రణవములు ఐక్యమయి ఆత్మ యనడము / **శుద్ధాత్మ** = మనోకల్మషములు రహితమయి అంతరమందు బ్రహ్మము ప్రకాశిస్తూ ఉన్నదనుట / **జ్ఞానాత్మ** = అంతరబాహ్యమును జ్ఞాన రూపమనుట / **భూతాత్మ** = పంచభూతములు ప్రకృతి యని నిర్గుణమయినందున ఆత్మయనుట / **మహదాత్మ**= అంతా మహదాత్మయే కానీ యితరము కాదనుట.

**సప్తవ్యసనములు**

**తనువ్యసనము**= దేహపోషణయందు అతి శ్రద్ధ కలిగియుండుట / **పానవ్యసనము** = మద్యపానమందాసక్తి కలిగియుండుట / **క్రీడా వ్యసనము**= జూదము మొదలగు ఆటలయందు ఆసక్తి కలిగియుండుట / **వాగ్వ్యసనము** = అతిగా ఉపన్యాసములు చెప్పుటయందు ఆసక్తి కలిగియుండుట / **కామవ్యసనము** = అతిగా స్త్రీ సంపర్కమందును, అసంభరిత కార్యములందు ఆసక్తి కలిగియుండుట / **కర్మ వ్యసనము** = మోక్ష సంబంధమయిన పాప, పుణ్య కర్మలయందాసక్తి కలిగియుండుట / **ఉత్సాహ వ్యసనము** = విషయములు తెలుసుకొనవలయునను కోరిక కలిగియుండుట

**సప్తశక్తి స్వరూపము**

**శాకిని**= నోటిని (త్వక్కు) ఆశించి ఉండేది / **డాకిని** = రక్తమును ఆశించి ఉండేది / **లాకిని** = మాంసమును ఆశించి ఉండేది / **కాకిని** = మెదడును ఆశించి ఉండేది /

**సాకిని** = ఎముకను ఆశించి ఉండేది / **హాకిని** = ముఖమును ఆశించి ఉండేది / **యాకిని** = శుక్లమును ఆశించి ఉండేది

**సప్తావరణ లక్షణము**

**పృథివి**= మొదటి యావరణ / **ఉదకము** = రెండవయావరణము / **తేజస్సు** = మూడవయావరణము / **వాయువు** = నాలుగవ యావరణము / **ఆకాశము** = అయిదవ ఆవరణము / **ఎఱుక** = ఆరవ యావరణము / **మహత్తత్వము** = ఏడవ యావరణము

**అరిషడ్వర్గములు**

**కామము**= కోర్కెలు కలగడము / **క్రోధము** = హింస చేయడము / **మోహము**= ఆశను పొందుట / **లోభము** = లోభితనము / **మదము** = గర్వించడము / **మాత్సర్యము** = యితరుల ఔన్నత్యమును చూచి సహించలేకపోవుట.

**అష్టమద నిరసనము**

**గ్రామము** = ఉత్తమగ్రామవంతుడనునది / **కులము** = ఉత్తమ కులవంతుడనుకొనునది / **అర్థము**= అతి ధనవంతుడననునది / **విద్య**= విశేష విద్యావంతుడనునది / **రూపము** = అతి అందగాడనుకొనుట / **యవ్వనము** = మంచి వయసున బలవంతుడననుకొనుట / **క్షేత్రము** = యింద్రభవనమువంటి యిల్లుగలవాడిననుకొనుట / **ధాన్యము**= పెక్కు ధాన్య సంపదగలవాడిననుకొనుట.

**ఉత్తరమదాష్టకము**

**స్తోత్రము** = యితరుల పొగడ్తలకు ప్రియుడై యుండుట.

**సర్వకార్య నిరసనము** = మంచిపనులను అజ్ఞానముచే తృణీకరించుట.

**మూఢ దశావర్తనం** = నిజమును తెలుసుకోలేక మూఢునిగా ప్రవర్తించుట.

**కాపట్యము** = మనసునకుచ్చితభావముతో ప్రవర్తించుట.

**అతిమోహము**= పొగడ్తలకు పొంగి వారు కోరినదిచ్చుట.

**అతి వాగాడంబరము** = ఎల్లప్పుడూ తన గొప్పలను తానే అతిగా చెప్పుకొనుట.

**సంచారము** = ఎక్కడ ఏమున్నదోనని భ్రాంతితో దేశ సంచారము చేయుట.

**మరణభయము** = ఎప్పుడు ఎలా మరణము సంబవించునోయని భయపడుతుండుట.

**అష్టపాశములు**

**లజ్జ**= అతి సిగ్గుతో ఉండుట / **భయము** = అతి భీతితో నుండుట / **రుణము** = సంపాదన తక్కువై సమాజమెప్పుకై అప్పు చేయుట / **శంక** = ఎప్పుడూ ప్రతీదానికి





అనుమానించుట / **జుగుప్స** = ప్రతీదానికీ అతిగా విచారించుట / **కులము** = మాకులమే గొప్పదనుకొనుట / **బలము** = నాకు గొప్ప బలము కలదని యోచించుట / **వ్రతము** = నియమ నిష్టలను అతిగా పొందుట

**అష్టకష్టములు**= భార్యలేకపోవుట ఉండిమాటు వినకపోవుట

**ఋణభాధ**= తన గొప్పలకు అప్పుచేసి కార్యములాచరించి బాధలుపడుట / **బీదయాచన** = తను పోషణకై అడుక్కొనుట కొందరిచే లేదనిపించుకొని సమాజంలో హీనముగా జీవించుట / **దారిద్ర్యము** = జీవనయాత్రకు యిబ్బంది పడుట/ **వార్ధక్యము** = శరీరము శక్తి హీనమగుట / **దాసిత్వము** = యితరులకు చాకిరీ చేయుట / **రోగము** = వ్యాదులచే బాధలనొందుట / **దేశత్యాగము** = స్వదేశమును వదలి పరదేశములకు పోవుట

**అష్టభోగములు**

**సుగంధము**= కస్తూరి, జవ్వాది మొదలగు సువాసనలయందు ప్రీతి / **వస్త్రములు** = పట్టుపీతాంబరాదులందు ప్రీతి / **స్త్రీభోగము**= అందమగు స్త్రీలయందు ప్రీతి / **గానము**= సంగీతము వినుట, ఆవిద్య అభ్యాస యందు ప్రీతి / **భోజనయిచ్ఛ**= నవకాయ పిండివంటలతో మృష్టాన్న భోజనములందు ప్రీతి / **అభ్యంగనము** = సుగంధమిళితమగు జలస్నానమందు ప్రీతి / **శయ్య** = మెత్తని పరుపులు సున్నితమగు వస్త్రములపై పవళింప ప్రీతి / **భూషణములు** = నవరత్నఖచిత సువర్ణ దివ్యాభరణధారణయందు ప్రీతి.

**అష్టాంగరాజయోగములు**

**యమ**= వైరాగ్యము కలగడము / **నియమ**= పూర్ణభక్తిని పొందడము / **ఆసన**= సదాసంతోషము పొందడము / **ప్రాణాయామము**= వాయుస్థంభనము చేయడము / **ప్రత్యాహార** = కలిగినదానితో నిత్యానందము పొందడము / **ధ్యాన** = సదా చిన్మయస్వరూపము చూడటము / **ధారణ** = నిశ్చలదృష్టిని సాధించడము / **సమాధి** = యోగధ్యానమందు నిరంతరము పూర్ణ సమాధిని పొందడము

**షడ్విధముక్తి విచారము**

**సాలోక్యము**= కళా సందర్శనమగుట/ **సామీప్యము**= సారమును తెలిస్తే వచ్చేది / **సారూప్యము**= అంతఃకరణచతుష్టయం ఒకటితో ఒకటి ఐక్యమయినపుడు ఒకటిగా నిలిస్తే వచ్చేది / **సాయుజ్యము**= చిత్తుయందు అనగా శుద్ధ ప్రకృతిరూప ప్రణవమందు ఐక్యమయితే వచ్చేది/ **సారిష్ణ్యము**= పరోక్షమును అపరోక్షమందు ఐక్యము చేసుకుని

పరిపూర్ణ అనుభవమందు నిత్యసమాధియుక్తుడయితే వచ్చేది/ **విదేహము**= ద్వందాతీతుడయిన ఆత్మ ఐక్యమయితే వచ్చేది.

**పర్వదిన పంచకము**

1. పూర్ణిమ, 2. అమావాస్య, 3. సూర్యసంక్రమణ దినము, 4. కృష్ణపాడ్యమి, 5. కృష్ణ చతుర్దశి.

**భ్రాంతి పంచకము**

**రజ్జుసర్పభ్రాంతి**= తాడును చూచి సర్పమని భ్రమించుట.

**శుక్తి రజిత భ్రాంతి**= ముత్యపుచిప్పను చూచి వెండియని భ్రమించుట.

**మరుమరీచిక భ్రాంతి**= యండమావులను చూచి నీరని భ్రమించుట.

**స్థాణుపురుష భ్రాంతి**= ఎండిన మొద్దును చూచి పురుషుడని భ్రమించుట.

**సుషుప్తి దినభ్రాంతి**= పగలు నిద్రపోయి మేల్కొంచి ఉదయమని భ్రమించుట.

**పంచవింశతి తత్వనిర్ణయము**

**జ్ఞానేంద్రియములు**= శోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణములు.

**కర్మేంద్రియములు**= వాక్కు, పాణి, పాదము, గుదము, మర్మావయవము.

**వాయుపంచకము**= ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాయువులు.

**పంచతన్మాత్రలు**= శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధములు.

**ఆకాశపంచకము**= మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, జ్ఞాత.

**పంచభూత లక్షణము**

**భూగుణవృత్తి**= గంధము, కఠినము, ధారణ ఈ మూడును భూమికిగల గుణస్థితి సత్తాలు.

**ఉదకగుణవృత్తి**= షడ్రసములు గ్రహించుట, చలించుట, కలుసుకొనుట ఈ మూడును నీటికిగల గుణవృత్తి స్థితులు.

**తేజోగుణ వృత్తి**= రూపము, ఉష్ణము, పచనము ఈ మూడును తేజస్సు యందుగల గుణ వృత్తి స్థితులు.

**వాయుగుణవృత్తి**= స్పర్శ, చలనము, గమనము ఈ మూడును వాయువునందుగల గుణవృత్తి స్థితులు.

**ఆకాశగుణవృత్తి**= శబ్దము, సుషిరము, సర్వవ్యాపకము ఈ మూడును ఆకాశమునందుగల గుణవృత్తి స్థితులు.





**పంచభూతాంశలు**

**పృథివీసంబంధము**= ఎముకలు, రోమములు, మాంసము, చర్మము, నరములు.

**ఉదకసంబంధము**= మెదడు, మూత్రము, రక్తము, శుక్లము, అమేధ్యము.

**తేజస్సంబంధము**= ఆకలి, దప్పిక, మాంద్యము, సంగమము, నిద్ర.

**వాయు సంబంధము**= అడ్డగించుట, చలించుట, ఓర్పు, అధోగతి పొందుట, నిలుచుట.

**ఆకాశ సంబంధము**= భయము, మోహము, క్రోధము, లోభము, కామము.

**పంచశక్తి స్వరూపము**

**క్రియాశక్తి**= కర్మేంద్రియములచే చేయబడు క్రియలన్నియూ క్రియాశక్తి స్వరూపము.

**ఇచ్ఛాశక్తి**= తన్మాత్రలచేత చేయబడు క్రియలన్నియూ ఇచ్ఛాశక్తి స్వరూపము.

**జ్ఞానశక్తి**= జ్ఞానేంద్రియముల చేత చేయబడు క్రియలన్నియూ జ్ఞానశక్తి స్వరూపము.

**ఆదిశక్తి**= వాయుపంచకము చేత చేయబడు క్రియలన్నియూ ఆదిశక్తి స్వరూపము.

**పరాశక్తి**= ఆకాశపంచకముచేత చేయబడు క్రియలన్నియూ పరాశక్తి స్వరూపము.

సూచన=పంచభూతగుణముల పంచీకరణ నాచే వ్రాయబడిన **శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వరసంవాద గ్రంథార్థముల గ్రంథమందు కలదు.**

**వ్యాపార పంచకము**

**ఆకాశకార్యము**= జ్ఞాతసమానవాయువును కలుసుకొని శ్రోత్రమునకు వచ్చి శబ్దమును విని వాక్కు మూలముగా బయల్పడును.

**వాయుకార్యము**= మనస్సు వ్యానవాయువును కలుసుకొని చర్మమునకు వచ్చి స్పర్శను గ్రహించి పాణి మూలముగా బయల్పడును.

**తేజోకార్యము**= బుద్ధి ఉదానవాయువును కలుసుకొని నేత్రమునకు వచ్చి రూపమును చూచి పాదము మూలముగా బయల్పడును.

**ఉదకకార్యము**= చిత్తము అపానవాయువును కలుసుకొని జిహ్వకువచ్చి రసమును అనుభవించి, ఉపస్థమూలముగా బయల్పడును.

**పృథివీ కార్యము**= అహంకారము ప్రాణవాయువును కలుసుకొని నాశికమునకు వచ్చి వాసనను గ్రహించి గుదమూలముగా బయల్పడును.

**పంచకోశ నిర్ణయము**

**అన్నమయకోశము**= అన్నముచేత వృద్ధి నొందునది.

**మిత్రులు**= అంతఃకరణ చతుష్టయము/ **శత్రువులు** = మనసునందలి కోర్కెలు / **బంధుజనులు** = ఇంద్రియాదులు / **సోదరులు** =త్రిగుణములు / **నివాసస్థానము** = త్రిపురములు / **దరిద్రము** = అజ్ఞానము / **భాగ్యము** = జ్ఞానము (అపరోక్ష జ్ఞానము / **పరిచారకులు** = కర్మేంద్రియములు / **మహాభోగము** = బ్రహ్మానందము.

### చతుర్విధ శుశ్రూషలు

**అంతర శుశ్రూష**= గురువుయొక్క సర్వకార్యములను శిష్యుడు అతి శ్రద్ధతో నిర్వహించుట.

**అంగ శుశ్రూష** = గురువుయొక్క శరీరానికి శిష్యుడు అతి భక్తితో సేవలు చేయుట.

**స్థాన శుశ్రూష** = గురువుయొక్క గృహాన్ని ధనధాన్యములను వస్తువులను అతి ప్రేమతో కాపాడుట.

**భావ శుశ్రూష** = తల్లి, తండ్రి దైవము గురువేనని నిశ్చయించుకొని వినయ విధేయతలతో నుండుట.

### సాధన చతుష్టయము

**నిత్యానిత్య వివేకము**= ఆత్మ నిత్యమనిన్నీ, జగత్ అనిత్యమనిన్ని తెలుసుకొనుట.

**ఇహాముత్రార్థఫలభోగ విరాగము** = ఈలోకమందు, పరలోకమందునూ గల భోగములు అనిత్యమని తెలియుట.

**అధికారము** = సాధన చతుష్టయసంపత్తి కలుగుట, అనుబంధ చతుష్టయము/**సంబంధము** = వేదాంత విద్యాసముపార్జన / **విషయము** = బ్రహ్మవిద్యా ఉత్తమమోత్తమైనది / **ప్రయోజనము** = నేతి నేతి వాక్యనిరూఢి.

### మునిచతుష్టయము

**బ్రహ్మవిదుడు** = బ్రహ్మమును గుర్తెరిగి సదా మననము చేయువాడు.

**బ్రహ్మ విదారుడు** = బ్రహ్మను గురించిన విషయములను సదాశ్రవణము చేయువాడు.

**బ్రహ్మ విద్వర్యుడు** = బ్రహ్మయందు ఆరూఢభావము గలవాడు.

**బ్రహ్మ విద్వరిష్ఠ** = బ్రహ్మయందు ఐక్యమంది శూన్యలింగస్తితి యందుండువాడు.

### జ్ఞానయజ్ఞ స్వరూపము

**యజమాని** = జ్ఞాత/ **అద్వర్యుడు** = అజ్ఞానమనే వహ్నిరహితమగు నేత్రము / **బ్రహ్మ** = మనస్సు / **అజ్ఞేదృడు** = శాస్త్రములు / **ఔద్గాత** = స్పరిశము / **ఋత్విక్కులు** = చిత్తము,





బుద్ధి, అహంకారములు / **దక్షిణాగ్ని** = శ్రోత్రము / **అవహనీయం** = నోరు / **గార్హపత్యం** = నేత్రం / **అగ్ని** = ఎడతెగని అఖండ బోధ / **యూపస్థంభము** = నిజశ్రవణము / **మంత్రము** = అనాహతచక్రమందలి నాదం / **పశువులు** = దశవాయువులు కర్మేంద్రియములు / **పత్ని** = ప్రకృతి / **పాత్రలు** = సప్తధాతువులు / **సోమం** = అమృతము / **అవబృధస్నాన ప్రవేశం** = భ్రూయుగమందు ప్రవేశం

### మానవస్థితరత్న చతుష్టయము

**విజ్ఞానము** = విషయములను గ్రహించుట / **సుజ్ఞానము** = యోగజ్ఞానము / **ప్రజ్ఞానము** = ఆత్మయందైక్యము చెందు జ్ఞానము / **స్థితప్రజ్ఞత** = అఖండానుభవమందు అతినిష్ఠ కలిగియుండుట.

### వివేకపురుష చతుష్టయము

**ఆర్తః** = జ్ఞాన విషయములందు అతి శ్రద్ధగలవాడు / **జిజ్ఞాసి** = జ్ఞానవిషయములందు గ్రంథాన్వేషకుడు / **అర్థార్థి** = మనోన్మని పొందుటకు తీవ్రసాధన చేయువాడు / **జ్ఞాని** = బ్రహ్మాన్ని పొందినవాడు.

### చతుర్విధ పురుషార్థములు

**ధర్మము**= వేదాంత విద్యా విచారణ / **అర్థము** = పరమ రహస్యాన్ని గ్రహించుట / **కామము** = ముక్తికాంత సంగమము / **మోక్షము** = నిర్వికల్ప సమాధి.

### చతుర్విధ యోగములు

**మంత్రయోగము** = ఏకాక్షరి, ద్వియక్షరి, పంచాక్షరి, షడాక్షరి, అష్టాక్షరి ద్వాదశాక్షరి మొదలగునవి జపించుట.

**లయ యోగము** = అనాహత చక్రమందు గల నాదమందు మనస్సును ఐక్యముచేయుట.

**హటయోగము** = వాయువును తన స్వాధీనము చేసుకొనుట.

**రాజ యోగము** = బాహ్యాంతరములయందు బ్రహ్మకళ నిండునట్లు చేయు సాధన.

### చాతుర్ధేహనిర్ణయము

**స్థూలదేహము/ అవస్థ** = జాగ్రము / **నేత్రములు** = స్థానము/ **గుణము** = రాజసము / **భోగము** = క్రియాయుక్తము / **అభిమాని**=విశ్వుడు

**సూక్ష్మదేహము/ అవస్థ** = స్వప్నము / **కంఠము** = స్థానము / **గుణము** = తమము / **ఆనందము** = భోగము/ **అభిమాని** = తైజసుడు

**కారణదేహము**/ **అవస్థ** = సుషుప్తి / **హృదయము** = స్థానము / **గుణము** = తమము / **ఆనందము** = మహాభోగము/ **అభిమాని** = ప్రాజ్ఞుడు

**మహాకారణ దేహముఅవస్థ** = **మరణము** / స్థానము = **సహస్రారము**/ గుణము = **గుర్తు** / **"మహానందభోగము"** **అభిమాని** = గురుడు

**చతుష్టయగుప్త సమాధి**

**పాణిద్వారము** = స్వవిషయము, పరవిషయములందు సువర్ణమును జారత్వముచే పట్టక ఉండుట.

**భగద్వారము** = అప్సర స్త్రీలయందైననూ కోరికలేక పత్నియొక్క కోరికచేత సంగమించుట.

**పరద్వారము** = అంతఃకరణ చతుష్టయమునకు ఎట్టి కార్యమునూ లేకుండా చేయుట.

**వాగ్ద్వారము** = మనసును బాధించునవి, అబద్ధములు, జీవన విగానమునకు కావలసిన మాటలను విడిచి, సత్యవాక్యములు, భగవత్ స్తుతి వాక్యములు పల్కుచూ, తతిమా సమయములందు మౌనముగా నుండుట.

**చతుర్విధ పురుష లక్షణములు**

**అధముడు** = ఇంద్రియములందు అతిలోలుడై నిరంతరము సంచరించెడివాడు.

**మధ్యముడు** = జ్ఞానవిహీనముచేత కర్మేంద్రియములను మాత్రము అరికట్టినవాడు.

**ఉత్తముడు** = జ్ఞానముచేత సుజ్ఞానముచేత జ్ఞానేంద్రియములను అరికట్టినవాడు.

**ఉత్తమోత్తముడు** = సర్వేంద్రియ విషయములను బ్రహ్మయందు ఐక్యము చేసి పూర్ణ సమాధినిష్టుడైనవాడు.

**మహావాక్య చతుష్టయము**

**ప్రజ్ఞానం బ్రహ్మ** = పదునాలుగు లోకములు ప్రకృతియని తెలిసిన ప్రజ్ఞ బ్రహ్మము.

**అహం బ్రహ్మోస్మి** = ఈ ప్రజ్ఞయే నేను గనుకనేనే బ్రహ్మము.

**తత్వమసి బ్రహ్మ** = త్వంపదమైన ఈశ్వరునితో తత్పదమయిన జీవునికి "అసిపదము" చేయుట, అనగా జీవుడు ఈశ్వరుని ఐక్యం చేసిన అంతా తత్వస్వరూపము.

**అయమాత్మా బ్రహ్మ** = బ్రహ్మనేనని తలంచు ఆత్మయే బ్రహ్మము.

**యుగచతుష్టయవర్తన**

**కృతయుగము**= ఉదయమున రెండుజాముల పర్యంతం చేసెడి స్నాన సంధ్యాదికము యావత్తూ కృతయుగ వర్తన.





**త్రేతాయుగము** = పగలు తక్కిన రెండు జాముల మట్టుకు చేసే గ్రంథాది పఠన మోక్షకార్యములు యావత్తు త్రేతాయుగ వర్తన.

**ద్వాపరయుగము** = సూర్యాస్తమైనది మొదలు రెండుజాములు పర్యంతము జరిగే క్రక్చందనవనితాదికము యావత్తు ద్వాపరయుగవర్తన.

**కలియుగము** = రాత్రి తక్కిన రెండు జాముల యందు జరిగే అవ్యక్త భాగము యావత్తూ కలియుగవర్తన.

**సర్వజన అనుభవ చతుష్టయము**

1 **ఆహారము** = నాలుగు విధములగు అన్నము / **నిద్ర** = ప్రపంచమందలి సర్వజీవులు నిద్రలో తనవారి వలనపరుల వలన భయమును / **మైధునము** = సకల జీవులు శరీర సంపర్కము / **కామాది సంచారము** = మనసునందలి కోర్కెలకై పరుగులిడి వాటిని పొందుట.

**యోగచతుష్టయ సాధనము**

**ప్రథమసాధనము** = సోహమని చేయునది / **ద్వితీయ సాధనము** = హంసయని చేయునది / **తృతీయ సాధనము** = ప్రణవమని చేయునది / **చతుర్థ సాధనము** = మూలాధారము మొదలగు సహస్రార పర్యంతము శోధించుట.

**వైఖరీ చతుష్టయము**

**పరా**= మూలాధారమందు పుట్టినవాక్కు / **పశ్యంతి** = మణిపూరకమందు పుట్టినవాక్కు / **మధ్యమ** = అనాహతమందు పుట్టినవాక్కు / **స్థూల వైఖరిని ఆపి సూక్ష్మ వైఖరి** = విశుద్ధ చక్రమందు పుట్టిన వాక్కు

**ప్రథమ ఉపాస్యక చతుష్టయము**

**మోచక ప్రథము** = సాంబమూర్తిని ఉపాసించితే ఈ శివుడు గురువును యిచ్చును.

**యోచన**=గురువు సద్గురుని ఉపాసనచేసే విధానమును చెప్పును.

**ముక్తిసాధనము** = సద్గురు ప్రోక్తమైన సాధన ప్రకారము సాధన చేసినచో.

**ముక్తి** = మోక్షము లభించును.

**వేదచతుష్టయము**

**ఋగ్వేదము** = పృధివి, అగ్ని ఉదకము, ఈ మూడూ కలిసినది.

**యజుర్వేదము** = వాయువు, ఆకాశము ఈ రెండు కలిపినది.

**సామవేదము** = సూర్యచంద్రులు కలిసినది.

**అధర్వణవేదము** = పై మూడు వేదములు ఐక్యమయినది

**ప్రణవవేదము** = పైనాలుగు వేదములసారము (సృష్టి రహస్యము తెలుపునవి)

**పాదచతుష్టయము**

**అవిద్యాపాదము** = అజ్ఞానపాదము / **సువిద్యాపాదము** = జ్ఞానపాదము / **ఆనందపాదము** = పూర్ణానందపాదము / **తుర్యపాదము** = బ్రహ్మపాదము.

**వ్యష్టి ఈశ్వర చతుష్టయము**

1. విశ్వ 2. తైజస 3. ప్రాజ్ఞ 4. ప్రత్యగాత్మలు.

**సమిష్టి ఈశ్వర చతుష్టయము**

1.విరాట్, 2. హిరణ్యగర్భ, 3. అవ్యాకృత, 4. సూత్రాత్మలు

**ప్రభావ చతుష్టయము**

**దేహప్రభ**= తన్నుతాను మరచి, దేహము నిజమని నమ్మి దేహధారులను వృద్ధిచేయుట.

**మనఃప్రభ** =కామాదులందు అతిలోలుడయి సంకల్పవికల్పములను చేస్తూ ఆత్మయందు ప్రణవనాదమును గ్రహించి సాకార నిష్ట సత్యమని గ్రహించేది.

**బుద్ధిప్రభ** = శరీరము ప్రపంచముయావత్తూ అసత్యమని నిశ్చయించి నిర్గుణమయిన బ్రహ్మమే సత్యమనుకొని ఉపాసనలు చేస్తూ ఉండేది.

**ఆత్మప్రభ** = ముందు వ్రాయబడిన మూడింటిని త్యజించి, నిరామయరూపమైనది.

**పూర్ణముద్రాద్వయము**

**ఉత్తరశాంభవి** = సదా అమృతదృష్టిని చూచుట

**ఖేచరీ** = యఋకను ఆత్మయందు మగ్నత చేసి ఉండడము.

**కర్మద్వయము**

**బాహ్యకర్మ** = సగుణ విషయమయిన దేవతలను ఉద్దేశించి చేయబడే యజ్ఞయాగయాత్ర మొదలగు అనుష్టానములు నిర్గుణమయిన ఆత్మయందు ఐక్యమును కోరియున్నది.

**అంతఃకర్మ** = మనోన్మనిభావములు కలిగే నిమిత్తము చేయుకర్మ.

**జ్ఞానద్వయము**

**పిపీలికము** = భక్తి వైరాగ్య విచారణ, యోగాదుల సమస్తము సాధనచేసికొని ఆత్మ యందు ఐక్యమయినది.





**విహంగము** = భక్తి వైరాగ్యములు మాత్రం చేపట్టి గుణరహితుడై ఆత్మయందు ఐక్యం అయి ఉన్నది.

సన్యాసద్వయము

**బాహ్య సన్యాసము** = అపరోక్షాత్మ విజ్ఞాన శూన్యులై శిఖాయజ్ఞోపవీతములు త్యజించి కాషాయ వస్త్రధారులై అంతఃసంకల్పరహితముగా నుండుట.

**అంతఃసన్యాసము** = పరోక్ష అపరోక్షములను ఏకముచేసుకుని అంతఃకరణ శూన్యులై శాశ్వత తత్వమును పొందివుండుట.

గురుశిష్య న్యాయద్వయము

**మార్జాల కిశోర న్యాయము** = మార్జాలము తన శిశువునకు ఏవిధమయిన ఆపదరాకుండా నోట పట్టుకొని తిరుగునో అలాగే గురువున్నూ శిష్యుని పట్టి ఉండేది.

**మర్కట కిశోర న్యాయము** = కోతిపిల్ల తన తల్లి చెట్టులు, గుట్టలు దూకునప్పటికిన్నీ పిల్ల తల్లి కడుపును కరుచుకొని ఏరీతిగా నుండునో అలాగే శిష్యుడు గురువును వదలక ఉండేది.

వ్యష్టిసమిష్టులు

**వ్యష్టి** = ఏకవచనము / **సమిష్టి** = బహువచనము.

**పరోక్ష అపరోక్షములు**

**పరోక్షము** = పదునాలుగు లోకములు. **అపరోక్షము**= తాను.

గ్రహణద్వయ విచారము

**చంద్ర గ్రహణము** = చంద్రనాడియందు సూర్యనాడి ఉపాసనా మూలంగా కలిస్తే అయ్యేది.

**సూర్య గ్రహణము** = సూర్యనాడియందు చంద్రనాడి ఉపాసనామూలముగా కలిస్తే అయ్యేది.

**అజ్ఞానవృక్షం**

**అజ్ఞానం** = పొద / **మోహము** = బీజము/ **ప్రీతి** = నీరు / **సంతోషము** = పర్ణములు / **అభిమానము** = మొద్దు / **దుఃఖము** = కొమ్ములు / **యోచన** = ఉపశాఖలు / **ప్రారబ్ధము** = పుష్పములు / **సంచితము** = చిగుళ్ళు/ **ఆగామి ఫలము** = మానవజన్మనెత్తుట / **అష్టపాశములు** = తీగెలు.

**అజ్ఞానభూమికలు**

**బీజజాగ్రత**= దేహేంద్రియవిషయాదులు మేలుకోకపూర్వమందు, తాను మెలుకువతో నుండుట.

**జాగ్రత** = దేహేంద్రియాదులు మేలుకొని తన్ను తామరచి, నాయిల్లునావాళ్ళు అనేమోహంతో భ్రమపడిఉండుట.

**మహాజాగ్రత**= భూతభవిష్యత్ వర్తమానకాలములందు వున్నవాడిని వీటిసంబంధ ఫలితములను పొందుతున్నాననికోరుతూవున్నది.

**జాగ్రత్‌స్వప్న**= దేహేంద్రియసంబంధ కార్యములుచేస్తూ, చేయరానికార్యాలగురించి ఆలోచించుట.

**స్వప్నజాగ్రత** = స్వప్నావస్తయందు జరిగే సమస్త విషయములు అసత్యమని ఎఱుగక సత్యమని ఊహిస్తూ ఉండుట.

**స్వప్నసుషుప్తి** = స్వప్నమందు జరిగే కార్యములను, అప్పుడప్పుడు మేలుకుంటూ తిరిగికలలు కంటూ మోహిస్తూ ఉండేది.

**సుషుప్తి** = స్వప్నంనుండి మేలుకొని అచట ఏమియూ కనలేక, స్వప్న సంగతులన్నియూ మరచి మహాంధకారమందు లీనమయి ఉండుట.

## యోగవిఘ్నములు

**ఆలస్యము**= కాలహరణము / **సంశయము** = బుద్ధియందు అనుమానములతోనుండుట. **మంత్రవాదము**= మంత్రివిద్యయందు ఆశ/ **దుర్గోష్టి**= దుర్జనులతో సహవాసము చేయుట .**దారిద్ర్యము**= దరిద్రముతో తిరుగుట.

**జీవన్ముక్తి సంచారవిధి**

సుఖేచ్ఛవిచారణ, శరీరము, మనస్సు, సత్యాన్వేషణలతో సంచరించుట, క్రోధాన్ని విసర్జించి, యోగసాంప్రదాయ ఆచారములతో నుండి అతీంద్రియ నిగ్రహము, సహనం, భూతదయ, పశ్చాత్తాపము, సర్వజనశ్రేయస్సును కోరి, లోభ, మోహ, మద మాత్సర్యాదులను నణచి, శుద్ధ సాత్విక సంబంధ గుణములతో సర్వ విషయములను అంటీ అంటని స్థితితో సంచరిస్తూ ఉండుట.

**జ్ఞానభూమికలు**

అనేకజన్మములనుండి సంక్రమించిన వాసనలచేత, అజ్ఞానినైతినని పరితపించి వైరాగ్యమును పొందిన చిత్తముతోసదా నుండునది. (1.) ఇటువంటి వైరాగ్యమును,





పొంది, యోగ్యుల చెంతకుచేరి వేదాంత విద్యావిచారణ చేసేది (2,) పైరెంటిని గ్రహించి గురువుచే చెప్పబడిన యోగరహస్యాతిరహస్యములను మననం చేసుకుంటూ నిశ్చయించేది. (3.) పైవిషయములనభ్యసిస్తూ ఈషణత్రయములను త్రెంచి, శాంత్యాది గుణములులేక గుణ రహితుడై ఉండేది (4.) పైనాలుగింటిని అభ్యసించి సంగత్రయ రహితుడై పిపీలికాది బ్రహ్మపర్యంతము శరీరములందు నేనే ఉన్నానని నిశ్చయించుకునేది. (5.) పై అయిదింటిని అభ్యసించి ఆత్మ సర్వత్రా నిండియున్నదని గ్రహించి దృశ్య ప్రపంచమును వదలి సత్యమును చూస్తూ వుండేది. (6.) సృష్టిలో నశించునది, నశించనిదనురెంటినీ త్యజించి కేవల నిష్కళంక సచ్చిదానందమునకు అతీతుడై ఆత్మయందు ప్రవేశించి స్థిరముగా ఉండేది.

1. మహర్షిఃయోగుల జ్ఞానాన్ని ప్రకాశములో నాల్గవవంతు గలవార్ని మహర్షియందురు
2. రాజర్షిః అట్టి జ్ఞానాన్ని ప్రకాశము అర్ధభాగమున్న వార్ని రాజర్షి అనవచ్చును
3. దేవర్షిః అట్టి జ్ఞానాన్ని ప్రకాశము మూడువంతులు గలవార్ని దేవర్షియందురు
4. బ్రహ్మర్షిః అట్టి జ్ఞానాన్ని ప్రకాశము సంపూర్ణముగా నున్న వార్ని బ్రహ్మర్షి యనవచ్చును.

విశ్వామిత్రుడు పట్టుదలతో మహర్షి స్థాయినుండి రాజర్షి దేవర్షి స్థాయి నుండి బ్రహ్మర్షియైనాడు.

**చతుర్దశ భువన వివరము**

**అతలం** = పాదముల అడుగుభాగం / **వితలం** = పాదముల పైభాగం / **సుతలం** = పాదాల సన్నిధిని / **తలాతలము** = జాను ప్రదేశము / **మహాతలము** = ఊరు ప్రదేశము / **రసాతలము** = కటిప్రదేశం / **పాతాళము** = నాభిక్రిందభాగము / **భూలోకము** = నాభియందు/ **భువర్లోకము** = కుక్షియందు / **సువర్లోకము** = హృదయమందు / **జనలోకము** = కంఠమందు/ **మహర్లోకము** = బ్రహ్మరంధ్రం / **తపోలోకము** = భ్రూయుగమందు / సత్యలోకము = (మూర్ద్ని) తలపైభాగమందును గలవు.

**శ్రీ జగద్గురు సనారీ విశ్వనాథావధూతస్వామినే నమః**

సూచన: పురాతనమైన ఈగీతాశాస్త్రము మరుగున పడుటచే నేటియోగసాధకులకు యిందలి విషయములు సహకరించి యోగాభివృద్ధిని పొందగలరనితాత్పర్య సహితంగా ముద్రించు చున్నాము.

-:గురుగీతా స్తోత్రము:-

శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తంయేనచరాచరం।
తత్పదం దర్శితంయేనతస్మైశ్రీ జగద్గురవేనమః॥

శ్లో॥ అస్మత్కామఫలప్రదాయ, గురురాట్టానందతేజోమయఃభస్మాకం
పితదోషపుంజజననంఫాలేక్షనాపావనాయుష్మత్పాదసరోజరేణు।
శిరసాహృధ్యానసంభావనావిస్మేయాభవదాస్మరామినిరతం సర్వేజగద్దేశికా॥

శ్లో॥ గురుశూలీ, గురోచక్రి గురుధాతృ, బహస్పతీ, గురుశుక్రా, గురుత్వష్ట్రాయిమే దేశికవర్ధకీ।

హరిఃఓం అస్యశ్రీ సనారీ విశ్వేశ్వర గురుస్తోత్ర మహామంత్రస్య హంస ఋషిః అనుష్టుప్ఛందః శ్రీసనారీ విశ్వేశ్వరోదేవతా, హ్రీం బీజం, శ్రీం శక్తిః, క్లీం కీలకం, మమసనారీ విశ్వేశ్వరగురు ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః॥

-:కరన్యాస:-

ఓం హంసా సనారీ విశ్వేశ్వరాయనమః అంగుష్ఠాభ్యాం నమః, ఓం హం సీం సనారీ విశ్వేశ్వరాయనమః తర్జనీభ్యాంనమః, ఓం హంసూం సనారీ విశ్వేశ్వరాయనమః మధ్యమాభ్యాం నమః, ఓం హంసేం సనారీ విశ్వేశ్వరాయనమః, అనామికాభ్యాం నమః , ఓం హం సౌః సనారీ విశ్వేశ్వరాయనమః కనిష్ఠికాభ్యాం నమః, ఓం హంసః శిరస్సోహం హంసః సనారీ విశ్వేశ్వరాయ నమః కరతలకరపుష్ఠాభ్యాం నమః॥

హృదయన్యాసః

ఓం హ్రీం సనారీ విశ్వేశ్వరాయ హృదయాయ నమః, ఓం హ్రీం సనారీ విశ్వేశ్వరాయ సహస్రారవాశియోః హంసః శిరసే స్వాహా, ఓం హ్రీం అతీత నాదాంతరవాసయోః హంసః శిఖాయైవౌషట్, ఓం హ్రీం సనారీ విశ్వేశ్వరాయ అవర్గషోడశ స్థానజీవాధారవిశుద్ధ చక్రవాసే హంసః కవచాయహుం, ఓం హ్రీం అనంతకోటి సూర్య ప్రకాశ సందర్శననిజాస్థాన, ఆజ్ఞాస్థాన ఆజ్ఞాచక్రప్రదేశనివాసేహంసః నేత్రత్రయాయ వౌషట్, ఓం హ్రీం సర్వప్రపంచాయ అస్త్రాయ ఫట్, ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ధ్యానం

శ్లో॥ శ్రీ దేవదేవమహాదేవ పరాత్పరం వా। బోధాసుబోధ పరతత్వప్రపంచసర్వే।
మోదాయభక్తజనలోకఫలప్రదాయ। విశ్వేశ్వరాయనమితప్రియదేశికాయ॥





మూలమంత్రం:

ఓం, హ్రీం, శ్రీం, ఐం, క్లీం, సౌః। సౌః, క్లీం, ఐం, శ్రీం, హ్రీం,ఓం.(యధా శక్తి జపించి)

సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంథచతుర్థోధ్యాయమునందు గురుపూజ కలదు.

ఓం హ్రీం సనారీ విశ్వేశ్వరాయనమః యధాశక్తి జపంమమసద్గురు బ్రహ్మార్పణ మస్తు॥

రమ్యమైన కైలాసగిరి శిఖరమందు యోగనిష్ఠా గరిష్ఠుండైన సాంబమూర్తితో పార్వతీదేవి నమస్కరించి యిట్లు పలికెను.

శ్లో॥ (పార్వత్యువాచః) నమోస్తు దేవదేవేశ సదాశివజగద్గురో।
సర్వేశ్వర మహాదేవ గురుదీక్షాం ప్రదేహిమే॥ 1

తా: ఓ దేవదేవ! సదాశివ! జగద్గురో। సర్వేశ్వర। మహాదేవ। నాకు గురుదీక్షనిమ్ము. మీకిదే నానమస్కారము.

శ్లో॥ కేణమార్గేణభోస్వామిన్దేహీబ్రహ్మమయోభవేత్।
తత్కృపాంకురుమేస్వామిన్నమామి చరణేతవ॥ 2

తా॥ దేహియైన జీవుడు యే సాధనచేత బ్రహ్మమయుడగునో నాయందు దయతో లోకకల్యాణార్థం తెలియజేయండి స్వామీ మీ పాదపద్మములకు మ్రొక్కుచున్నాను.

శ్లో॥ (ఈశ్వర ఉవాచ) యస్యదేవేపరాభక్తిర్యధాదేవేతధాగురౌ।
తస్యతేకధితాహ్యర్థాః ప్రకాశ్యన్తే మహాత్మనః॥ 3

తా॥ పరమేశ్వరుడగు శివుడు చెప్పుచున్నాడు. ఎవరికైనా దేవునియందు నిశ్చలమైన భక్తికలుగునో, అలాగే గురువుయందు భక్తి విశ్వాసములుండునో అట్టి మహాత్మునకు గురువు ప్రసిద్ధమయిన అర్థములు చెప్పి అతనిని ప్రసిద్ధుని చేయును.

శ్లో॥ "గు"శబ్ధస్త్వనకారస్స్యా "రు"కారస్తన్నిరోధకః।
అన్ధకారనిరోధిత్వాద్గురురిత్యభిధీయతే॥ 4

తా॥ గురుశబ్దమందలి "గు" అక్షరమును చీకటిని "రు" అక్షరముకుచీకటిని పోగొట్టి వెలుగును ప్రసాదించునని అర్థము. అనగా అజ్ఞానమను అంధకారమునుండి జ్ఞానమనెడి కాంతిని ప్రకాశింపజేయువానిని "గురువని" లోకులందురు.

శ్లో॥ **జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం గురుపాదోదకంపిబేత్॥** **15**

తా॥ జ్ఞానము, వైరాగ్యము సిద్ధించుటకు శ్రీగురుపాదపంకజమును సేవించ వలయును.

శ్లో॥ **గురుపాదోదకం పీత్వాగురోరుచ్ఛిష్ఠభోజనం।**
**గురుమూర్తిసదాధ్యాయగురుస్తోత్రంజపేస్సదా॥** **16**

తా॥ గురుపాదజలాన్ని పానముజేసి గురువు మిగిల్చిన ఆహారాన్ని భుజించి గురునిరూపాన్ని హృదయమందు నిలిపిగురునివాక్కులు సదా మననము చేయుచు గురూపదేశమంత్రాన్ని సదా జపించాలి.

శ్లో॥ **కాశీక్షేత్రనివాసస్స్యాత్ జాహ్నవీ చరణోదకం।**
**గురుర్విశ్వేశ్వర స్సాక్షాత్తారకం బ్రహ్మనిశ్చితం॥** **17**

తా॥ గురుసన్నిధి కాశీక్షేత్రనివాస తుల్యము, గురుపాదోదకం గంగాజలతుల్యము, గురువేసాక్షాత్ ఈశ్వర సమానుడు, గురూపదేశము నిశ్చయముగా తారకబ్రహ్మమే యగును.

శ్లో॥ **శివః పాదాంతికస్సాక్షాపాదస్థశ్చాక్షయోవటః॥**
**తీర్థరాజః ప్రయాగశ్చశ్రీగురోఃపాదసన్నిధౌ॥** **18**

తా॥ శ్రీ గురునియొక్క సన్నిధి సాక్షాత్ శివసన్నిధి వంటిది. గురుపాదమందే అక్షయవట మున్నది. తీర్థశ్రేష్ఠమగు ప్రయాగగురుని పాదసన్నిధియందే కలదు.

శ్లో॥ **గురుమూర్తిం స్మరేన్నిత్యం గురునామసదాజపేత్।**
**గురోరాజ్ఞాం ప్రకుర్వీతగురోరన్యం నభావయేత్॥** **19**

తా॥ ఎల్లప్పుడూ గురుమూర్తిని స్మరింపవలెను. గురునామమునూ జపించవలయును. గురువాజ్ఞను శిరసావహించి ఆచరించవలెను. గురునికంటే వేరొకరిని తలంచ కూడదు. స్మరించరాదు. ఉచ్ఛరింపరాదు. గురువే పరబ్రహ్మము గనుక పరబ్రహ్మ గురుని కంటే వేఱుగాదు.

శ్లో॥ **అనన్యచిత్తో యోగీస్సాత్సులభంతత్పదంశుభం।**
**తస్మాత్సర్వప్రయత్నేన గురోరారాధనంకురు॥** **20**

తా॥ యితర మూర్తులందు చిత్తములేక గురునియందే చిత్తముగలవానిని యోగి యందురు. వానికి గురుపదము సులభమగును గనుక సర్వప్రయత్నముల చేత ఏలాగైనా గురుని ఆరాధన చేయుము





శ్లో॥ **గురువక్త్రేస్థితావిద్యాగురుభక్త్యేషులభ్యతే॥** **21**

తా॥ గురువుగారి యందున్న విద్య, గురుభక్తిగల వారికి మాత్రమే సిద్ధించును.

శ్లో॥ **త్రైలోక్యే స్ఫుటవాక్తారో దేవతాఽసురపన్నగాః॥** **22**

తా॥ దేవతలు, అసురులు, పన్నగులు, గురువునుగూర్చి ప్రమాణబద్ధముగా మూడు లోకములందును స్ఫుటముగా(ఖచ్చితముగా) చెప్పుచున్నారు.

శ్లో॥ **గుశబ్దస్త్వంధ కారస్స్యా ద్రు కారస్త న్నిరోధకః।**
**అజ్ఞాన గ్రాసకం బ్రహ్మగురుదేవనసంశయః ॥** **23**

తా॥ గుశబ్దము అంధకార వాచకము, రుశబ్ధముదాని నిరోధించును, అజ్ఞానమును హరించును గురువు బ్రహ్మయేగానీ యితరులుగారు, సంశయములేదు.

శ్లో॥ **గుకారః ప్రథమోవర్ణోమాయాదిగుణభాషకః।**
**గుకారోద్వితియోవర్ణోమాయాబ్రాంతి విమోచకః ॥** **24**

తా॥ మొదటి అక్షరమగు గుకారము మాయాదిగుణములను చెప్పుచున్నది. రెండవ అక్షరమైన రుకారము మాయాదిబ్రాంతిని పోగొట్టుచున్నది.

శ్లో॥ **ఏవంగురు పదం శ్రేష్టందేవానామపిదుర్లభం** **25**

తా॥ ఇట్టి శ్రేష్టమైన గురుపదము దేవతలకైననూ దుర్లభమయియున్నది

శ్లో॥ **హాహా హూహూగణైశ్చైవగంధర్వాద్యైశ్చపూజ్యతే।**
**ధ్రువం తేషాంచసర్వేషాంనాస్తితత్వగురోః పదం॥** **26**

తా॥ గంధర్వులైన హాహా హూహూ గణములచేత గురువు పూజింపబడుచున్నాడు. ఆ సమస్తమయిన వారికి గురువుకంటే మించిన తత్వము మరియొకటిలేదు.

శ్లో॥ **ఆసనం, శయనం, వస్త్రం, వాహనం చాపిభూషణం।**
**సాధకేన ప్రదాతవ్యం గురోసంతోషకారకమ్ ॥** **27**

తా॥ ఆసనము, శయనము, వస్త్రము, వాహనము, అలంకారములు యిత్యాదులు గురువుయొక్క సంతోషముకొఱకు సాధకుడుయివ్వవలెను.

శ్లో॥ **గురోరారాధన కార్యం సజీవిత్వం నివేదయేత్**
**శరీర మర్ధనం ప్రాప్తిం పశుపుత్రగృహాదికం**
**కర్మణామనసావాచాసదా సంతోషమేద్గురుం॥** **28**

తా॥ శిష్యుడు గురువు యొక్క ఆరాధనము చేయవలయును, తనయొక్క వృత్తిని అప్పగించవలెను. శరీరము, ధనప్రాప్తి, పశువులు, పుత్రులు, గృహములను అప్పగించి మనోవాక్కాయకర్మలచేత త్రికరణ శుద్ధిగా గురువును సంతోషింప జేయవలెను.

శ్లో॥ **దణ్ణవత్ప్రణమేద్భక్త్యానిర్లజ్జాగురుసన్నిధౌ।**
**శరీరమర్ధంప్రాణాంశ్చసర్వంతస్మైనివేదయేత్॥** **29**

తా॥ సిగ్గునువిడిచి గురువునకు సాష్టాంగ దండప్రమాణములు భక్తితో చేయవలయును. శరీరము, ధనము, ప్రాణము మొదలగునన్నియూ గురువునకర్పణ చేయ వలయును.

శ్లో॥ **అత్మదారాదికంచైవసద్గురుభ్యోనివేదయేత్॥** **30**

తా॥ తనయొక్క అత్మసాక్షిగా భార్యాదులను గూడా సద్గురువులకు సమర్పించవలయును

శ్లో॥ **క్రిమికీటంభస్మవిష్ఠాదుర్గంధిమలమూత్రకం।**
**శ్లేష్మరక్తంత్వచంమాంసంగురోరగ్రేనకారయేత్।**
**సంచారవృక్షమారూఢాః పతన్తినరకార్ణవే॥** **31**

తా॥ పురుగులు, కీటకములు, బూడిద, పురీషము, దుర్గంధములైన మలమూత్రాదులు, తెమడ, నెత్తురు, చర్మము, మాంసము, వీటిని గురువునకు కనపడనీయరాదు. సంసారమనెడి వృక్షముపైకెక్కినవాడు నరకసముద్రములో పడుచున్నాడు.

శ్లో॥ **యేనచోద్గారితం విశ్వంతస్మై శ్రీ గురవేనమః ॥** **32**

తా॥ ఎవనిచేజగత్తంతయూ నిర్మింపబడినదో అట్టి విరాట్ విశ్వకర్మజగద్గురువునకు నమస్కారము

శ్లో॥ **గురుబ్రహ్మాగురుర్విష్ణుర్గురుదేవో మహేశ్వరః।**
**గురురేవపరంబ్రహ్మతస్మైశ్రీ గురవేనమః॥** **33**

తా॥ గురువనగా బ్రహ్మ, గురువే విష్ణువు, గురువే దేవుడగు మహేశ్వరుడు, గురుడే పరమాత్మ. కాబట్టి సర్వదేవస్వరూపుడైన గురునికొరకు నమస్కారము చేయుచున్నాను.





శ్లో॥ **అజ్ఞానతిమిరాన్ధస్యజ్ఞానాంజనశలాకయా।**
**చక్షురున్మీలితంయేనతస్మై శ్రీగురవేనమః॥** **34**

తా॥ అజ్ఞానమనియెడి అంధకారముచే గ్రుడ్డివాడయినవానియొక్క నేత్రము జ్ఞానమనియెడు కాటుకగల కణికచేతయే మహాత్మునిచే తెరపిచేయుటవలన సమస్తమును కనబడునట్లు చేయబడునో అట్టి శ్రీ గురుదేవులకు నమస్కారము చేయుచున్నాను.

శ్లో॥ **అఖండమండలాకారం వ్యాప్తయేనచరాచరం।**
**తత్పదందర్శితంయేనతస్మైశ్రీ గురవేనమః॥** **35**

తా॥ ఈ చరాచరజగత్తుయావత్తూ సంపూర్ణముగా ఎవనిచే వ్యాప్తిచెందినదో అట్టి పరమాత్మను (విరాట్విశ్వకర్మ) ఎవరిచేత సాక్షాత్కారముగావించబడునో అట్టి గురుబ్రహ్మకు నమస్కారము.

శ్లో॥ **స్థావరం జంగమంచైవవ్యాప్తంయేనచరాచరం।**
**తత్పదందర్శితంయేనతస్మైశ్రీగురవేనమః॥** **36**

తా॥ ఎవరిచేత జీవనిర్జీవమయిన వివిధ ఆకారములతో కూడిన జగత్తు నిర్మింపబడినదో అట్టి పరబ్రహ్మను ఎవనిచేత చూపింపబడినదో అట్టి శ్రీగురుని పాదములకు నమస్కారము.

శ్లో॥ **చిన్మయం వ్యాపితం సర్వంత్రైలోక్యంసచరాచరం।**
**తత్పదం దర్శితంయేనతస్మైశ్రీ గురవేనమః॥** **37**

తా॥ చరాచరసహితమయిన మూడు లోకములు ఎవనిచేనిర్మింపబడి వ్యాప్తి చెందుచున్నవో (విరాట్విశ్వకర్మ) అట్టివానిపదమెవనిచే చూపింపబడినదో అట్టి శ్రీగురునికి నానమస్కారములు

శ్లో॥ **సర్వశ్రుతిశిరోరత్నవిరాజితపదాయచ।**
**వేదామ్బుజన్మసూర్యాయతస్మైశ్రీ గురవేనమః** **38**

తా॥ సమస్తశ్రుతులయొక్క, ఉపనిషతుల యొక్క శిరోభూషణములైన రత్నములచేత అలంకరించబడిన పాదాబ్జములు గలిగినట్టియు, వేదములనెడు పద్మములకు సూర్యునివలె ప్రకాశించునట్టి శ్రీ గురునకు నమస్కారము.

శ్లో॥ చైతన్యం శాశ్వతం శాస్త్రం వ్యోమాతీతం నిరంజనం।
బిన్దునాదకలాతీతంతస్మైశ్రీ గురవేనమః॥ 39

తా॥ జీవసమూహముశాశ్వతమైనది, వేదప్రమాణమైనది, ఆకాశమును మించినది, మాయాదులులేనిది. నాద, కళలనతిక్రమించినదియు నగునట్టి వాటి సృష్టికర్త పదమెవ్వనిచే సాక్షాత్కరింపజేయునో అట్టి శ్రీ గురునికి నమస్కారము.

శ్లో॥ నగురోరధికంతత్వంనగురోరధికంతపః ।
తత్వజ్ఞానంపరంనాస్తి తస్మైశ్రీగురవేనమః ॥ 40

తా॥ గురునికంటే అధికమైన తత్వములేదు. గురునికంటే గొప్ప తపస్సు లేదు (గురునిసేవయే తపఃస్సమానం) గురునికంటే తత్వజ్ఞానమువేరేలేదు. అట్టి శ్రీగురునికి నమస్కారము.

శ్లో॥ మన్నాధ శ్రీజగన్నాధోమద్గురుశ్రీజగద్గురుః
మమాత్మాసర్వభూతాత్మాతస్మైశ్రీగురవేనమః ॥ 41

తా॥ నానాధుడు జగన్నాథుడే నా గురువు జగద్గురువే, నాయొక్క ఆత్మయే సర్వభూతాత్మ అని చెప్పిన శ్రీ గురునికి నా నమస్కారము.

శ్లో॥ ధ్యానమూర్తిర్గురోర్మూర్తిః జ్ఞానమూలంగురోఃపదం।
మన్త్రమూలంగురోర్వాక్యం ముక్తిమూలం గురోఃకృపా॥ 42

తా॥ గురువుయొక్క మూర్తినే ధ్యానించవలయును. గురుపదమే నాకు జ్ఞానకారణము, గురూపదేశమే మూలమంత్రము. గురుని కృపయే ముక్తికి కారణమైనది.

శ్లో॥ నిత్యం శుద్ధం నిరాభాసం నిరాకారం నిరంజనం।
నిత్యబోధంచిదానందం గురుం బ్రహ్మానమామ్యహం॥ 43

తా॥ నిత్యమైపరిశుద్ధమైవాక్కుకందని ఆకారశూన్యమై నిరంజనమై శాశ్వత జ్ఞానకారమైజ్ఞాన స్వరూపమయిన గురువరబ్రహ్మను నేను నమస్కరించుచున్నాను.

శ్లో॥ గురురాదిరనాదిశ్చగురుః పరమదైవతం।
గురుమన్త్రసమోనాస్తితస్మైశ్రీ గురవేనమః॥ 44

తా॥ గురువు ఆదియు అనాదియైయున్నాడు. ఉపదేశములతో ఆది కలవాడనియు స్వతసిద్ధముగ ఆదిగాలేదనియు అర్థము. గురుశబ్దార్థము యోచించపగా





అనాదియయి ఉన్నాడు. గురువు పరమదైవము. గురుమంత్రముతో సమమగు మంత్రములేదు. కావున అట్టి గురుని (సనారీని) సదా నేను నమస్కరింతును.

శ్లో॥ సప్తసాగరపర్యంతం తీర్థస్నానఫలం తదా।
గురోరంఘ్రితలాద్బిందుసహస్రాంశేసుదుర్లభం॥ 45

తా॥ సప్తసాగరపర్యంతమయిన యావత్తీర్థములందు స్నానము చేసినఫలము గురుపాదతీర్థ బిందువుయొక్క 1000వంతుకైననూ సరిపోవుట దుర్లభం.

శ్లో॥ గురుర్దేవో జగత్సర్వం బ్రహ్మవిష్ణు శివాత్మకః
గురోః పరతరంనాస్తితస్మాత్సమ్పూజయేద్గురుం॥ 46

తా॥ గురుడే జగత్తంతయు, గురుడే బ్రహ్మవిష్ణు శివనామక త్రిమూర్త్యాత్మకుడు, గురునికంటే శ్రేష్టమయినదేదియూలేదు, కావున గురునే పూజింపవలయును.

శ్లో॥ జ్ఞానం వినాపిముక్తిస్తులబ్యతేగురుభక్తితః
గురోస్సమోనాస్తినాన్యత్సాధయేద్గురుమూర్తిణాం॥ 47

తా॥ గురునియందు భక్తిఉంటే చాలును. జ్ఞానములేకున్ననూ ముక్తి కలుగును. గురుని ఆరాధించువారికి, గురునికంటే ఆరాధించతగినదేదియూ లేదు. కావున గురునిపాదభక్తియే శ్రేష్టమయినది.

శ్లో॥ తస్మాత్పరతరంనాస్తి వదన్తీతిశివాదయః
సమన్యతాంధధౌనాన్యత్సాధయేద్గురుమార్గగః॥ 48

తా॥ శివుడు మొదలగు దేవతలు గురునికంటే పరములేదని చెప్పుచున్నారు. కనుక గురువేపూజార్హుడు గురుమార్గమునవలంబించినవారి తరమును సాధింపగూడదు.

శ్లో॥ తస్మాత్ పరతరం నాస్తి నేతినేతీతివైశ్రుతేః
మనసావచసాచైవఅస్మదాద్యావిమోహితాః॥ 49

తా॥ లేదనిలేదనిఅనెడు శ్రుతివలన గురునికంటే పరుడు లేదని చెప్పబడినది. ఆవాక్యమువలన మావంటివారు (అజ్ఞానులు) మనస్సుచేతను వాక్కుచేతను మోహితులమయిపరుదున్నాడోలేదోయని విమర్శించుచున్నాము.

శ్లో॥ **గురోఃకృపాప్రసాదేన బ్రహ్మావిష్ణుర్హరస్తదా।**
**సామార్థ్యంతత్ప్రసాదేన కేవలంగురుసేవయా॥** **50**

తా॥ బ్రహ్మావిష్ణు మహేశ్వరాదులుగురుటాక్షము (విరాట్ విశ్వకర్మభగవాన్)చేత గురు సేవచేతనే సామర్థ్యమును బొందిరి. (యిది పై శ్లోకమునకు అర్థము)

శ్లో॥ **దేవకిన్నెర గంధర్వాఃపితృయక్షాస్తుచారణాః।**
**మునయోపినజానన్తిపితరోయక్షకిన్నెరాః।**
**ఋషయస్సర్వసిద్ధాద్యాగురుసేవాపరాఙ్ముఖాః॥** **51**

తా॥ దేవతలు, గంధర్వులు, కిన్నెరలు, పితృదేవతలు, యక్షులు, చారణులు వీరును మునులును, పితరులును యక్షకిన్నెరులును జగద్గురుకటాక్షములేనిదే గురువును (విశ్వకర్మను) గుర్తించలేరు. ఋషులు సర్వసిద్ధులు, మొదలగువారు గురుసేవ చేయుటకు విముఖులైనచో గురువునుకనుగొనలేరని భావము.

శ్లో॥ **ధ్యానంశ్రుణుమహాదేవీసర్వానన్దప్రదాయకం।**
**సర్వసౌఖ్యకరంచైవభుక్తిముక్తి ప్రదాయకం॥** **52**

తా॥ ఓ మహాదేవీ! సమస్తములయినయానందములనిచ్చునట్టియు సర్వసౌఖ్యముల నిచ్చునట్టియు, ఇహపరములనిచ్చునట్టి ధ్యానము చెప్పెదను వినుము.

ఈశ్వర ఉవాచ :

శ్లో॥ **శ్రీమత్పరంబ్రహ్మగురుంనమామి। శ్రీమత్పరంబ్రహ్మ గురుంభజామి॥**
**శ్రీమత్పరంబ్రహ్మ గురుంస్మరామి। శ్రీమత్పరంబ్రహ్మ గురుంవదామి॥**

తా॥ శ్రీపరబ్రహ్మస్వరూపుడైన గురువును నమస్కరించుచున్నాను. శ్రీపరబ్రహ్మ స్వరూపుడైన గురువును సేవింపుచున్నాను, శ్రీపరబ్రహ్మస్వరూపుడైన గురువును స్మరించుచున్నాను, శ్రీపరబ్రహ్మస్వరూపుడైన గురువును స్తుతించుచున్నాను. అట్టి గురువే సకలచరాచర సృష్టికర్తయైన విరాట్ విశ్వకర్మ భగవాన్.

శ్లో॥ **బ్రహ్మానందం పరమసుఖదం కేవలంజ్ఞానమాత్రం।**
**ద్వందాతీతంగగనసదృశం తత్వమశ్యాది లక్ష్యం॥**
**ఏవం నిత్యం విమలమచలం సర్వదాసాక్షిభూతం।**
**భావాతీతం త్రిగుణరహితసద్గురుం తంనమామి॥** **54**





తా॥ బ్రహ్మానందస్వరూపుడును, మిక్కిలి సుఖములనిచ్చువాడును, ఏకాకారుడును జ్ఞానమొకటియేయైనవాడును, ద్వందాదులనతిక్రమించినవాడును, ఆకాశ స్వరూపుడును తత్వమస్యాది మహా వాక్యములకు లక్ష్యభూతుడును, విమలుడును, సుస్థిరుడును, సర్వకాలసర్వావస్థల యందు సాక్షీభూతుడును, షఢ్భావ వికారముల నతిక్రమించినవాడును, గుణత్రయమునతిక్రమించిన వాడును, అగు ప్రసిద్ధుడైన గురువును (విరాట్విశ్వకర్మ భగవానుని) ఈ వాక్యములతో నిత్యమూ నమస్కరించుచున్నాను.

శ్లో॥ **నిత్యశుద్ధం నిరాభాషం నిరాకారం నిరంజనం।**
**నిత్యబోధం చిదానందంగురుం బ్రహ్మానమామ్యహం॥** **55**

తా॥ నిత్యుడు, పరిశుద్ధుడు, మాటలకందనివాడు, ఆకారములేనివాడు, ప్రకృతిగుణములు లేనివాడును, శాశ్వతజ్ఞానుడు, జ్ఞానానందమయుడు గురు రూపుడైన పరబ్రహ్మకు నమస్కారము.(విరాట్ విశ్వకర్మ)

శ్లో॥ **ఆనందమానందకరం ప్రసన్నంజ్ఞానస్వరూపం నిజభావయుక్తం।**
**యోగీంద్రమీడ్యంభవరోగవైద్యంశ్రీమద్గురుంనిత్యమహంభజామి॥** **56**

తా॥ ఆనందమయుడు, ఆనందదాయకుడు, అనుగ్రహముగలవాడు, జ్ఞానస్వరూపుడు స్వస్వరూపుడు, జ్ఞానసంపన్నుడు, యోగిశ్రేష్టుడు, స్తోత్రార్హుడు సంసారమనియెడు మహావ్యాధికి వైద్యుడునగు సకల శుభములు చేకూర్చు జగద్గురువును నేను నిత్యమూ ప్రార్థించుచున్నాను.

శ్లో॥ **బ్రహ్మామ్బుజేకర్ణికమధ్యసంస్థంసింహాసనేసంస్థితదివ్యమూర్తిం।**
**ధ్యాయేద్గురుంచంద్రకలాప్రకాశంసచ్చిత్సుఖాభీష్టకరందధానం॥**
**శ్వేతాంబరం శ్వేతవిలేపనాఢ్యంముక్తాఫలాభూషితచారుదివ్యం।**
**వామాంకపీఠేస్థితదేవశక్తింమన్దస్మితంచారుకృపాభిధానం॥** **57**

తా॥ బ్రహ్మ పద్మమందున్నకర్ణికామధ్యమునందు సింహాసనాశీనుడై దివ్య స్వరూపముతో చల్లని చంద్రకాంతితో ప్రకాశించుచూ సచ్చిదానందరూపుడై వరదహస్తముతో తెల్లని వస్త్రములు ధరించి ముత్యాలసరులచే అలంకరించబడిన

అందమగు దివ్యశరీరముగలిగి ఎడమతొడపై దేవశక్తితో మందహాసము చేయుచూ పరమదయాళువుయని పేరుగాంచిన పరమశివరూపుడయిన (విశ్వకర్మ భగవానుని) శ్రీ గురుదేవుని సదా ధ్యానించవలయును.

శ్లో॥ **యస్మిన్ సృష్టిస్థితిధ్వంస నిగ్రహానుగ్రహాత్మకం।**
**కృత్యం పంచవిధంశాశ్వత్ భాసతేతన్నమామ్యహం॥** **58**

తా॥ ఎవనియందు సృష్టిస్థితిలయములు నిగ్రహానుగ్రహములు ఐదునూగలిగిపదేపదే ప్రకాశించునో అట్టి పరమాత్మకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ **ప్రాతశ్శిరసిశుక్లాబ్జేత్రినేత్రం ద్విభుజంగురుం।**
**వరాభయకరం శాన్తంస్మరే త్తన్నామపూర్వకం॥** **59**

తా॥ ప్రాతఃకాలమున తెల్లని పద్మమువలే నున్న శిరస్సునందు మూడునేత్రములు, రెండు భుజములు గలిగిన, వరహస్తము, అభయహస్తము గలిగినట్టి శాంతుడయిన గురుని వారినామమును ఎల్లప్పుడూ స్మరించవలెను (మూడవ నేత్రమనగా భ్రూమధ్యదృష్టి)

శ్లో॥ **నగురోరధికం, నగురోరధికం, నగురోరధికం నగురోరధికం ।**
**శివశాసన, తశ్శివశాసన, తశ్శివశాసన, తశ్శివశాసనతః॥** **60**

తా॥ శివునియొక్క శాసనమువలన గురునికంటే అధికుడు లేడు యీ యదార్థమునే మూడుసార్లు చెప్పవలయును.

శ్లో॥ **ఇదమేవహిశివమిదమేవహిశివమిదమేవహిశివమిదమేవశివం।**
**మమశాసనతోమమశాసనతః మమశాసనతో మమశాసనతః॥** **61**

తా॥ నాయొక్క యాజ్ఞవలన యిదేశివమయము. ఈ యదార్థమునే మూడుసార్లు చెప్ప వలయును.

శ్లో॥ **ఏవంవిధంగురుంధ్యాత్వా జ్ఞానముత్పాద్యతేస్వయం।**
**తథాగురోఃప్రసాదేన ముక్తోహమితిభావయేత్॥** **62**

తా॥ ఈ విధముగానున్నట్టి గురుధ్యానముచేయగా జ్ఞానము దానికదే పుట్టును, అప్పుడు గురుకటాక్షముతో నేను ముక్తుడనయితినని ఊహింపవలెను.





శ్లో॥ **గురోర్నిరూపితేమార్గే మనశ్శుద్ధంచకారయేత్।**
**అనిత్యంఖండయేత్సర్వం యత్కించ్చాత్మగోచరం॥** **63**

తా॥ గురువుచే చెప్పబడినవిషయములను మనశ్శుద్ధిగా ఆచరించవలెను. తనకు గోచరమయిన అనిత్యవిషయములన్నిటినీ ఖండించవలెను.

శ్లో॥ **జ్ఞేయంసర్వమతీతంచజ్ఞానంచన ఉచ్యతే।**
**జ్ఞానం జ్ఞేయంసమంకుర్యాద్యథాన్యాన్యద్వితీయకం॥** **64**

తా॥ ప్రపంచమున సర్వమూ జ్ఞానవిషయములు, జ్ఞానమునతిక్రమించినవి కలవు. జ్ఞానముమనస్సునకు వాచకమై మన మనస్సును ప్రపంచమును సమానముగా జేయును."యద్దృశ్యంతన్నస్యం" అనున్యాయముచేత దృశ్యపదార్థమయిన జగమంతయు నెటుల అసత్యమని చెప్పబడినదో ఆ లాగుననే జ్ఞానమనదగిన మనస్సున్ను నశ్వరమేగనుక దానిని నశింపజేయవలెను. ఇలాచేయగా తక్కినవన్నియూ ఏకీభావమగును. అపుడు ఆత్మస్వయం ప్రకాశమే చెందును.

శ్లో॥ **ఏవంశ్రుత్వామహేశాని గురునిందాంకరోతియః।**
**నయాతినరకంఘోరం యావచ్చన్ద్రదివాకరౌ॥** **65**

తా॥ ఓ పార్వతీ! ఈ విషయములను విని ఎవడుగురునిందచేయునో అట్టివాడు సూర్య చంద్రులున్నంతకాలము ఘోరనరకముల ననుభవింతురు.

శ్లో॥ **యావత్కల్పాంతకోదేహీతావదేవగురుంస్మరేత్।**
**గురులోపోనకర్తవ్యస్స్వచ్ఛందంయదిభావయేత్॥** **66**

తా॥ ఎంతవరకు ఈ కల్పములోదేహియుండునో అంతవరకూ గురునిస్మరించవలెను. తనయిష్టానుసారము ప్రవర్తించిగురుసేవలో లోపము చేయకూడదు.

శ్లో॥ **హూఙ్కారోహినకర్తవ్యః ప్రాజ్ఞైఃశ్శిష్యైః కథంచన।**
**గురోరగ్రేనవక్తవ్యసత్యంచకదాచన॥** **67**

తా॥ గురువువిషయమై ప్రాజ్ఞులగు శిష్యులు అహంకారాన్ని ప్రదర్శించరాదు. కోపముచేత ధిఃక్కరించకూడదు, గురుసన్నిధిని అసత్యములనెన్నడూ పలుకరాదు.

శ్లో॥ **యావైజయతిహూఙ్కృత్య గురుంనిర్జిత్యవాదతః।**
**అరణ్యేనిర్జనేదేశేసభవేద్బ్రహ్మరాక్షసః॥** **68**

తా॥ ఎవరైననూ అహంకారముతో వాదమందుగురిని జయింపరాదు. యిల ప్రవర్తించిన వాడు నిర్జనారణ్యములందు బ్రహ్మరాక్షసుడై జన్మించును.

శ్లో॥ **మునిభిఃపన్నగైర్వాపిసురైర్వాశాపితోయది।**
**కాలమృత్యుభయాద్వాపిగురూరక్షతి పార్వతి॥** 69

తా॥ ఓ పార్వతీ। మునులచేతగానీ, పన్నగులచేతగానీ, దేవతలచేతగానీ, ఎవ్వరైన శపింపబడినచో ఆ శాపముచేతను, కాలమృత్యువువలననూ కలిగిన భయము నుండికలుగు బాధలు కలుగకుండా విశ్వకర్మ గురుడే రక్షించుచున్నాడు సుమా.

శ్లో॥ **అశక్తోఽ పిసురాధ్యక్షోప్యశక్తామునయస్తథా।**
**తత్క్షణాద్గురుశాపాత్తుక్షయంయాన్తినసంశయః॥** 70

తా॥ గురుశాపమువలన దేవేంద్రుడయినా,మునులయిననూ అశక్తులగుదురు. గురుశాపముచేతత్క్షణమే నశించుదురు. సందేహము వలదు.

శ్లో॥ **మంత్రరాజమిదందేవిగురురిత్యక్షరద్వయం।**
**స్మృతివేదార్థవాక్యానాంగురుసాక్షాత్పరంపదం॥** 71

తా॥ ఓదేవీ! గురుఅనెడి రెండక్షరములుగల యిదిమంత్రరాజము. స్మృతులు, వేదార్థములు, మహావాక్యములు వీటికి గురువే ముఖ్యస్థానము.

శ్లో॥ **శ్రుతేస్స్మృతేచ్ఛ విజ్ఞానం కేవలంగురుసేవయా।**
**తేవైసన్మానినఃప్రోక్తా ఇతరేవేషధారిణః॥** 72

తా॥ శ్రుతియొక్క గానీ స్మృతియొక్కగానీ విజ్ఞానము గురుసేవచేతనే కలుగును. వీరే సన్మానించదగినవారు. ఇతరులు వేషధారులు సన్మానార్హులు కారు.

శ్లో॥ **నిత్యం బ్రహ్మనిరాకారం నిర్గుణం బోధయేత్పరం।**
**సర్వం బ్రహ్మనిరాభాసం దీపాద్దీపాంతరంయధా॥** 73

తా॥ నిత్యమయి, ఆకారరహితమయినగుణరహితమయిన బ్రహ్మను సర్వలోక బ్రహ్మాండ స్వరూపుడైనయితరులవలన తాను కాంతిని బొందక స్వయంజ్యోతి యైనది పరబ్రహ్మమని చెప్పి ఒక దీపముచే మరియొక దీపము వెలిగించునట్లుగా గురువు శిష్యుని విజ్ఞాన వంతునిగా చేయును.





శ్లో ॥ **గురోః కృపాప్రసాదేశ ఆత్మారామం నిరీక్షయేత్।**
**అనేన ముక్తిమార్గేణ ఆత్మజ్ఞానం ప్రవర్తతే॥** 74

తా॥ గురువు యొక్క దయాసహితమయిన అనుగ్రహముచేత ఆత్మారాముడనగా ఆత్మయే నివాసముగా గలవాడయి యద్యాసజ్ఞానముగల పరమాత్మను ధ్యానింప వలెను. అనగా జ్ఞానదృష్టిగల యోగదృష్టిచేతనే చూడవలెనని భావము. ఇదియే ముక్తి మార్గము. ఈ మార్గముచేతనే ఆత్మజ్ఞానము లభించుచున్నది.

శ్లో ॥ **ఆబ్రహ్మస్తమ్బపర్యంన్తం పరమాత్మ స్వరూపిణమ్।**
**స్థావరం జంగమంచైవ ప్రణమామి జగద్గురుమ్॥** 75

తా॥ బ్రహ్మమొదలు గడ్డిపోచవరకుగల ప్రపంచరూపుడయి పరమాత్మ స్వరూపుడయి స్థిర చరాత్మకమైన జగన్మాతగా పరిణమించియుండు జగద్గురుడైన పరమేశ్వరుని గూర్చి వందనము చేయుచున్నాను.

శ్లో॥ **సందేహం సచ్చిదానందం భేదాతీతం సదాగురుం।**
**నిత్యం పూర్ణం నిరాకారం నిర్గుణం స్వాత్మ సంస్థితం॥** 76

తా॥ సత్తు చిత్తు ఆనందం అనునవి యే స్వరూపము కలిగినట్టియు భేదము నతిక్రమించినట్టియు ఎల్లప్పుడును ఉపదేశకుడయ్యు శాశ్వతుడయ్యి జగద్వాపియై పంచభూతాత్మిక్యయిన శరీరము లేక, గుణత్రయములేక, స్వాత్మయందున్నట్టి విశ్వకర్మ పరమాత్మను గూర్చి నేను నమస్కరించుచున్నాను.

శ్లో॥ **పరాత్పరతరం ధ్యేయం నిత్యమానందకారకం హృదయాకాశ మధ్యస్తం।**
**శుద్ధస్ఫటికసన్నిభం స్ఫటికప్రతిమారూపం దృశ్యతే దర్పణేయధా॥** 77

తా॥ పరమయిన బ్రహ్మాద్యఖిల దేవసమూహముకంటే ఉత్తమమయినటువంటిన్నీ, ధ్యానము చేయుట కర్హమైనట్టియు, ఎల్లపుడూ ఆనందమును కలుగజేయు నట్టియు, హృదయాకాశ మధ్యభాగమున ఉన్నట్టి పరిశుద్ధమైన స్ఫటిక కాంతితో సమమగు కాంతిగలట్టి పరతత్వము స్ఫటికమణితో చేసినబొమ్మ అద్దము నందేలాగు కనపడునో ఆలాగు ధ్యానము చేయతగినది.

శ్లో॥ **తధాత్మానంచిదాకారంఆనందసోహమిత్యతః।**
**అంగుష్ఠమాత్రంపురుషైః ధ్యాయతే చిన్మయోయది॥** 78

తా॥ అంగుష్ఠప్రమాణమయిన పరతత్వము, ముముక్షువులచేత ధ్యానము చేయించగా సోహమనెడు ధ్యానమువలన చిదాకారమైనది,ఆనందరూపమయినట్టిదియునగు ఆత్మను బొందుదురు.

**శ్లో॥ తత్త్వంస్ఫురతియద్భావంశృణుతత్కథయామ్యహం।**
**అగోచరంతథాగమ్యంనామరూపవర్జితం॥ 79**

తా॥ ఎట్టి భావముతో తత్వము ప్రకాశించునో, ఆ విషయాలన్నీ నీకు చెప్పుచున్నాను వినుము. ఆ తత్వము అగోచరము, అగమ్యము, నామరూపవర్జితమైనది యైయుండును.

**శ్లో॥ నిశ్శబ్దంతంవిజానీయాత్స్వభావంబ్రహ్మపార్వతి।**
**యధానిజస్వభావేనకర్పూరేకుంకుమాదిషు॥**
**శీతలత్వం స్వభావేన తథా బ్రహ్మచశాశ్వతః॥ 80**

తా॥ అట్టి పరమపురుషుని శబ్దశూన్యమయినవానిగా ఎరుంగుము. యిదియే పరబ్రహ్మ స్వభావము. ఓ పార్వతీ! కర్పూరము, కుంకుమ మొదలగు పరిమళద్రవ్యముల యందు స్వాభావికముగా శీతలత్వము కలిగియుండునో అలాగుననే బ్రహ్మస్వరూపము శీతలమై శాశ్వతముగా నుండును.

**శ్లో॥ స్వయంతథావిధోభూత్వా స్థాతవ్యం యత్రకుత్రచిత్॥ 81**

తా॥ తాను ఎక్కడో ఒక్కచోటనుండి బ్రహ్మభావముతో ధ్యానగరిష్టుడై ఉండవలెను.

**శ్లో॥ కోటిభృంగిరిటిధ్యానాద్యధాభవతిపార్వతి।**
**గురుధ్యానాత్తదానిత్యంస్వయంబ్రహ్మమయోభవేత్।**
**పిండేపదేతథారూపేముక్తాస్తేనాత్రసంశయః।**
**స్వయంబ్రహ్మమయోభూత్వాతత్పదంచవిలోకయేత్॥ 82**

తా॥ ఓ పార్వతీ। కోటిపర్యాయములు భృంగిరిటిసంబంధ భృంగధ్యానము చేయుట వలన ఏఫలితము కల్గునో అంతఫలము గురుధ్యానమువలన కలుగును. గురుధ్యానము చేతనే బ్రహ్మమయుడైపోవును. లయయోగాదులచే లభించు భృంగిధ్యానము కంటే గురుధ్యానమే ఎక్కువయని భావము గురుధ్యానము ఎలాగంటే, గురునిదేహమందు, పాదములందును, శరీరసన్నివేశమందునూ ఏకాగ్రతతో దృష్టియుంచి ధ్యానించినచో ముక్తులగుదురు. ఈ విషయమున ఎట్టి సందేహమునూ లేదు. ఈ ప్రకారము తాను బ్రహ్మమయుడై బ్రహ్మస్థానమును దర్శించవలయును.





**శ్లో॥ పరాత్పర నాస్తి సర్వదేవనిరామయం।**
**తస్యావలోకనేప్రాప్తేసర్వసంగవివర్జనాత్॥ 83**

తా॥ సర్వసంగపరిత్యాగమువలన యోగికి గురుధ్యానమువలన బ్రహ్మావలోకనము కలిగినపిమ్మట సర్వదేవమయుడయి మాయావిద్యాదిఉపాధులు లేకయున్నట్టు పరాత్పరుని చూడవలెనను తపనపడుటకంటే తనకంటేవేరగుపరాత్పరుడు మరొకడులేడని అంతయూ బ్రహ్మరూపమేగాని దానికి భిన్నమగునదివేరొకటి లేదుకావున తానే బ్రహ్మమైనందున సోహంభావముచేత తానే బ్రహ్మయగు చున్నాడని భావము.

**శ్లో॥ ఏకాకీనిస్పృహశ్శాన్తస్థాతవ్యస్తత్ప్రసాదతః।**
**లబ్ధంవాప్యథవాలబ్ధంస్వల్పంవాబహులంతథా।**
**నిష్కామేనైవభోక్తవ్యంసదాసంతుష్టమానసైః ॥**

తా॥ నిర్జనప్రదేశమున తానొక్కడేయుండి దేనియందునూ కాంక్షలేక శాంతుడై గుర్వనుగ్రహముతో నుండవలయును. ఏది లభించిననూ, లభించకున్ననూ ఎల్లప్పుడునూ మనసునసంతోషముగలిగి కోరికలు విడిచి దొరికినదే మహాప్రసాదముగా భుజింపవలెను.

**శ్లో॥ సర్వజ్ఞపదమిత్యాహుర్దేహీసర్వమయోవిభుః।**
**సదానన్దస్సదాశాన్తోరమతేయత్రకుత్రచిత్॥ 85**

తా॥ దీనినే సర్వజ్ఞపదమని చెప్పుదురు. సర్వమయుడై సర్వవ్యాపకుడైన ఆత్మసదానందుడై ఎల్లప్పుడు శాంతుడై ఎక్కడైనాసరే సంతసముగా క్రీడించును.

**శ్లో॥ యత్రైవతిష్ఠతేసోపిసదేశఃపుణ్యభాజనమ్।**
**ముక్తస్యలక్షణంచాపితత్రకథితం మాయా॥ 86**

తా॥ పైన తెల్పిన మహాత్ముడు ఏ ప్రదేశమందుండునో, ఆదేశమే పుణ్యభూమి యగును. అట్టి ముక్తునియొక్క లక్షణములు నాచేనీకు చెప్పబడినవి.

**శ్లో॥ ఉపదేశోమయాదేవీగురుమార్గేణదర్శితః।**
**గురుభక్తిస్తథాధ్యానంసకలంతవకీర్తితం॥ 87**

తా॥ ఓ పార్వతీ। నాచేత చెప్పబడిన ఈ ఉపదేశములుగురుమార్గముగా తెలిపితిని. గురు భక్తియు, గురుధ్యానమును లోకోపకారముగా నీకు చెప్పుచున్నాను.

శ్లో॥ **అనేనయద్భవేత్కార్యం తద్వదామిమహామతే।**
**లోకోపకారకందేవి లౌకికస్తునభావయేత్॥** **88**

తా॥ ఓదేవీ! ఈ ఉపదేశమువలన ఏ కార్యము జరుగునో దానిని నీకు చెప్పుచున్నాను. ఇదిలోకోపకారమైనది, ఏదో కార్యముగా భావించరాదు.

శ్లో॥ **లౌలికంకర్మతోయాతిజ్ఞానహీనంపరన్తపః।**
**జ్ఞానాత్తుభావయేత్సర్వంకర్మనిష్కర్మచాన్యతః॥** **89**

తా॥ లౌకికమంతయూజ్ఞానహీనమయికర్మస్వరూపముగానడుచుచుండును. జ్ఞానముచేతనే సర్వమును ధ్యానింపవలయును. కర్మయును నిష్కర్మయును అజ్ఞానముచేకలుగునని యెరుంగుము.

శ్లో॥ **ఇదంతుభక్తిభావాయమానవైశ్రూయతేయది।**
**లిఖిత్వాయత్రప్రదాతవ్యందానందక్షిణయాసహ॥** **90**

తా॥ ఈ విషయములు గుర్తెరిగి మానవులు ఈ పుస్తకమును దక్షిణసహితముగా దానముచేసినట్లయితే అట్టివారికి భక్తిస్థిరముగా నుండును.

శ్లో॥ **గురుగీతామిమాందేవిశుద్ధసత్వంమయేదితాం।**
**భవవ్యాధివినాశార్థంస్వయమేవజపేత్సదా॥** **91**

తా॥ :శుద్ధసత్వమయుమయినాతోచెప్పబడిన ఈగురుగీతను సంసారదుఃఖరూపమయిన క్లేశనివారణకొరకు ముక్తాసక్తుదు ఎల్లప్పుడూ జపించవలయును.

శ్లో॥ **గురుగీతాక్షరైరేకంమంత్రరాజమిమంజపేత్।**
**అన్యేచవివిధామన్త్రాః కలాంనార్హన్తి షోడశీం॥** **92**

తా॥ గురుగీతయనెడుఈ గ్రంథమును సదాధ్యానముచేయవలెను. అలాగాకయితర మంత్రములు పఠించినచో వీనిలో పదహారవభాగఫలము కూడా లభించదు.

శ్లో॥ **అనన్తఫలమాప్నోతిగురుగీతాజపేనచ।**
**సర్వపాపప్రశమనంసర్వదారిద్ర్యనాశనం॥**
**కాలమృత్యుభయహరంసర్వసంకటనాశనం।**
**యక్షరాసభూతాదిచోరవ్యాఘ్రభయాపహం॥** **93**





తా॥ గురుగీతాజపముచేత అపరిమితమైన ఫలములను పొందుదురు. సర్వపాపములు సర్వదరిద్రములు హరించును. సర్వరోగములు హరించి కాలమృత్యువును పోగొట్టును. యక్ష, రాక్షస, భూతాదికమును, చోరులు క్రూరమృగములవలన కలుగు భయమును పోగొట్టును.

శ్లో॥ **మహావ్యాధిగతాస్సర్వేజప్త్వాశ్రుత్వానిరామయాః।**
**అథవామోహనేమహారణ్యేవశ్యేజపేత్సదా॥** **94**

తా॥ మహావ్యాధులతో బాధలుపొందుచున్నవారు దీనిని జపించినా, వినిననూ, రోగహితులయ్యెదరు. అదీగాకమోహనమందు, మహారణ్యమునందు వశ్యక్రియలందును దీనిని జపించవలెను.

శ్లో॥ **కుశైర్వాదూర్వయావాపిఆసనేశుభ్రకంబలే।**
**ఉపవిశ్యతతోదేవీజపేదేకాగ్రమానసః॥** **95**

తా॥ ఓ దేవీ! దర్భాసనమందైనా గడ్డిపరకలయందైనా తెల్లని కంబళియందైననూ కూర్చుండి ఈ గురుగీతను నిశ్చలచిత్తుడయి జపించవలయును.

శ్లో॥ **శాన్త్యర్థమానసంశుక్లంవశ్యేరక్తాసనంప్రియే।**
**అభిచారేకృష్ణవర్ణంపీతవర్ణం ధనాగమే॥** **96**

తా॥ శాంతిచేయుటకు తెల్లని ఆసనమును, వశపరచుకొనుటకు ఎర్రనిఆసనమును, శత్రుసంహారమునకునల్లని ఆసనమును, ధనాగమునకు పచ్చనిఆసనముపై కూర్చుని జపించాలి.

శ్లో॥ **ఉత్తరేశాన్తయేజప్యం, వశ్యేపూర్వముఖోదితం।**
**దక్షిణేమారణంప్రోక్తం, పశ్చిమేధనాగమం** **97**

తా॥ శాంతికొరకు ఉత్తరాభిముఖముగా, వశ్యానికి తూర్పుముఖముగాను, సంహారమునకు దక్షిణముఖముగా, ధనాగమునకు పడమటదిక్కుగా కూర్చుండి జపించవలెను.

శ్లో॥ **మోహనంసర్వభూతానాం బంధమోక్షకరంభవేత్।**
**అసాధ్యంసాధయేత్కర్మనవగ్రహభయాపహం॥** **98**

తా॥ ఈగురుగీతాజపముచేయటవలనసర్వభూతములుమోహనమయిజపించినవారికి సంసారబంధవిముక్తునిజేయును. అసాధ్యమగుకార్యములను సాధింతురు. గోచార దశలరీత్యా నవగ్రహములవలన గలుగు సర్వకీడులు తొలగును.

శ్లో॥ దుస్వప్ననాశనంచైవసుస్వప్నఫలదాయకం।
సర్వస్యార్తిహరంనిత్యం తథావంద్యాసుతప్రదం॥ 99

తా॥ దుస్వప్నములచేకలుగుచెడుఫలితములను రానివ్వదు. సుస్వప్నఫలములను పరిపూర్ణముగానిచ్చును. జనులందరిదుఃఖములనునశింపజేయును. విశేషంగా గొడ్రాలికి సంతానము నొసంగునదియైయున్నది.

శ్లో॥ అవైధవ్యకరంస్త్రీణాంసదాసౌభాగ్యదాయకం।
ఆయురారోగ్యమైశ్వర్యపుత్రపౌత్రవివర్ధనం। 100

తా॥ స్త్రీలకు సౌభ్యాగమునిచ్చును, వైధవ్యమురానివ్వదు. ఆయురారోగ్యఐశ్వర్యమును పుత్రపౌత్రవృద్ధి గావించును.

శ్లో॥ అకామితస్త్రీ విధవా జప్త్వామోక్షమవాప్నుయాత్।
వైధవ్యధ్వంసకామేనలభ్యతేత్వన్యజన్మని॥ 101

తా॥ విధవ అయిన స్త్రీ ఏకోరికయులేక ఈ గురుగీతను జపించినఎడల మోక్షము నొందును. వైధవ్యము రాకూడదని జపించిన ఎడల మరుజన్మయందు సువాసిని యగును.

శ్లో॥ సర్వదుఃఖంభయంవిఘ్నంనాశయేత్తాపహారకం।
సర్వబాధాప్రశమనంసర్వకామార్థమోక్షదం॥ 102

తా॥ సర్వదుఃఖములు, సర్వభయములు, సర్వవిఘ్నములు నశించును. సంతాపములను హరించును. సర్వబాధలను శమింపజేయును. సర్వకోర్కెలు తీర్చి మోక్షము నొసంగును.

శ్లో॥ యంయంకామయతేకామంతంత। మాప్నోతినిశ్చితం
కామితానాంకామధేను కల్పద్రుమప్రకల్పితా।
చింతామణిశ్చిన్తితస్యసర్వమంగళదాయకం॥ 103





తా॥ ఎవరెవరు యేయే కోరికలతో ఈ గురుగీతను జపించునో, వారు ఆయా కోర్కెలను పొందుదురు. కోరినవారి కోర్కెలు తీర్చుటలో కల్పవృక్షము, కామధేనుల వలేకామితము లీడేర్చును. కోరిన పదార్థము నిచ్చుటలో చింతామణి వలే సర్వ శుభములు ఈ గురుగీతయే యిచ్చును.

శ్లో॥ లిఖిత్వాపూజయిత్వాచ జపాన్మోక్షమవాప్నుయాత్।
కామేనపూజయేద్యస్తుతస్యకామఫలప్రదం॥ 104

తా॥ ఈగురుగీతను వ్రాసితానేపూజించి జపించుటవలన మోక్షమును పొందుదురు. ఎవరు ఏఏ కోరికలతో నున్న వారికోర్కెలుతప్పక సిద్ధించును.

శ్లో॥ జపేత్తుశాక్తశైవశ్చగాణాపత్యశ్చవైష్ణవః।
సిద్ధిదంమోక్షదందేవిసత్యంసత్యంనసంశయః॥ 105

తా॥ ఓదేవి శాక్తేయుడుగాని శైవుడుగానీ గాణపత్యుడుగాని వైష్ణవుడుగానీ దీనినెవడు జపించిననూ వారికి కార్యసిద్ధియు మోక్షమును కలుగును. ఎట్టి సందేహమూ వలదు.

శ్లో॥ అథకామ్యజపస్థానంకథయామివరాననే।
నగరాన్తే సరిత్తీర్థే।తదాహరిహరాలయే
శక్తిదేవాలయేగోష్ఠేసర్వదేవాలయే శుభం॥ 106

తా॥ ఓపార్వతీ! కోర్కెలవిషయములలో జపము చేయవలసిన స్థానమును చెప్పుచున్నాను. పట్టణములచివరను, నదీతీరమందును, హరిహరాలయములందును, శక్త్యాలయము నందును గోవులమందయున్న ప్రదేశమందును శుభప్రదమైనది.

శ్లో॥ వటస్యధాత్ర్యామూలేవామఠేబ్రందావనేతథా।
పవిత్రేనిర్మలేస్థానేనిత్యానుష్ఠానతోపివా।
నిర్వేదనేనమౌనేనజపంచైవసమాచరేత్।
శ్మశానేనిర్భయోభూత్వాజపేదేకాగ్రమానసః॥ 107

తా॥ మఱ్ఱిచెట్టు, ఉసిరిక చెట్లయొక్క మూలమందయినా, మఠమందు, తులసీ వనమందైనా సరే, ఏదయినా పవిత్రమూ నిర్మలమైన స్తానమందైననూ, నిత్యానుష్ఠాన సమయమందైనా సరే ఎవరికీ తెలియకుండా మౌనముగా జపాన్ని చేయాలి. నిశ్చల చిత్తుడై శ్మశానమందు నిర్భయుడై జపించవచ్చును.

శ్లో॥ **సిధ్యన్తిపైప్పలేమూలేచూతవృక్షస్యచైవహి।**
**గురుఃపూజ్యోవరంమూర్ఖస్తస్మాత్సిధ్యతినాన్యధా।**
**శుభకర్మణిసర్వత్రదీక్షాదీక్షాదిసిద్ధిదః॥** **108**

తా॥ రావిచెట్టు, మామిడిచెట్టుల మొదటగానీ ఈ గురు గీతాజపము చేసెనేని మూర్ఖుడైననూ పూజింపదగు గురువగును. గనుక గీతాధ్యానసిద్ధి దానివలన గలుగును. మఱియొక విధముగా ఈ శిద్ధిగలుగదు. గురువు శుభకర్మలయందునూ అంతటా దీక్షాదీక్షలయందు సిద్ధిగలిగించును.

శ్లో॥ **సంసారమలనాశార్ధంభవతాపాన్నివర్తనే॥** **109**

తా॥ సంసారమునందలి పాపములను నివారించు కొనేందుకు సంసారబంధములను తొలగించుకొనేందుకు గీతాస్తోత్రాన్ని జపించవలెను.

శ్లో॥ **గురుగీతాదిశిశ్రూషాంతత్వజ్ఞఃకురుతేసదా।**
**నఏవ సద్గురుస్సాక్షాత్సదాసద్ధర్మవిత్తుమః॥** **110**

తా॥ తత్వజ్ఞుడైనవాడెల్లప్పుడూ గురు గీతాదులను వినుటకు యిష్టపడును. అట్టివాడే సాక్షాత్ సద్గురుడున్నూ సర్వకాల సర్వావస్థల యందు మంచిధర్మముల నెరిగినవాడై యుండును.

శ్లో॥ **తస్యస్థానానిసర్వాణిపతిత్రాణిన సంశయః।**
**నఏవశుద్ధఃపూతశ్చసౌఖ్యభావేసతిష్ఠతి॥** **111**

తా॥ అట్టివానికి సమస్తజ్ఞానములు పవిత్రములు, సంశయము లేదు. అతడే శుద్ధుడును, పవిత్రుడును సౌఖ్యభావుండయి యుండును.

శ్లో॥ **తత్రదేవగణాస్సర్వేక్షేత్రపీఠేవసన్తిచ।**
**ఆసనస్థశ్శయానోవాగచ్ఛన్తిష్ఠన్సదాశుచిః॥** **112**

తా॥ అట్టి క్షేత్రపీఠమునందు సమస్త దేవగణములు నిండియుండును. కూర్చున్ననూ, నిలుచున్ననూ పడుకున్ననూ నడుచుచున్ననూ గురుగీతా జపపారాయణు డెల్లప్పుడూ శుచిగానే యుండును.

శ్లో॥ **అశ్వారూఢో, గజారూఢసుషుప్తోజాగ్రదప్యధ।**
**శుచిస్థితస్సదాజ్ఞానీ గురుగీతజపేనచ।**
**తస్యదర్శనమాత్రేణ పునర్జన్మనవిద్యతే॥** **113**





తా॥ ఏనుగునెక్కినను గుర్రమునెక్కినను నిద్రించిననూ జాగ్రదావస్థయందున్ననూ గురుగీతా జపమువలన జ్ఞానియెల్లప్పుడూ శుచిగానే యుండును. అట్టి మహాత్ముని దర్శనభాగ్యముచే జన్మ రాహిత్యమగును.

శ్లో॥ **సముద్రేచయధాతోయంక్షీరేక్షీరంజలేజలం।**
**భిన్నేకుంభేయధాకాశం తదాత్మాపరమాత్మని॥** **114**

తా॥ సముద్రమందలినీరువలె, పాలయందు పాలవలె నీటియందు నీరువలె నీటికుండ పగిలినపిదప కుంభమందలి ఆకాశము నిజాకాశములోకలియునో అలాగే ఆత్మపరమాత్మ యందు లీనముగానుండును.

శ్లో॥ **యధాయధావిధోభూత్వాయత్రకుత్రస్థితోపివా।**
**తదైవజ్ఞానీజీవాత్మాపరమాత్మనిసర్వదా॥** **115**

తా॥ యే యే విధముగానైనను, సరే, ఎచ్చటెచ్చట నున్ననూ సరే జీవాత్మ పరమాత్మయందు సర్వదా నిలిచి ఉంటున్నాడు.

శ్లో॥ **తస్యసర్వప్రయత్నేనభావభక్తింకరోతియః।**
**ససర్వత్రహితోయోగయుక్తోభవతిపార్వతీ।** **116**

తా॥ ఓపార్వతీ!ఎవరైతే సర్వప్రయత్నములచేత యోగ్యమైన భావముతో భక్తినిలుపునో అట్టివాడు సర్వహితుడై యోగగమ్యుడైనవాడగుచున్నాడు.

శ్లో॥ **ముక్తిర్ముక్తిర్దయాత్యస్యజిహ్వాగ్రేచసరస్వతి।**
**అనేనప్రాణినస్సర్వే తథాగీతాజపేనచ।**
**సర్వసిద్ధిమవాప్స్యంతిముక్తింముక్తింనసంశయః॥** **117**

తా॥ గురుగీతాజపముచేయువానియొక్కదయయే ముక్తివానిజిహ్వాగ్రమందే సరస్వతి యుండును. వీనిచేతనే ప్రాణులందరూ ముక్తులగుదురు. గురుగీతాజపముచేయు ప్రతివారునూ ముక్తులు కాగలరు. సమస్తమైనకార్యసిద్ధినిపొందుచున్నారు. ముక్తినికూడా పొందుచున్నారు. ఈ విషయమున సందేహింపపనిలేదు.

శ్లో॥ **సత్యంసత్యంపునఃస్సత్యంధర్మసంఖ్యామయోదితా।**
**గురుగీతాసమోనాస్తిసత్యంసత్యంవరాననే॥** **118**

తా॥ ఓపార్వతీ యిది సత్యము, సత్యము, సత్యము ముమ్మాటికీ సత్యము. ఈ గురుగీత యందు ధర్మజ్ఞానము నాచే చెప్పబడినది. దీనితో సమమగునది మరేదియూ లేదు. ఇది సత్యము సుమా!

శ్లో॥ **ఏకందైవంధర్మఏకఏకానిష్ఠాపరన్తపః।**
**గురోఃపరతరంనాస్తితత్వంచైవగురోఃపదం॥** **119**

తా॥ ఒకటే దైవము, ఒకటే ధర్మము, ఒకటే నిష్ఠ, ఇదే తపస్సు. గురువుకంటే పరాత్పరుడు వేరుగాలేడు గురుని పాదములే పరతత్వమని నమ్మవలెను.

శ్లో॥ **మతాధన్యాపితాధన్యోధన్యంసర్వంకులంతథా।**
**ధన్యాచవసుధాదేవీగురుభక్తిస్సుదుర్లభాం॥** **120**

తా॥ గురుభక్తిగలవానివలన వాని తల్లీదండ్రీ ధన్యులు. కుటుంబము ధన్యము. పవిత్రమగును. భూదేవియును వానివలననే ధన్యురాలగును. గురుభక్తి కలిగి యుండుట యిలలో దుర్లభము.

శ్లో॥ **శరీరమిన్ద్రియం ప్రాణాఅర్థస్వజనబాంధవాః।**
**పితృమాతృకులందేవిగురురేవనసంశయః॥** **121**

తా॥ శరీరము, యింద్రియములు, ప్రాణము, ధనము, స్వజనము, బంధువులు, తండ్రి కులము, తల్లికులము ఇవన్నియు గురుస్వరూపమైనవి కావు, గురుభక్తియే శ్రేష్ఠము.

శ్లో॥ **ఆజన్మకర్మణాంకోటియజ్ఞవ్రతతపఃక్రియాః।**
**తస్యసర్వఫలందేవిగురుసంతోషమాత్రతః॥** **122**

తా॥ ఓ పార్వతీ గురువును సంతోషింపచేసి నంతమాత్రమున గలుగు ఫలమేమనగా పుట్టినప్పటి నుండి చేసిన సర్వకర్మలు, కోటియజ్ఞములు, వ్రతములు, తపస్సులు, చేసిన ఎలాంటి ఫలము గలుగునో ఆ ఫలము గురువు సంతోషింపజేసిన వారికి కలుగును.

శ్లో॥ **విద్యాధరైర్భవేనాపిమందభాగ్యస్తుయేజనాః।**
**గురుసేవాంనకుర్వంతిసత్యంసత్యంనసంశయః॥** **123**

తా॥ విద్యలేక, ధనములేక, బలములేక అదృష్టహీనులై కనబడు ఏ మానవులుగలరో అట్టివారు గురుసేవచేయని కారణముననే యిట్టి దుస్థితి కలిగినది. యిది సత్యము సత్యము. సంశయించవలదు.





శ్లో॥ **బ్రహ్మవిష్ణుమహేశాది దేవర్షిపితృకిన్నరాః॥**
**సిద్ధచారణయక్షాద్యాయేచాన్యేమునయోజనః।**
**గరుభావంపరంతీర్థమన్యతీర్థంనిరర్థకం॥** **124**

తా॥ బ్రహ్మవిష్ణు, మహేశ్వరుడు, దేవతలు, ఋషులు, పితృదేవతలు, కిన్నెరులు, సిద్ధులు, చారణులు,యక్షులు మొదలగువారు యింకా యితర మునీశ్వరులు, జనులు, వీరియందొక్కరి యందును గురు భావమనునదియే ముఖ్యమైన సార్థకమైన, పుణ్యతీర్థము గానీ యితరమగు గయాప్రయాగాదులు నిరర్థకము సుమా.

శ్లో॥ **సర్వతీర్థాశ్రయోదేవి పాదాఙ్గుష్ఠేచవర్తతే।**
**ఇదంరహస్యంవాచ్యంతవాగ్రేకథితంమయా॥** **125**

తా॥ ఓ పార్వతీ! గురుశ్రేష్ఠుడైన మహాత్మునియొక్క పాదాగ్రమునందే సర్వ తీర్థములున్నవి. అతని పాదవందనమే సర్వతీర్థములు సేవించిన ఫలము నిచ్చును. నీకీరహస్యమును చెప్పితిని.

శ్లో॥ **సుగోప్యంచప్రయత్నేనపరతత్వంప్రియేసతి।**
**స్వామిముఖ్యగణేశాదివైష్ణవాదిషుపార్వతీ॥** **126**

తా॥ ఓ ప్రియురాలా! ఓ పతివ్రతా! ఓ పార్వతీ, ఈ పరతత్వము ఆస్థికులయిన గణేశాదులందును, విష్ణుభక్తులయందును, దీనిని రక్షించి యుంచవలయును.

శ్లో॥ **అభక్తేవంచకేధూర్తే పాషండే నాస్తికేపునః।**
**మనసాపినవక్తవ్యాగురుగీతాకదాచనా॥** **127**

తా॥ భక్తిలేనివానికి, వంచకునకు, దుర్మార్గునకు, పాషండునకు, పరమేశ్వరుడు లేడనువానికి ఈ గురుగీతను చెప్పరాదు. చెప్పాలని మనసునందైనా తలంచరాదు.

శ్లో॥ **గురవోబహవస్సంతి శిష్యవిత్తాపహారకాః।**
**దుర్లభస్సద్గురుర్దేవిశిష్యసన్తాపనాశకః॥** **128**

తా॥ యిల శిష్యుని విత్తమున పహరించు గురువులనేకులు కలరు దేవీ, శిష్యునకుగల సంతాపమును హరించే గురువు దొరకుట దుర్లభము.

శ్లో॥ అతీతచిత్తశాన్తశ్చశుద్ధభక్తిసమన్వితః।
వక్తవ్యస్తు ఇదందేవిమమచాత్మప్రియంసతి॥ 129

తా॥ ఓ పార్వతీ! మిక్కిలి చిత్తశాంతిగలవాడును కేవలము భక్తిభావముగల్గినవాడు దీనిని యితరులకు ఉపదేశింపవలయును. అట్లుచేసిన నాయాత్మ సంతసించును.

శ్లో॥ సంసారసాగరసముద్ధరణైకమన్త్రం। బ్రహ్మాదిదేవమునిపూజితసిద్ధమంత్రం॥
దారిద్ర్యదుఃఖభయశోకవినాశమన్త్రం॥ వన్దేమహాభయహరంగురురాజమంత్రం॥ 130

తా॥ సంసారమనియెడు మహాసముద్రమును దాటించుటకిదియే మంత్రము. బ్రహ్మా మొదలగు దేవతలు మునులచేత పూజించబడినదిదే మంత్రము. దారిద్ర్యము వలన కలిగెడు దుఃఖమును, భయమును, శోకమును పోగొట్టునదీమంత్రము. ఇట్టి సకల దోషములను హరించునట్టి గురుప్రతిపాదకమంత్రరాజమును గూర్చి ప్రతీదినము వందనములు చేయుచున్నాను.

**ఇతి రుద్రయామలే ఉమామహేశ్వరసంవాదే గురుగీతాస్తోత్రం సంపూర్ణము**

వీరబ్రహ్మ ఉవాచ:

అ.వె గురుడుగురునిపూజ, గుఱుతుశిష్యునిపూజ। శిష్యగురులయొక్క శివునిపూజ
హరునిపూజచేయుగురుశిష్యులెందరో। నిత్యముక్తిపరులవేర్పు సిద్ధా॥

క॥ దర్భాసనాలువేసుక। దుర్భాలషలనొకరినెపుడు దూషించెడునా।
నిర్భాగ్యులేమిగాంతురు?దౌర్భాగ్యులేయెంచి చూడధరణిని సిద్ధా॥

క॥ సంసారమునందుండియు। సంసారముమిథ్యజేసిసర్వముతానై।
సంసారమందునిలిచిన సంసారే రాజయోగిసత్యము సిద్ధా॥

క॥ సన్యాసమైననొక్కటె। కన్యలతో నున్ననొకటె కనుపాపలలో।
వెన్నెలజూచినవారలు। తన్నెరుగుదురయ్యయోగధన్యులు సిద్ధా॥

క॥ అంతాబ్రహ్మమయంబని, సంతసమునద్గిగురువారు సర్వజ్ఞులు, శ్రీ
కాంతునికృపచే వారికి। చింతలులేవయ్యయోగసిద్ధులు సిద్ధా॥

క॥ శ్రీగురుపదములుముట్టియు బాగుగ త్రివిధప్రసాదభక్షకుడైనన్।
యోగంబుచేయనేటికి? యోగులలోనుండునతడెయోగ్యుడు సిద్ధా॥





బ్రహ్మజ్ఞానాసక్తులారా! ఆత్మబంధువులారా! యోగసాధకులారా! యిందలి ఆధ్యాత్మిక విషయములు సంపూర్ణముగా గ్రహించండి.

వీరబ్రహ్మేంద్రుని ఉవాచ

ఆ.వె॥ జీవి విశ్వకర్మ చిక్కుతెలియరాదు।భావమెంచి చూడ బ్రహ్మమతడు।
వాని పేరదేమి?వాడె పరమశివుండు।కాళికాంబహంసకాళికాంబ॥

ఆ.వె॥ విశ్వదోషగుణము విప్రులపాలయె।విశ్వమెల్ల నడుపు విశ్వకర్మ।
విశ్వగురుండెవడో వివరించిచూడుడు।కాళికాంబహంసకాళికాంబ॥

ఆ.వె॥ బ్రహ్మమనగవేరె పరదేశమున లేదు।బ్రహ్మమనగ చూడు బట్టబయలు॥
తనకు తానె బ్రహ్మ తారకమౌనురా।కాళికాంబహంసకాళికాంబ॥

యోగసిద్ధులు తెల్పిన అమృతవాక్కులు

సీ॥ ఆత్మవృత్తులనెడియంబుధిలింకునే। యచలాత్మయనుబడబాగ్నిలేక।
వికటాష్టమదశైలనికరముల్। పగులునేధరణినిశ్చలవజ్రధారలేక।
యీషణత్రితయమత్తేభంబులడగునే। పరిపూర్ణమనెడుకేసరియులేక।
మేనునేననుగాఢమేఘంబువిచ్చునే। శేషాత్మయనువాయుసిద్ధిలేక॥

గీ॥ పరమపదనిర్గుణానంతనిరుపమాన। వస్తువీక్షింపగల్గునేవర్గరహిత।
సలలితానందగురుకృపాంజనములేక। హరిహరవిధాతృలకయిననరశిచూడ॥

సీ॥ ధరణిసంసారసంతాపార్తిదీరునే। గురుదాస్యమనుహిమకరుడులేక।
మదవృత్తియనుపెద్దమత్తేభమణగునే। దేశకార్చమృగాధిపుడులేక।
శతృషట్కాభీలసర్పంబులడగునే। గురుకృపయనుఫలగేశ్వరుడులేక।
మమతాభావంబనుమహిమమెల్లదొలగునే। దేశికధ్యానార్కదీప్తిలేక॥

గీ॥ పరమపదనిర్గుణానంతనిరుపమాన। వస్తువీక్షింపగల్గునేవర్గరహిత।
సలలితానందగురుకృపాంజనములేక। హరిహరవిధాతృలకునైననరశిచూడ॥

సీ॥ దుగ్దృశ్యరూపపంక్తిశిరుండుగూలునే। బయలనుజానకీభర్తలేక।
అభిమానమనుగంభీరాంబువులింకునే। పరమపతార్కతిగ్మరుచిలేక।
సత్యానృత్యాభీలసర్పంబులడగునే। పరమాత్మయును ఘోరబర్హిలేక
చైతన్యమనెడుజీమూతంబువిరియునే।సత్యాత్మయనుప్రభుజనములేక॥

గీ॥ పరమపదనిర్గుణానంతనిరుపమాన।వస్తువీక్షింపగల్గునేవర్గరహిత।
సలలితానందగురుకృపాంజనములేక। హరిహరవిధాతృలకునైననరశిచూడ॥

యోగసాధకులు సులువుగా యోగసిద్ధిని పొందుటకు గాను మహా పెద్దలచే వ్రాయబడిన ముఖ్య విషయముల నిందు పొందుపరచినాము.

**గురుపరంపర**

అద్వైతసుధానిధి గ్రంథరచయిత పట్టిసపు వెంకటేశ్వరుడు వ్రాసిన గురుపరంపరలో శ్రీశంకరానందులవారి ప్రియశిష్యుడు జగద్గురువు, సద్గురువు, మద్గురుదేవులయగు బ్రహ్మశ్రీ సింహాద్రి విశ్వనాథావదూత స్వామి గారు వారి ముఖ్య శిష్యులగు1. రెడ్డివెంకటసుబ్రహ్మణ్యం, 2. తణికెళ్ళ శేషయ్య 3 మంతెన వెంకటరత్నము, 4. పట్టిసపువెంకటేశ్వరుడు, అనేకులుగలయిందులో 4వ వారికి అమనస్కబోధ చేయుమని సనారీవారు2వ వారికి అజ్ఞయివ్వగాశేషయ్యగారినుండి పొందిన బోధానుభవముతో అద్వైతసుధానిధి వ్రాసినట్లు పట్టిసపు వెంకటేశ్వరుడు ముందుమాటలో చెప్పు కున్నాడు.దాని ఆధారంగా ఈ గురుపరంపరను వ్రాసిన బ్రహ్మశ్రీ సుగంధం **సాయిబాబాచార్య స్వామీజీ**, సెల్: 9290582110, 9032253205 శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారీవిశ్వనాథాలయ నిర్మాణాధ్యక్షులు మహానాడురోడ్డు నెం.7, కృష్ణానదీ తీరము, తాడేపల్లి పోస్టు & మండలం గుంటూరు జిల్లా, నవ్యాంధ్ర - పిన్ 522501

**గుర్వష్టకము**

శ్లో॥ మౌనజపపారాయణాముక్తియోగకారణా।
ధ్యానధ్యాతృధేయరహితదేవదేవనాయకా।
స్థానరహితపూర్ణవిమలసత్యవస్తుదాయకా।
సుజ్ఞానరూపరహితపరమకారణాయతేనమో॥

శ్లో॥ ఇదమఖండపూర్ణతత్వమిదమనంతమవ్యయం।
ఇదమవాచ్యమిదమభేద్యమిదమభోజ్యభోక్తకం।
మదినినిల్పుమనుచుసమ్ముదముతోద్వాదశిం।
సదయుతోడభోదసేయుసాక్షిరహితతేనమో॥





శ్లో॥ అచలపూర్ణపరమకేవలాత్మతత్వనాయకా।
ఖగచరపక్షిరహితహృదయకమలకర్ణికాంతరా।
విచరతత్వసర్వసాక్షివిత్వహంతవర్జితా।
సచియునిచియుహృదయసారసత్యరూపతేనమో॥

శ్లో॥ పరమవస్తుతత్వరూపభావనాతీతసుస్థిర।
తరాత్మద్రవ్యవిమలతేజ తేజరహితసం।
చరితచరితముక్తతత్వశేషశేషవర్జితా।
పరమపోషపరమాధీశపాపహరతేనమో॥

శ్లో॥ పలుకుగులుకుకలకలేనిపరమవస్తునాయకా।
నిలకడైనభక్తితోనునిన్నునన్నువదలినేమో।
సలిలతంబుగానుమదిని సత్యరూపమైక్యమై।
పలువిధమ్ములాత్మదలతుపావనాయతేనమో॥

శ్లో॥ ఆదిమధ్యలేకవెల్గునాదివస్తుకారణా।
సాధనాతీతమగుచుసంభవించుదేవరా॥
గాధబాధలేకవెల్గుఖండతత్వనాయకా।
సాధుతత్వహృదయరూపసాక్షిరహితతేనమో॥

శ్లో॥ మూలమేమిలేకయున్నమోక్షతత్వనాయకా।
మూలప్రకృతిహరణదివ్యపూర్ణతత్వనాయకా।
కాలనీమవర్జితాకార్యకారణాత్మకా।
నాలుగొకటిరెండులేనినాదిముఖ్యతేనమో॥

శ్లో॥ పంచతత్వములకుపైనవెనుకతానుయై।
అంచితముగనున్నపూర్ణమధ్యకేవలాత్మకా।
నించుకంతకొరతలేకనిండినిర్వికారమై।
యంచశక్యరహితమగునలరుదైవతేనమో॥

సనారీవిశ్వనాథావధూతగారి సద్గుర్వష్టకము( రెడ్డి సుబ్రహ్మణ్య ప్రణీతము)

సీ॥ శ్రీపతిశివధాతుచిద్రూపయుక్తుడౌ। పరమాత్మరూపునేప్రస్తుతించి
సకలచరాచరజంతుజాలములందు। విహరించుచున్నసద్విమలుదలచి।
ధరణియాదిగభూతతత్వాత్ముడైనట్టి। హంసస్వరూపునేనభినుతించి।
నిర్గుణజ్ఞప్తితోనెగడులోకములెల్ల। పరిపాలనమొనర్చు ప్రభువునెంచి।
గీ॥ శిష్టకాసనసీసపద్యాష్టకంబు। జెప్పినుతిజేతుగృపజూడు సేవకుడను।
విశ్వనాథావధూతసద్విమలచరిత। పతితపావనసద్భక్తపారిజాత॥ 1
సీ॥ బాలప్రాయమునాడుపరమాత్మకనులందె। చూపించిబ్రోచినసూరినీవె।
సంసారబంధంబుసడలించిభ్రాంతులు।విడుదలజేచినవిభుడవీవె।
నాల్గుయోగంబులు,నమ్మికాదెల్పి। కేవలాత్మనుజూపితీవె।
లక్ష్యత్రయమునందులక్షణంబుగ। నిల్పితత్సాక్షిదెల్పినధాతవీవె॥
గీ॥ అహహమిమ్ములనుతియింపనజునికైన।దరముగాదయ్యనిర్గుణతత్వమూర్తి।
విశ్వనాథావదూతసద్విమలచరిత।పతితపావనసద్భక్తపారిజాత॥ 2
సీ॥ ముద్రపంచకమునుముక్తపరచియుయోగ। నిద్రదెలిపినకృపానిధివినీవ।
యూరేడులోకంబులీమేనజూపి।సుజ్ఞానంబుగలిగించుఘనుడవీవె।
హఠమనుయోగాభ్యాసంబుజేయించి। దుర్వృత్తులనుద్రుంచుదృక్కునీవె।
పిమ్మటదానిప్రీతియుబోకార్చితేను।బయల్ప్రాకించువిభుడవీవె॥
గీ॥ ప్రాకప్రాకంగజగములరాకపోకదలచి।యెరుగంగనేర్చినదైవమీవ।
విశ్వనాథావధూతసద్విమలచరిత।పతితపావనసద్భక్తపారిజాత॥ 3
సీ॥ వున్నదెపుడునిండియుండనేయున్నది।లేనిదెచ్చోటనయినలేనెలేదు।
యిదినిజంబేగానియీరెండుననబోక। మరియున్నచోననుమానపడక।
యూరుకుండుటెచాలునూహింపనెప్పుడు।వచ్చినదెల్లభ్రమరూపుస్థిరంబునరయ।
నాభ్రమరూపుమయ్యచలరూపమెకాని।యన్యంబుగానేరదచలునకు
గీ॥ నబ్ధినుదయించుబుద్బుదంబదియుజూడ। నబ్ధిరూపంబెయగుగాకయన్యమగునె।
విశ్వనాథావదూతసద్విమలచరిత।పతితపావనసద్భక్తపారిజాత॥ 4
సీ॥ ప్రకృతిద్వయాటవిభంగమెట్లనివేడ।షోడశదవవహ్నిజూపినావు।
దైవరూపమునాకుదయదెల్పమనివేడ।దెలివిబ్రహ్మంబనిదెలిపినావు।





తెలివెక్కడైక్యమోదెల్పవేయనివేడ।బట్టబయలదంచుబల్కినావు॥
ఆబట్టబయలెద్దియనిమరియునువేడబ్రహ్మంబిదేయంచుబల్కినావు॥
గీ॥ పల్కుకళలేమిలేనిదీనవస్తువనుచు।జెప్పియొప్పించినట్టిమాయప్పవీవు।
విశ్వనాథావధూతసద్విమలచరిత।పతితపావనసద్భక్తపారిజాత॥ 5
సీ॥ సప్తభూమికలసారాంశమరయగా। షోడశాక్షరిలోనసూటి యయ్యె।
సప్తచక్రములలోసారాంశమరయగా।షోడశాక్షరిలోనసూటి యయ్యె।
సకలమూర్తులందుసారాంశమరయగా।షోడశాక్షరిలోనసూటి యయ్యె।
సర్వసమాధులసారంశమరయగా।షోడశాక్షరిలోనసూటి యయ్యె॥
గీ॥ పంచదశివలెషోడశినెంచశేషసంజ్ఞ। మొందితిద్వాదశాక్షరుడవగుచు।
విశ్వనాథావధూతసద్విమలచరిత। పతితపావనసద్భక్తపారిజాత॥ 6
సీ॥ ఈయుత్తబట్టబయలేమిలేదంచు।దానూహించిదెలియువాడుత్తముండు।
ఆతెలివిననుభవంబాత్మలోపరికించి।యదిమంత్రమందునైక్యపరచి।
యదియునుగురువునందైక్యంబుగాజేసి యాయైక్యభావమేయాత్మనరసి॥
చూడచూడంగరిత్తసూన్యభావముజెంది। బట్టబయలైనిల్చుగుట్టుతోడ॥
గీ॥ నట్టిగుట్టిట్టిదంచాత్మబట్టనేనిబుట్టుట।గిట్టుటయురెండువట్టివగును।
విశ్వనాథావధూతసద్విమలచరిత।పతితపావనసద్భక్తపారిజాత॥ 7
వ॥ యిట్టి మహానుభావుండుగనుకనేమూర్తిత్రయాతీతంబయినపరబ్రహ్మంబునగు సనారీవారినిజగద్గురువనదగెను.

గీ॥ పెక్కువదరులాడుటకుక్కలకెల్లను।దక్కబోదుపరమునిక్కముగను। 8
చిక్కునుచ్చులోనిజింకచందంబురా।వీరగురువరేణ్యవిభుధశరణ్య॥
విశ్వనాథావదూతసద్విమలచరిత।పతితపావనసద్భక్తపారిజాత॥

సద్గురులక్షణము

క॥ శివహరిరుద్రేశసదా, శివులెవ్వనికుక్షి లోనచెలువొందుచుదా, నివ।
సించియుందురుయాప్రవిమలు।డాచార్యుడనుచుభావింపదగున్॥
గీ॥ దృశ్యమెదుటలేకదృష్టియునాలంబ।నంబులేకమానసంబొకింత।
యలసతయులేకయనిశంబునిలచునే।సత్తమునకతండెసద్గురుండు॥

గీ॥ ఇన్నిచెప్పనేలయేఘనుండవనిలో। బ్రహ్మతత్వమెరిగిబ్రహ్మతత్వ।
మందునిష్టగలిగియదిశిష్యముఖమున।బోధశేయువాడెపోసద్గురుండు॥

క॥ శరణనిపలికినశిష్యునికరుణినించియు।సాంఖ్యతారకంబులలోనన్।
సరణిన్దెల్పుచుమనసుకుగురిదెల్పిన।వారుబోధగురువులుగారే॥

వ॥ యిట్టిసద్గురువులదరిచేరిసేవించువిధంబెట్లనిన

క॥ గురువేదైవంబనుచును, గురువేపరుడనుచు।మదినిగురినిల్పుచుయా।
పరిపూర్ణునిశోధించిననరుడే।నారాయణుండునయముగజూడన్॥

వ॥ యిలాభావించి చిత్తశుద్ధితో గురుని సేవించినచో శిష్యునిపై పుత్రవాత్సల్యంబుతో గురుదేవుడు హస్తమస్తక సంయోగముతో జ్ఞానదృష్టినొసంగును.

:-వేమన ఉవాచ:-

గీ॥ కుక్కను తిన్నవాడు గురులింగజంగడు పందిని తిన్నవాడు పరమయోగి
ఏనుగును తిన్నవాడు ఎంత సుజ్ఞానియో విశ్వదాభిరామ వినురమేమ॥

తా॥ మానవ శరీరమందలి మనస్సు కుక్కవలె అతిచంచలమై ఒక్కక్షణం కూడా స్థిరముగా నుండక ఇల్లిల్లు తిరుగుతున్నట్లు మనస్సుకూడా విషయములకై పరుగులిడు చుండును. కుక్కమాదిరిగా చంచలమైన మనస్సును ఎవరు జయింతురో వారు నిజముగా గురుతుల్యుడే అట్టివానిని కుక్కను తిన్న గురులింగడని పై పద్య భావము. మనస్సు చంచలమైనదే గాక పరమ నీచ విషయములమీదికి సదా పోవుచుండును. అందువలన దానిని పందితో సమానముగా పోల్చి అట్టి మనసును జయించినవారు పరమయోగియని తెల్పుచూ పందిని తిన్నవాడు పరమయోగి యని వర్ణించారు. మనస్సు చంచలమైనది. నీచమైనదియేగాక, చాలా బలమైనదిగా కూడాయున్నది. అట్టిదానిని జయించవలెనని ప్రయత్నము చేయు వారికి సులభముగా లొంగదు. ఎంత బలముగా మనస్సు నిలువవలెనని ప్రయత్నిస్తున్నా అది ఏనుగు వలే బలమైనది గావున మన ప్రయత్నమనే పగ్గములకు ఆగక సులభముగా లాగుకొని పోవుమనస్సు ఏనుగువలె బలమైనదిగా వర్ణించుచూ అట్టి మనస్సును జయించినవాడు మహాజ్ఞాని యని చెప్పుచూ అట్టివానిని ఏనుగును తిన్నవాడని వేమనగారి మనోభావము.





గీ॥ విశ్వకర్మ లేకవిశ్వంబుతాలేదు।కుదువకూడులేదు గృహములేదు॥
విశ్వకర్మ గురుడు వేల్పులకెల్లను।విశ్వదాభిరామ వినురవేమ॥

గీ॥ పుట్టినప్పుడు బొడ్డుకోసిన నాడు।అప్పుడెగురు ముద్రయంటియుండె।
ముద్రతాకనివారు ముజ్జగంబునలేరు।విశ్వదాభిరామ వినురవేమ॥

గీ॥ అన్నిజాతులకు ఆధారమైనట్టులున్న।సానగాదిమిన్నఋషుల।
నెన్నిజన్మలకు నెక్కడగానము।విశ్వదాభిరామ వినురవేమ॥

గీ॥ ఋషికులంబునందు రూఢిగా జన్మించి।కులముగోత్రములనుగొప్పలైరి॥
బ్రహ్మసంతతిగాక బ్రాహ్మణులెట్టైరి।విశ్వదాభిరామ వినురవేమ॥

గీ॥ విశ్వకర్మ గురుడు విశ్వంబునకునెల్ల।ప్రణవమంత్రమొకటి పరమగురుడు।
కన్నకడుపు గురువు గాయత్రిమంత్రంబు।విశ్వదాభిరామ వినురవేమ॥

శ్రీ సనారీ చాలీసా

1. క్షీరాద్రివాసాసనారిదేవా- జగతిమూలంనీవేజగద్గురూ
సాక్షాత్ పరమశివావతారం- నీలోనేసర్వసృష్టివ్యవహారం
విరాట్స్వరూపా ఓ సనారీ- కరుణించిమముకావగరావా
దర్శనమీయగరావయ్యా- ముక్తిమార్గములనుబోధించుమయా ॥క్షీరా॥

2. కాషాయకౌపీనమును ధరించి- కఠారిని చేతినబట్టి
శ్రీశైలగుహాంతర్భాగమున- మహాతపోదీక్షలోనుండి
కలియుగమందునవెలసినదేవా- యోగసాధనలు తెలుపగరావా
భక్తులమదిలోనీరూపం- పాలకొండలోనీ నివాసం ॥క్షీరా॥

3. చచ్చినగొఱ్ఱెపై హస్తమునుంచి - కరుణతో జీవం పోసితివి
అచ్చెరువొందిరి ఆ గ్రామ ప్రజలు- పరమానందము పొందిరివారు
కురూపికన్యను దరిచేరదీసి-ఆమె దుఃఖకారణ మెరిగి
సౌందర్యవతిని చేసితివి- ఘనాపాఠీలగర్వమణిచితివి ॥క్షీరా॥

4. శిష్యబృందం సేవలుచూచి- ముక్తిమార్గము తెలిపితివీ
చచ్చినయువకుని బ్రతికించి- సర్పరాజుకు శిక్షవేసితివి
పక్షులయందు జాలి కలిగి- ధనమిచ్చి వాటి ప్రాణము కాచి
గిరిజనులందు కరుణతో- జీవనమార్గమును జూపితివీ ॥క్షీరా॥

5. నిత్యమునీవు యోగసాధనల- వివరములను శిష్యులకు తెలిపి
అభయమిచ్చి కాచిన గురువరా- (సింహాద్రి) విశ్వనాధావధూత
ధన్యము ధన్యము మా జీవనము- నిన్నేకొలిచి సేవింతుము (స్వామీ!)
నీ దివ్య చరణారవిందము -మా పాలిట అదే రక్షణ కవచము ॥క్షీరా॥

6. విజయనగరాధీశులకు - రాజగురువువై రాజసముతో
దివ్యబోధనలుచేసితివి- రాజసభలో నీ ప్రతిభనుజూపి
పండితుల ఈర్ష్యాద్వేషమును త్రుంచి- పాండిత్యగర్వము భంగము చేసి
దుష్టమాంత్రికుల మారణకాండను- త్రిప్పికొట్టి మృతులను జేసిన ॥క్షీరా॥

7. భక్తిమార్గములు చూపితివి- భక్తులకోర్కెలు తీర్చితివి
ద్రాక్షారామమున మృహమ్మారిని- బంధనజేసి జీవులకాచి
రాజమహేంద్రి పంచాననులకు- స్వర్ణముచేసి చూపితివీవు
వారికిగల ధనమోహమునాపి- ధన్యత నొందు దారులు జూపిన ॥క్షీరా॥

8. రాజమండ్రి తాహసిల్దార్‌ను- ప్రతిమనుచేసి గర్వమునణచి
బ్రాహ్మణకన్యనావహించిన- బ్రహ్మరాక్షసిశాపముబాపి
గోదావరిపుష్కరమహిమను- విజయరామప్రభువునకు జూపి
పితృదేవుల పిండతర్పణలు- ఆవాహనచేసి ఆరగింపజేసిన ॥క్షీరా॥

9. మొదలియార్ మహావ్యాధిని- నీ (దివ్య) మహిమతో తొలగించితివి
సంవాదగ్రంథమును ముద్రింపించి- చెన్నపురిలో (బ్రహ్మరథంపై) బయలుదేరి
మార్గమందు పీఠాధిపతులతో- వేదవాగ్వివాదములు జరిపితివి
అన్నపూర్ణను ఆవాహనజేసి- అర్ధనారీశుడవై వెలుగొందితివి ॥క్షీరా॥





10. పండితసభలో త్రినేత్రము జూపి- గడ్డిమేటలను భస్మంచేసి
పీఠాధిపతుల అహమునణచి- పండితులచే ప్రార్థనలంది
కాలజ్ఞానబోధలు చేసి- కలియుగధర్మంకనుడని తెలిపి
విశ్వమ్ములోతాను శాశ్వతంబుగనుందునని శ్రీశైలగుహనుచేరిన ॥క్షీరా॥

11. రేయిపగలు నీ ధ్యానము- నిత్యమునీ గ్రంథపఠనము
భక్తితో చేయు నీ పూజలు- చూపించును ముక్తికి మార్గము
పదకొండుసార్లు అర్థము గ్రహించి- మేము చదువు నీ గ్రంథము
తెలుపును సర్వసృష్టి రహస్యములు- సర్వవేదార్థసారమును ॥క్షీరా॥

12. అందరిలోనూ గలదు నీ అంశ- నీ మహిమలు అనంతములు
ఓ సనారీ మేమజ్ఞానులము- మా కొసంగుమయా బ్రహ్మజ్ఞానం
సృష్టికి నీవే మూలము స్వామీ- సర్వజీవులపోషకుడవీవు
సదా సనారీమంత్రము జపించెదము- నిత్యము స్వామిని కొలిచెదము ॥క్షీరా॥

13. భక్తిభావము తెలుసుకొని- స్వామిని మదిలో నిలుపుకొని
చిత్తములో సనారీ ధ్యానము- శ్రద్ధతో చేయండీ ప్రతీనిత్యం
సకలదోషములు నివారించును- వ్యాధిబాధలు తొలగించును
శ్రీశైలగుహాంతరమునుండి- భక్తులనెప్పుడు కాపాడునయా ॥క్షీరా॥

14. మన ప్రశ్నలకు సమాధానములు- తెల్పును సనారీ సంవాదము
వినండి మీరే చదవండి- సనారీ సత్యము చూడండి
సత్సంగమమును చేయండి- శుద్ధజ్ఞానమును పొందండి
వివిధమార్గములువీడండి- సనారీయే సద్గురువండీ ॥క్షీరా॥

**శ్రీ సనారీ ఖడ్గము**

ఓం నమో భగవతే అధర్వణ మహాశాస్త్ర మంత్రధికారిణే ఓం హ్రీం శ్రీం గౌరీదేవి కుమార ఐం క్లీం సౌః ఈశ్వరాంశాయ, సింహాద్రి విశ్వనాథాయ, విశ్వకర్మకులోద్భవాయ, విశ్వబ్రాహ్మణ కులోద్ధారకాయ, అపరిమిత అట్టహాసాయ బ్రహ్మజ్ఞాన ప్రదాతాయ, సకలపాప సంహారకాయ, సహస్రకోటిభక్త సంరక్షకాయ, సర్వభూతదమనాయ, శ్రీశైలగుహ

నివాసాయ శరణాగతపాలనాయ, కాలగ్రహ, కామినీ గ్రహ, పిశాచ గ్రహ, ఛండాలగ్రహ, బ్రహ్మరాక్షస, శాకినీ, ఢాకినీ, సర్వదుష్టగ్రహాన్ హన హణ దహ దహ పచ పచ మారయ మారయ మర్ధయ మర్ధయ చూర్ణయ చూర్ణయ నికృంతయ నికృంతయ రాజభయం చోరభయం- శత్రుభయం- రోగభయం నాశయ నాశయ ఏకాహీక ద్వాహిక త్ర్యాహిక చాతుర్థిక పక్షమాస త్రైమాసిక షణ్మాసిక సాంవత్సరీక సన్నిపాత సర్వజ్వరాన్ నాశయ నాశయ సర్వవ్యాఘ్ర భల్లూక దురీకృత దూరోకృత దుష్టపుచ్ఛ మస్తక స్థావరజంగమ సర్వవిషాన్ నాశయ నాశయ మమ ఆత్మ మంత్రయంత్ర తంత్ర సహస్రకోటీన్ సంరక్షయ సంరక్షయ కుఠారేణ బిందిబింది చింది చింది విభోదయ విభోదయ శ్రీ సనారీ విశ్వనాథాయ ఆజ్ఞయ సర్వశత్రూన్ నాశయ నాశయ సర్వదుష్టగ్రహాన్ నాశయ నాశయ సర్వభయాన్ నాశయ నాశయ ఓం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః హుం ఫట్ స్వాహా సౌః క్లీం ఐం శ్రీం హ్రీం ఓం హుంఫట్ స్వాహా శ్రీ పాలకొండపురనివాస, భూతిభాస భూతనాశ రిపుగణదోర్భలధ్వంస శ్రీ మహావీరా సనారి విశ్వనాథ నమస్తే నమస్తే నమః

**గమనిక:** ఈ మంత్రాన్ని నిత్యానుష్ఠానముచేసి సిద్ధించుకొని ఎవరికైనా గాలి, ధూళి, తొక్కిడి దోషాలతో జ్వరబాధలుగానీ, మానసిక స్థిమితము లేకయున్నను యింక ఏ యితర బాధలు పడుచున్న వారికి ఈ మంత్రాలన్నీ పఠించి విభూతి ముఖానికి పెట్టి నీటిలోవేసి త్రాగించినచో అన్ని బాధలు తొలగి ఆరోగ్యవంతులగుదురు (మడి మైలు పాటించాలి)

**మహనీయులు అనుభవించిన శరీర ప్రారబ్ధములు**

ఈ ప్రారబ్ధములు చిన్నలకు, పెద్దలకు, జ్ఞానులకు, అజ్ఞానులకు, పూర్వకృతము ననుసరించి హెచ్చుతగ్గులుగా నుండును. యిందుకు ప్రమాణము కృతయుగంలో రాముడు చాటుగా బాణంవేసి వాలిని సంహరించినందుకు ద్వాపరయుగంలో శ్రీకృష్ణునకు ఆశరము అరికాలిలోదిగి అసువులు బాసిరి. కలియుగములో రమణ మహర్షి రాచపుండుచే, మలయాళ మహర్షికి కంటిజబ్బును అంత్యదశలో మధుమేహముచే శరీరమంతయు పుండ్లుకాబడి, నారాయణ అవధూతగార్కి అంత్యదశలో దేహమంతయు యేనుగుగజ్జి వ్యాపించి, నందల నాగదాసుగారు కలరావ్యాధిచే, రామకృష్ణ పరమహంస కాన్సరు వ్యాధిచే, చ్యవనమహర్షి యంతటివానికి క్షయవ్యాధి, మాండవ్యమహర్షికి రాజదండనచే కొరతవేయబడి, శరీరములు చాలించిరి. అగ్నిదేవునకు అజీర్ణవ్యాధి,





చంద్రునకు క్షీణ (క్షయ) వ్యాధి కల్గెను. పుట్టపర్తిసాయి జీవిత చరిత్రను గమనించినచో కలియుగంలో దైవాంశ సంభూతులకు సైతము జరుగని విధంగా వారు జీవించి యుండగనే దేవాలయములు కట్టించి పూజించుతూ భక్తులు ప్రత్యక్షముగా సాయిని కూర్చోపెట్టి పూజించి నీరాజనములిచ్చిరి. గతంలో ఎంతటిమహనీయులైనా వారు చాటుకు వెళ్ళిన పిదపనే దేవాలయములు విగ్రహారాధనలు జరుగుతున్నవి. అంతటి ఖ్యాతినార్జించిన పర్తిసాయి అంతిమయాత్ర ఏస్థితిలో జరిగినదో జగద్విదితమే. ఈ విధంగా దైవాంశసంభూతులు మహనీయులే శరీర ప్రారబ్ధములననుభవించుచుండగా సామాన్యమానవుల గతియేమి? కావున జన్మరాహిత్యము పొందవలెనని మహనీయులు వేనోళ్ళ చెప్పిరి. లోకములన్నింటినీ మృత్యువు మ్రింగివేయుచున్నది. కాలపరిమితి అధికముగల లోకములు లోకేసులను కాలము మ్రింగివేయుచున్నది. సృష్టిలో అనేక బ్రహ్మాండములు గలవు. వీటన్నింటినీ కాలేశ్వరుడు మ్రింగివేయుచుండెను. భక్తులారా! పరమార్థము (నామములు) లోకములకు వేరుగా నున్నది. అది నిత్యము, నిర్మలము, సత్యము, అతి సూక్ష్మము, శాశ్వితము ఈ పరమార్థము మహనీయులగు సాధు సజ్జన యోగీశ్వర సమాగమువల్లను, సద్గురుమూర్తి కరుణాకటాక్షమువల్లను, పరిపక్వముగల భక్తులు మాత్రము ఫలితములను పొందగలరు. మిగతా ప్రయత్నములు మహాకష్ట సాధ్యములు మాయనుజయించుట అసాధ్యము, ఈ సృష్టి యావత్తూ మాయామయమై యున్నది. సమస్తదేవతలు మాయ, సృష్టిలోని సమస్త దేవతాగణములు మాయ మనోబుద్ధులు మాయ, శబ్ద, స్పర్శ రూప, రస, గంధములు సర్వం మాయ బ్రహ్మాండ లోకములు, లోకేసులు అంతామాయ. ఈ మాయ అవిద్యారూపమై పెంచిన కొలది హద్దులేక పెరిగిపోవుచుండును. అందువలన జన్మకర్మలచే అనంతముగా కోటానుకోట్ల జన్మలకు కారణమగుచున్నది. యిక జీవి ఒకదరి జేరుటెప్పుడు, జన్మరాహిత్యమెప్పుడు భ్రాంతులు పెరిగి పెరిగి జీవికి గ్రుడ్డితనము, చెవిటితనము కుంటితనము కలిగించి కటిక చీకటి గాఢాంధకారముగా చేసి నిజాత్మ స్వరూపమును మరుగు పరచి, జిగురులో చిక్కిన పురుగువలే మాయా భ్రాంతి మమకారములలో పడి జీవి అంతమగుచున్నవి. యిట్టి జీవులను దరిజేర్ప ఆ పరమేష్టికైననూ సాధ్యమోకాదో తెలియరాదాయె. ఇక కర్తవ్యమేమి? యిపుడున్న అమూల్యమైన మానవజన్మ వ్యయమైపోవుచున్నది ఆత్మ విచారణ చేసుకున్న అప్పులు తీర్చుటకై వచ్చిన మానవజన్మ యిది. యింకా కొత్త అప్పులు చేయకపాత అప్పులు తీర్చుటయే జన్మరాహిత్యమగును. అద్దమును మనవైపు

తిప్పుకున్న మనముఖము, వేరే వస్తువు ఎదుట ఉంచిన ఆ వస్తువు అద్దమమును ప్రతిబింబించునట్లుగా, ఇంద్రియ మనోబుధ్యహంకారములు, ఈ సృష్టిలో సారరహిత విషయములే. పిండమావులరీతి ప్రాప్తించి, సార రహితమగు కార్యము లాచరించు చున్నాము. యోగి యైనవాడు 84 లక్షల జీవరాసులందు గల జీవాత్మలన్నియూ ఆ పరమాత్మ స్వరూపమే గానీ మరి వేరు కాదని తెలుసుకుని యోగా భ్యాసముచే విగతకల్మషుడై ఆగామి సంచితములనెడు పుణ్యపాపములు లేనివాడై బ్రహ్మరూపుడై బ్రహ్మమును చేరి నిత్యానందముననుభవించును.

### షడ్విధ గురుశిష్య సంబంధాలు

1. మార్జాల కిశోర న్యాయముం పిల్లి, పిల్లలను పెట్టి అనువైన చోటుకు వాటిని మార్చుతూ తనంతచేసి విద్యలన్నీ నేర్పి వదిలివేయును. అట్లే గురువుగారు శిష్యుని సంరక్షించుతూ అన్ని విద్యలను నేర్పితనంతచేసి వదిలివేయుట.

2. మర్కటకిశోరన్యాయము: కోతి తన పిల్లలను పట్టించుకోకుండా చెట్లు గుట్టలను దూకుచుండును. పిల్ల తల్లిని పట్టుకొని వదలకుండును.
అలాగే గురువుగారు శిష్యుని పట్టించుకోకుండా తన అనుష్ఠానము నిర్వర్తించుచుండును. శిష్యుడు మెళకువగా గురువుని వదలక విద్యలను గ్రహించి ఉత్తీర్ణుడగుట

3. భ్రమర కీటక న్యాయము: తుమ్మెదమట్టిగూటిని కట్టి గడ్డిపురుగులను తెచ్చి కుట్టి గూటిలో పడవేసి మూతవేసి ఝుంకారము చేయుచుండును. ఆ పురుగు బాధతో భయంతో తుమ్మెద రూపును తలచుకుంటూ తుమ్మెదలా మారుట ! అంటే గురువు శిష్యుని కొట్టి హింసించి విద్యలు నేర్పుట

4. విహంగమార్గము: పక్షి గుడ్లను రెక్కలతో మూసి పిల్లలను చేసి పెంచి తనంత చేయుట. అంటే గురువు శిష్యుని తనరక్షణలో పదేపదే గమనించుతూ తనంతవానిగా చేయుట

5. మీనమార్గము: చేపలు గుడ్లు పెట్టి తన చూపుతో పిల్లలను చేయుట
అంటే గురువు శిష్యుని పదే పదే గమనించుతూ తనంతవానిగా చేయుట

6. కూర్మ మార్గము: తాబేలు గుడ్లను పెట్టి వేరొకచోటుకు పోయి ఎల్లప్పుడూ గుడ్లను తలంచుచుండగా పిల్లలైనట్లు, అంటే గురువు శిష్యునకు బోధించిన విషయాలను ఎలా ఆచరణలో పెడుతున్నాడని పదేపదే తలంచుచూ తనంతవానిగా తయారుచేయుట.





## శివదర్శనమునకు వచ్చిన భక్తులు తెలుసుకోవలసిన స్మార్త శైవాగమంలో చెప్పిన విషయాలు

కొన్ని ఆలయముల బయటగల నందీశ్వరుడు కాకుండా లోపల వేరొక నందీశ్వరుని ప్రతిష్ఠించి వుంటారు. అలా ఉంటే చిన్న, పెద్ద నందీశ్వరులమధ్య నుండి వెళ్ళవచ్చును. శివాలయంలో ప్రవేశించి నక్షణంనుండి శివదర్శనం చేయువరకూ పంచాక్షరీ మంత్రాన్ని జపిస్తూనే వుండాలి. శివదర్శనం తర్వాత అమ్మవారిని దర్శించి నమస్కరించాలి. తర్వాత యితర దేవతలను దర్శించుకోవాలి. ఆలయం ప్రవేశించేప్పుడు గంటను వాయించాలి. వెళ్ళేటప్పుడు గంటను మ్రోగించకూడదు. శివాలయంనుండి విభూతిని పురుషులు తెచ్చుకోవచ్చును. ముత్తైదువులు, కన్యలు తెచ్చుకోరాదు. నుదుటిపై ధరించవచ్చును. విధవలు విభూతిని, ముత్తైదువులు కుంకుమను తెచ్చుకోవచ్చును.

నవగ్రహాలున్న శివాలయములో ముందుగా నవగ్రహాలను దర్శించి ప్రదక్షిణలు చేసి కాళ్ళు కడగకుండా శివదర్శనం చేయాలి. కేవలం నవగ్రహాలను దర్శించే వాళ్ళు మాత్రమే దర్శన ప్రదక్షిణల తర్వాత కాళ్ళు కడగాలి.

శివాలయం చుట్టూ "ఓం నమశ్శివాయ" అని స్మరించుకుంటూ 11 ప్రదక్షిణలు చేయుట వలన అనేక దోషాలు పరిహారమవుతాయి.

శ్లో॥ **నందీశ్వర నమస్తుభ్యం- శాంతానంద ప్రదాయకం।**
**మహాదేవేశసేవార్థం- అనుజ్ఞాంధాతుమర్హసి॥**

అనుచూ నందీశ్వరుని కొమ్ములపై ఎడమ చేయి వుంచి కుడిచేతితో తోక వృషణాలను నిమురుతూ నందికొమ్ముల మధ్యనుండి శివలింగ దర్శనము చేసికోవాలి. ఇలా కాకుండా సరాసరి శివలింగాన్ని చూడరాదు.

### గమనిక

కురుక్షేత్ర మహాసంగ్రామంలో శ్రీకృష్ణభగవాన్ విశ్వరూప సందర్శనం చేసి అర్జునునితో చెప్పిన భగవద్గీత 4వ అధ్యాయంలోని 1వ శ్లోకం

శ్లో॥ **ఇయం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్।**
**వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్॥**

సృష్ట్యాదిలో నేను విరాట్ విశ్వకర్మభగవాన్‌గా అవతరించి,నా పంచముఖముల నుండి "బ్రాహ్మణోశ్యముఖమాసీత్" అను పురుషసూక్త ప్రమాణముగా పంచబ్రహ్మలగు మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞులను సృజించివారినే.

ఈశ్వరుడు, విష్ణు, బ్రహ్మ, యింద్ర, సూర్యులనుగా, నామాంతరము గావించి, అఖిలాండకోటి బ్రహ్మాండములను, పంచశక్తులను, పంచ భూతములను, నక్షత్రగ్రహ తారకాదులను, అఖిల చరాచర జీవకోటిని సృజించి, పోషించి, తనయందులయ మొనర్చుకొను విరాట్ పురుషుడు సృష్ట్యాదిలో తనమానసపుత్రులగు పంచబ్రహ్మలకు తెలిపినట్లుగా పై శ్లోకభావము.సృష్ట్యాదిలో సకల భువన, చరాచరజీవరాసుల సృష్టికర్తగా నిత్య సత్యమైన ఈ యోగమును తన పుత్రులకు తెలుపగా వారు నిత్యానుష్ఠానముగా గీతను ఆచరించుతూ, సృష్టికర్త తమకొసంగిన బాధ్యతలను వారి ఆదేశానుసారముగా ఆచరించుతూ, సూర్యభగవానుడు తన పుత్రుడైన వైవస్వత మనువుకు బోధించగా, ఆమనువు తనకుమారుడగు ఇక్ష్వాకునకు కృతయుగమున ఉపదేశించగా, నాటినుండి పరంపరగా బోధింపబడుతున్న ఈ విద్య త్రేతాయుగములో సూర్యాభగవానుడు ఆంజనేయునకు ఉపదేశించెను. ద్వాపర యుగములో శ్రీ కృష్ణ పరమాత్మ ద్వారా అర్జునకు ఉపదేశించబడెను. పిదప అంబికా శివయోగికి కలియుగమందు వేమనయోగికి శ్రీధరస్వామి, శ్రీమద్‌రామడుగు శివరామదీక్షితులవారికి, కందుకూరు అప్పారావు మంత్రికి శ్రీ పరశురామసీతారామస్వాములవారికి శ్రీభాగవతకృష్ణదేశికస్వాముల వారికి ప్రస్తుత శ్రీమత్ పిల్‌జ్ఞానలక్ష్మణదేశిప్రభువులు(సికింద్రాబాద్ ఆశ్రమము) వారికి పరంపరగా ఉపదేశింపబడినది.

**4 వ అధ్యాయంలో 2వ శ్లోకం**

శ్లో॥ **ఏవం పరంపరా ప్రాప్తమివం రాజర్షియో విధుః।**
**స కావేనేహ మమతా యోగోనష్టః పరంతప॥**

ఓ పరంతపా! ఈ విధంగా పరంపరాప్రాప్తమైన ఈ యోగమును అవతారపురుషులు, సిద్ధపురుషులు, మహనీయులు ఆచరించగా కాలక్రమమున భూలోకమందు క్షీణించుచున్నది అని గీతాచార్యుడు ద్వాపరయుగంలో అర్జునునకు తెలిపినట్లుగా దానిని





వేదవ్యాసుడు లిఖించినట్లుగాగల భగవద్గీతలో 700 శ్లోకములలో ప్రస్తుతం 54 శ్లోకాలు కల్పించినట్లుగా ఆచార్య ప్రబోధానందయోగీశ్వరులు తెలిపి కలి ప్రభావముచేనేటి భగవద్గీత వివరణకూడా సంతృప్తికరంగా లేక విపరీత వ్యాఖ్యానములతో మతప్రచారకులు, పీఠాధిపతులు, బాబాలు, సనాతనధర్మ సంరక్షణ పేరిట ప్రచారం చేస్తున్నట్లుగా వారు వివరించారు. యింకా భగవద్గీతను హిందూ మతగ్రంథముగా ప్రచారంచేయుట విచారకరమని, యిది ఏ మత సంబంధమైనది కాదని సృష్టికర్త సంతతియైన కుల, మత, జాతిభేదం లేకుండా సర్వమానవులకు పరమాత్మ జ్ఞానమును బోధించు గ్రంథమై సర్వులూ తరించునట్టి పరమపవిత్ర పరిశుద్ధ గ్రంథము **"భగవద్గీత"**. యిందలి విషయములు బోధించుటకు సద్గురు కావలయునుగావున అట్టి లక్షణములు గురుసేవచే కల్గు ఫలితములను **గురుగీతా** ద్వారా సర్వులకు సులువుగా అర్థమగుటకు తాత్పర్యసహితముగా అర్థమగునట్లు యిందు వ్రాయుట జరిగినది.

**భగవద్గీత**

విభూతియోగము 10వ అధ్యాయములో 39వ శ్లోకం

శ్లో॥ యచ్ఛాపి సర్వభూతానాం బీజం తదహమర్జున।
న తదస్తి వినాయత్ స్యాత్ మాయాభూతాం చరాచరమ్॥

తా॥ అర్జునా సర్వప్రాణుల ఉత్తత్తికి కారణమైన బీజమును నేనే ఏలనన? నేను లేని చరా చరా ప్రాణి ఏదియునూలేదు.

15వ అధ్యాయములో 1 శ్లోకం

శ్లో॥ ఊర్ధ్వమూలమధశ్శాఖమ్ అశ్వత్థం ప్రాహురవ్యయమ్॥
ఛాందాపి యస్య పర్ణాని యస్తందేవ నవేదవిత్॥

తా॥ అర్థం: ఆదిపురుషుడైన పరమేశ్వరుడే మూలముగా బ్రహ్మయే ముఖ్యశాఖగా (కాండముగా) వేదములే పర్ణములు (ఆకులు)గా గల ఈ సంసారరూప - అశ్వర్థ వృక్షము నాశ రహితమైనది (శాశ్వతమైనది) ఈ సంసార వృక్షతత్వమును మూల సహితముగా (ఆదిఅంతములు) తెలిపినవాడు నిజముగా వేదార్థములు ఎరిగినవాడు.

**పంచాక్షరీ మంత్ర ప్రభావము**

సీ॥ **పంచాక్షరీ మన్త్ర పఠనాగ్ని కీలలచే - దహనమౌ దుష్కృతగహనకోట్లు।**
**పంచాక్షరీ మన్త్ర పఠన వాయువులచే- దుఃఖతోయదములు తొలగిపోవు।**
**పంచాక్షరీ మన్త్ర పఠన సింహంబుచే- కడతేరు సంతాపకలభగణము।**

పంచాక్షరీ మన్త్ర పఠన భాస్కరుదీప్తిచే - సమయును షడ్వర్గతమములెల్ల॥

గీ॥ పంచాక్షరీ మన్త్రపఠన తార్క్ష్యములచే- కాలదూతాహిసంఘములు వీడు॥
పంచాక్షరీ మన్త్రపఠన రౌద్రంబునచే- బ్రహ్మరాక్షసతతుల్ పరుగులిడును॥

**శిష్యా యింతటి మహిమలగల పంచాక్షరిని పఠించిన మహనీయులను వినుము**

**సీ॥ అలమృకండాత్మజుండాయుష్యముగణించె- పంచాక్షరీ మన్త్రపఠనచేత॥**
**పరికింపవేమన బ్రహ్మత్వమును బొందె- పంచాక్షరీ మన్త్ర పఠనచేత॥**
**కేవల బ్రహ్మమై శ్రీవీరగురుడుండె- పంచాక్షరీ మన్త్రపఠనచేత॥**
**శివరామబ్రహ్మంబుచేరె సాయుజ్యంబు- పంచాక్షరీ మన్త్రపఠనచేత॥**

**తే॥గీ॥ విశ్వనాథావధూతకు నీశ్వరికిని-వీరభద్రలక్ష్మప్ప కపీరుసిద్ధ॥**
**యమరలింగ వెంకమనాసరాదులకును- బ్రహ్మసాయుజ్యమబ్బెనీపఠనచేత॥**

పూర్వము అల్పాయుష్కుడగు మార్కండేయుడు ఓం నమఃశ్శివాయ మంత్రము జపియించి చిరంజీవియయ్యెను. మరియు వేమనయోగి, శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి, చెరుకూరి శ్రీ శివరామపరబ్రహ్మేంద్రస్వామి, సింహాద్రి విశ్వనాథావధూతస్వామి, ఈశ్వరమ్మ, అల్లాడపల్లె వీరభద్రస్వామి, యాగంటి లక్ష్మప్పగారు, స్వర్ణ అమరలింగాచార్య స్వామి, కపీరుదాసు, సిద్ధయ్యగారు, తరిగొండ వెంకమ్మగారు, నాసరయ్యగారు, ఈ మహాపురుషులు పంచాక్షరీ మంత్రోపాసకులై చిరస్మరణీయులైరి. కలిమాయచే ఈ కాలమున పుత్రమిత్రకళత్రాది మోహములచేత ఇహలోక కార్యములాచరించి శరీరమందలి 25 తత్వములలో కొన్ని తత్వములు సక్రమముగా పనిచేయని కారణముచే వ్యాధిగ్రస్తులై ఔషధసేవలు చేయుచూ పరిపూర్ణారోగ్యము పొందలేక అకాలమృత్యువు పాలుగుచున్నారు. కేవలము పాంచాక్షరీ పారాయణచేసుఖజీవనము పొందుదురు. ఈ పంచాక్షరిలో ఓంకారము విశ్వబ్రహ్మము, నకారము శివుడు, మకారము విష్ణువు, శికారము బ్రహ్మయు, వకారము దేవేంద్రుడు, యకారము సూర్యుడు. కావున ఓం నమఃశ్శివాయ జపించిన వీరందరినీ ఏకకాలంలో ధ్యానించినట్లగును.

**వశిష్ఠో వాచ-** పంచాక్షరితో సమానమైన మంత్రముగానీ విరాట్ విశ్వకర్మ భగవానుని పంచముఖములనుండి ఉద్భవించిన వారితో సమమగు దైవములుగానీ విశ్వకర్మభగవాన్ పంచముఖముల నుండి ఉద్భవించిన వారి కులముతో సమమగు కులముగాని యింతకు ముందు లేవు, యింకముందు ఉండబోవు!

**శిష్యుడు:** గురుదేవా! ఈ లోకంలోని జనులు అనేకవిధములయిన వ్యాధులతో బాధపడుటకు కారణమేమి స్వామీ?





గురువు: పూర్వజన్మలో తామాచరించిన కర్మలఫలితమే ఈ జన్మలో వ్యాధులు. శిష్యా!

| **పూర్వజన్మలో చేసిన దుష్కృత్యములు** | **ఈ జన్మలో కలుగు బాధలు** |
|---|---|
| దేవ బ్రాహ్మణుల నిందించుట, బ్రహ్మహత్యాదోషముచే | క్షయవ్యాధులు వచ్చును |
| వేదములను ఉపనిషత్తులనునిందించుటచే | సంతానములేక గానీ, స్త్రీ సంతానముచే గాని బాధలు కల్గును. |
| శిశుహత్యలు, పక్షపాత ప్రవర్తనలచేత అన్నదమ్ముల వేధించుట, వధించుటచే | భార్య జీవించదు, ఉన్నా మాట వినదు జ్వరపీడలు, జ్వరరోగాదులచే మరణించును. |
| మద్దెల మొ॥ చేతి వాయిద్యములు దొంగిలించుటచే | చేతిరోగములు కలుగును. |
| మిత్రద్రోహము, బాలహత్యలు చేయుటచే | సంతానముచే - క్షోభ, లేదా సంతానము దుర్మరణముల పాలగుదురు. |
| దైవభక్తి లేనివాడు, గురుజన హంతకుడు | పాండురోగముతో బాధపడును |
| గోహత్య చేసినవాడు | దీర్ఘరోగముతో బాధపడును. |
| సోదరీ సంపర్కము చేయుట వలన | అంగవిచ్ఛేదన జరుగును. |
| పశు శిశు హత్యలు చేయుటవలన | సంతానము నిలువదు, శరీర వ్యాధులవలన బాధపడును. |
| పుస్తకములు దొంగిలించుటవలన | గర్భస్రావము లేదా జన్మాంధుడగును. |
| పరనింద, పరపీడ, వస్త్రములు, భూముల అపహరణచేత | మహాదరిద్రము,దీర్ఘరోగములతో నుండును. |
| పరస్త్రీలను బలాత్కారముగా తీసుకుపోవుట, మానభంగము చేయుటవలన | వైద్యులకు అలవికాని దీర్ఘరోగములతో బాధనొందును |
| గోమహిమను అపహాస్యము చేయుటవలన | వణుకు రోగముతో బాధనొందును |
| ఎద్దు వృషణములను చితకకొట్టువాడు | షండుడుగానీ, మూత్రరోగములతో బాధనొందువాడగును. |
| మాతాపితరులను హత్యచేసినవాడు | మహాకుష్ఠురోగముతో బాధనొందును |

| | |
|---|---|
| ప్రత్యక్షపరోక్షములుగా గోహత్యచేసినా భాగస్వాములయినా | సమాజంలో హీనముగా చూడబడును. |
| బలాత్కారముగా కన్యను చెరిచినవాడు | శిశ్నరోగములతో, దరిద్రముతోను బాధనొందును |
| పూలు గంధాదులు అపహరించినవారికి | దేహము దుర్వాసనతోనుండును |
| నేతిని దొంగిలించి తినినవారు | క్రిమిరోగములతో బాధనొందుదురు. |
| చెట్లను దొంగిలించినవారు | దేహమంతయు క్రిములతో బాధనొందుదురు. |
| తెచ్చుకున్న నీటిని, అన్నపానాదులను అపహరించినవారు | దంతరోగములతో బాధనొందుదురు |
| దేవాలయములో పూజకువాడే పాత్రలు దొంగిలించిన | కంఠరోగములతో బాధనొందుదురు |
| తైలము దొంగిలించినవారు నేత్రవ్యాధులు, | నాశికయందు పురుగులతో బాధనొందుదురు. |
| బెల్లం దొంగిలించినవారు | జ్వరబాధల నొందుదురు. |
| వెండి బంగారం దొంగిలించినవారు | సంతాన నష్టం, సదా అనారోగ్యముతో బాధపడుదురు. |
| పాలు, పెరుగు దొంగిలించినవారు | కడుపునొప్పి వ్యాధితో బాధపడుదురు. |
| దాస దాసీలను అపహరించినవారు | చెవిరోగములతో బాధపడుదురు. |
| ప్రయాణీకులను మోసగించినా, ధనం దోచుకున్నా,శారీరకంగా బాధించినా | చాలా రోగములతో బాధనొందుదురు. |
| పశుపక్ష్యాదులను అపహరించినవారు | చర్మరోగములతో బాధనొందుదురు |
| గృహం, ధాన్యం, ధనం, సంపదలు హరించువారు | మహారోగములతో బాధనొందుదురు. |
| పూలు, కాయలతో పచ్చగానుండి బాటసారులకు నీడ నొసగు చెట్లను బావులను నాశనం చేయువారు | కాకియై జన్మించి హీనస్థితిని పొందును. లేదా దద్రురోగముచే బాధపడుచుందురు |



శ్రీ సనారీ యోగ జ్ఞానామృతము

| | |
|---|---|
| దేవయాత్రా ప్రయత్నములను ఏదోవంకతో భంగపరచువారు | కఫరోగపీడితుడగును. |
| మిత్రద్రోహము శిశుహత్యా పశుహత్యా చేసినవారికి | సంతానము కలిగి నశించుచుండును. |
| వస్త్రములు దొంగిలించువాడు, ఇతరుల నిద్రాభంగము చేయువారు | దరిద్రుడై బిచ్చమెత్తుకుని జీవించు చుండును. |
| సంభోగింపదగని స్త్రీలను, వీరపత్ని, గురుపత్నిని పొందినవాడు | జ్వరజీఉతుడయి బాధలనొందును. |

**యిలాంటి పాపములవలన కలిగిన రోగములుఏమందులకు తగ్గక జీవితాంతం బాధించును**

**శిష్యుడు:** మానవ శరీరమున సప్త ద్వీపములు ఎచటగలవో నాయందు దయతో చెప్పండి స్వామీ!

**గురువు: మజ్జ అనగా** మూలుగు= జంబూద్వీపము / **అస్థి అనగా** ఎముకలు= ప్లక్షద్వీపము / **త్వక్ అనగా** చర్మము= శాల్మల ద్వీపము, **రక్తము**=శాకద్వీపము/ **మేధస్సు**= పుష్కరద్వీపము / **రోమములు** = క్రౌంచద్వీపము / కుశద్వీపము=**నరములు**

**శిష్యుడు:** గురుదేవా సప్త సముద్రములు మానవ శరీరమునందు ఎచట గలవు స్వామీ?

**గురువు:** మనము విడుచు **మూత్రము**= లవణసముద్రము / **స్వేదము** (చెమట)= ఇక్షు సముద్రము/ **శుక్లము**= సురాసముద్రము/ **శ్రోణితము**= సర్పిసముద్రము/ **శ్లేష్మము**= దధిసముద్రము/ **లాలాజలము**= మంచినీటి సముద్రము./ **క్షీర సముద్రము**=మానవుల స్తనములనుండి వచ్చునది. శిష్యా వీటిని గుర్తించుము.

**శిష్యుడు:** గురుదేవా! మానవ శరీరమందలి నక్షత్ర స్థానములు తెలియజేయండి స్వామీ!

**గురువు:** శిష్యా మానవుని **శిరస్సు**= అశ్విని/**ముఖము**= రోహిణ/ **వక్త్రము**(నోరు)= మృగశిర/ **నేత్రము**= ఆరుద్ర/ **కంఠము**= పునర్వసు/ **భుజము**= పుష్యమి/**చేతులు**= ఆశ్లేష,మఖ/ పుబ్బ= **హృదయము** /ఉత్తర,హస్త = **నాభిలోపల**/చిత్త,స్వాతి = **నాభి పై భాగము**/ విశాఖ= **గుహ్యము**/ అనూరాధ, జ్యేష్ట= **జానువులు**/ ఉత్తరాషాఢ, శ్రవణం= **జంఘులు**/ ధనిష్ట, శతభిషములు= **పాదములు**/ పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్విని, భరణి,నక్షత్రములు, **కాలి, చేతుల వేళ్ళు** అని తెలుసుకో శిష్యా!

**శిష్యుడు:** మానవ శరీరమందలి అగ్నుల వివరము తెలియజేయండి స్వామీ!

**గురువు: ఆత్మయందు**= జ్ఞానాగ్నియు/ **నేత్రములందు** = క్రోధాగ్నియు/ **హృదయమందు**= శీతాగ్నియు/**నాభియందు**= క్షుదాగ్నియు/ **పాదములందు**= కాలాగ్ని రగులుకొలుపుచు నుండునని తెలియుము.

**శిష్యుడు:** అమృతతత్వసిద్ధి యనగానేమి గురుదేవా?

**గురువు:** యిడాపింగళనాడుల మధ్యగల సుషుమ్న నాడీమార్గముద్వారా ప్రాణాయామ సాధనచే సహస్రారకమలమందు అమృత బిందువులు పడుచుండును. ఆ సహస్రార చక్రమే విశ్వసృష్టికర్త సింహాసనము, అట్టి మహత్తర స్థితినిమానవులు పొందుటయే అమృత తత్వసిద్ధియందురు. ఇక పరమార్థిక శరీరమనగా స్థూలశరీరమున విరాట్ పురుషుడగు విశ్వకర్మ భగవానుడు నివసించుచుండును. అట్టి పరమాత్మ జీవాత్మతో లీనమగుటయే అమృత తత్వసిద్ధియందురు.

**శిష్యుడు:** గురుదేవా! మీరు చెప్పిన వన్నియూ నాకు అగమ్యగోచరముగా యున్నవి. గాన నాకు యింకనూ వివరముగా తెలుపండి.

**గురువు:** శిష్యా ఈ కీర్తనయందు యింకనూ వివరములు గలవు. దీనిని సంపూర్ణముగా గ్రహింపుము.

**రాగం= ధన్యాసి– ఏకతాళము : పల్లవి:–**

చిల్లర రాళ్ళకు మ్రొక్కుచునుంటే చిత్తము చెడునురో ఒరే ఒరే

**అనుపల్లవి**

చిత్తమునందున్న చిన్మయజ్యోతిని– చూచుచునుండట సరే సరే ॥ చిల్లర॥

చరణం: ఒక ప్రొద్దులని యెండుచునుంటె– ఒనరుగ చెడుదువు ఒరే ఒరే–
ఏకమైనయా వైభవమూర్తిని చూచుచునుండుట సరే ॥ చిల్లర॥
నీళ్ళలోమునిగి గొనుగుచునుంటే నిలకడ చెడునుర ఒరే ఒరే ।
నిలకడగుండే నిర్మల జ్యోతిని జూచుచునుండుట సరే సరే ॥ చిల్లర॥
బాధగురువుల పంచనజేరితే భావము చెడునుర ఒరే ఒరే।
భావమందున్న బ్రహ్మకాంతిని జూచుచునుండుట సరే సరే॥ చిల్లర॥
భూములు అడవులు తిరుగుచునుంటే బుద్ధులు చెడునుర– ఒరే ఒరే





బుద్ధిలోనున్న పున్నమచంద్రుని జూచుచునుండుట సరే– సరే ॥ చిల్లర ॥
సనారీ చెప్పినవాక్కు నమ్మితే వివరము తెలియును– ఒరే ఒరే –
శరీరమందున్న విగ్రహమూర్తిని జూచుచునుండుటసరే సరే ॥ చిల్లర॥

అని బోధగురువులు చెప్పినారుగనుక ఏ దైవములను నమ్మక సద్గురువే దైవమనీ, ఈ గురుగీతాస్తోత్రమును నిత్యము పారాయణ చేసి తరింపుమని గురుదేవులు నా మనంబున ఊహగల్గించెను.

**శ్రీజగద్గురు విశ్వనాథావధూత పరబ్రహ్మార్పణమస్తు**

శ్రీ సనారీ భక్తులు, శతాధిక గ్రంధ కర్త, నగిషీ పనిలో సువర్ణ ఘంటాకంకణ సన్మానితులగు **బ్ర॥ దేవు సత్యన్నారాయణ** గారు 1945ప్రాంతంలో పాలకొండలో కాపురముండేవారు. ఆరోజుల్లో ప్రయాణసౌకర్యాలు చాలా తక్కువగా ఉండేవి. ఎప్పుడు బడితే అప్పుడు ఎక్కడికైనా వెళ్లేందుకు గానీ వచ్చేందుకు గానీ అవకాశాలుండేవికావు తప్పనిసరి పరిస్థితులలో ఎక్కడికైనా వెళ్లాలంటే మైళ్ళకొలది కాలినడకన ప్రయాణం చేసి గమ్యస్థానం చేరేవారు. స్థితిపరులు ఎడ్లబండిపైగాని గుర్రబండిపైగాని ప్రయాణం చేసెడివారు. చీకటి పడేలోగా గమ్యం చేరలేకపోతే మార్గమధ్యమందలి గ్రామాల్లో బంధువులుగానీ మిత్రులుగానీ పరిచయస్థులుగానీ ఉంటే రాత్రి అక్కడ విశ్రమించేవారు. పేదవారైతే స్వయం పాకానికి గ్రామస్థులు సామగ్రినిచ్చి ఆదరించేవారు. ఈ పరిస్థితులలో దేవసత్యనారాయణగారు కోర్టుపని మీద విజయనగరం వెళ్ళి తిరిగి వచ్చేటప్పటికి బాగా ప్రొద్దుపోయి చీకటిలో ఒంటరివాడౌటచే భయభ్రాంతులై సనారీ వార్ని ధ్యానిస్తూ రహదారి ప్రక్కనగల చెట్టుక్రింద రాత్రి 1 గంటప్రాంతంలో నిలుచున్నారు. అదిరెండవ ప్రపంచ యుద్ధ సమయమగుటచే, మిలటరీ వారు జీపులో వెళుతూ ఇక్కడున్నావేమిటని సత్యంగార్ని ప్రశ్నించగా, కోర్టు పనిమీద వచ్చాను. పాలకొండ వెళ్ళాలని చెప్పారట, మేము అటే వెళుతున్నాము రహదారి వద్ద దించుతాము. నీవు ఊరులోకి వెళ్ళవచ్చు. బండిఎక్కమని పాలకొండ రహదారి పై దించివెళ్ళిపోయారట. అప్పుడూ రాత్రి 1–30 సమయమైనది. కటికచీకటిలో యింటికి ఎలా వెళ్ళాలో తెలియక స్వామి వారిని గ్రామదేవత కోటదుర్గమ్మను ప్రార్థించగా! అల్లంత దూరంలో మేళతాళములతో పెద్ద ఊరేగింపు వస్తున్నదట త్వరగా ఆ ఊరేగింపు దరిజేరి పాలకొండ గ్రామ దేవత

కోటదుర్గమ్మ తల్లిగా గుర్తించి ఆ ఉత్సవాన్ననుసరించి యిల్లు చేరారట. ఉదయాన్నే రాత్రి సంఘటనలు గుర్తుచేసుకుంటూ యింటిలోను యిరుగుపొరుగు వారినడుగగా రాత్రి ఏ ఊరేగింపు జరగలేదనగా గురుదేవులు తనకు రక్షణగా పాలకొండ గ్రామ దేవతను పంపినట్లు భావించి, సనారీవారికి శతసహస్ర పాదాభివందనలర్పిస్తూ భక్తి భావంతో సనారీ వారి జీవిత చరిత్ర గద్యరూపముగా, వారి మహిమలను స్తుతిస్తూ కందపద్యములను అకారాది క్షకారము వరకూ 1946లో రచించి ప్రచురించుటకు ప్రయత్నించగా ఈ వర్ణమాలికను బరంపరం వాస్తవ్యులు బ్ర॥ఎదురేశ్వరపు చిట్టియా చార్య శ్రీమతి మహాలక్ష్మిపుణ్య దంపతుల జేష్ఠపుత్రుడు శిల్ప విద్వాన్ బ్రహ్మశ్రీ ఎదురేశ్వరపు కామరాజుగారు ముద్రించి సనారీవిశ్వనాధుల కృపాకటాక్ష వీక్షణలకు పాత్రులైరి. 1948లో ముద్రింపబడి ప్రస్తుతం మరుగునపడినట్టి అక్షరలక్షల విలువగు వర్ణమాలికలో గల జగద్గురువు సద్గురువు మద్గురు దేవుల స్తోత్రములను మనము నిత్యమూ మననము చేసుకుంటూ తరింతుముగాక!

## శ్రీమత్సనారీశ్వర స్తుత్య వర్ణమాలికా ప్రారంభము

కం॥ శ్రీమత్కలధౌతాచల – ధామ శ్రీ పాలకొండ ధామా భీమా
ధీ మానవాళి వినుతస–నామా హృత కామ విశ్వనాధమహాత్మా. 1

కం॥ **అ**తులిత యోగాభ్యాసో – న్నతివై సకలాగమార్ధ నతగుణ జాలం
కృత మూర్తివై(భువన్థలి)భువంబున – నత గణనుత పాద విశ్వనాధ మహాత్మా. 2

కం॥ **ఆ**రూఢ స్థితి భక్తులc– బేరిమితో cగాచినట్టి పెన్నిధివని నిం
జేరి నుతి సల్పు వాడను – నారాయణ వినుత విశ్వనాధ మహాత్మా 3

కం॥ **ఇ**ందుధరు డనుచు ధర యతి – బృందంబులు నిన్ను 'గొల్వ' బ్రియసంపదలన్
డెందము లంచిగుణించగ – నందితులం జేయు విశ్వనాధ మహాత్మా. 4

కం॥ **ఈ** రేడు జగము లందిక – నేరీ నీలాంటి సిద్ధు లెంచగ మారా
కారా సుగుణ విజాల స – నారీ యుత దేహ విశ్వనాధ మహాత్మా. 5

కం॥ **ఉ**రగ విభూషణు వైఖరి – ధర సన్మహిమంబు జూపి దన్పిన విశ్వం
భర విశ్వదూర శాశ్వత – నరవర విశ్వేశ విశ్వనాధ మహాత్మా. 6

కం॥ **ఊ**పిరి గల కాలము నీ – ప్రాపును నొనరింపు లేక ప్రస్ఫుట శోభం
గాపాడు దురిత దూరా – నాపాలిట వేల్పు,విశ్వనాధ మహాత్మా. 7





కం॥ **ఋ**భ వార్చితాంగ సద్గుణ– విభవాస్పద విబుధవర్య విభవాంచిత వి
శ్వభవా యిభ చర్మాన్విత – నఖశిఖ శోభాలత విశ్వనాధ మహాత్మా. 8

కం॥ **ౠ**షాఖ్య వర్ణ విలస – ద్యోషావర వరద ప్రకటితోద్భాస ఫణి
ర్భూషా భాషాసతి నుత – నాషద్గుణ దూర విశ్వనాధ మహాత్మా. 9

కం॥ **ఌ**వర్ణార్ధ వర శ్చాయ – ప్రవిమల భద్రాంక పరమ పండితవర నిన్
ధృవముగను వినుతు లిడుదును – నవ కాంతి విలాస విశ్వనాధ మహాత్మా. 10

కం॥ **ౡ**కార వర్ణ వాసా – ప్రాకారి ప్రముఖదేవ ప్రస్తుత పాదా
యాకార మెటుల జూపెదొ – నాకాంక్షిత మీర విశ్వనాధ మహాత్మా. 11

కం॥ ఏకా కారత జెలగుచు – సాకిన జగదేక రక్ష సౌశీల్యతగన్
నీ కరుణ దన్పి బ్రోవుము– నాకాధిప వినుత విశ్వనాధ మహాత్మా. 12

కం॥ **ఐ**కార వాచ్య గమ్యా – ఓకారార్ధ స్వరూప కుజ్వల గరిమన్
సాకార మూని మనిపిన – నా కేశ నుతాంగ విశ్వనాధ మహాత్మా. 13

కం॥ ఓరాజ కళ కలాపా – ధీరారి జిత ప్రతాప ధృతిగిరి చాపా
మారాంగ దగ్ధకోపా – నారీయుత రూప విశ్వనాధ మహాత్మా. 14

కం॥ ఔరా! యిలనే వేలుపు –లౌరౌరా యనగ స్వచ్ఛమైcదగు రూపం
బౌరాదివిచేరె స్థిర – నారాయణ వినుత విశ్వనాధ మహాత్మా. 15

కం॥ **అం**తత్యుక్తార్థ విభా – కాంతాపుర మర్ధవాస కైలాస గిరి
ధ్వాంతాంత పాంగ భాసుర – నంతాధిప భూష విశ్వనాధ మహాత్మా. 16

కం॥ **అః**శ్శబ్దార్థ విలాసా – సశ్శబ్ద ప్రకృతి రూప, సౌజన్య జనో
నిశ్శంకcజేసి మనిపిన – నశ్శంకరపోష విశ్వనాధ మహాత్మా. 17

కం॥ **క**మనీయ వర్ణవిలస – త్ర్పమదా రత్నంబుతోడ ప్రస్ఫుట శోభన్
క్రమ మొప్ప భువి మెలంగిన – నమశివ వర్ణాత్మవిశ్వనాధ మహాత్మా. 18

కం॥ **ఖ**రకరనయనుండన భువి – వరలుచు వరదాఖ్య cబూని వర్ధిష్ణుcడవై
సరభసముగc బోషించిన –నరనుత చరితాఢ్య విశ్వనాధ మహాత్మా. 19

కం॥ **గ**రళాశను పేర్వడసియు – ధరసన్మహిమంబు జూపు ధన్యవరా నిం
గరమొప్ప వినుతు లొనరుతు – నరలోక విహార విశ్వనాధ మహాత్మా. 20

కం॥ **ఘ**నుడవు విశ్వ కరుండవు – అసమాన్య పవిత్ర గోత్ర సర్వజ్ఞుcడవున్
యనఘుండ వక్ష రుండవు – ననుcబ్రోవు సనారి విశ్వనాధ మహాత్మా. 21

కం॥ జకారార్థసు రూపా - సాకాశ ప్రముఖ దైత్యనందిత రూపా
సాకార సుస్వరూపా - నా కోరిక దీర్చు విశ్వనాధ మహాత్మా. 22

కం॥ చతురాగ మార్ధ జాలం - కృతమూర్త్యతి లోకపూజ్య కీర్త్యాన్విత స
త్పుతి తాంబుద జితమనిలో - న్నతగుణ శుభ పాద విశ్వనాధ మహాత్మా. 23

కం॥ ఛాందోగ్యోపని షత్రోక్తా -మందాక్షర స్ఫురిత తత్వ మస్యార్ధ నిజా
నందాంగ మూర్తి వైభవ - నందితుఁగా మనుపు విశ్వనాధ మహాత్మా. 24

కం॥ జగదేక సత్ర్పతాపా - నిగమార్ధ విలాసరూప నిర్గుణ దీపా
యగజార్తి దలితకోపా - నగరాజ సుచాప విశ్వనాధ మహాత్మా. 25

కం॥ ఝూమైన నీదు నామము - నీమమున న్నుడువనైతి నిర్మలగుణ యా
కామంబు గల్గఁగారణ - నామా జితకామ విశ్వనాధ మహాత్మా. 26

కం॥ ఞా ర్ణాత్మికాంగ భాస్వర - దుర్ణయ దైత్యాలిజైత్ర దోర్బలశౌర్యా
వర్ణాశ్రమ ధర్మంబుల - నార్ణవ స్తుతిగొనుము విశ్వనాధ మహాత్మా. 27

కం॥ టాటోటు లోక మునకున్ - సూటిగ నీ మహిమజూపు సువ్రత చర్యా
పాటింపుము నుతి జగమన్ - న్నాటక తెర నాడు విశ్వనాధ మహాత్మా. 28

కం॥ ఠవలి ప్రపంచ గరిమన్ - దవిలితి నే నీదు భవ్యతర ప్రస్తుతులన్
ధృవముగను జేయఁగలనా - నవరస రసికాత్మ విశ్వనాధ మహాత్మా. 29

కం॥ డాగితివి నిర్గుణుఁడవై - భోగేంద్ర విభూష సకల భోగాస్పదుగా
సాగింపు మిందు భూషా - నా గరువంబొప్ప విశ్వనాధ మహాత్మా. 30

కం॥ ఢాకిన్యాది పిశాచము - లేకీర్త్యుని నామ మెరిఁగి యింపగు తావుల్
చేకొనియె గాదె దేవా - నా కాంక్షిత మిడుము విశ్వనాధ మహాత్మా. 31

కం॥ ణాకారాక్షర గుణుడం - చేకోక్తులె గాని శాస్త్రమెరిగిన నిజముం
గా కింపు గూర్చె సద్గుణ - నా కలుష విదూర విశ్వనాధ మహాత్మా. 32

కం॥ తథ్య స్వరూపమని మతి - సద్యోజ్జాతుం డటంచు జనవర్యులునిన్
యాద్యునిగఁనెంచి బలికిరి - సద్యాన్వితశీర్ష విశ్వనాధ మహాత్మా. 33

కం॥ థకారాది సకారంత్య - ప్రకటిత వర్ణాశ్రవసిత ప్రమదా మణితో
సుకరముగ వెలయుచుండిన- నకలుష గోత్రాంక విశ్వనాధ మహాత్మా. 34

కం॥ దరసమ ముజ్వల దేహా - గురగిరి వరగేహా దివ్యగోపతి వాహా
యురు ధనపతి సుస్నేహా-నరనుతపతి తాఖ్య విశ్వనాధ మహాత్మా. 35





కం॥ ధరశ్రీ శైలంబున గిరి - వర గహ్వరమునికి జేసి వరలిన మౌనీ
శ్వర,"యీశ", సార్ధకాఖ్యా - నరనుత నన్ గావు విశ్వనాధ మహాత్మా. 36

కం॥ న త నా నా కవి వరులతి - కుతుకమున న్నీదు మహిమ గొనియాడిరి య
ద్భుత మొప్ప నేను శిశువును - నతిగా నుతిసేతు విశ్వనాధ మహాత్మా. 37

కం॥ పరమార్ధ గమ్యు ఁడెవడో - చరవణ చరితుం డెవడొ సంయమినుత స
చ్చరణార విందు డెవడో - నరవపుషుండెవడో విశ్వనాధ మహాత్మా. 38

కం॥ ఫణిరాజ హార భక్తా - గ్రణులస్తుత సత్ర్పచార కడు వీరవరా
గణజాల గుణవిహారా - నణ జితమతి ధీర విశ్వనాధ మహాత్మా 39

కం॥ బంధుర దయాంత రంగా - సింధుర చర్మాన్వి తాంగ సిగపూ గంగా
వందితనంది తురంగా - నందాత్మజపంగ విశ్వనాధ మహాత్మా 40

కం॥ భరమగు నీ సంసారము - స్థిర కరుణా రతిని దుల్చి స్తిమితంబౌనీ
యురు దివ్య రమ్య పదముల - నరనుత దరిఁజేర్చు విశ్వనాధ మహాత్మా41

కం॥ మానితమౌ మహిమంబును - బూనియు నిహ పర సుఖాలి బొందిన వరదా
నూన ప్రభాద్యగరిమన్ నానడువడి ఁజూడు విశ్వనాధ మహాత్మా 42

కం॥ యతిలోక వినుత నామా - మతి మంతులహృదయ సీమ మానిత సోమా
ధృతి భర్మగిరి సుధామా - సతపుర వరధామ విశ్వనాధ మహాత్మా 43

కం॥ రతిరాజ పరి విభంగా - ధృతచంద్ర కళోత్త మాంగ ధీజన సంగా
శృతివర్ణ పూజితాంగ - నత నంది తురంగ విశ్వనాధ మహాత్మా 44

కం॥ లవమైన సౌఖ్యముండని - భవ బంధితుఁజేసి మిగుల బాధల పాలన్
భవిదూర బెట్టఁదగునా - నవరస యుత నామ విశ్వనాధ మహాత్మా 45

కం॥ వరదా నా మొర వీనుల - జొరదా,లలితాంగ దివ్య సుందర వనసత్
ద్విరదా, వర దాక్షిణ్యత - నరవర నన్ బ్రోవు విశ్వనాధ మహాత్మా 46

కం॥ శరవణ భవనుత వర్ణా - కరయుత దివ్యాంగ నిన్ను కరమరుదారన్
గురు తివియు స్తుతు లొనర్తును -నరలోక నుతాంగ విశ్వనాధ మహాత్మా 47

కం॥ షట్కర్మ నిరతుఁడెవడో - ద్విట్కృత్య విదార బాహు ధీరుండెవడో
నట్కర్త ధారుఁడెవడో - షట్కర్మా వంద్య విశ్వనాధ మహాత్మా 48

కం॥ సకలా శావని పాలక - మకుటాంచ ద్రత్న భాస్వమానిత రుచిర
ప్రకటీ కృత పాదాంబుజ - నకటిక హృదయాబ్జ విశ్వనాధ మహాత్మా 49

కం॥ హరయను రెండక్షరములు - ధరఁబ్రజ్వలితముగజేయు ధన్యాత్మక నిన్
విరివిగను వినుతు లొనరుతు -నరవర నుత చరిత విశ్వనాధ మహాత్మా 50

కం॥ శార్ణాత్మికాఖ్య కాళిని - నిర్ణయ దివ్యాంగ సంగ నిర్గుణ రంగా
దుర్ణయ తమఃపతంగా -నార్ణవ గుణరంగ విశ్వనాధ మహాత్మా 51

కం॥ క్షమయుత హృదయ విశీలా - కమనీయ గుణాలవాల కరుణ విశాలా
విమలాత్మ గణ విజాలా-నమ శివయా లోల విశ్వనాధ మహాత్మా 52

**వర్ణములు సమాప్తము**

**దేవు వారి వంశక్రమము**

కం॥ శ్రీమద్దేవు కులాంబుధి - సోముడ వర రాజలింగ సురుచిర నామో
ద్దామ వరసూను సత్యం -నాముఁడు యిది వ్రాసె విశ్వనాధ మహాత్మా. 53

కం॥ ధరసౌజ్ఞర్షిన్ సుగోత్రా - కరుఁడన్ శ్రీచిన్నమాంబికా గర్భ శ్రీ
వరశుక్తి మౌక్తికముకున్ - నరనుతుఁగాఁనేలు విశ్వనాధ మహాత్మా 54

కం॥ శ్రీకర వ్యయ నామాయన- ప్రాకట ముగ మాఘ బహుళ పదియవ నాడున్
నాకవిత వర్ణమాలిక - నాకేశ్వర గొనుము విశ్వనాధ మహాత్మా. 55

కం॥ నీకర్పణముగ జెప్పితి - సాకుము జగదేక రక్ష,సౌశీల్య,తగం
జేకొనుచు సిరు లొసంగుము - నాకేశ సనారి విశ్వనాధ మహాత్మా. 56

1946 సం॥లో వ్రాసిన **శ్రీమత్సనారీశ్వర స్తుతి వర్ణమాలిక సంపూర్ణము**

అనగా 2016లో ద్వితీయ ముద్రణ

బ్ర॥సుగంధం సాయిబాబాచార్య స్వామిజీ వారిచే ముద్రింపబడినది.

**శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ**

**శ్రీ శివతాండవ స్తుతి**

శ్రీ విరాట్ విశ్వ కర్మ భగవాన్ మానస పుత్రులగు నవ బ్రహ్మలలోని పులస్య బ్రహ్మ పౌత్రుడు విశ్రవసు బ్రహ్మ జేష్ఠ పుత్రుడగు దశకంధరుడు నాల్గు యుగములలోనూ శివభక్తాగ్ర గణ్యుడు ఆ మహనీయుడు శివ సాక్షాత్కారమునకై చేసిన శివతాండవ స్తోత్రంతో పరవశుడైన పరమేశ్వరుడు దశకంధరుని 'రావణ బ్రహ్మగా' సంబోధించి వర ప్రధానం చేసారు. అట్టి శివతాండవ శ్లోకాలకు అర్ధం తెలుసుకుని పఠిస్తే పరమేశ్వరుని కృపను పొందగలరన్న భావంతో అర్ధ సహితంగా శివతాండవ స్తోత్రాన్ని ముద్రిస్తున్నాము. భక్తులు సద్వినియోగ పరుచు కోగలరని మనవి.





**1. జటా టవీ గల జ్జల ప్రవాహ పావితస్థలే।**
**గలేవలంబ్య లంబితాం భుజంగ తుంగమాలికామ్॥**
**డమడ్డమ డ్డమ న్నినాదవడ్వమర్వయం**
**చకార చండతాండవం తనోతు న శ్శివ శ్శివమ్॥**

తా. పరమేశ్వరుని జటలనే అడవినుంచి క్రిందికురుకుచున్న దివ్య గంగాజల ప్రవాహముచే, పవిత్రమైనట్టి కంఠమునందు గొప్పనాగమును మాలగా ధరించి , ఢమడ్డమ డ్డమ యను డమరు నాదముతో గూడిన,భయంకర నాట్యముచేయు శివుడు మనకు అనేక శుభములు చేకూర్చుగాక! అని అర్ధం

**2. జటాకటాహ సంభ్రమ భ్రమ న్నిలింప నిర్ఝరీ**
**విలోల వీచివల్లరీ విరాజమాన మూర్ధని।**
**దగద్ధగధగజ్జ్వల ల్లలాట పట్ట పావకే**
**కిశోర చంద్ర శేఖరే రతిఃప్రతిక్షణంమమ॥**

తా. పరమేశ్వరుని జటలయొక్క ముడియందు సుడులు తిరుగుచున్న గంగానదీ తరంగములను లతాఫంక్తులతో, ప్రకాశించులలాటము నందు అగ్ని కలవాడును,బాల చంద్రుని శిరోభూషణముగా ధరించిన "చంద్రశేఖరుని" యందుప్రతీక్షణము నాకు ప్రీతి కలిగియుందును గాక!

**3. ధరాధరేంద్ర నందనీ విలాసబంధుబంధుర**
**స్ఫురద్దృగంత సంతతి ప్రమోద మాన మానసే।**
**కృపాకటాక్ష ధోరణీ నిరుద్ధ దుర్ధరాపతి**
**క్వచి ద్దిగంబరే మనో వినోద మేతు వస్తుని॥**

తా.పర్వతరాజగు హిమవంతునికుమార్తె యగు,పార్వతీదేవియొక్క క్రిడా విశేషములతో అతిసుందరముగా ప్రకాశించుచున్న కృపాకటాక్ష వీక్షణములచే బంధువులను,భక్తులను ఆపదలను తొలగించునట్టిదియునగు పార్వతీ దేవి భర్తయగు శివుని యందు నామనస్సు ఆనందించుగాక!

**4. జటాభుజంగ పింగళస్ఫురత్ఫణామణిప్రభా**
**కదంబ కుంకుమద్రవ ప్రలిప్త దిగ్వధూముఖే।**
**మదాంధసింధుర స్ఫురత్త్వగుత్తరీయ మేదురే**
**మనో వినోద మద్భుతం బిభర్తుభూతభర్తరి॥**

తా. జటలయందలి సర్పముల పడగలయందలి ,మణులపీతవర్ణ కాంతి సమూహముచే, దిక్కులను ప్రకాశింపజేయుచు, కుంకుమ ద్రవముచే, దిగాంగనలయొక్క ముఖములకు పూయుచున్నవాడు,మదాంధుడగుగజాసురుని వధించి,ఆతని చర్మమును ఉత్తరీయముగా ధరించినట్టి , సురద్రూపి యగు మహాదేవుని యందు నామనమద్భుతానంద పారవశ్యము నందుగాక!

5. **లలాటచత్వర జ్వలద్ధ నంజయ స్ఫులింగ భా**
**నిపీతపంచ సాయకం నమన్నిలింప నాయకం।**
**సుధామయూఖ లేఖయా విరాజమాన శేఖరం**
**మహాకపాలి సంపదే శిరోజటాల మస్తు నః॥**

తా. లలాటమందలి అగ్నిచే మన్మధుని దహించినట్టివాడును,కపాలమును చేతబట్టిన వాడును, దేవనాయకులచే నమస్కరింపబడుచుండు వాడును, జటలయందు గంగను, శిరమున చంద్రరేఖను ధరించినవాడును,మహా తేజోవంతుడగు మహాదేవుడు భక్తులమగు మనకు చతుర్విధపురుషార్ధములు ప్రసాదించునుగాక!

6. **సహస్ర లోచన ప్రభృత్య శేష లేఖ శేఖర**
**ప్రసూనధూళి ధోరణీ విధూసరాంఘ్రి పీఠభూః।**
**భుజంగ రాజ మాలయా నిబద్ధజాటజూటకః**
**శ్రియై చిరాయ జాయతాం చకోరబంధు శేఖరః ॥**

తా. ఆ మహాదేవుడు వేయికన్నులుగల యింద్రుడు మొదలగు సర్వదేవతలయొక్క శిరములందున్న పుష్పముల పుప్పొడి వారు పాదాభివందనము చేయునపుడు రాలిన పాదపీఠము గలవాడు, సర్పరాజగు వాసుకీ చేచుట్టబడిన జటాజూటము గలవాడు. చకోరములకు బంధువగు చంద్రుని శిరోభూషణముగ ధరించిన మహాదేవుడు సదా చతుర్విధ పురుషార్ధములను ప్రసాదించుగాక!

7. **కరాలఫాల పట్టిక ధగద్ధగద్ధగజ్జ్వల**
**ద్ధనుంజయా ధరీకృత ప్రచండ పంచసాయకే।**
**ధరాధరేంద్ర నందినీ కుచాగ్ర చిత్రపత్రక**
**ప్రకల్ప నైకశిల్పని త్రిలోచనే రతిర్మమ॥**

తా. భయంకరమగు భాలభాగమందు భగభగమండుచున్న అగ్ని హోత్రునిచే భస్మము చేయగల ప్రచండమగు కామదహనుడు,పర్వతరాజగు హిమవంతుని పుత్రిక





కుచాగ్రముల యందు, చిత్ర పత్రకములలిఖించుటయందు మహానేర్పరియగు,త్రిలోచనుని యందు నాకు ఎక్కువ ప్రీతియుండుగాక!

8. **నవీన మేఘమండలీ నిరుద్ధ దుర్ధర స్ఫుర**
**త్కుహూ నిశీధినీ తమఃప్రబంధ బంధ కంధరా।**
**కళానిధాన బంధుర శ్శ్రియం జగద్ధురంధరః**
**నిలింప నిర్ఝురీ ధరస్త నోతు కృతి సింధురః॥**

తా. కొత్తగా ఏర్పడిన మేఘములచే కప్పబడిన,భయంకరమగు అమావాస్య అర్ధరాత్రి యందలి, కారుచీకటిని బోలిన కంఠప్రదేశము గలవాడును, దేవనదియగు గంగను ధరించిన వాడును,మృగచర్మమును ధరించిన సుందరుడు కళలకు నిలయమైన చంద్రుని ధరించిన మహాదేవుడు మనకు శుభములు చేకూర్చుగాక!

9. **ప్రఫుల్ల నీలపంకజ ప్రపంచకాలిమప్రభా**
**విలంబ కంఠకంధర రుచి ప్రబంధకంధరం।**
**స్మరచ్ఛిదం పురచ్ఛిదం భవచ్ఛిదం ముఖచ్ఛిదం**
**గజచ్ఛిదాంధకచ్ఛిదం తమంతకచ్ఛిదం భజే॥**

తా. వికసించిన నల్లకలువలచే విస్తరించిన కాలుష్య ప్రభను అవలంభించిన, కంఠకందళీ కాంతిచే ప్రకద్ధమైన మెడగలవాడు, మన్మధుని ఛేదించినవాడు, త్రిపురా సురుని సంహరించినవాడు, సంసారమును ఛేదించినవాడు, దక్షయజ్ఞమును ధ్వంస ము గావించినవాడు, గజాసురుని సంహరించినవాడు, అంధకాసురుని సంహరించి నవాడగు, మహాదేవుని నేను భజించెదను.

10. **అఖర్వ సర్వ మంగళా కళాకదంబ మంజరీ**
**రసప్రవాహ మాధురీ విజ్ఞృంభణా మధువ్రతమ్।**
**స్మరాంతకం పురాంతకం భవాంతకం మఖాంతకం**
**గజాంతకాంధకాంతకం తమంత కాంతకం భజే॥**

తా. (అఖర్వమనగా) అధికమగు సర్వమంగళము గలిగినట్టి అరువదినాలుగు విద్యలే కడిమి వృక్షముకాగా,అవృక్షములపూలయొక్క సారప్రవాహము యొక్క మాధుర్యమును తుమ్మెద గ్రహించగలదు! సర్వవిద్యామయుడు,స్మరాంతకుడు, పురాంతకుడు, భవాంతకుడు, దక్షయజ్ఞ విధ్వంసియగు గజాంతకుడు, అంధకాంతకుడు, అంతకాంతకుడునగు శివుని నేను భజించెదను.

**11. జయద్వదభ్రవిభ్రమ భ్రమద్భుజంగ నిశ్వసః**
**ద్వినిర్గత్క్రమస్ఫురత్కరాళఫాల హవ్యవాట్।**
**ధిమిధిమి ధ్ధిమిధ్వన న్మృదంగ తుంగ మంగళ**
**ధ్వనిక్రమప్రవర్తిత ప్రచండతాండవ శ్శివః॥**

తా.అధికమయిన వేగముతో తిరుగుచున్న పాములయొక్క ఉచ్ఛ్వాసనిశ్వాసములతో ప్రకాశమగుచూ దుష్టజనులను భయకంపితులను చేయునట్టి అగ్నిని ధరించినవాడు, మరియు ధిమిధిమి ధ్వనులను మృదంగములచే ఉత్పన్నమైన మంగళకరనాదములచే ప్రారంభించబడిన, భయంకర నృత్యముచేయు మహాదేవునకు జయము!జయము!

**12. దృషద్విచిత్ర తల్పయో ర్భుజంగ మౌక్తిక స్రజో**
**ర్గరిష్టరత్న లోష్ఠయో స్సుహృద్విపక్షపక్షయోః।**
**తృణారవింద చక్షుషోః ప్రజామహీ మహేంద్రయో**
**స్సమం ప్రవర్త యన్మనః కదా సదాశివం భజే॥**

తా. పాషాణముచేతను గానీ, పుష్పాదులచేతనుగానీ నిర్మింపబడిన విచిత్రమైన శయ్య యందు సమదృష్టి గలిగి, రాగద్వేషాదులులేనివాడయ్యును.పాముల, ముత్యముల హారములందు సమప్రవృత్తి కలవాడయ్యున్ను,మిత్ర శత్రువుల యందు సమభావముగల వాడయ్యును,గడ్డిపోచయందు,అత్యంత విలువగుదానియందును, కమలములవంటి కన్నులుగల కామిని యందును, కురూపియందును, భూపతి యందును సామాన్యమానవునియందును,సమానభావము గలవాడనై నేను ఎప్పుడా మహాదేవుని భజింప గలనోగదా!

**13. కదానిలింప నిర్ఝరీ నికుంజకోటరే వస**
**న్విముక్త దుర్మతి స్సదా శిరఃస్థమంజలిం వహ।**
**న్విముక్త లోల లోచనో లలాటఫాల లగ్నక**
**శ్శివేతి మంత్ర ముచ్చర స్సదా సుఖీ భవామ్యహమ్॥**

తా. నేను ఎల్లప్పుడు దుష్టబుద్ధిని విడనాడి,పవిత్ర గంగానదీ తీరమందలి పొదరిల్లు యొక్క మధ్య భాగమునందు నివశించుచూ శిరస్సునందంజలి ఘటించుచూ భ్రూమధ్యమున దృష్టిని కేద్రీకరించి “శివ”మంత్రమునుచ్చరించుచూ ఎన్నడూ బ్రహ్మానందమును పొందుదునోగదా!

**14. ఇమం హి నిత్యమేవ యుక్తముత్త మోత్తమం స్తవం**
**పఠ స్స్మరన్ బ్రువన్నరో విశుద్ధిమేతి సంతతమ్।**
**హరే గురౌ సుభక్తి మాశుయాతి నాన్యథాగతిం**
**విమోహనం హిదేహినాం సుశంకరస్య చింతనమ్॥**





తా. ఈ ఉత్తమమైన శివ స్తోత్రమును ఎల్లప్పుడూ పఠించుచూ స్మరించుచూ వినుచూ నరుడు పరిశుద్ధుడగును. హరునియందు, గురునియందును, పరిశుద్ధ భక్తిని శీఘ్రముగా పొందగలడు, శంకరుని స్మరణ నరులకు ఇహలోక భ్రాంతిని తొలగించును.

**15. పూజావసాన సమయే దశవక్త్రగీతం**
**యశ్శంభు పూజనమిదం పఠతి ప్రదోషే।**
**తస్యస్థిరాం రథ గజేంద్రతురంగ యుక్తాం**
**లక్ష్మీం సదైవసుముఖీం ప్రదదాతి శంభుః॥**

తా. సాయం సంధ్యా సమయములందును, పూజయైన పిమ్మట దశకంఠునిచే గానముచేయబడిన ఈ శివస్తోత్రాన్ని ఎవరు పఠింతురో వారికి శంకరుడు రథ,గజ, తురగ యుక్తమైన ప్రసన్నమగు లక్ష్మిని అనగా సుఖసంపదలను ప్రసాదించగలడు.

**జగద్గురువు, సద్గురువు, మద్ గురువుదేవులగు అన్నపూర్ణా సమేత విశ్వనాథుని ప్రార్థన**

హే! జగద్గురు సనారీ విశ్వనాథా వదూత స్వామీ। భక్తవత్సలా। దీనదయాపరా। ఆపద్బాంధవా। అనాథరక్షకా। సద్గురుదేవా।ఆకాశము విరిగి మీద పడిననూ, భూమితల్లక్రిందులైననూ, సప్త సాగరములింకిననూ, జల ప్రళయము సంభవించిననూ, అగ్ని పర్వతములు బ్రద్దలైననూ, సూర్యచంద్రులు గతులు తప్పిననూ, ఎట్టి విపరీత విపత్కర పరిస్థితులెదురైననూ, నీ పాద సేవా భాగ్యము మాకు దక్కునటుల, అనుగ్రహింపుము సదా మమ్ము రక్షించికాపాడి యోగసిద్ధిని ప్రసాదించి, మా జన్మలు చరితార్థమగుటుల ఆశీర్వదించుము త్రండీ యివియే మా శతకోటి సహస్ర పాదాభి వందనములు గురుదేవా!

ప్రతీ మానవునకు వచ్చు జన్మరీత్యా వచ్చు మహర్థశలు జన్మించిన దగ్గరనుండి
1సం॥ వరకూ చంద్రమహాదశ పసితనము
2వ సం॥ నుండి 3సం॥ వరకూ కుజమహాదశ **(బాల్యము)**
3వ సం॥ నుండి 12సం॥ వరకూ బుధ మహాదశ **(లోకవిద్య)**
12వ సం॥ నుండి 32 సం॥ వరకూ శుక్ర మహాదశ **(వృత్తి విద్య వివాహము)**
32వ సం॥ నుండి 50సం॥ వరకూ గురు మహాదశ **(పెద్దరికం)**
50వ సం॥ నుండి 70సం॥ వరకూ రవి మహాదశ **(అన్నిటా పెద్దరికం)**
70వ సం॥ నుండి 120సం॥ వరకూ శనిమహాదశ **(జీవితాంత్యము)**

జాతకాలు లేని వారికి వచ్చు దశలయందును జాతకరీత్యా సంభవించు మహార్థశ, అంతర్దశ, సూక్ష్మదశలయందును, గోచారరీత్యా కలుగు సర్వావస్థలయందు రక్షించి కాపాడి, సదా మీ పూజచేయు మహద్భాగ్యమును, మనఃశ్శాంతిని ఆయురారోగ్య ఆర్థిక వసతులనిచ్చి, తెలిసీ తెలియక మేము చేసిన సర్వ తప్పులనూ, మన్నించి, మాకు గల దుర్గుణములు తొలగించి, సుజ్ఞానాన్ని ప్రసాదించి, మా జన్మలను చరితార్థంచేయండి సద్గురు దేవా! శరణు శరణు శరణు

## శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారీ విశ్వనాధాలయము

మహానాడు గ్రామము, రోడ్ నెం.7, కృష్ణానదీతీరము,
తాడేపల్లి మండలం & పోస్ట్, గుంటూరుజిల్లా, నవ్యాంధ్ర - 522 501

| రుద్రాభిషేక ద్రవ్యము | | ఫలితాలు |
|---|---|---|
| ఆవుపాలు | - | సర్వసౌఖ్యము |
| ఆవు పెరుగు | - | ఆరోగ్యము |
| మెత్తని పంచదార | - | ఐశ్వర్యవృద్ధి, సంగీతప్రాప్తి |
| తేనె | - | తేజోవృద్ధి |
| చెఱకురసం | - | ధనవృద్ధి |
| కొబ్బరినీళ్ళు | - | సర్వ సంపదలు |
| భస్మజలం (వీభూది) | - | మహా పాపహారం |
| సుగందోధకము | - | పుత్రలాభము |
| పుష్పోధకము | - | భూ లాభము |
| బిల్వజలం (మారేడు) | - | భోగభాగ్యాలు |
| దుర్వారోధకము(దర్భ) | - | నష్ట ద్రవ్య ప్రాప్తి |
| నువ్వులనూనె | - | అపమృత్యుహారం |
| రుద్రాక్షోధకము | - | మహదైశ్వర్యము |
| సువర్ణజలము | - | దారిద్ర్య నాశనం |
| అన్నముతో | - | రాజ్య ప్రాప్తిసుఖజీవనం |
| నల్లద్రాక్ష పళ్ళరసంతో | - | సకల కార్యసిద్ధి |
| నేరేడు పళ్ళ రసంతో | - | వైరాగ్యము |
| కస్తూరి జలం | - | చక్రవర్తిత్వం |
| మామిడిపండ్ల రసంతో | - | దీర్ఘవ్యాధి నాశనము |
| గంగోధకం | - | మోక్ష ప్రాప్తి సర్వ సంపదలు |
| పసుపు జలం | - | మంగళ ప్రధము |
| కుంకుమ జలం | - | జయము |
| ధవళాక్షతల ఉదకముతో | - | శివసాన్నిధ్యము |

మీ మనసు నందలి కోర్కెలుపై ద్రవ్యములతో కాశీ విశ్వనాధుని అభిషేకములు చేయించు కొని ఫలితములను పొందగలరు.





**క్రీ॥పూ॥ 4వ శతాబ్ధిలో శృంగేరిలోగల సరస్వతీపీఠ స్థాపకులు ఆదిశంకరాచార్య విరచిత విశ్వకర్మాష్టకం ఆంధ్రానువాదం** పండిత పామర్తి నాగభూషణ శర్మగారు (1991)

**శ్లో॥ శ్రీకరార్చిత సత్య శాశ్వత లోక నిర్మిత నిర్జరా।**
**పాకశాసన పద్మజాది సురా సురార్చిత భాస్కరా।**
**ఏకమేవ బ్రహ్మమూర్తి పినాక సంస్థిత శంకరా।**
**శోక వర్జిత శంభునామక విశ్వకర్మ జగత్ప్రభో॥** 1

హే విశ్వకర్మ జగత్ప్రభూ! నీవు పరమేశ్వరునిచేత పూజింపబడుచున్నాడవు. సత్య స్వరూపుడవు శాశ్వతుడవు. సమస్త లోకములను నిర్మించువాడవు. ముదిమిలేని వాడవు. ఇంద్రుడు బ్రహ్మ మున్నగు దేవతల చేతను అసురుల చేతను పూజింపబడుచున్నవాడవు. స్వయం ప్రకాశకుడవు. అద్వితీయమైన బ్రహ్మమూర్తిని, సుఖమును కలిగించువాడవు. దుఃఖమును అతిక్రమించినవాడవు శంభు అను పేరుగలవాడవు అట్టి నీకు నమస్కారము.

**శ్లో॥ సర్వనాయక సర్వదాయక సర్వసాక్షి మహేశ్వరా।**
**సర్వరాజిత సర్వపూజిత సర్వకార్య దురంధరా।**
**సర్వశిక్షక సర్వభక్షక సర్వరక్షక శ్రీకరా।**
**సర్వసద్గుణ సర్వనామక విశ్వకర్మ జగత్ప్రభో॥** 2

హే విశ్వకర్మ ప్రభూ ! నీవు సర్వమునకు ప్రభువైనవాడవు. సమస్త సుఖముల నిచ్చువాడవు. సమస్త కార్యములకు సాక్షీభూతుడవు. మహాప్రభుడవు. అన్నిటి యందు ప్రకాశించువాడవు. సమస్త పాపములను హరించువాడవు. సమస్త ప్రాణులను రక్షించు వాడవు. సంపదల నిచ్చువాడవు. సమస్త సద్గుణములు గలవాడవు. సమస్త నామములు గలవాడవు. అట్టి నీకు నమస్కారము.

**శ్లో: స్వర్ణరూప సువర్ణలోక స్వర్ణకాంతి మనోహరా।**
**వర్ణరాజిత వర్ణవర్జిత వర్ణరాజ విధాకరా।**
**వర్ణవాచక వర్ణసంభవ వర్ణవేద జటాధరా।**
**వర్ణవర్ణాతీతవర్ణన విశ్వకర్మ జగత్ప్రభో॥** 3

హే విశ్వకర్మ ప్రభూ ! నీవు అన్నిరూపములు గలవాడవు. స్వర్గలోకమందుండు వాడవు. సూర్యచంద్రాది రూపముల ద్వారా కాంతి నిచ్చుచూ మనస్సులను రంజింప జేయుచున్నవాడవు. విశ్వకర్మ ప్రభు అను అక్షరములతో ప్రకాశించుచున్నవాడవు. కులమత వర్జితుడవు. సద్విధులను విధించువాడవు. సమస్త జాతులచే చెప్పబడువాడవు. అన్ని జాతులలో జన్మించువాడవు. అందరి యొక్క మంచి చెడ్డలను తెలిసికొనువాడవు. ఎల్లపుడు మౌనముతో నుండువాడవు. అన్ని రంగులకు అతీతమైన బంగారు కాంతి గలవాడవు. అట్టినీకు నమస్కారము.

శ్లో॥ **మంత్రవిగ్రహ మంత్రసంగ్రహ మంత్రమాయజసంహరా**
**మంత్రచేతన మంత్రనూతన మంత్రసంశయ శేఖరా।**
**మంత్రరాజిత మంత్రపూజిత మంత్రరూపమహేశ్వరా।**
**మంత్ర బంధుర మంత్రనామక విశ్వకర్మ జగత్ప్రభో॥** 4

హే విశ్వకర్మ ప్రభూ ! నీవు మంత్రస్థాపిత విగ్రహ స్వరూపుడవు. సమస్త వేద మంత్రములలో రహస్యార్థముగా నున్నవాడవు. మంత్రములతో మాయచేయుచున్న వారిని సంహరించువాడవు. మంత్రములలో జ్ఞానస్వరూపుడవుగా నున్నవాడవు. మంత్రముల ద్వారా నూతన విషయములను తెలియజేయు చున్నవాడవు. మంత్రములలోని సంశయములను తీర్చువాడవు. మంత్రవేత్తలచేత పూజింపబడువాడవు. వేదములచేత తెలిసికొనదగినవాడవు. శారదా రూపములో (అనగా) వాగ్రూపములో ప్రకాశించువాడవు. మంత్రవేత్తలకు బంధువైన వాడవు. మంత్రములలో ప్రసిద్ధమైన పేరుగలవాడవు. అగు విశ్వకర్మ జగత్ప్రభూ నీకు నమస్కారము.

శ్లో॥ **ఘోరఘోర విదార దూర శ్రవణ నిస్వన మంజులా।**
**ధీరవార్ధి గంభీర మాయామందిరాశ్రిత చిత్కళా।**
**సూరిత్వష్టవిహారకల్ప విచారకారణ సత్ఫలా।**
**మేరు నిర్మిత మేరునామక విశ్వకర్మ జగత్ప్రభో॥** 5

జగత్ప్రభుడవగు ఓ విశ్వకర్మ పరమాత్మా! నీవు అత్యంత ఘోరమైన పాపములను తొలగించి దూరముగా నుంచువాడవు. వినుటకు మనోహరమైన మధుర ధ్వనులను ఇచ్చు వాడవు. విశాలమైన సముద్రమువలె గంభీరమైనవాడవు. మాయాగ్రస్తులై





నిన్నాశ్రయించిన వారికి వెలుగుబాట చూపించువాడవు. త్వష్ట బ్రహ్మ సృష్టి కల్పను విచారించుటకు కారణభూతుడవై సత్ఫలము నిచ్చువాడవు. దేవతలకు నివాసమైన మేరు పర్వతమును నిర్మించిన వాడవు. మేరు పర్వతనామము గలవాడవు. అట్టి నీకు నమస్కారము.

శ్లో॥ **విశ్వచారణ విశ్వపూరణ విశ్వధారణ నిశ్చయా।**
**విశ్వభూషణ విశ్వతోరణ విశ్వపోషణ విస్మయా।**
**విశ్వతారణ విశ్వకారణ విశ్వధారణ లీలయా ।**
**విశ్వహారణ విశ్వనామక విశ్వకర్మ జగత్ప్రభో॥** 6

హే విశ్వకర్మ జగత్ప్రభో ! నీవు విశ్వమందంతను సంచరించువాడవు. విశ్వమును పూరించువాడవు, విశ్వమును ధరించువాడవు. నిశ్చయ జ్ఞానము గలవాడవు. విశ్వమునకు భూషణము వంటివాడవు. విశ్వమునకు మంగళకరుడవు, విశ్వమును పోషించువాడవు. అశ్చర్యమును కలిగించు వాడవు. విశ్వమునకు రక్షకుడైన వాడవు. విశ్వమునకు ఆధారభూతుడైన వాడవు. విలాస చేష్టలుగల వాడవు. విశ్వమును హరించువాడవు. విశ్వము అనుపేరు గలవాడవు. అట్టి ఓ పరమేశ్వరా ! నీకు నమస్కారము.

శ్లో॥ **మంగళాకార మంగళాధర మంగళాసన పంఙ్కకా।**
**మంగళాస్థిత మంగళాప్రద మంగళాంగ విరాజితా।**
**మంగళాయత భీష్టదాయక మంగళాకర నామకా।**
**మంగళాజయతుంగ నామక విశ్వకర్మ జగత్ప్రభో॥** 7

హే విశ్వకర్మ జగత్ప్రభూ ! నీవు శుభములకు ఆశ్రయమైన వాడవు. శుభముల నిచ్చి ఆదరించువాడవు. మంగళములే ఆసనముగా గలవాడవు. సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన అను పంచ ముఖములు గలవాడవు, సర్వదా మంగళముల నిచ్చుచు నుందువాడవు, మంగళవ్రతములు గలవాడవు. మంగళ స్వరూపుడవు, విశేషముగా ప్రకాశించు వాడవు, మంగళములకు స్థానమైనవాడవు. శత్రువులకు భీతిని గొల్పువాడవు. మంగళములకు స్థానమైన పేరు గలవాడవు. శుభములచే జయింపబడువాడవు. అత్యుత్తమైన పేరుగలవాడవు. అట్టి విశ్వకర్మ పరమేశ్వరా ! నీకు నమస్కారము.

శ్లో॥ కల్పపావన కల్పజీవన కల్పభావ నమోస్తు తే।
కల్పపాలన కల్పఖేలన కల్పజాజ్ఞ నమోస్తు తే।
కల్పనాకృత కల్పసంయుత కల్పకల్ప నమోస్తు తే।
కల్పతాండజ కల్పనామక విశ్వకర్మ జగత్రృభో॥

హే విశ్వకర్మ ప్రభూ ! నీవు సృష్టిని పవిత్రము చేయువాడవు, సృష్టికి జీవనాధారమైన వాడవు. సృష్టి రూపములో తెలిసికొన దగినవాడవు, అట్టి నీకు నమస్కారము. సృష్టిని పాలించువాడవు, సృష్టిలో విలాసముగా విహరించువాడవు, సృష్టి రహస్యములను తెలిసికొనుచున్న వాడవు. అట్టి నీకు నమస్కారము, సృష్టికి అతీతముగా నుండువాడవు, సృష్టిలో అంతర్లీనమై యుండువాడవు అట్టి నీకు నమస్కారము.బ్రహ్మాండ రూపములో నుండు వాడవు, బ్రహ్మాండనామము గలవాడవు. అట్టి ఓ విశ్వకర్మ ప్రభూ మా నమోవాకములు అర్పించుచున్నాము మమ్ములను కాపాడుము.

పామరులు సైతము ఈ అష్టకభావాన్ని అర్ధంచేసుకొని చతుర్విధపురుషార్ధములు పొందుటకు ఈ గ్రంధమందు పొందుపరచితిమి

ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః

## స్థూల,సూక్ష్మ, కారణ,మహాకారణ దేహములశుద్ధి

1. సనారీ విశ్వేశ్వరసంవాద గ్రంధమందలి ప్రధమాశ్వాసము స్థూలదేహంబనే బ్రహ్మ గ్రంధిని (ఆత్మతత్వం) శుద్ధిచేయగల ప్రక్రియలు కలవు. (ఆణవమలాన్ని శుద్ధిపరచును)
2. సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధమందలి ద్వితీయాశ్వాసము సూక్ష్మదేహంబనే విష్ణు గ్రంధిని (విద్యాతత్వం) శుద్ధిచేయగలట్టి ప్రక్రియలుగలవు.( మాయిక మలాన్ని శుద్ధిపరచును)
3. సనారీ విశ్వేశ్వర సంవాదమందలి తృతీయాశ్వాసము కారణదేహంబనే రుద్ర గ్రంధిని (శివతత్వం) శుద్ధిచేయగల ప్రక్రియలు గలవు. (కార్మికా మలాన్ని శుద్ధిపరచును.
4. సనారీ విశ్వేశ్వరసంవాదగ్రంధమందలి తృతీయాశ్వాస ఉత్తర భాగమందు మహాకారణ దేహమును పరిశుద్ధము చేయగలట్టి ప్రక్రియలు గలవు.





## శ్రీసనారీ విశ్వనాధుని మంగళాష్టకమ్

1. సనారీ దేవాయ కఠారిధరాయనిర్గుణాయగుణాత్మనేనమః।
కాలకాలాయ భవాయ -దివ్యవర్ణాయమంగళమ్॥
2. కాలగమనాయ భీమాయ-కాషాయకౌపీనధారిణే నమః।
ఆర్తత్రాణపరాణాయ- అన్నపూర్ణాంబపతయే మంగళమ్॥
3. భస్మోద్ధూళిత దేహాయ- పద్మయజ్ఞోపవీతినేమః।
స్ఫటిక రుద్రాక్ష మాలాభూషాయ- నీలకేశాయ మంగళమ్॥
4. సూర్యచంద్రాగ్ని నేత్రాయ- క్షీరాచలవాసినే నమః।
సచ్చిదానంద రూపాయ- సత్‌శిష్యగణాయ మంగళమ్॥
5. మృత్యుంజయాయ- విశ్వనాధాయ సృష్టిస్థిత్యంతకారిణే నమః।
త్రికాలజ్ఞానాయ, శాంతాయ, త్రిలోకసంచారీ మంగళమ్॥
6. గౌరీపుత్రాయ ఈశ్వరాంశాయ-జగద్గురవేనమః।
ఉగ్రాయత్రిగుణఘ్నాయ-త్రివిక్రమాయ మంగళమ్॥
7. మయవంశోద్భవాయ- బ్రహ్మజ్ఞానప్రధాయినేనమః।
వామదేవాయనమస్తుభ్యం-దివ్యవక్త్రాయ మంగళమ్॥
8. సదాశివ స్వరూపాయ-సత్పురుషాయతేనమః।
అమోఘాయ, ఆనందాయ-అనంతాయచ మంగళమ్॥
9. శ్రీ సద్గురు ప్రేరితేన సాయిబాబా రచితం మంగళాస్పదమ్।
తస్యాభీష్టప్రదం, శుభంయఃపఠేన్మంగళాష్టకమ్॥

శ్లో॥ సనారీం పరామానందమ్। పరబ్రహ్మపరాత్పరమ్ ।
వ్యాపకం సర్వలోకానాం। నమామి అన్నపూర్ణేశమ్॥

## సనారీ విశ్వనాధ మంగళాశాసనమ్

1. గౌరీసుతాయ శాంతాయ- కామితార్ధప్రధాయినే।
క్షీరగిరి దేవాయ- విశ్వనాధాయ మంగళమ్॥
2. సచ్చిదానంద రూపాయ-శ్రీగిరి గుహనివాసాయ।
వీరాచార్యసుతాయ- విజ్ఞానప్రధాతాయ మంగళమ్॥

3. సత్యానందరూపాయ - నిత్యానంద విధాయినే।
స్తుత్యాయ శ్రుతిగమ్యాయ- శ్రీగిరీశాయ మంగళమ్॥

4. ముక్తిప్రదాతాయ ముఖ్యాయ- భక్తానుగ్రహకారిణే।
సుందరేశాయసౌమ్యాయ - సింహాద్రి వంశ పావనాయ మంగళమ్॥

5. అన్నపూర్ణాంబనాథాయ -అచల తత్వ బోధితాయ।
అవధూత ప్రముఖాయ - ఆకర్షణస్వరూపాయ
ఇలవెలసిన ఈశ్వరాంశాయ- ఉరగభూషణాయ ఊరిజన క్షేమకారకాయ।
ఋషిగణప్రధానాయ ఋభవార్చితాంగ - ఋూపలావణ్య ప్రధాతాయ।
సింహాద్రి విశ్వనాధాయ -శాశ్వతానంద ప్రదాతాయ మంగళమ్॥

## శ్రీ సనారీశ్వరస్వామివారి శుద్ధమాల

ఓం మహాదేవ! ఆదిపురుషా! అనంతరూపా! జ్యోతిస్వరూపా! దుష్టశిక్షకా। శిష్టరక్షణా। మహాట్టహాసా !క్షీరగిరి పీఠనివాసా! ఏహిపీఠేమహా పీఠే ఓంహ్రీంశ్రీం ఐం క్లీంసౌః సర్వకార్యార్ధసాధకా। అవధూతయోగా। యోగా పీఠస్థితా! పరమేశ్వరావతారా! పంచకోణనివాసాయ! బేతాళాది యక్ష రాక్షస కృత్య కృత్యే పుల్లీ, శ్రీశూన్య, శబ్ద, స్పర్శ, ఖచోర, సర్ప, సింహ, వ్యాఘ్ర, శునకాదీనాం, నివారయ నివారయ, ఏహి ఏహి,పుత్ర,పౌత్ర, భ్రాతృ, పరిజన, పరివారజన, పరిశుభట సహితస్య, మమశరీరస్య, వజ్ర శరీరం కురుకురు, స్వకులస్థితం, అన్యకులస్థితం, రాజకులస్థితం, స్వప్నస్థితం, సుషుప్తిస్థితం, బాహ్యస్థితం, గ్రహస్థితం, గ్రామస్థితం, మండలస్థితం, మమసర్వరక్షణా స్వయం భయకరాన్, నాశయ నాశయ, ఏకాహిక, ద్వియాహిక, త్రయాహిక, చతుర్థిక, పంచరాత్రిక, పక్షక, మాసక, సంవత్సరీకా దిజ్వరాన్ నాశయ నాశయ, ఏకాక్షరి, ద్వియాక్షరి, త్రియాక్షరి, చతురాక్షాది కాలముద్రాన్ నివారయ నివారయ సర్వం, బంధయ బంధయ, గ్రాసయగ్రాసయ, ఓఢ్యాణపీఠప్రసాదేన, జాలంధర పీఠప్రసాదేన, వామగిరిపీఠ ప్రసాదేన, పరమేశ్వరప్రసాదం కురుకురు, పాదశూల, నేత్రశూల, ఉదరశూలాది సర్వశత్రూన్ నాశయ నాశయ, సర్వరోగాన్ నికృంతయ నికృంతయ, నిద్రామయ, నిద్రామయ, నిర్భయంకురుకురు, మాం రక్షరక్ష సనారీశ్వరా, భేతాళవశ్యాః, చతుషష్ఠి కళావిద్యాం ప్రాపయ ప్రాపయ, దురితాన్ నాశయ నాశయ, హుంఫట్ స్వాహా॥








### శ్రీసనారీ విశ్వేశ్వర సద్గురు బ్రహ్మార్పణమస్తు
### సర్వేజనాః సుఖినో భవంతు
### లోకాః సమస్తా యోగసిద్ధిర్భవంతు

పూర్వము భస్మాసుర సంహారార్ధమై విష్ణువు జగన్మోహినీ రూపముదాల్చిన తరుణంలో ఆమె సౌందర్యమునకు పరవశుడైన హరుడు ఆమెతో సంగమించెను. ఈ విషయాన్నెరిగిన పార్వతి సంసారికి చిత్త చాంచల్యమేమిటని కోపించి శంకరుని భూలోకమున మానవునిగా పుట్టి యతీశ్వరుడవు కమ్మని శపించెను. గృహస్తుడవై ధర్మమును తప్పి స్త్రీ వ్యామోహితుడవైతివి కావున నరజన్మలో స్త్రీ సంపర్క యోగములేని సన్యాసివి కమ్మని శపించుట యుక్తమేయని తెల్పినది. తత్ఫలితంగా శంకరుడు కాళహస్తీశ్వరనామమున కాశీనగరము చేరినాడని పురాణములు తెలుపుచున్నవి. ఆ మహనీయుడు సుద్రత మహారాజుకు తెల్పిన విశ్వకర్మ పురాణమందలి అష్టాదశ మహాయుగములందలి విరాట్ విశ్వకర్మ భగవాన్ సృష్టులు.

**1. అనంత** యుగమున విశ్వకర్మచేత ఓంకారయుక్తమగు గాయత్రీ మంత్రము సృష్టించబడినది. ఆదేవయుగమునందు గాయత్రీ నుండి సమస్తమైన దేవతలు, ఋషులు విశ్వకర్మ చే ప్రేరేపించబడినవారై జన్మించిరి.

**2.అద్భుతమను** పేరుగల మహాయుగమునందు జ్ఞానానందస్వరూపుడైన విశ్వకర్మ చేత మొదటగా వేదములు పర్వతములు పుట్టించబడినవి. ఆకాలము సమస్త వేద సూక్తముల యందును దేవతలు విశ్వకర్మ చేత సముద్భూతులై ప్రవర్తించిరి.

**3.తమందమను** పేరుగల మహాయుగమున పరంజ్యోతి స్వరూపుడగు విశ్వకర్మచేత కాపాలియను మహాశక్తి సృష్టించబడినది. ఆమెయొక్క కపాలపురక్త బిందువులచేత కలిగిన సమస్త దేవతలు విశ్వకర్మచేత రక్షితులై ప్రవర్తించుచున్నారు.

**4.తారకమనెడి** మహాయుగమున పరబ్రహ్మాస్వరూపుడయిన విశ్వకర్మవలన పంచబ్రహ్మాసమూహముకలిగినదివారే, శివుడు, ఆమూర్తి, మూర్తి, కర్మ, కర్తలను బ్రహ్మలైదుగురు విశ్వకర్మ వంశవృక్షపు అయిదు శాఖలనుండి కలిగినారు.

**5.అండజ** మహాయుగంలో దేవతాదులైన వారెల్లరూ పంచబ్రహ్మలనుండి కలిగిన వారై విశ్వకర్మ భగవానుని రక్షణచే ప్రకాశించుచుండిరి.

**6.భిన్నజమను** పేరుగల మహాయుగమున విరాడ్రూపుడైన విశ్వకర్మ స్వయముగా అయిదు

ముఖములు మూడుకన్నులు గల పరమశివుడై ప్రకాశించెను. ఆపరమ శివుని నుండి ఏకాదశరుద్రులు, వారి నుండి పలువురు దేవతాదులు జన్మించిరి. వారు ఈ విశ్వకర్మ భగవానుని రక్షణచే ప్రకాశించుచుండిరి.

**7.భిన్నాయత్తమనెడి** మహాయుగమునందు విశ్వరూపుడైన విశ్వకర్మతానే శ్రీవత్సాంకుడు చతుర్భుజుడగు మహావిష్ణువాయెను. ఆయుగమందు సమస్త సృష్టి విష్ణుమాయ చే జరిగినది. విశ్వకర్మ విష్ణురూపుడై సమస్తమునూ సృష్టించినాడు.

**8.అభ్యంతమనెడి** పేరుగల మహాయుగమున అద్వితీయుడైన విశ్వకర్మ భగవానుడు ముందుగా బ్రహ్మదేవుని సృష్టించగా బ్రహ్మచేత ఆయుగమున సమస్త సృష్టి జరిగినది.

**9. అనభ్యాంతయుగమునకు** (మహాభ్యాంతమని కూడా అందురు) ఈ యుగమున పరశివ విశ్వకర్మముందుగా ఇంద్రుని సృష్టించెను. ఆ ఇంద్రుడు సమస్త సృష్టిని కొనసాగించెను.

**10. అనిరణమనెడి** మహాయుగమునందు దేవదేవుడగు విశ్వకర్మ సూర్యుని సృష్టించెను తరువాత సూర్యుడు సర్వ సృష్టిని నిర్వహించెను.

**11.మనీరణమనెడు** మహాయుగము దేవాదిదేవుడగు ఈశ్వరుడు మనురూపంతో విశ్వకర్మయందుదయించి సమస్త సృష్టిని కావించెను

**12. మన్వారణమనెడి** మహాయుగమునందు చతుర్భుజుడైన విష్ణువు మయరూపంతో విశ్వకర్మయందు దయించి సమస్త లోకములను సృజించెను.

**13. విశ్వరణమనెడి** మహాయుగమునందు బ్రహ్మదేవుడు త్వష్ట్రరూపంతో విశ్వకర్మయందుదయించి సృష్టికార్యము జరిపెను.

**14.విశ్వసృష్టియనెడి** మహాయుగమందు ఇంద్రుడు శిల్పిరూపముతో విశ్వకర్మయందు దయించి విశ్వసృష్టి కార్యము నిర్వహించెను.

**15. సర్వదేవతా** మయుడైన సూర్యుడు విశ్వజ్ఞబ్రహ్మరూపముగానుదయించి కృత, త్రేతా, ద్వాపర, కలియుగములందు సృష్టికి ప్రభుడై ప్రకాశించెను ఇతడే సర్వదేవతా మయుడైన సూర్యునిగా అభివర్ణించాయి వేదములు.

ఈ విశ్వకర్మ భగవానుడు కృతయుగమున కశ్యప బ్రహ్మరూపమున అవతరించి తన భార్యలు13 యందు స్థావర జంగమ రూపమగు జగత్తును పుట్టించినాడు. సృష్టియావత్తూ విశ్వకర్మమయం.





1.భార్య **బృహతి** వలన పృథివి,తారలు, కులపర్వతములు ఉద్భవించాయి.(కలిగినవి)

2.భార్య **దితి** గర్భమున ఏభైకోట్ల ఘోరపరాక్రములయిన దైత్యులు ఉద్భవించారు.

3.భార్య **అదితి** గర్భమున ముప్పైమూడు కోట్ల దేవతలు ఉద్భవించారు.

4.భార్య **కద్రువ** గర్భమున అనంతుడు, శంఖపాలుడు, శేషుకి, వాసుకి, తక్షకుడు మొదలగు 9 నాగుజాతులు జన్మించాయి.

5.భార్య **వినత** గర్భాన సౌదామిని (మెరుపు) వజ్రఘోష (పిడుగు) అనూరుడు, గరుడుడు మొదలగు పక్షిజాతులు జన్మించాయి.

6.భార్య **ప్రభాదేవి** యందు అమూల్యమైన నవరత్నాలు, కొన్ని గ్రహములు, నక్షత్రములు, తోకచుక్కలు జన్మించాయి.

7.భార్య **కుముదిని** యందు దిగ్గజములు, అశ్వములు, మృగాలు, సింహం మొదలగు జంతువులు కలిగినవి.

8. భార్య యగు **స్వర్ణప్రభకు** బంగారు వెండి మొదలగు సమస్త లోహములు, కోర్కెలు తీర్చెడి చింతామణి, స్పర్శవేది మొదలగునవి కలిగినవి.

9వ భార్య యగు **కాలదండికి** మూడుకోట్ల యాభై లక్షల తపోధనులగు ఋషులు పుట్టిరి.

10వ భార్యయగు **మేఘదండికి** పుష్కలావర్తాది మేఘములు చైత్రరథము ఉద్యానవనములు తదితర వనములు కలిగినవి.

11వ భార్యయగు **ధాతుప్రభకు** చేపలు తాబేళ్ళు తిమింగలాదులగు జలచరములు కలిగినవి.

12వ భార్యయగు **కుసుమావళికి** కల్పవృక్షము కామధేనువు కలిగినవి.

13వ భార్యయగు **పార్వందికి** ఓషధులతో కూడిన కొండలు సమస్త కుల పర్వతములు కలిగినవి.

కశ్యపుని 13 భార్యలయొక్క ప్రసవసమయమున వెలువడిన మాలిన్యముల వలన నీచములైన క్రిమికీటకాది సమస్త ప్రాణులు జన్మించినవి. ఈ సకల చరాచర సృష్టి యంతయు కశ్యపుని సంతానమైనందున మనుబ్రహ్మస్వరూపుడైన కశ్యపుడు లోకులకు జనకుడైనాడు.

**మనువు సంతతి కావున మనము మానవులమైనాము.**

## యోగసాధనకు మూలమగు కుండలినీ శక్తి

మూలాధారచక్రంలోని విశ్వచైతన్య శక్తిని వేదవాఙ్మయంలో బ్రహ్మవర్చస్సుగాను, ప్రాచీనశాస్త్రంలో కుండలినీ శక్తిని ముకుళిత సర్పశక్తిగానూ వర్ణించబడినది. సాధారణంగా ప్రాణశక్తి ఇడపింగళనాడులద్వారా ప్రవహిస్తుంది. ఒక వ్యక్తి శ్రద్ధగా నియమబద్ధంగా సాధనచేస్తే కుండలినిలో నిబిడీకృతమైయున్న దివ్యచైతన్య శక్తి కదలడం ప్రారంభించి ఊర్ధ్వంగా పయనించి శరీరభాగాలను మాత్రమే శక్తివంతం చేయటయేగాక ముఖంవైపు పయనించడం ప్రారంభమౌతుంది. భారతదేశ మహర్షులేకాక పాశ్చాత్య తత్వవేత్తలైన **పైథాగరస్, ప్లాటోలు** కూడా ప్రతివ్యక్తి శరీరంలోను ఒక దివ్యచైతన్య శక్తి ఉందని అది నాభిపరిసరప్రాంతంలో ఉండి మెదడుకు వికాసాన్ని కలిగించి వ్యక్తిలో దైవశక్తిని వృద్ధిచేస్తుందని వివరించారు.

### -:చక్రాలను వృద్ధిచేసి కుండలిని మేల్కోల్పడం:-

మహనీయులైన దేశవిదేశితత్వవేత్తలు అందరూ ఏకాభిప్రాయంతో చెప్పిన దేమంటే "యదా పిండే తధా బ్రహ్మండే" అంటే విశ్వమంతా వ్యాపించిన దివ్యశక్తి మూలాధార చక్రంలో నిక్షిప్తమైయున్నది. ఈ చక్రము మేల్కొల్పితే కుండలినీ శక్తిలేచి ఊర్ధ్వదిశగా పయనిస్తుంది. "ఇదేకుండలినీశక్తి ఉద్దీపనం" అంటే. ఈ కుండలినీ శక్తి వలన ప్రయోజనమేమంటే సాధనతో విద్యుత్ కేద్రంలా తయారై, ప్రధానస్విచ్ నొక్కగానే అన్ని వాడుక భాగాలకు విద్యుత్తు సరఫరా అయినట్లుగా, కుండలినీ శక్తి పైదిశగా పయనించి అన్ని చక్రాలను శక్తివంతం, చైతన్యవంతంచేసి, వాటికి దివ్యజ్ఞానా న్నందిస్తుంది. కుండలిని ఊర్ధ్వమార్గాన్ని పయనించునపుడు దానితో సంబంధంపొందిన చక్రాలుకూడా ప్రభావంతమై చైతన్యవంత మవుతాయి. ఈ శక్తి ఆ జ్ఞాన చక్రాన్నిచేరినప్పుడు సాధకుడు సంప్రజ్ఞత సమాధి స్థితిని చేరుకుంటాడు. అపుడు మానసికానందము కలుగుతుంది. ఆ ప్రశాంత స్థితిలో ఆత్మ తన చిత్తప్రాణంలో బీజరూపంలో ఉండి,కుండలినీ వికాసంద్వారా ఆవిష్కృతమైన దివ్యజ్ఞానాన్ని గ్రహించగలుగుతుంది. ఇదే పరిశుద్ధమైన పూర్తి నిస్సంగత్వమగు ప్రజ్ఞానం. ఈ స్థితిని పొందిన సాధకుడు ఈ విశ్వంయొక్క ఇతోత్కృష్టమైన సమగ్ర సత్యాన్ని జ్ఞానాన్ని పొందగలుగుతాడు. అపుడు సాధకుడు యితరత్రా తెలుసుకోవలసిన విషయాలేవీ ఉండవు. ఈ స్థితిని పొందిన సాధకుడు నిర్బీజసమాధి స్థితిని పొంది అనంతమైన ఆనందానుభూతిని అనుభవించుతుంటాడు.

### -: కుండలినీ శక్తిని మేల్కొలిపే విధానం:-

యోగాధ్యానంలో కుండలిని మేల్కొలపడం శక్తి మార్పిడి అనే పద్ధతి ద్వారా జరుగుతుంది. సమర్ధుడైన ఒక ఉత్తమయోగితో పరిచయంకలిగినప్పుడు తనకు





యోగసాధనచేయాలన్న దృఢసంకల్పం కల్గితే సాధకుని ప్రయత్నంలేకుండగనే యోగాచార్యుల కృపతో దివ్యశక్తి సాధకుని లోనికి ప్రవేశించి సాధకుడు యోగసమాధి స్థితిని పొందుతాడు. సద్గురునియొక్క శక్తిపాతంవలన సాధకుడు సులువుగా యోగస్థితిని పొందుతాడు. కానీ అటువంటి సిద్ధిపొందిన యోగి తటస్థపడటం పూర్వజన్మ సంస్కారం వలన మాత్రమే సాధ్యమవుతుంది. నేటికాలమాన పరిస్థితులలో ప్రాణాయామం ద్వారానే కుండలిని మేల్కొల్పే విధానాలే ప్రాముఖ్యత పొందాయి. యోగాలో యోగాసనాలు, ప్రాణాయామం, ముద్రలు, బంధాలు మొదలగు పద్ధతులద్వారా శరీరశుద్ధిగాబడి, వ్యర్ధ పదార్ధాలద్వారా మలినమయిన చక్రాలు శుద్ధియై సాధకుడు తన యింద్రియాలు ప్రేరేపించే విషయ వాంఛలను అదుపుచేయగల శక్తిని సాధిస్తాడు.ధ్యానంద్వారా అంతర్ముఖుడై మనస్సుచంచల స్థితిని అధిగమించి స్థిరసిద్ధిని పొందుతుంది. అట్టి స్థితిని సాధించిన వ్యక్తి ఈ విశ్వాన్ని మన దేహాన్ని ఆవహించిన పంచభూతాలను అదుపుచేయగల శక్తిని పొందుతాడు. యోగ సాధనతో కుండలినిశక్తి మూలాధారాది చక్రాల నధిగమించి సహస్రారం చేరుకున్న జీవాత్మ పరమాత్మ సాక్షాత్కారం పొందుతుంది. ఈ స్థితికి సాధకుడు చేరాలంటే శరీరం సహకరించే ఆసనంలో స్థిరత్వం సాధించి ధ్యానం చేయగా సుషుమ్నా నాడినుండి చైతన్య శక్తి ఉపనాడుల ద్వారా శరీరమంతా వ్యాపిస్తుంది. కాని సాధకుడు తన వెన్నెముకను నిటురుగా ఉంచి ధ్యానం చేయకపోతే కండరాలు మూడుచుకు పోయి కఫంచేరి ఉపనాడులన్నీ కలుషితమై ధారాపాతంగా చైతన్య శక్తి ప్రవహించటానికి ఆటంకాలు ఏర్పడతాయి. దానిచే సాధకులు ఆసించిన ఫలితాన్ని పొందలేరు. ప్రాణాయామ సాధనచే సాధకుని ప్రాణకోశంమీద ప్రభావం చూపి ప్రాణ శరీరంలోని అన్ని భాగాలు చైతన్య వంతమై సక్రమ రక్త ప్రసరణ జరిగి తద్వారా కఫంలాంటివి కరిగిపోయి ప్రధాన శరీరావయాలగు ఊపిరి తిత్తులు,చర్మం, ప్రేగులు పూర్తిగా పరిశుద్ధమై పరిపూర్ణ ఆరోగ్య వంతుడిని చేస్తాయి.అట్టి సాధకుడు ఉత్తేజాన్ని ఆనందానుభూతిని పొందుతాడు. ఈ చరాచర సృష్టిరహస్యాన్ని గ్రహించగలుగుతాడు. ఇట్టి యోగసాధన ద్వారా ఒక దివ్య కాంతిని దర్శించగలడు. ఈ స్థితిలో కంటికి కనిపించని సూక్ష్మప్రాణాయామ కోశానికి చేరుకుంటాడు. శరీరమందలి అన్ని కోశాలు ప్రాణాయామ కోశంఆధీనంలో ఉంటాయి.తత్ఫలితంగా చక్రాలు సమర్ధవంతంగా పనిచేస్తాయి అన్ని అవయవాలకు నిరంతరాయంగా ప్రాణశక్తి సరఫరా అవుతుంది. దానిచే నాడీవ్యవస్థ శుద్ధమై ప్రాణం మరియు సుషుమ్నలు సమస్తమార్గాలు తేజోవంతమవుతాయి.మనకు ఆత్మ రెండు కనుబొమలమధ్య ఉన్నట్లు చెప్పబడుతుంది. దాని ముఖ్యచేతనాశక్తి బుద్ధి. ఇదే మనకు మంచిచెడులను విమర్శించి తెలిపే వివేకం. భక్తి పూర్వక నిరంతర

ప్రాణయామ సాధనలోని అజ్ఞానమనే చీకటిని తొలగించి శరీరంలోని ప్రధాననాడులైన ఇడ,పింగళ, సుషుమ్న నాడులను మూలాధారం నుండి సహస్రారంవరకు గల అన్ని చక్రాలను వాటి మార్గాలను చైతన్యవంతంచేసి కాంతితో నింపుతుంది.

పైన వివరించిన దానిని బట్టి మనకు మూలాధార చక్రం మేల్కోనడంద్వారా మిగిలిన చక్రాలన్నీ వాటంతట అవే మేల్కొంటాయని మరియు దివ్యశక్తి లేచి ఊర్ధ్వ ముఖంగా పయనిస్తుందని స్పష్టం అవుతుంది. ఇదే కుండలినీ శక్తిని మేల్కొనడంఅంటే. శాస్త్ర పరిభాషలో శరీరమంతా వ్యాప్తిఅయ్యే దివ్య కాంతి ఇదే. ఒక సాధకుడు ఈ చక్రాలను పరిశుద్ధంచేసి మేల్కొలపాలని ప్రయత్నిస్తే దానికి సంబంధించిన పద్ధతు లన్నింటినీ అనుభవజ్ఞుడైన యోగాచార్యుని సమక్షంలో ప్రయత్నించాలి. ఈ విషయా లన్నింటినీ నిశితంగా పరిశీలించి దీక్షతో ఆచరించితే యోగసిద్ధిని పొందగలరని ఆశిస్తాను.

**జపము ఏ వేలితో చేయటంవలన ఎట్టి ఫలితము కలుగును.**

1. బొటనవేలు చూపుడువేలుతో జపము చేయుట వలన ఫలితము విద్వేషణ, గ్రహోచ్చాటనలకు
2. బొటనవేలు మధ్యవ్రేలుతో చేయుట వలన కలుగు ఫలితము గ్రహాకర్షణకొరకు
3. బొటనవేలు ఉంగరపు వేలితో చేయుట వలన కార్యసఫలమునకు ఉత్తమము.
4. బొటనవేలు చిటికిన వ్రేలుతో చేయుట వలన భూతప్రేత పిశాచములను వదిలించుటకు.

---

## శ్రీ సనారీ సౌజన్య పత్రిక

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ జగద్గురువులై అనేక కోటి బ్రహ్మాండములు, త్రిభువనముల నిర్మితోద్ధారకులగు మనుమయ త్వష్టశిల్పి విశ్వజ్ఞ పంచమూర్త్యాత్మకజనని జనకులగు శ్రీ విరాట్ విశ్వకర్మగాయత్రీ వరప్రసాదలబ్ధ నిగ్రహానుగ్రహసమర్ధులయి శ్రీశైలవాఘ్రబిల వాసులై అగ్నిసాగర, గుణసాగర, బ్రహ్మసాగర, విష్ణుసాగర కర్తలయిన శ్రీఘటనాఘటన నాగాభరణ, నవరత్న సింహాసన, ఛత్రచామరాం దోళికాది, ఆర్తత్రాణబిరుదాంకితులునగు పద్మయోగ, పరమయోగ, భైరియోగా, రేచక పూరక, కుంభక సమర్ధులగు అష్టాంగయోగ ప్రసిద్ధులు, శ్రీ మదాదిశక్తి సమేత ఈశ్వరాంసులగు, శ్రీకాకుళంజిల్లా రాజాంతాలుకా పాలకొండపురవాసులు శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వనాధులు తెలుపునది. శ్రీ విరాట్ విశ్వకర్మ భగవాన్ జగద్గురు పుత్రులగు, సానగ, సనాతన, అహభూన ప్రత్నస, సుపర్ణస, గోత్రోద్భవ వంశీయులగు విశ్వబ్రాహ్మణులకు, విశ్వమందలి సమస్త రాజవంశీయులకు, అలాగే సమస్త వైశ్య వర్గముల వారికి, విశ్వమందలి సమస్త శూద్ర వంశీయులకు, అలాగే విశ్వమందలి సమస్తపంచమజాతుల వారికి ఈ సృష్టిలోని సమస్త ప్రజానీకమునకు, వీరు నివసించు అంగ, వంగ, కళింగ, కాశ్మీర, కుంతల, బర్బర, కోసల, పాండ్య,





మాళవ, ద్రవిడ, ఆంధ్ర, మగద, కాంభోజ, కర్నాటక, నాట, మరహాట, కరహాట, మత్య, సౌరాష్ట్ర, కురు,సింధు, ఖుర్జుర, కుకుర, సౌవీర, గౌళ, నేపాళ, పాంచాల, చోళ విదర్భ, విదేహ ఇత్యాదిచెప్పన్న యాభై యారు దేశముల వారికిన్నీ సమస్త దేశప్రజానీకమునకు దేశభక్తి తత్పరులు జగద్గురువు, సేవదురంధరులైన వారికిని వ్రాయు చతుర్విధ పురుషార్ధములు పొందు, మార్గమును గ్రహించండి. కాలజ్ఞానమును తెలుసుకొని సుజ్ఞానులై చరియించి తరితార్ధులుకండి.

**ఈశ్వర ఉవాచ:–** పార్వతీవినుము, కలియుగమందు వైవస్వతమనువు వలన జన్మించిన మానవకులములు, గొప్పమృగములు, పక్షులు, వృక్షములు, పర్వతజాతులు, భూమిపై నున్న యివన్నీ

మరియు విశ్వబ్రహ్మకులము వారగు పంచవృత్తుల పంచాననులు, మొత్తం దేవతలందరునూ,

బలమును కోల్పోయి నిస్సారములవుతారు, వారి సమూహములన్నియూ కళావిహీనమౌతాయి. అలాగే భూతగణములన్నీ సూక్ష్మమవుతాయి. మానవులందరూ వంచకులు, మోసగాళ్ళవుతారు, సత్యమురూపుకైనా కానరాని సంకోచయుగము అగును.

మానవులు ఆశామోహములలో చిక్కుకుని ఆనందాన్ని కోల్పోయి, వ్యభిచారం, దొంగబుద్ధి, కుచ్ఛిత మనసులతో నాశనమవుతారు, గురువులు, దేవతలు, శక్తులు, రాజులు, వీరికి ఘోరమగు శిక్షలు విధిస్తారు. 12 రాసులందలి సర్వజనులు గ్రహ దోషములచే, దేశమందంటతా బాధింపబడతారు.

గొప్పకులములు నీచకులములందలి స్త్రీలందరూ, కపట స్వభావంతో ఎలాంటి పురుషులతోనైనా సమయంకుదిరితే సంపర్కం పొందుతారు. ఎలాంటి అనుమానమూ లేదు, యింకా సహింపరాని ఆశ్చర్యం కలిగించునట్లు తమకు కల్గిన సంతానముతో మాతాపితురులు క్రీడించుతారు. ఎలాగంటే వావివరసలు తెలియని మృగములవలే, చూడుమా.

వివాదములచేత, ఘోరమైనట్టి కార్యములచేత, కల్గిన కారణములచేత, అస్తిరమైన మనస్సుచే కల్గిన పదేపదే హృదయమందలికోర్కెలచేత, అకస్మాత్తుగా వచ్చు విపరీతరోగములచేత, పంచభూతములైన, గాలి, నీరు నిప్పు, భూమిఆకాశములను ఆరాధించని కారణములచేత, చిక్కులబడిచింతింతురు నరులు, అద్భుతమగు కాల ప్రవాహములోపడి నశిస్తారు ఏమని చెప్పాలో తెలియడం లేదు. దేవీ.

చేయకూడనిపనులు చేయాలనేతలంపుతో, కుచ్ఛితస్వభావంతో, స్త్రీలను పొందినరోగముల చేత కొందరు, ఆయుధములచేత యింకొందరు, ఆడినమాట తప్పుట చేత, దేహమందలి గుణములచేత, ఎన్నడు కనివినీఎరుగని వింతశిక్షలను యమలోకంలో చవిచూస్తారు.

తాతలు, తండ్రులున్నట్టి ప్రాంతాన్ని వదిలిపొట్టచేత బట్టి అనేక ప్రదేశములు తిరిగి "నోటివిద్యలచే" కొత్తజీవనవిధానములతో సంపూర్ణ సేవాభావంతో సేవలు చేయుచూ, ధనహీనులై, అకాలమృత్యువుపాలగుదురు, ఆడవారికి ఆయువు ఎక్కువై కామాతురతతో, మృగములతో రతిక్రీడ ముచ్చటలు పూర్తి కామవాంఛతో జరుపుకుని శరీరం చాలిస్తారు. యిలాగు అడివిలో ఉన్నా ఊరులో ఉన్నా జనమంతా చనిపోవుట నిజము. ఆకాశమునుండి ఉల్కలు రాలి, పెద్ద పెద్ద కొండరాళ్ళుపడి, పాముకాట్లచేత, దేవతల చేత చనిపోయెదరు దీనజనులు.

దక్షిణాయనమున భూమియందు సర్పజాతి శ్రేష్టుడయిన తక్షకవంశములోని వాడు నిలిచి, భువిపై నరులను యింకరక్షింపక యమరాజు వద్దకు యమలోకంపంపు తాడు.

ఆసమయంలో కొన్ని ధూమకేతువులు భూమిపై కనబడతాయి, సూర్యచంద్రులు కళలు తప్పుతారు, దేవతలు, మునులు నియమములు తప్పినడుస్తారు. గొప్ప కులస్తులు నిందలపాలవుతారు, ధర్మప్రవర్తనలు లేక నరులందరూ మరణిస్తారు.

పర్వతములు భూమిలో దిగబడతాయి, వృక్షములు సహజత్వముకోల్పోయి వికృతంగా తయారవుతాయి, పశువులు, మృగాలు మాట్లాడుతాయి, ఆకాశం నుండి అగ్నివర్షం కురుస్తుంది. అ నృతములును సత్యంకానివి యిలాంటివి చాలా జరిగి విపరీత చావులుంటాయి.

చిత్రవిచిత్రసంఘటనలు అనేకము జరుగుతాయి, గొప్పవారు చెడ్డపనుల గురించి ఆలోచిస్తుంటారు, శిల్పి బ్రహ్మసంతతివారు, గొప్పజాతులవారు వింత ప్రవర్తనల తో ఉంటారు, ప్రతీ యింటవిగ్రహపూజలు వరుసగా చేస్తుంటారు. యితర పూజా పద్ధతులు గ్రహించలేరు ఏమి చిత్రమో? యిది కలిప్రభావమేమో?

కొత్తమతములు చాలా పుట్టి జనులను మాయమాటలలో పెట్టి మత మార్పిడులుచేస్తారు, మంత్రవాదులు జనులకు మేలు చేయు పనులు చేయక, ధనార్జనకోసం, నీచమనస్కులైదుష్టకార్యములాచరించుచూ దుఃఖములపాలై సద్గతులు కానలేక, తుదకు తిరునామములు గల వైష్టవమతములో చేరి, యతులమతమదేయనుచూ ఆ సమూహములతో కలిసి ప్రచారం చేసి, అంత్యమున నరకలోకమున బడి యమభటులు విధించు శిక్షలననుభవించుచూ వారు పెట్టిన తినరాని వస్తువులు తిందురు. యిలా అసత్య ప్రచారములు చేయుట చేత జరుగును.

దేవతలు, ఋషులు, భూపాలకులు, కొండగుహల నుండి బయటకు వచ్చిన మునులు, భయమునొందిన నరులను పట్టించుకోరు, రహస్యంగా ఉన్న కాలజ్ఞాన విషయాలను గమనించు ప్రయత్నం కూడా చేయరు. ఆపదకల్గినపుడు అప్రయత్నంగా నైనా గమనించరు వారందరూ.





దేవతలిచ్చిన వరాలు ఫలించకపోవడం నిశ్చయము, నదీనదములందిలి నీరు యింకి పోవుట సత్యము, ఆ నీరంతా ఎక్కడికిపోతుందో? అన్ని పుష్పజాతులకు సుగంధ పరిమళములు పోయి సహజత్వాన్నికోల్పోయి పూలచెట్లన్నీ ఎక్కడ దాగిఉంటాయో? ఎండ తాపానికి తట్టుకోలేక చాలా మంది జనులు నశిస్తారు.

నీచజాతులవారు గొప్పవారౌతారు, అగ్రజాతులవారు ఆపదలపాలౌతారు, ప్రతీ యింటిలో ఏడ్పులుంటాయి, ఏడుయిళ్ళకు ఒక యిల్లు ఉంటుంది. పతివ్రతలు వ్యభిచారులగుదురు, రాత్రులలో పక్షులు భయంకరంగా కూస్తాయి, ఆకాశము ఎర్రనౌతుంది, మిత్రులకు విరోధములు కల్గుతాయి. ఎనిమిది దిక్కులలోనిజనులుగగ్గోల పెడతారు, ప్రాణమున్నంతవరకూ దిగులు తోనే రోజులు గడుపుతారు, ఏదిక్కులో చూచిన రాక్షసులు, జనులను ఏనుగుకుంభస్తలాన్ని పొడిచిచే అంకుశంతో పొడిచినట్లు పొడిచి బాధిస్తారు.

మంచి కులముల గౌరవములు పోతాయి, కొంచెం పుణ్యభూమి ఎక్కడగలదని జనులు వెత్తుక్కుంటా సూర్యుని కాంతిగల ప్రదేశాలకు తరలిపోతారు. సత్కార్యము లాచరించువారికి నివసించు ప్రదేశమే కరువగును.

సానగ సనాతన, అభవన, ప్రత్న, సుపర్ణసులు, మొత్తం విశ్వబ్రాహ్మణజాతి చాలాకష్టమగు పనులు చేసుకుంటూ ఒక్కరోజుని, ఒక యుగములాగా గడుపుతారు. వేదపఠనము ఆచార్య వ్యవహారాలు వదలుకుని హీనజీవులై పనికి మాలిన వారై చాలా కష్టంగా రోజులు గడుపుతారు. పంచాననులు.

అనేక విధములకట్టడితో నదీనదములలో నీటిని నిలుపుతారు, దేవతలు వాక్సిద్ధి కోల్పోతారు, అన్ని దుష్టభూతములు విచ్చలవిడిగా భూమిపై తిరుగుచూ పుణ్యాత్ములకు కష్టాలు కలిగిస్తాయి. రోగాలు బాగా పెరుగుతాయి. మానవులకు కోపాలు పెరుగుతాయి. నెలలోని ప్రతీపక్షంలోను అధికమైన మేఘాలు, ఏర్పడి విపరీతమైన వానలు పడి, భూమి అంతా బురదయై వ్యవసాయానికి వీలుకాకుండా నాగళ్ళు దిగబడిపోతాయి. జనుల పాలునీరు ఒకేరకంగా భావిస్తారు. ఆయువులు తగ్గుతాయి. ఆపదలు పెరుగుతాయి. జనుల పాపాలు తగ్గక మానవులు చేష్టలతో అవి పెరుగుతుంటాయి. పనికి మాలిన జ్ఞానం జనులందరిలో ఉంటుంది, మలమూత్రములు తినే మూర్ఖులుగా జనం తయారవు తారు. భూకంపనలచే భూమి పగులును, దానిచే విపరీతంగా జనం మరణిస్తారు, వారికోసం యమకింకరులు భూమిపై ఎక్కువగా తిరుగుతారు, రాత్రివేళ సూర్యుడు కనబడి, నక్షత్రములు కంటికికానరావు, పగలు నక్కలు విపరీతంగా కూస్తాయి, దుష్ట జంతువులు ఎక్కువగా తిరుగుతాయి.

మాయలో చిక్కిన నరులు, శరీరసుఖాలను పొందలేరు, అయ్యో వేయి విధములుగానైనా న్యాయాన్ని చేపట్టక అనేకరకములయిన దుష్టకార్యములా చరించి

ధర్మాన్ని తప్పుతారుజనులు. పార్వతీ వినుము యిలాంటి గొప్ప వింతలు నాలుగు యుగాంతములందూ జరుగుతుంటాయి. "ఎలాగంటే" కృతయుగనాల్గవ పాదమున, త్రేతాయుగమూడవ పాదమున, ద్వాపరయుగ రెండవపాదమున, కలియుగమొదటి పాదాంతమున, ఆయాయుగ ప్రమాణములను బట్టి ఎక్కువ తక్కువకాల ప్రమాణములతో జరుగు తుంటాయి. ఈ కలియుగంలో ఐదువేల సంవత్సరముల నుండి ఈ చెప్పినవన్నియూ జరుగు తుంటాయి. ఈ కలియుగంలో ఐదువేల సంవత్సరముల తర్వాత చెప్పినవన్నీ జరిగిపోయి, కులములన్నియూ సంకరములైన పిదప మరల కృతయుగధర్మంగా 84 లక్షల జీవరాసులు సుఖంగా ఉంటాయి. కావున

ఈ కాలజ్ఞానమును పూర్తిగా చూచి చదివిన నరులకు, శివుని కరుణతో గల లోకంలో శివుని వలే ప్రఖ్యాతితో నుండుట యదార్థము.

ఈ గ్రంథాన్ని చదివి పురవీధులందు ఊరేగించి, పట్టాభిషేకం చేయువారి పుణ్యము ఏమని చెప్పను, అట్టినరులకు సంపూర్ణమగు భుక్తి, ముక్తి, జ్ఞానము, కీర్తియు గలిగి శివసాయుజ్యంపొందగలరు.

గొప్ప కొండగుహయందునివాసముండి, సకల దోషములు నశింపజేయగలట్టి వినయముగల జనులందువిశేషుడా. విశ్వమందలి జనులను ఆపదనుండి కాపాడి పోషించు వాడా, వనములందు తిరుగుట యిష్టమగువాడా, రసవాద విద్యాధికులక నాయకుడా, మునులహృదయమందు నివాసముండు విశ్వానికి అధిపతీ, నమస్తేనమ

యిదిశోభాయుక్తమైసకల విద్యలు నేర్చి కవిత్వంతో వెలుగొందుచూ, సరసకవితయు విశేషమగు అనంతవిద్యలు సాధించి, జనసమూహమునకు తత్వశోధన, అర్చనల తెలియజేసి కాలజ్ఞానమనే జరుగబోవు విషయములతో గల ఒక భాగంలో శమము దమము, ఉపరతీ, తితీక్షశ్రద్ధ, సమాధానము, ఈ ఆరునూగల కాల నిర్ణయములు గల మంత్ర, లయ, హట, రాజయోగములతో, మహేశ్వరుని మూడవ నేత్రం వలే ప్రభావమ గల, మానసిక స్థిరత్వం పొందగలట్టి సనారీ విశ్వేశ్వర సంవాద మందలి కాలజ్ఞానము

శైవులు శివుడని/ వైష్ణవులు విష్ణువని/ శాక్తేయులు శక్తియని/ గాణపత్యులు గణపతియని సౌరులు సూర్యుడని/ చాంద్రులు చంద్రుడని/ కాపాలికులు కపాలధరుడని / లైంగికుల లింగమని/ గారుడులు గరుత్మంతుడని ఎవరికి నచ్చిన రూపాన్ని వారు ఈ విధంగా అర్చించుచున్నారు కానీ వీరందరి సృష్టికర్త ఆదిఅంతములేని జ్యోతిస్వరూపుని మనసునందైనా తలంచుకున్నారు. కలి ప్రభావేనేమో? ఆత్మ విమర్శతో యిందలి విషయములను పరిపూర్ణముగా గ్రహించి ఆచరించితరియింతురుగాక.

**ఈ పత్రికను మీ శక్తికొలది ముద్రింపించి పంచండి లేదా ప్రచారంచేయండి**

**శుభం భూయాత్**

**సర్వేజనాఃసుఖినోభవంతు సకల సన్మంగళాని భవంతు ఓం శాంతి శాంతి శ్శాంతిః**



## శ్రీ సనారీ విశ్వేశ్వర గురుయంత్రము

**శ్లో॥ బిన్దుత్రికోణషట్కోణం, త్రివృత్తాష్టదళంతథా, దశపత్రరవిద్వంద్వం షోడశందళసంయుతంభూపురత్రయ సంయుక్తం, గురుచక్రమహోత్ఫలం**




## యన్త్రబీజనిర్ణయః

బిన్దుమద్యేతు ఓంకారం, త్రికోణేత్రయబీజకం, షట్కోణేశివమంత్రస్యాత్, త్రివృత్తే గురునామకం, కామ్యాభీష్ట లిఖేత్సర్వం, అష్టేద్యఅ,క,చ,ట,త,ప,య,శ పత్రేసబీజస్యాత్, రవౌగాయత్రితుర్యసా, షోడశావర్ణసంయుక్తం, భూపురేవర్గపంచకం

ఇది శ్రీమద్గాయత్రీ విశ్వకర్మ పరమేశ్వరులచేనుత్పన్నమైన సానగాది పంచ బ్రహ్మఋషి గోత్రములలోని ద్వితీయ మగుసనాతన బ్రహ్మఋషి గోత్రమందలి పర్ణబ్రహ్మఋషి గోత్రోద్భవులైన బ్ర॥ **సుగంధం ఆదినారాయణ, అన్నపూర్ణాంబల** పౌత్రుడు,వెంకటేశ్వరరావు పాపాయమ్మలకు సమర్ధ సద్గురు శిరిడి సాయి వరప్రసాదలబ్ధ· సుపుత్రుడును" విమలాదేవి మనోహరుండు, యింద్ర కీలాద్రిపైవెలసిన శ్రీశ్రీశ్రీ కనకదుర్గామాతా కరుణాకటాక్ష వీక్షణలతో విలసిల్లు విజయవాడ నగరవాసుడును · జగజ్యోతి" శ్రీశ్రీశ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి లోకమున కెఱుక వరిచిన భవిష్యకాలజ్ఞానవాక్యప్రకారముదయించిన పరమ శివావతారులగు జగద్గురు" శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధుల పాదసేవకుడును। తణుకు సాంబశివానంద రాజయోగి ప్రియశిష్యుడు 1. సనారీ నిత్య పూజా విధానము, 2. సనారీశ్వరవ్రత సంకల్పనము, 3. సనారీ మాలాధారణ కర్త 4. సనారీ పూజాప్రచారకులు, 5) శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్ధములు, సనారీ పీఠాధిపతి, శ్రీశ్రీశ్రీ త్రిశక్తీ, సహస్రలింగ సహిత విశ్వనాధాలయ నిర్మాణాధ్యక్షులు, పూర్వాశ్రమమున నవరత్న స్వర్ణాభరణ నిర్మాణ శిల్పి,వాస్తుజ్యోతిష సిద్ధాన్తి , పౌరాణిక నటకుండగు బ్రహ్మశ్రీ సుగంధంసాయి బాబాచార్య స్వామీజీ (విశ్వకర్మ) విరచిత శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర యోగజ్ఞానామృతము సమాప్తము.

శ్రీ విశ్వబ్రహ్మార్పణమస్తు





గ్రంధకర్త రంగస్థల గురువు బ్ర॥ **పుల్లేటికుర్తి నరసింహాచార్యులు** గారితో



గ్రంధకర్త మిత్రులతో ప్రధమ మంత్రోపదేశ గురువు
బ్ర॥ **బోనుమద్ది రామలింగ సిద్ధాంతి** (రాజగురువు) గారితో




శ్రీశ్రీశ్రీ సనారీ పీఠాధిపతులు అభినందిస్తున్న సనారీ సంవాద గ్రంధార్ధముల ముద్రణ కర్త
మ॥ **వేగిశన రాధాకృష్ణరాజు** గారు